Sl. No. 193
Acc. No. 2657



# స్త్రీల పాటలు.

## మూడవ భాగము.

14 JUL 1922

ప్రకాశకులు
నందిరాజు చలపతిరావుగారు
మంజువాణీ ముద్రాక్షరశాల,
ఏలూరు.

వెల రు 1.

All Rights Reserved

1922



# స్త్రీల పాటలు.

## మూడవ భాగము.

ప్రకాశకులు

నందిరాజు చలపతిరావుగారు

మంజువాణీ ముద్రాక్షరశాల,

ఏలూరు.

వెల రు 1.

All Rights Reserved.

1922

శ్రీరస్తు.

# స్త్రీలపాటలు—మూడవభాగము.

## విషయసూచిక.

### దైవప్రార్థనాదికములు.

నోములకధలు-

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః

25 సంవత్సరముల క్రిందట స్త్రీలు పాడుకొనుట కనుకూలములగు పాటలను ప్రచురింపవలయునని తలపెట్టి మేము సమకూర్చిన పాటలనేకములు 3 భాగములుగా ముద్రించినారము. అప్పటినుండియు మఱికొన్ని ముఖ్యములైన పాటలు మా దగ్గరకు వచ్చుచున్నవి. కాని యవి ఒక భాగముగా ముద్రించ దగినన్ని లేకుండుట చేత కొంతకాలమును, ప్రపంచము నల్లూతలూపి, కాకితము ప్రియముచేసి, ఆంధ్ర వాఙ్మయ ప్రచారమున కంతరాయమ్ము గలుగించిన మహాయుద్ధము వలన కొంత కాలమును వానిని ప్రచురింపకుంటిమి. ఈలోగా కొందఱు గుజలీ ముద్రాపకులు మేము ప్రచురించిన భాగములలో కొన్ని కొన్ని భాగములను విడివిడిగా ముద్రించిరి. అందు ప్రాచీనములేవియో మేమే స్వయముగ రచించిన వేవియో గుర్తెఱుంగక యన్నియు బ్రచురించినారు. గ్రంథకర్తయనుమతిలేనిదే యట్టివి చేయరాదు. ఈ భాగములో కొన్నిపాటలు సంపూర్ణముగా, కొన్ని చాలవరకు, కొన్ని విస్తార సంస్కార యుతముగా మేమే వ్రాసి ప్రచురించినవి యున్నవి. గుజలీ ముద్రాపకులు, కడుపు కక్కూర్తికై పుస్తక వ్యాపారము చేయు సామాన్యజనులు, మమ్మునడిగి గాని యట్టి సాహసమునకు జొరకుందురుగాక! వెనుక మేము ప్రచురించిన మూడవ భాగమును, నాలుగవ భాగముగా ముద్రించినారము.

ఈభాగమున, స్త్రీలకు నిత్యతులసి వ్రతమును, వేంకటేశ్వర దీపారాధన వ్రతమును చేర్చినారము. ఇప్పుడు సనాతన

మాతమేమైన కొంచెమున్నదనిన, అది యింటనే, గృహలక్ష్ముల యెడనే యున్నది. వారేవాస్తవముగా భారతభూమి కర్మభూమి యను మాట నిప్పటికి సార్థకము చేయుచున్నవారు

భారతకులాంగనలారా! ఈవ్రతములను ఒక్కసారి ఉచ్చారణ సౌష్ఠవముగలవారిచేత చెప్పించుకొని, మీరే వ్రతాచరణము చేసికొనుడు. విఘ్నేశ్వరపూజ గూడ స్త్రీలపాటలు రెండవభాగమునం జేర్చబడియున్నవి. ఈభాగమున విస్తారముగా స్త్రీలువట్టునోములు చేర్చడమైనది. ఇంకను స్త్రీలునోచుకొను చిట్టిచిట్టి నోములనేకములు, నాలుగవభాగమున ముద్రింపబడినవి.

ఈసారి స్త్రీలపాటలు చక్కగా ముద్రింపబడి, మనోహరముగా బైండు చేయబడినవి. ఇవి ప్రతియింటను తాండవమాడుచు సనాతన ధర్మపునః ప్రతిష్ఠాపన కార్యమున కుపయోగించుగాక!

ఓం తత్ సత్.

| | |
|---|---|
| ఏలూరు. | సజ్జన విధేయుడు, |
| ది 1-3-1922 | నందిరాజు చలపతిరావు. |



శ్రీ రస్తు.

# స్త్రీలపాటలు మూడవభాగము.

శ్రీ పరమాత్మనే నమః.

శ్రీ శుభమస్తు- అవిఘ్నమస్తు.



పరమహంసపూజిత విశిష్టగుణప్రతిబద్ధరాగయై।
యాపృథివీధరాత్మజ సురావళి మెచ్చకతన్వరింపగా।
నేపుననామె కేలు గ్రహియించిన యిందుకళావతంసు డు
ద్దీపిత పుష్కలార్థముల దేల్చుమిముంగలిదోషహారియై॥

ఉ॥ శ్రీమదుమామహేశ్వరులు-చిన్మయరూపులు సత్కటాక్షవీ
క్షామృతవృష్టిభక్త సుజ-నాళిపయింవెదజల్లుచుం గడుం।
ప్రేమమెలర్పనేలుమహి-భృత్కులదీపములైనవారు మ।
మ్మామచుమంత్రుగావుత స-ముచ్ఛ్రిత కాంక్షిత కార్యసిద్ధులన్॥

## 1 కృష్ణస్తుతి, ఝంఝూటిరాగము-ఆదితాళము.

శ్రీలాముదిజన-పాలాభవభయ, వేలానతసుర-పాలాసుశీలా॥
రామాకలుష విరామాజగదభి। రామాఘనసుఖ ధామాసుధామా॥ శ్రీలా॥
ధీరామహిమ గభీరామహితవి। చారాసదవన సారావతారా॥ శ్రీలా॥
గోపాలకకుల దీపాయితఖల। పాపాసురహర చాపాధిరోపా॥ శ్రీలా॥
శృంగారసురుచిరాంగాపరసభు। జంగాధిపనుద పాంగానుషంగా॥ శ్రీలా॥

## 2 ఆపద్బాంధవునిమీద కాంభోజి-త్రిపుట.

ఎంతవేడినమాపై నేలరాదయరాదు ఏమినేరముచెప్పుమా॥
సంతసమునమాపాలి యుచునిన్ను శరణుజొచ్చిన వెనుకక్రమపెట్టదగునో॥ ఎం॥
చింతలువదలి మాచిత్తములనునీదు చెంతఁజేర్చితిమిరా।
సంతసముమాను మొబ్రిహ్మదునివిభుఁదక్కనంతరంగనువ్వాదుఁడన్యదెవ్వడు॥
అపద్బాంధవనమ్ము నాదరింపుమటన్నఁ గోపముసేయకురా।
పాప్రపునీవేయన్నిప్రార్థించుచుండఁగమాపయినీకిటుమఱపాయెనివిమేరా॥ ఎం॥
దోసకారులిట్లు ఘోషింపుచుండ విశ్వాసముంచవేరా।
దోసములనుబాపు దొరనీవైయుండఁగ వాసిగవానినివారింపనేరవే॥ ఎంత॥

నీవేదిక్కని మేము నెరనమ్మియుంటింగాఁ గావఁదలంపవేరా।
కావనిరామశల నోకారుణ్యమయమయ్య నేనాఁడుచేకొని రాలమింకో౯వగ
వేర్పు॥ ఎంత॥

## 3 కమాజురాగము-ఆదితాళము.

ప॥ వేగరారాయిందు భోగిభోగశయన॥
అ॥ జాగుజేసేవదేరజలనిధిగంభీరధీర వేగ॥
చ॥ పంకజచరణనేనింక నోర్వగజాల।
శంక సేయక నావంకకిటు రారశౌరి॥ వేగ॥
శ్యామసుందరాకారస్వామిపరాకేల।
నీమము తోడుత నేనిన్నె నమ్మియున్నవాఁడ॥ వేగ॥
దంతిభూధరవాసయెంతో నమ్మియున్నా।
చింతదీర్పరాదా సాంతారంగశుభాంగ॥ వేగ॥

## 4 కమాజురాగము-అటతాళము.

ప॥ వనజోదర శ్రీమన్నారాయణ వేగ॥
అ॥ నిను నెరనమ్మితి నీలవర్ణ వేగ॥నను॥
చ॥ అనుదినమును నాకనులుపండుగగా౯!
గనఁగొను టెన్నఁడో గరుడగమన వేగ॥నను॥
మునిజనవర సాహ్యదయకములమందు।
సదాయూషవని నిన్నెచాలనమ్మితి వేగ॥నను॥
కాంచినగరమందు కరుణతో నెలకొన్న।
చంచల నిభచేల జాలమేల వేగ॥నను॥

## 5 కమాజురాగము-ఆదితాళము.

ప॥ గతినీవనినమ్మితిసీతాపతి।
అ॥ పతితపావననామభక్తకుముదసోమ॥ గతి॥
చ॥ కపటచిత్తునికాకాసురునిగాచినట్టి।
కృపగలదొరవనికోరివేడితినా॥ గతి॥
పగవానితమ్మునిబట్టముగట్టిన।
అగణితకల్యాణసుగుణసాగరనా॥ గతి॥
సారంగశైలనివాసశ్రీశయతి।
కూరిమితోనిన్నెకొలిచియున్నా॥ గతి॥

## 6 శ్రీరాగము-ఆదితాళము.

ప॥ రఘువీరా రావదేరా।
అ॥ అఘుమారా యనుపమశూరా॥రఘు॥
చ॥ చిన్నియన్నా చేరరావా।
నాకన్నులకరువెల్లదీరరయో॥రఘు॥
నీరదశరీరనిన్నె।
కోరియున్నా గురిగమున్నెరయో॥రఘు॥
కుంజరాభూధరవిహారా।
పదకంజములెనమ్మినా రారయో॥రఘు॥

## త్యాగయ్యగారి కృతులు.

## 7 భైరవిరాగము-రూపకతాళము.

ప॥ ఉపచారిముజేసేవా రున్నారని మరువకురా॥
అ॥ కృపగావలెనని నే కీర్తని బలుకుచునుండగ॥
వాకిట నేపదిలము గావా। తాత్మజుడున్నాడని
శ్రీకరులగు నీతమ్ములు। జేరియున్నారని
యేకాంతమునసుజానకి। యేపట్టిడియున్నదని
శ్రీకాంతపరులెవ్వరు। శ్రీత్యాగరాజువినుత॥ ఉ॥

## 8 బిలహరిరాగము-అటతాళము.

ప॥ దొరకునా యిటువంటిసేవ॥
అ॥ దొరకుసాయుజ్యతపమొనరించిన భూదేవతలకునైన సురులకైన॥
తుంబురునారదులుసుగుణ సంకీర్తనములనాలాపముజేయగా।
అంబరీషముఖ్యులు నామముజేయుచు జాజులుపైజల్లగా।
బింబాధరలగు సురవరవిరిబోణులు నాట్యములాడగ।
అంబుజభవసాకారులు లిరుగడల నన్వయబిరుదావళినిపొగడ।
అంబరవాసచెలులు కరకంకణంబులు ఘల్లనివిసరగ।
మణిహారంబులుగదలగయూచెఘణితల్పంబున నెలకొన్నహరినికనుగొన॥
మకరతమణిసన్నిభదేహంబున మెరుగుకనకచేలముశోభిల్లగ।
చరణయుగనఖావళి కాంతులు చెందుచుపిల్లలనేజేరా।
వరనూపురములలో వెలుగగ కని రాజవజ్రపుభూషణము మెరయా।
ఉరమునముక్తాహారములు మెరయ నుచితమైన మకరకుండనమ్ములు।

చిరునవ్వులుగలవదనంబులుముంగురులందవుకపోలముద్దులగురియగా
దివ్యఫాలమ్మున తిలకముమెరసే దివిలావణ్యనిధికనగొన॥ దొ॥
తామసగుణరహితమునులకుపొగడ తరముగాకనిత్యమరచి।
శ్రీమత్కాంచనతొట్లపైని చెలువొందగొలువుండగ।
కామితఫలదాయకి యాసీతాకాంతునికని యూపంగగా।
రామబ్రహ్మతనయుడౌత్యాగ రాజనుతునితోపాడుచునూచగా।
రామునిజగదోద్ధాముని సురరిపుభీముని చిన్మయారూపుని।
పూర్ణకాముని త్రిగుణాతీతుని సద్గుణధాముని కనులారమదిగొన॥ దొ॥

## 9 నాగవరాళిరాగము- ఆదితాళము.

ప॥ నగుమోముగనలేని నాజాడదెలిసి రఘువరనన్నుబ్రోవరాదా॥
అ॥ నగరాజధరనీదుపరివారలెల్ల వగబోధనజేసేవారలుగారె।
అటులుండదురాన॥ న॥
ఖగరాజనీయానతి వినివేగచనలేదో।
ఖగనానిలకుబహుదూరంబనినాడో।
జగమేలేపరమాత్మ యెవరితోమొరలిడుదు।
వగజూపకుతాళను నన్నేలుకోరా త్యాగరాజనుతనీ॥ న॥

## 10 తోడిరాగము-రూపకతాళము.

ప॥ నినువినాసుఖముగాన నీరజనయనా॥
అ॥ మనసుకెంతో ఆనందమై పులకరించగ॥
రూపముప్రతాపము సరససల్లాపములుగల॥ ని॥
కరుణారసపరిపూర్ణ వరదమృదువాక్కులుగల॥ ని॥
రాగరసికరాగరహిత త్యాగరాజభాగధేయ॥ ని॥

## 11 సురటరాగము- రూపకతాళము.

ప॥ భజనపరులకేలగలుగు దండపాణిభయము రామ॥
అ॥ అజరుద్రసురేశులకై యాస్థానమొసగు రామ॥
అండకోట్లునిండిన కోదండపాణిసన్ముఖమున।
హృత్పుండరీకమునుజూపి పూజసల్పుచు।
నిండుప్రేమతో కరంగు నిష్కారణములకువరదా।
దండపాణిదాసుడైన త్యాగరాజసేయరామ॥ భ॥

# రాఘవకల్యాణము.

హరువిల్లువిరవను । ఆరామచంద్రులువచ్చినారు
సీతామహాదేవితో శ్రీరాములచెలువమ్ము । చెలియలందరుచెప్పిరి
మన్మధునికన్నమరి హరిహరాదులకన్న ।
అతనుచంద్రునికన్న అతిరూపుకలవాడడే ।
రమణీయులావణ్యము । శౌర్యపరాక్రమంబులతోడను
శ్రీరామచంద్రులుక్షీరాబ్ధిశయనులై । భువినిజన్మించినారు
ఆదిలక్ష్మిబోలెటి । సీతనీవర్థాంగివౌదువమ్మ
అతడునీవిభుడుగా నడుగుకొనుదైవాలు । అతిప్రార్థనములచేత
ఆపల్కులనువినుచుఅతివఆనందమున । హర్షించుచూడాచెను
అందుచూ చొందుచూ విరహాగ్నినొందుచూ । నప్పటప్పటినుద్దులు
వినుకొనుచునన్నుకొనుచువిరహాగ్నియెక్కుడై । తనుతానుమరచిపోయి
మేడదిగియటుయిటుమేకొనిజూచుచు ।
పొలుపుగాశ్రీరామునులపాడయైనగానకుండ ।
శృంగారవనమునకు చెలులతోగూడుకొని । తరుణులుతానేగెను
చిలుకలుపలుకగా కోయిలలుకుయ్యగా । హంసలందందాడగా
ఆచెలియయందుండి వినజాలకా । వినియూ మనజాలకా
ఇంతిబయలుచూచియే మేమికౌరాయనుచు । భ్రమతోడమరుగునుండె
చిలుకలూ హంసలు పలుమారుజలక్రీడ । లాడుచున్నవిచూడుమా
చిలుకలకాహారమిడకుండనుండిన । పలుకనేరకయుండును.
కోయిలస్వరములుకుదియించిపట్టితే । నాదమ్ము లేకయుండు
అనిచెలుపల్కగానట్టెకలయూచి । ఇట్లుచేయగగూడునా
చెలువుడువింటివాడుచేవగలవాడని । చెప్ప గావింటినునుమ
సన్నజాజులశయ్యసైయుంచుపవళించి । తలకొనుచుతల్లడించి
పవళించితనలోన బాధలుపడుచును । తారుమారుగపలుకును
ఇంతికిఆణిముత్యపుపేరులవా । ఇంతికిసన్నంపుపేరులాయె
పొనుపువిరులెల్లమిసమిసలుతగ్గుండె । కాకుండెనీమేనను
యిసుకతిన్నెలమీదను యింతితా । పలుమారుపవళింపుచు
పైలుచూచిబ్రమసిపరగంగ తనలోన । తామరలగానుదోడగా
ఇంతయుగ్రముతోడను యీసూర్య । రమ్మెల్లకాయగాను

ఇందేలపూఁపాన్పు యీగతిగానమర్చిరీ । చెలులారయింతమత్సరమేటికే
రవిరశ్మికాదోయమ్మా । రమణీయమగువెన్నెలా
నీడుపున్నమచంద్రుడు । పండువెన్నెలగాసెను
నన్నింతవేచేటియామన్మథునిబట్టి । సంకెళ్ళువేయింతమా
యీచంద్రునీబట్టియిఁపొందరోహిణికి । పట్టిబలవంతాను పట్టప్పగించండి
అనగానెచెలులంతశైత్యోపచారానకు ।
పన్నీరుచల్లిరిబాలకనితెచ్చిరి అమృతంపుఫలములను॥
కరములడ్డములాగుచు మేలైనవస్తువులు । కన్నెత్తిచూడకుండ
శ్రీరామసుద్దులు యేమనివింటిమో । ఆరాముజాడమ్మా
తెలుచుకల్లార నీరేజనాభుని । గొండినాటిపుడువేగ
మింటనేమీరుఅంటివుండగైతి । అందందనానాధుని
వెదకితీసికురండి వేడుకలూజేతు । వెళ్ళిపొండిపుడువేగ
పక్షిజాతుల్లారమీరు నాపరమాత్మ గనిపెపిరా ।
మీవంటిరెక్కలూ నాకేలలేవాయె । ఎగిరిపోయిచూతును
నీలమేఘుడు చెప్పవే నీవేగి । కలియుగశ్రీరాముని
మారువిల్లువిరిచినన్ గొనుమంచినా
తుమ్మెదారోచెప్పవేనీవేగి । కలియుగశ్రీరాముని
మారువిల్లువిరిచినన్ । గొనమంచిను
ఆదిదేవుడచెప్పవేనీవేగి । కలియుగశ్రీరాముని
మారువిల్లువిరిచినన్ । వరియించిపెళ్ళాడగా
ఆకాశఅంతరిక్షభూకాంతరములతో గూడుచు
మీశక్తులన్నియిచ్చి మేలుగాశ్రీరామమూర్తినెలి
ఆరాముతో జెప్పుడీ మారువిల్లు । విలయముగవిరచును
నన్నువరియించివేగ పెండ్లాడి । నాయాతిదీర్పమనుచు
అష్టదిగ్గజములారా మీరతివి । కాధారమై యుండుడీ
కలికిచిలుకాజెప్పవే । కాకుత్స్థవిభునితోడ
మారునివిల్లువిరిచి ఆరామచంద్రులు । తన్నుపెళ్ళాడగాను
రతిహంసరోజెప్పవే మా । రాజీవవిభునితో ను
మారువిల్లువిరచి ఆరామచంద్రులు । నన్నుపెళ్ళాడగాను
అనిసీతతలపోయగా నంతట । నరుణోదయంబాయెను.
అకుక్కుటములుగూసె అకవలములువిచ్చె అరుణుండుదయించెను।
స్వయంవరములచాటి సరగున శుభరేఖలంపించగా।

జనతేజరాజులు లిద్దరువచ్చిరీ సూర్యవంశపురాజులు।
కోటియసురులగెలిచియు కౌశికునియాగంబు నటులగాచీ।
అహల్యశాపంబాపిహరువిల్లు। జూడంగ వచ్చినారు
ఉదయకాలముకోలనిలో। సంధ్యనీమములు దీర్చుకొని
అర్కుడుదయమ్మౌ ఆయనోలేదని। ఆశ్చర్యపడుచుండిరి।
ఆబాలురాజాచిరా। అప్పటిబట్టితినకూ
అందంది చెక్కిలినొక్కుదునో। యనుచు ఆనందమగుచున్నదీ
ఆకౌశికుతోడనూ। ఆరామలక్ష్మణులు
తమయిష్టనీమములు తీర్చుకొని। యాకోలపుకూటానికేవచ్చిరీ
ఆరామలక్ష్మణులకు। ఆజనకుడెదురునడచీ
శీఘ్రిముగ శ్రీపాదపద్మములు। గడిగితాసింహాసనాలిచ్చెను
కౌసల్యసుతులకపుడు జనకుండు। గంధమక్షంతలిచ్చి
కట్టవగాకానిచ్చిబ। హుమానములుజేసెను
సంతోషమునజనకుడు రాముతో। భాషింపుచూనుండగా
జగతిరాజులెల్ల చెక్కటూచెయిబూని చింతించియుట్లనిరీ
మేటిరాజులకెల్లనే యెచ్చోటస్థమేరు పడజాపకా
చిరుతబాలురకిట్లు సింహాసనాలియ్య। సిరియెంతదొడ్డదనిరీ
ఆకాశసంపన్నుడే। ఆజానబాహుడితడు
ధిక్కరించున్నాడు రాజులందరిని। చుక్కలచంద్రుడేమో
అతనియాకారానికి రాజూలు। అరికాలుకేబోలరు
అనిరాజులందరను తమతమమదిలోను। తలపోసియిట్లనిరీ
ఓతనిరూపముగని జనకుడు। ఇయ్యవచ్చునుకన్యను
అనిరాజులందరు తమతమమదిలోన। తలపోయుచుండిరీ
కార్యమ్ముచేతనయితే। ఖండించిశత్రుధనసు
కార్యముగాకున్న కడువేగపోవలెను। గాండీవమెదెనెను
పరమాత్మపలుకులకును జనకుండు। పరమానందమునను
తనయిష్టదైవములనుతలచుకొని। యావిల్లుతెలిగించుకొనివచ్చెను
వెయ్యిన్ని యేనూరుజనమెత్తి। దెచ్చినారపుడువారు
శ్రీరామదేవరా ముందరయుంచితే। చిరునవ్వుతోబలికిరీ
చివుకవిల్లూఈదీ మీరుయేమూనిపొగడెదరు
పిడికిటఅందుకుని విల్లువిరవంగ। యివియెంతపాద్దునాకు
జానకిరాలక్ష్మన్నా। సుదతిజానకిదేవినీ

రూపలావణ్యములు సరిగానుయిప్రపుడును । శీఘ్రిరజాచిరమ్మా
దేశేరిరయుప్పతున్న సౌమిత్రిదినమెల్ల । వ్యర్థముగను
అలిరయుప్పాకున్న జన్మమెల్ల । వృథాజూచిరాలక్ష్మణా
జూచిరమ్మాలక్ష్మణా । ఆసువతిజానకీదేవినిప్రుడు
భూమిలోబుట్టినా భూకాంతచూచి । పరుగునరమ్మానెను
నడుముసన్నము జూడుమీ అయింతి । చిన పాదముజూడుమీ
చిన్నపాదముజూడుమీ అయింతి । కన్నులుజూడుమయ్యా
జూచిరమ్మాలక్ష్మణా ఆసుందరిరూపమంత చక్కగా
కడువేగిరముయేగి । కదలిరమ్మనిబలికెను
అనితన్నుబంపినా పా్రిసాదముని మొ్రిక్కుచు।
జనకూనిమందిరంబులకేగి । సౌమిత్రి జనులందరుమెచ్చగా
రామునితలపుయోఁగి । జనకుడుబ్రితివాలణ బెట్టింపెను
వాకిలిద్వారపాలకులతో నాతండు । రాణివాసముజొచ్చెను
శృంగారవతికన్యకూ । చెలియలుశృంగార మమర చేసి
బంగారుసింహాసనమ్మీద । సీతాంగననుని చిరి
సౌమిత్రిరాక రెరిగి । ఆచెలియలాసీతకిట్లనిచెప్పిరి
నిండుపున్నమచంద్రుని । పోలేటిరాముతమ్ముడు నినుజూడవచ్చినారు
ఆసీతవినిపొంగుచునవ్వుచు । నవరత్న సింహాసమున
ఒప్పచునుండగాను । లక్ష్మణు లక్షణమ్ములుజూచెను
సోమకళబోలేటిసీత । పాదపద్మములుజూచీ
తిగుననుచుసంతోషచిత్తాన పొంగుచు । చదురులోకతెంచెను
చూచివస్తినిదేవరా । మీసువతి జానకిదేవినిపుడు
హరిహరాదులుపొగడ । మాకలవిగాదయ్య అబ్రిహ్మకయినగాని
జూచివస్తివలక్ష్మణా । మనసువతి జానకిదేవినిప్రుడు
అనుమానంలేకవిరవనా యీవిల్లు । అదినాకు నిజముచెప్పు
అన్నరాఘవజూస్తిని । మీచేతిజానకిదేవినిప్రుడు
హరిహరాదులుపొగడ । మాకలవిగాదయ్య అబ్రిహ్మకయినగాని
అనితమ్ముడుపలుకగా । రాముడు కనుసంజ్ఞచేసిరపుడు
అంగుష్టమునలీలనందుకుని । యీవిల్లుబట్టించె శ్రీరాముడు
పెళ్ళుపెళ్ళుమనగను । యీమూడులోకాలవారలెల్ల
చూడచిత్రముగాను । శ్రీరామునిరచిరి
దుందుభులుమ్రోయగా । భూపులందరు పొగడగను

నానావిధమ్ముల పుష్పాలవానలు । రాముపయికురిపించిరీ
యెన్నివిధములను రాముణ్ణి । జనకుడు కొనియాడగా
కమలనేత్రియనియేటి । సీతాంగనను దెచ్చి శ్రీరాములకునిచ్చెను
ఎల్లుండిలగ్నమనుచు । శ్రీరామచంద్రుల పెండ్లియనుచు
కడమవారిపెండ్లిండ్లు యిక్కడనేకాగలవు । కాంతలతో రమ్మనెను
శ్రీరామచంద్రులకు । మాసీతాంగనను యిస్తును
అతనితమ్ముడులక్ష్మణా । దేవరకు ఊర్మిళను నేనిస్తును
భరతశత్రుఘ్నులకును । భరతునికి మాళవి నేనిస్తును
కడపారపుకాంత శతకీర్తిని దెచ్చి । శత్రుఘ్నునికి యిస్తును
ఒక్కలగ్నమందున । మీనుతులు నలుగురికి కళ్యాణము
కాంతలానలుగురిని కన్యధారాబోతు । గయికొనిరక్షించుమి
అప్పుడుశుభలేఖలు । అయోధ్య పురికంపగా
తనలేఖచదువుకుని తనరాణులపరాక్రమువిని । తలయూచిహాషించెను
దశరథులువచ్చి యపుడు । దేవులతో యిట్లనియెను
సుతులకల్యాణమని సుతులనుదోడ్కొని । జనకపట్టమువచ్చెను
దేవతలువచ్చినారు । దేవదేవుని పెండ్లికనుచు
మహామునీశ్వరులంత పొగడుతువచ్చిరి । మహాత్ముని పెండ్లికనుచు
గౌరిపార్వతివచ్చెను । కలకంఠునితో కలసి
లోకలక్ష్మివచ్చె శ్రీరాముపెండ్లికని । లోకమంతా వెలుగగా
అరుంధతీదేవివచ్చె అనసూయ । అహల్యదేవివచ్చె
దేవతాస్త్రీలంత చెలువమ్ముజేయుచు । దేవుణ్ణిచూడవచ్చి
సాటికితడొకడేయని చిత్తమున । చాలంగనుపొంగుచు
విల్లువిరచినరాముడు ఇహపరాకృముజూడ । జనులెల్ల మెచ్చగాను
సంపెంగతయిలమునను తరుణులు । సంపతుల శిరసంటిరీ
గంధమ్ములుదెచ్చిరి కాంతలంపరును । పన్నీటజలకమార్చి
నాతికురులుచక్కదీసి ఒకచెలియు । నేర్పుతో జడలల్లెను
పట్టుచీరలుదెచ్చియూ ఒకచెలియు । పణతులకుగట్టించెను
ఆభరణములుసొమ్ములు అతివలకు । అందముగ అలంకరించిరి
అతివలనుతోడుకొని ఆకాంతలందరు । అతివేగమునవచ్చిరీ
మేటిపుటికలనుంచియూ నల్గురును । జలదారలనునుంచిరీ
ఆరామచంద్రులకాళ్లుకడిగి తానూ । కన్యధారయుబోసెను
కాంతలనలుగూరినీ జనకుడు । ధారబోసీ యిచ్చెను

తెరచీరదీసితే శ్రీరాములజూచి । దేవితానప్పొంగను
మంగళసూత్రమ్ములుదెచ్చి । రామచంద్రులువేడుకతో
నవ్వుచుశ్రీరామచంద్రులు । సీతమెడను గట్టెను
అణిముత్యపుబ్రాలను । ఆరామచంద్రులు వేడుకతో
నవ్వుచు శ్రీరామచంద్రులు । తానసీతశిరమునబోసెను
చిటికెన్నబట్టుకని సీతతో । శ్రీరాములు
వైవాహికపువేదికకు చనదెంచి । దేవితో గూర్చుండెను
సప్తపాదమ్ములప్పుడు త్రొక్కించి । అరుంధతినిజూపించరి
మూడోరోజునా పాకెన్నిజేసి । నాగవల్లీదీర్చిరి
బంగారుపళ్లెరములో తమరపుడు । పాలునెయ్యిబోసియుం
సీతహస్తమునుంచీ జనకుడు । శ్రీరామునకప్పగించె
బాలహస్తమ్మునుంచీ జనకుడు । పణతులకునొప్పగించి
రాజుకప్పగించె జనకుడు । రమణులను తానప్పుడు
దశరథులు పొంగుచును జనకునితో । సంతోషమునబలికెను
కల్యాణమున నేడు కాంతను యిప్పుడు । ఘనముగామాకిస్సిరి
సంతోషింబాయెను మేమిప్పుడు । పురికివేగాబోవలె
కాంతను నలుగురినిపంపుడి । మీరిప్పుడు అయోధ్యపోవలెను
అనిరాజు యడుగగాను జనకుడు । కన్నీరుదెచ్చుకొనుచు
తనసతితోను తరుణులనంపుమని । వేడుకతో జెప్పెను
కౌగిటజేర్చుకొని తమతల్లి కన్నీరు దెచ్చుకొనుచు
కాంతలానలుగురికి వడిబియ్యముబెట్టి । కౌసల్యకొప్పగించే
భేరిరవములు మ్రోయగా దశరధులు । చేడెలను దోడుకొనుచు
కాంతలతో పుత్రులతో । అయోధ్యకువచ్చెను
పరశురామునిశాపముగను కొని । పట్నానికేతెంచెను
యింతినీ తొడలపయి వుంచుకొని । కురులు నున్నగాదువ్వుతు
అలకబంతులుబట్టియూ కస్తూరి । తిలకమప్పుడుదిద్దెను
నాతికిని యనముల సిన్నంఫ । కాటుకలేదీర్చెను
దేవికిశృంగారముతానా । నేరూపుతో జేయుచు
అంతటశ్రీరాములు తనసతితో గూడి । సంతోషమునయుండెను
అంతటఒక్కనాడు । ఆరామచంద్రులు వేడుకతో
నవ్వుచుశ్రీరామచంద్రులు అద్దమ్ము । నాతిచూడుమనెను
ఆచీయద్దములోపల ఆదేవిత । తనరూపు తెలియలేక

యెంతమాయలుగలవు శ్రీరామచంద్రుడాలు । పరసతినితేతగునా
చేనుగాకుండగాను పర [illegible]తిని । యిందులోనిలిపినావా
యేకపత్నీవ్రతుడవని మా [illegible]డిరియిచ్చెను । మామలారాయెరుగడాయె
యెంతమాయలుగలవయా ఓరామచంద్రుడ మీకిప్పుడు
చాలుచాలూరామ మీతో చిన్నెహంబు । సరసంబువిరసమాయె
అనిసీతపలుకగాను శ్రీ[illegible]చంద్రులు । నవ్వుకొనుచు మా
టాసీతముద్దరాలనిపొగ[illegible]నలోను । నవ్వుచు యిట్లాగెను
పతిలేనిసతినిజూచి ఓసీ[illegible]డలోను । కోపిస్తివి
పతిజూపితేఅలక బాయను [illegible]నీంపుడు । పద్మాక్షిరో చెప్పవే
నిలువుటద్దముదెచ్చెయు [illegible]మచంద్రులు । సీతచిటికెనవ్రేలై
అతివమునమిద్దరమ్ము ఈ[illegible]ముజూడగాను ।
పతిలేనిసతిజూపించగలవా జానకినీవానెను
సీతచిటికెనబట్టెయు శ్రీ[illegible]చంద్రులు । చూడగాను
యిద్దరిరూపులొకటయిఉండె [illegible]అద్దమ్ము । మొకల్లరీతిగనుండెను
వారిరువ్వురు రఘువ[illegible]నాథు । వివాహముగదెలుపుమనెను
అనిసీతయడుగగా చిరునవ్వునవ్వుచు । శ్రీరాములిట్లనిరీ
శ్రీరాముడు సీతా నీవు[illegible]లోను । [illegible]గవటవే
సీతముగ్ధాయాని వదిలోన తెలుసుకుని । నవ్వుచుతానిలచెను
పతిమాటలకు సతియు [illegible] । శిరసువంచుకునిలచెను
సిగ్గుబడినిలచున్న సతిని [illegible]దియు । శ్రీరాములుబలికిరీ
నీకునాకుభేదమా ఓసీత । [illegible]ంక నీకుతగదు
నన్నుగూడినీవు సంతో[illegible]మున । రాజ్యమేలుమీ యీపట్టమున
రాఘువులకళ్యాణము యెవరయిన । పాడినా విన్నగాని
అష్టయిశ్వర్యములిచ్చి [illegible]సంపదలిచ్చు । ఈరాజ్యపదవిచ్చును
కన్యలెవ్వరుబాడినా వ[illegible]క । కల్యాణమాననుచును
శ్రీరాములాసీత పరగ[illegible]సమయు । తానిచ్చిరక్షించును॥

---

# ధర్మరాజు జూదము.

శ్రీమంతులైయుండ్రి శూరులైయుండ్రి ।
సామంతులైయుండ్రి సరసులైయుండ్రి ।
సత్యమ్ముదప్పరే ధర్మనందనులు । పుత్రులు పౌత్రులు భ్రాతలు ప్రజలు
కోటివేలయేండ్లు రాజ్యములు సేయ । అంతటనరసింహదేవు ప్రార్థించ
మేడలుమహలులేమంచిపాళిళ్ళు । మాణిక్యమయమైన సింహాసనమున
ఆచోట్లనిలిచిరే ధర్మనందనులు । తల్లికికడపారి గారాబుపట్టి
చావుపుట్టుకదెలియుసహదేవుడుండే । పాడివస్త్రముగట్టడేతడివస్త్రమేగాని
అంతటతనఅన్న డాయంగవచ్చి । విన్నపముధర్మజాలు వినియాదరించు
వింబిలీకార్యములు చేయబోకయ్యా । ఆపకుమిజూదములు వోడబోకయ్యా
ఓయన్నయెటులయిన నామాటవినుము । పతులుచూడగమనసతిచెరనుబడగ
ఈడ్చుకుబోగురుసుమ్మియెల్లరాజులలో । అనియిట్లుసహదేవుడాడంగవినుచు
చిరునవ్వునవ్వెరే తాముధర్మజాలు । చిన్నవాడవునీవు యేమెరుగుదువు
పాటివారుబిలచితే వెళ్ళంగమాన । హస్తినాపురములో అంగళ్ళలోను
ప్రిథమమేనడచినవి బళ్ళారిబళ్ళు । కొమ్ములగట్టినవి కోటిఏనుగులు
అవియన్నినడచెనేహస్తినాపురము । కుంచెలుగట్టినవిగుర్రాలుఅన్నీ
అవియన్నినడచెనే హస్తినాపురము । తలలంటిపుచ్చేటి తరుణులందరను
వారెల్లనడిచిరేహస్తినాపురము । నీళ్లోసిపెంచేటి చెలతలందరను
వారెల్లనడచిరేహస్తినాపురము । ఉ సిపెంచేటి యువిదలందరును
వారెల్లనడచిరేహస్తినాపురము । పాలిచ్చిపెంచినా పణతులందరను
యేవురుంగారపరసగుర్రాలనెక్కి । యేవురువేసేటిహారములువేసి
యేవురుబట్టేటిగొడుగులుబట్టి । యేవురుబట్టేటిఆయుధములుబట్టి
ధర్మరాజేతెంచెహస్తినాపురము । అల్లంతటధర్మజాలరాకలుజూచి
యెదురులేచీవెళ్ళెకౌరాజాయప్పుడు । సింహాసనమువేసికూర్చుండబెట్టి
లోహాసనంమీదకాళ్ళుగడిగించి । పచ్చివిపోకలుపండుటాకులును
భమిడిపళ్ళేరాలతాంబూలమిచ్చే । ఆస్తినాపురములోఅంగళ్ళలోను
పలకయుసారెయుపెలయుదెప్పించి । ఈవలవేయించెసింహాసనమ్ము
సింహాసనంమీదధర్మరాజుండే । లోహాసనంమీదరాజుగూర్చుండి
వరసల్లాపజూదమ్ము వరుసగావాడి । క్రమ్మరపాచికలుకడుచేతనంది
పరుసలజూదమ్మువరుసతోవాడ । ధర్మరాజుకుబెక్కెకనకమ్ముసేరు

రాజాచేతజిక్కబలపమ్ము లేదు । అస్తినాపురములో అంగళ్ళలోను
తనచేతిపాచికలుతకుంచేతికిచ్చె । తావెళ్ళిపెద్దమ్మనగరికేతెంచె
అతివనప్పుడుగాంధిఅతిభక్తితోను , సాష్టాంగదండనమస్కారములుజేసి
చేతులుముడుచుకొని చేసెవిన్నపము । ధర్మరాజుతోనుజూదమ్ములాడి
ఆడితినినేనుకలతెల్లరోడి। వస్తినేనేడునినుశరణమ్ముజేడ
అనియిట్లురారాజుఆడంగవినుచు । చిరునవ్వుతోలికజ్యేష్ఠమహాదేవి
ధర్మరాజుతోనుజూదమ్ములాడ । వద్దనుచునీకొకరైనచెప్పనేగేదా
అప్పుడేజెప్పరాయెల్లవారల్లు। ధర్మజుడుదేవుండు ధర్మజుమతండ్రి
అటుగాకధర్మజులు శరధిగావనుచు । అయినానుతననేర్పుచేసెదననుచు
క్షీరాబ్ధికడకేగ చెల్లెలనువేడా । అల్లంతటనుఅక్క రాకల్లుజూచి
గుండెఝల్లుమనియె మహాలక్ష్మికపుడు । యెవ్వరినిచెరచగావచ్చెనోయక్క
పొట్టుకుదాలవె పెట్టెదుబెల్లు । అరచేతికలవాంబు పెంచుకొనివచ్చె
యెవ్వరినిపొందనువచ్చెనోయక్క । అల్లంతతనుఅక్క రాకలుజూచి
ఎదురులేచివెళ్ళి మహాలక్ష్మియపుడు । వలగొనిముమ్మారుప్రదక్షిణముజేసి
సాష్టాంగ దండనమస్కారములుజేసి । చేతులుముడుచుకొని చేసెవిన్నపము
యేమివోయక్క నీవొచ్చినపనులు । అనతిమ్మనుచుపలికెమహాలక్ష్మి
యనియిట్లుమహాలక్ష్మి యడుగగానపుడు । యిట్లనిపలికనేజ్యేష్ఠమహాదేవి
రారాజుధర్మజులుజూదమ్మునాడ । ఓడెనురారాజువరుసతోడతను
తనరాజ్యములునోడి తనకడకువచ్చె । శరణుజొచ్చినవాని చెడగొట్టుటకును
మనసువొప్పదునాకు మహాలక్ష్మివినుమీ । అబ్రహ్మవిప్రులు చేసేటివేడ్క
రాజసూయయాగమ్ము చేసినవాడు । వీధివీధులగట్టె విస్తళ్ళువెయ్యి
ఆయజ్ఞశాలలోపలికిబోతి । కూతుళ్ళుతానును కుడబోవవంగా
ఆకులువేసుకుని మేముకూర్చుండ । కూతుళ్ళతోజూచి కోపించెభీముడు
ఆపదానవునీవుయిదినీతిగాదు । మగవారిలోకుడువ పాటిలేదనుచు
ఆకులుదీయించిపారవేయించె । ఆభిముకిస్తినేశాపమ్మునేను
చాటలోపలవడ్లు చెరిపిన్నవాడు । నాడునినుగొలుతునని పలికితి నేను
కుంచమ్ముఓరగాపెట్టిన్నవాడు । నాడువినుగొలుతునని పలికితినెను
అరికాలునవుగింజతిడవన్నివాడు । నాడునినుగొలుతునని పలికితినెన
నాటికార్యములేదు సమకూడెనమచు । నిన్నువేడగవస్తి చెల్లెలాకావు
సాకొగ్కదీర్చవె నలినాయతాక్షి । యేమెమహాలక్ష్మి యేమెనాచెలియ
నీవెగిధర్మనందనులనేపాసి । రారాజునుపొందవె రమణిరోనీవు
అనియిట్లతమఅక్క అడుగగానపుడు । ఇట్లనిపలికనే మహాలక్ష్మితాను

సింహాసనముమీద ధర్మరాజుండి । వరసలజూడమ్మువరుసతోనాడి
తమ్మరపాచికలు కడుచేతనాడ । రాజుచేతికిజిక్కె కనకమ్మునేడు
ధర్మరాజునుజిక్కె బలపమ్మునేడు । ఆస్తినాపురములోఅంగళ్ళలోను
ప్రథమముననడచినవి బళ్ళమ్మబళ్ళు । ధర్మజానిబాసెను ధర్మంబునే
తప్పకనుధర్మజాలు తమరోడిరపుడు । తలలంటిపెంచిన తమ్ములందరిని
తప్పకనుధర్మజాలు తమరోడిరపుడు । నీళ్ళోసిపెంచిన సెలతలందరిని
తప్పకనుధర్మజాలు తమరోడిరపుడు । పాలిచ్చిపెంచేటి పణతులందరిని
తప్పలేకధర్మజాలు తమరోడిరపుడు । ఉగ్గోసిపెంచిన యువిదలందరిని
తప్పకనుధర్మజాలు తమరోడిరపుడు । ఏవురుయెక్కినా ఆశ్వాలనోడె
ఏవురువేసిన హారములునోడె । ఏవురుపట్టిన ఆయుధములోడె
ఏవురుగట్టినవస్త్రములనోడె । ఏవురుకిల్లాలు పాంచాలినోడె
సింహాసనముమీద రాజుగూర్చుండి । ప్రేమతోతమ్ములను బిలువనంపించి
గాంధారినిబిలువరే పాంచాలినితేను । కర్ణునిబిలువరే పాంచాలినితేను
చందానబిలువరే పాంచాలినితేను । అన్నకెదురుగవచ్చి అతిభక్తితోను
చేతులుముడుచుకొని చేసెవిన్నపము । గాంధారియీపనులు కావుమాచేత
చందానయీపనులుసరిపడవటంటెను । కర్ణుండుయీపనులకు రాదుయటంటెను
యిందరపలుకులు యిట్లుపలుకగను । కోపముతోపలికెనే రారాజుయపుడు
యేమోయిగాంధార నీవోయికొమార । పోయి పాంచాలిని దోడుకొనిరాగా
ధర్మరాజుగట్టినా వస్త్రములుగట్టి । ధర్మరాజువేసినా హారములువేసి
ధర్మరాజుబట్టినా ఆయుధములుబట్టి । ధర్మరాజెక్కిన అశ్వాన్నియెక్కి
హాస్తినాపురముకు వెళ్ళినాడపుడు । అల్లంతటగాంధారు రాకల్లజూచి
యెదురుకేచివెళ్ళి పాంచాలియపుడు । యేమోయిగాంధారనీవోయికొమారా
జూదంపుసాలలో వార్తలేమయ్య । మాయన్నగెలిచెను మీరాజావోడె
ముఖ్యముగపాంచాలి నిన్నురమ్మనిరి । వదినగారినిసుమా ఎవపతినిసుమ్మి
వదినగారవుకావు వరుసలేలేవు । నిక్కముగపాంచాలి నిన్నుపమనెను.
తలలంటిపసుపూసి జాజాల్లుముడచి । అంగుష్టవాంధిని రావాగుయనెను
అన్నకెదురుగవెళ్ళి అతిభక్తితోను । చేతులుముడుచుకొనిచేసెవిన్నపము
పాంచాలిమహాదేవి రాలేదుయనెను । యేమోయిగుణ్యాయనె నీవేగికుమారా
జూదంపుశాలలోవార్తలేమియ్య । మాయన్నగెలిచెను మీరాజావోడె
నిక్కముగపాంచాలినిన్నురమ్మనెను । వదినగారినిసుమ్మ పరసతినిసుమ్మ
హావిదప్పగరాదు వరపుత్రినిసుమా । వదినగారవుకావు వరుసలు లేవు
నిక్కముగపాంచాలి నీవురావేగ । తలలంటిపసుపూసి జాజాల్లుముడిచి

అంగుష్ఠవారధినిరారాదుచుచెను । వెండికాగులతోను వెణ్ణెళ్ళుగాచి
తమిడికాగులతోను చన్నీళ్లుదెచ్చి । వెణ్ణెళ్లుచన్నీళ్లు సమముగాతోరిపి
పాపకర్ముడుబోసెపాంచాలిమీద । పాంచాలికఖుబట్టి దుశ్యాసనుడీడ్చె
ముత్యాలవాలీలు ముందరాబడెను । మట్టుకోగాటోవమూకలోదోసి
రొమ్ములూడగనిలుచున్న పాంచాలిజూచి । మూగిమూకాల్లతె మూగియిట్లనిరి
కూడిమూకాలెల్లకూడుకొనిరపుడు । మూడుకేల గుర్రాలుమూడువేలమూక
మూడువేలఆవులాపాడిగలవారు । నాల్గువేలగుర్రాలు నాల్గువేలమూక
నాలుగువేలయావులాపాడిగలవారు । అయిదువేలగుర్రాలు ఐదువేలమూక
అయిదువేలయావులాపాడిగలవారు । అరువేలగుర్రాలు ఆరువేలమూక
ఆరువేలయావులపాడిగలవారు । అచ్చుతాఅక్షౌహిణీఆరువేలబలము
దయగలధర్మరాజులుయెందుండివారో । బింకముగలభీముడులేచెపార్థుమున
కవలవారిద్దరుకారువారైరో । అనిచెప్పిదుఃఖించెపాంచాలియపుడు
తోయ్యాలిఅపర్ణకాలవాకిటికి । పదుగురుజూడగాభంగంబుగాను
ఏవురుపురుషులతోడగూడుకొని । గుర్రాలపాలలుబాగుచేసేను
తోయ్యాలిఅపర్ణకాలవాకిటికి । పదుగురుజూడగాభంగమ్ముజేయరా
మేడలుమహలులుమల్లెపావిర్భు । సరిసతులయొక్కవేసభయవాతోడ
నీయొక్కతోడలపైసుద్దేష్ణయొక్క । సరిమంచమెక్కరాతల్లిగాంధారి
తోయ్యారాఅపర్ణకాలవాకిటికి । పదుగురుజూడగాభంగమ్ముజెయరా
కుండలోవీకూడుతినవికాకుల్లు । ఒక్కనీవురాజ్యంబునేలితివటర
గాజామెరిసితేమకనకంబుయవున । పూసమెరసితేనుపుష్యరాగమవున
మాణిక్యమునలుపైనమసికుండయగున । గాడిదయెంతగజమానటోరి
కాలువలెన్నయినకలసిపారినను । గంగానదితోటిపాటియగునటరి
వేరుగొన్నయానరెత్తిపొంగితేను । సముద్రముతోసరియానచవిటిబుట్టలు
పాములమనితమరుపడగలెత్తితె । శేషునితోసరిగావునచెదుగుపురుగులెల్ల
పక్షులమనితమమువృక్షమెక్కినను । గరుత్మంతునితోసరియగునపకలపక్షులును
కోతులమనితమరుకొమ్మలెక్కినను । హనుమంతునితోసరియగునఆకోతులెల్ల
కరణాలమనితమరు కవిలిబట్టినను । శ్రీరాములతోసరియగునస్పృష్టికరణాలు
రాజాలమనితమరురచ్చకెక్కినను । ధర్మరాజుతోసరియగున కలరాజులెల్ల
భూచక్రపాలకులు సర్వపాండ్రులును । మారాజకుంతికొమాళ్ళతోసరిరా
తోయ్యారాఅపర్ణకాలవాకిటికి । పదుగురుజూడగాభంగంబుజెయరా
కృష్ణకృష్ణకృష్ణమ్మశరణు । కృష్ణుడానీవునాకుసహాయముగమ్ము
క్షీరాబ్ధిలోపలాసరిపాన్పుపైని । శ్రీలక్ష్మితోడను జూదమ్ములాడి

ఆడేటిపాచికలు ఆటునిశ్చయించి । అక్షయమనివేసె అపుడుపాచికలు
అడవలెఓడవలెగెలువవలెగానీ । అక్షయమనియేటివికలవెపాచికలు
మనకులగోత్రిజ మనభర్తరాలు । మనవామమే గాని మగువదన్నటి॥
పగవారుతనుబట్టి బాధింపగాను । అక్షయమనివే స్త్రీ అతిపరోనేడు
తూర్పుగ బడ్డవీతొంబదికోట్లు । పడమరాబడ్డవీ పదికోట్లు
ఉత్తరమునబడ్డవీపూర్ణంతపాడవు । దక్షిణమునబడ్డవీతాళ్ళంతపాడవు
కేళ్ళన్నివిరగను గోళ్ళన్నిమణగ । ఓపలేకవారుకూర్చుండబడిరి.
ఏమినోమునో స్త్రీవైపాంచాలినీవు । ఈసభజూడగా ఇందరిలోను
పాండుగకుంతెమ్మచలిమెళ్ళుకెయ్య । భీముడుంపిడికెడు పోకలందియ్యా
అజునుడుఅరచేతుల ఆకులందియ్యా । కవలలిద్దరుగూడి ఉల్లభమూబట్ట
విష్ణుకాంతనో స్త్రీవినుడిమీరిపుడు । బ్రాహ్మం వీధుల పణతులందరును
భావించిగట్టరే పట్టుచీరేలు । వెలమవారీయిండ్ల వెలదులందరు
అంచుదీర్చిగట్టిరే అంచుచీరలును । పట్టుచీరలు రెండు పట్టుకొనివచ్చి
వదిలమూగదాచుమని పలికెనా రాజా । పెట్టరనివారికి పెద్దలకునెల్లా
కట్టదగువారికి కళవ్రుదీరగను । పత్తులైచీరెలేకుండచెంగులుకట్టగను
హస్తినాపురమున అంగళ్ళలోను ।దాగివేనవి పట్టుచీరలును
అమ్మగీతలకురుంగు ముగుచుకొమ్మనెను । తనుతొక్కుమన్న రారాజుతోడను
తొడలుచీరించకా తలముడువనౌను । నాతినుఖబట్టినదుశ్శాసనునిచేతులను
తోరణాలుగుచ్చకతిలముడువనౌను । ధర్మజానితో జూదమ్ముఆడితిగాని
తనతోటిజూదమ్ముఆడునవిబలికె । పాంచాలితోటిఆడెదననుచు
ఉల్లాసముననుండెరాజులరాజు । హస్తినాపురములోఅంగళ్ళలోను
పలకయూనుసారెయూను తెప్పించిరపుడు । ఈవలవేయించెసింహాసనమ్ము
అవలవేయించెకూర్మాసనమ్ము । సింహాసనముమీదరాజుగూర్చుండి
కూర్మాసనముమీదపాంచాలియుండె । పాపకర్మనిముఖముతోజూదమునకు
నడుమువేయించెగండభేరమ్ము । రారాజుతన చేతవేసెపాచికలు
పాంచాలితనకాళ్ళత్రోసెపాచికలు । ఒక్కపలకకువస్త్రములుగెలచె॥
తనపలకగెలుచుకొనితలఒద్దుకొనెను । రారాజుతనచేతవేసెపాచికలు
పాంచాలితనకాళ్ళత్రోసెపాచికలు । రెండోపలకకుహారాలుగెలచె
తనపలకగెలుచుకొనితలవద్దుకొనెను । రారాజుతన చేతవేసెపాచికలు
పాంచాలితనకాళ్ళత్రోసెపాచికలు । మూడోపలకకుఆయుధములుగెలచె
తనపలకగెలచుకొనితలఒద్దుకొనెను । రారాజుతన చేతవేసెపాచికలు
పాంచాలితనకాళ్ళత్రోసెపాచికలు । నాలుగోపలకకుగొడుగులనుగెలచె

తనపలకగెలుచుకొని తలవద్దుకొనెను । రారాజుతన చేత వేసెపాచికలు
పాంచాలితనకాళ్ళతో విసెపాచికలు। రారాజుతచేత వేసెపాచికలు
అయిదవపలకకు అందరిని గెలచె । తనపలకగెలుచుకొని తలఒద్దుకొనెను
రారాజుతనచేత వేసెపాచికలు । పాంచాలితనకాళ్ళ దన్నెపాచికలు
ఆరవపలకకే రాజ్యాలుగెలచె । తనపలకగెలుచుకొని తలఒద్దుకొనెను
రారాజుతనచేత వేసెపాచికలు । పాంచాలితనకాళ్ళత్రోసెపాచికలు
ఏడవపలకకయేపురిని గెలచె । తనపలకగెలుచుకొని తలఒద్దుకొనెను
రారాజుతనచేత వేసెపాచికలు । పాంచాలితనకాళ్ళద్రోసెపాచికలు
అంతలోనేవచ్చి ఆమాయశకుని । ఆడవారితో జూదమ్ము ఆడితివనీవు
అటుగాకపాంచాలితోను యాడితివ । ఆడవారేకారఅతివలేకార
ఆడవారికియుగ్గి సహాయమేకాద । ఉడికేటిఅన్నములలోనుకజేసేరు
మండేటిమంటకు మారుమసలేరు । కాలేటికొరువులు కాళ్ళదన్నేరు
అటుగాకపాంచాలితోనుయాడితివ । ఆడవారేగారఅనుఘలెగార
అటుగాకపాంచాలి పతివ్రతేగాద । అనియిట్లుఆశకునిఆడుమాటలకు
ఆటచాలించెనే రాజులరాజు । ఆమాటవినియపుడు ధృతరాష్ట్రుడొచ్చి
సభలోనుఆశ్చర్యమునతానుజూచి । ధృతరాష్ట్రుడప్పుడు కోపించిపలికె
ఇదియేమిజూదములు యిట్లుఆడుదురా । రావమ్మపాంచాలివరములిచ్చెదను
నీనేనరాజ్యములు నీవుగైకొనుము । పతులదీసుకనీ వుపదిలాన వెళ్ళు
అనియిట్లుఆరాజుఆడుమాటలకు । ఆమాటధర్మజాలు వినియాదరించె
ఆడవారివాజ్యంబు ఏలంగతగునా । సతిగూడివనములకు పోయెవననుచు
పాంచాలికోరనే వరములనేగురిని । తప్పకను ధృతరాష్ట్రుడు ఆ ధారబోసె
పతులనుకూడుకొని పాంచాలితాను । అరణ్యవాసముకుఅతివేగజనెను
పండ్రెండుయేండ్లును పదిలముననుండి । అజ్ఞాతవాసమునకతివేగవచ్చి
విరటుపట్నముజొచ్చి వీరశేఖరులు । ధర్మరాజాజూదమ్ముపాడినవిన్న
అష్టఐశ్వర్యములు ఆరాజాయిచ్చు । సంపూర్ణవిజయంబు సంతోషమబ్బు

---

# 14 కీచకవధ.

శ్రీమంతులయియుందురు । శూరులయియుందురు
సామంతులయియుండ్రు । సరసులయియుందురు
సజ్జనులయియుందురు । సుమతులయియుందురు
ధర్మంబుతప్పడె తానుధర్మజుఁడు । తనపాలిధర్మంబు తగిలిపడగొట్టి
వలచిధరణిపుత్రితోటి జూదమ్ములాడి । దుర్యోధనుడనువాడు పాపకర్ముండు
కల్పించివాడొకటి కపటజూదమ్ము । మాయతల్లడికాదు ఆడెజూదమ్ము
ధర్మశీలత్వగాను ఓడెజూదమ్ము । కొలువెల్లఓడెను గుర్రాలనోడె
అయింవారినివోడె అందనాలోడె । సమరధులతోడె విష్ణుభక్తులనోడె
ఏనుగులనోడెను సానువులనోడె । ద్రౌపతిసహితముగ తమ్ములనునోడె
తనవారినిఓడగా తనధామముగోడె । అడవిపండ్రెండేండ్లు ఆహారములను
పన్నెండుయేండ్లు పన్నిదముండి । యేడాదిఅజ్ఞాతవాసమ్ముజేయ
విరటునికొలువిరే వీరశేఖరులు । కులధర్మమువప్పి కొలచెధర్మజులు
నాట్యగురువై యుండెనగరఅర్జునుడు । వంటకొరకైయుండె నానరభీముండు
గుర్రములకాతునని కొలచెనకులుండు । గోవులనుగాతునని కొలచెసహదేవుడు
ఈపనులుతమకు శృంగారమునజేయ । కోరివిరటులదేవిఁ గొలచెపాంచాలి
ఈరూపుఈరేఖ ఈచక్కదనము । ఎమండియీరూపు కేతెస్తివమ్మ
మొగవారుజూచితే మనసునిలుపుదురా । చూడడాకృష్ణుడు మాడడానిన్ను
చూచినకృష్ణుడుచూడకంటేను । కాకయినుమనుయీగమునురువాచెప్పుమా
నిప్పుజెపులంటునా నీవుయెరుగవా । సముద్రముకడముట్టనీదునాయొడదు
గంధర్వులేవురు కలరునాపతులు । వారేవురైనాను లేరుయిచ్చటను
యెరుగక అంటినే యేలనాగనేను । తప్పులేదేమిటికి చంద్రముఖి యనుచు
అనుచువిరటులదేవి ఆదరింపుచును । నీవుచేయుపనులు తెలతరోయేవి
ఆనతివ్వునుచును అతివబల్కగను । చేడెపాంచాలితా జెప్పంగదొడగె
ఎంగిళ్ళుముట్టను సంగతికిరాను । పాదంబులొత్తుటను పడతినేనోప
బాలలంగుళ్ళునైన నొత్తనేరాను । అంగనలుపనులైన నాచేత గావు
ఇంతరక్షుడిట్లుగనేల యీమాటలేల । అతివనీకునావు అరమరలుయేల
అప్పచెల్లెళ్ళవలె భావింతుననెను । అనుచువిరటులదేవి ఆదరింపగను
కోరివిరటునిదేవిఁ గొలచెపాంచాలి । కొన్నాళ్ళయీరీతి గొలచియుండగను
తిరుముళ్ళగజముల తీరుగలవాడు । మదమత్సరముతోటి మత్స్యపతిమరది
వచ్చివాకిటనిలచె వలకీచకుండు । కుంతికొడలజూచి గునిసెమూర్ఖుడు

కుంతికోడలనుజూచి మోహించెబలుడు । చింతలదిక్కుచుసింహాబలుడు
అక్కనీదగ్గర నిలుచున్నచేడె । దానిపూర్వపూరు దానికేరవర
దానిమగడెవ్వరో చెప్పవునాతో । అమ్మరోయేరాజు కూతురేనాతి
చెయ్యవలసినపనులు చేయునానీకు । వెలదికస్తురినామ మలదగ జూచి
మేలుముత్యముసరులు మెడవేయ్యజూచి అక్కచెప్పు యికయెవరామెనాతో
ఈచీరకువోర్కు లిట్లున్నవిధము । ఏయన్న నీకేల దానిమాటలు
కపిడిబొమ్మవుగదే పరికించిచూడ । కుసుమరోనీవొళ్ళుమయిలలెక్కడివె
పుట్టరాఆడపుట్టుకలు నీతోడ । ఇట్టిదోషపుపలుకు లెట్లుపలికితివి
రాముసతిగోరియు రావణుడుచెడెను । చెడ్డమాటలన్ని చెప్పంగదోషగా
పరస్త్రీపరధనము సంబరముగాదు । తేరతెల్లడిగాను యేలచెడియెదవు
అక్కనీవద్దన నిలుచున్నచేడె । హంసనడకలదాని అడుగులనుబోలు
పద్మదళములుదాని పాదములబోలు । పోకబోదెలుదాని పిక్కలనుబోలు
అరటిబోదెలుదాని పెందొడలబోలు । కలబందబోలునీ కాంతపిరుదులు
వడ్డాణమమరినట్లున్నదాననడుము । చెరుకుగోలలుదాని చేతులంబోలు
తమలపాకులుబోలు దానిహస్తములు । శంఖచక్రముల భుజములంబోలు
చక్రాకారములు కుచములంబోలు । పొద్దునసూర్యుడు ఉదయించినట్లు
పడతిదానిముఖము పద్మమునుబోలు । కలువరేకులుదాని కన్నులంబోలు
చేమరేకులుదాని చెక్కిళ్ళబోలు । సంపెంగపువ్వుబోలు సొంపునాసికము
దంతములుదానిమ్మగింజలనుబోలు । మల్లెమొగ్గలుదాని పలువరుసబోలు
పగడతీగెలబోలు దానిపెదవులును । కొదమతుమ్మెదబోలుదానికురులును
కొదమతుమ్మెదదాని కొప్పునుబోలు । శశిముఖియాడుచు నాట్యమాడగను
అతివయాకాశాన జలధిలోమునిగి । అంకుశంబైనట్టి ఆముసలిచేత
పట్టుబడియున్నను బ్రతుకుతెరవేమి । సర్వేశ్వరదేవి తాబొందకున్న
గారపండగుదాన్ని గడియించుకున్న । పాలతిబొందకవాకు పోవుప్రాణాలు
బ్రతుకనుమిఅక్కనుమ పాదములబడెను । పాదములపైబడ్డతమ్ముని మెత్తి
అక్కనచేర్చుకొని అతివయిట్లనెను । రారసింహాబలుడ రాజరత్నంగా
ఏలసింహాబలుడయిటువంటిపనులు । నాతిక్కైతికుగుటమాని నాబుద్ధివినుము
ఆడదానిచిత్తము అరటాకుమొవ్వ । యెవ్వరేకున్నాను యముడుబాధించు
సర్వేశ్వరులువిన దండించునిన్ను । ఇల్లాలిగోరితే యిదిఒక్కనింద
పతివ్రతనుగోరితే పోవుప్రాణములు । గంధర్వులేవురు కలరుదానిపతులు
నాకేవురైనాను తేరుయిచ్చుటను । వారువింటేనిన్ను తలలుగొట్టుదురు
పుష్పంటిగవలె పొంతులున్నారు । కుందనపుబొమ్మవలె కాంతలున్నారు

పొగడబొమ్మలవలె పణతులున్నారు । వజ్రంపుబొమ్మవలె వనితలున్నారు
అనగానుకీచకుడు అప్పుడిట్లనియె । నీరజాక్షినిబోలు సెలతేదిచెప్పుము
సాకొలువువారంత సాకెందుకనెను । రంభాదులయినను రమణిసరిరారు
రెండురయినాయింతి గోరుబోలందురే । చూడగూడదుతండ్రి జూచెదవుసుమ్మి
ముట్టగూడదుతండ్రి ముట్టెదవుసుమ్మి । ముందుఒకనాడునే ముచ్చటాడితె
వనితకోపించితే వణకితిని నేను । అనియిట్లుతనయక్క ఆడుమాటలను
తల్లడింపుచుదాని పాదములబడెను । నిలువవుప్రాణములు నిజముగానమ్మ
అనికీచకుడుబలుక అతివభీతిల్లి । కాకన్ననీబుద్ధి కడముట్టదన్న
సురపేరుజెప్పి ఆసుదతినంపేను । అటుమీదనీవొలసినట్లుండుమన్న
అక్కపలుకులువిని ఆసింహబలుడు । అధికసంభ్రమముతోను నగరికేతెంచె
మహారాజువచ్చెనని మంగళహారతులు । ముత్యాలహారతులుముదమొప్పదెచ్చిరి
మగువలుదెచ్చిన మంగళహారతులు । ఉల్లమలరగజేసి ఊర్మిళసఖియు
సంపెంగతైలాన శిరసొప్పనంటి । మంచితైలముతోను మురినలుగుపెట్టి
సుగంధిగంధమున అటకళ్లుగాచి । కెంపుకాగులతోను వేనీళ్లుగాచి
ధమిడికాగులతోను చన్నీళ్లుతోడి । చన్నీళ్లువేనీళ్లుసమముగాతోలిపి
ముత్యాలముంతల ముగుదలందియ్య । పసిడిముంతలతోను పణతులందియ్య
మహిమతోమహారాజు మజ్జనమాడె । పగడాలముంతల పణతులందియ్య
మహిమతోమహారాజు మజ్జనమాడె । మెత్తవస్త్రములమేనుతళ్కొత్తి
పట్టువస్త్రంబులే కట్టదస్తురు । రత్నాలసొమ్ములే రాజుమదికిని
హెచ్చైనచెవుల ముత్యాలపోగులును । అణిముత్యపుసరులు హారములువేసె
మకరమాణిక్యాలు ఆసింహబలుడు । గంధకస్తురి పరిమళద్రవ్యములు
బాగుగాధరియించె ఆసింహబలుడు । ఏడునిలువులధమిడి మేడలోపలను
బంగారుతెరికోళ్ళ పట్టెమంచంబు । పట్టిమంచముజాల్చి పొన్నమురించి
యిరుగడలతలగడలు యిమ్ముగనుంచి । నేత్రవపట్టుపచ్చడమొప్పబరచి
తొడిమెలబూసినవి పారిజాతములు । ఆమంచిపానుపున అవిచాలబరచె
జామోయిబూసినవి జాజిపువ్వులును । ఆమంచిపానుపున అవిచాలబరచి
మాపోయిబూసినవి మల్లెపువ్వులును । ఆమంచిపానుపున అవిచాలబరచి
పొన్నలుబొగడలేబొడ్డుమల్లెలును । ఆమంచిపానుపునఅవిచాలబరచి
నాలుదిక్కులకడదివ్వెవెలుగా । నవరమపసిడిమువాలు చిలుకలగద్దె
కస్తూరిరొకకుడక గంధమొకకుడక । చాలవెన్నెలనిండపోకలాకులును
చిన్నారిగొలుసులదిసునన్నపుకాయ । గరకతోనుదకంబుచిలుక లపంక్తి
సకలాభరణములు చాలపళ్ళెములు । యిన్నిపంపించెనే తమ్మునకుతాను

అడవిలోనలుడు దమయంతిబాసీ । దమయంతియిడుములనుబడినట్లుయుంటే
ఆలాగుకన్నీరుఅరచేతబట్టి । యీచేతబొబ్బలకుఇక తెరవులేదు॥
ఒరలుదీసినగంధమెల్లడటచేడె । తానదీస్తేగాని యొప్పదటతరుణి
ఈజీవుడుండగానిచారమేలే । ధర్మజులుయుండగా తలపోతలేలే
నేనీకనుండగా నేరమేమిటికి । వనితనీవద్దకు వచ్చితేవాడు
వచ్చేదననిచెప్పు వనితరోనీవు । ఆరాత్రిసదిరించి ఆటుతెల్లవారె
అబలయొక్కడికిబోకఒక్కడికెబొమ్మ । భానుదిక్కుంజూచిపద్మములుజూచి
పట్నములోపలికిపాంచాలివచ్చె । గట్టిగాపట్టుదలపట్టె కీచకుడు
కాంతయున్నచోటికేతెంచియపుడు । వనితనినుచేబట్టి వచ్చితినేను
వనితరోనా యొడలు వణకినదియేమే । కలకంఠినీతోడ కలయవచ్చితే
కాంతరోనాకెంత కంపంబుబుట్టె । యువిదరోనీతోడనుండవచ్చితే
పణతితోనాకెంతభయమాయెనేమే । పసిడిబొమ్మవునీవుపరికించితేను
పణతినీతోడయిన స్త్రీలువున్నారే । ఇంతినీతోడయిన యింతులున్నారే
రమణిరోనీపతుల రప్పించుకోవే । నీవురుపతులనీ యొరిగించినీవు
పదివండిపతులైన పణతినా కెదుర । నీకుగలవారితో నీవుచెప్పకోవే
యిట్టిపలుకులుపలికి యేట్టికేబుట్టి । రాజులకల్లను రాజానేనేను
వాడుకల్లాసుమ్మి నేడనువనము । నిన్నుగూడగనుత్తు ఈరాత్రినేను
నిన్నుచేలాపించి నీవంతజేసీ । నేడుపస్తానండె నేనమ్మలేనే
నమ్మకుండగనేల నామాటనీవు । గురియుపదేశంబు కొంగనీముతే
వినన్నజప్పుకతొందు నేడు ఈరాత్రి । నాటకపుశాలలో నాట్యశాలలో
నాటకపుశాలలో రంగమధ్యమున । నినుజంపినీకాత్రి బొబ్బెట్టకుందు
అనియిట్లపాంచాలి యాడుమాటలకు । ఆధికసంభ్రమముతో ను నగరికేతెంచె
నవారాజావచ్చెనని మంగళహారతులు । ముత్యాలహారతులు మదిరలుదెచ్చి
మగువలుదెచ్చిరి మంగళహారతులు । ఉల్లంకపడిరాజు ఆవిపరదన్న
రత్నసింహాసనము రత్నంపుగద్దె । రాజుకుకేసిరి పనసలనీడ
సంపెంగతైలాన నీళ్ళాపోసనంటి । సుగంధిగంధమున ఆటీళ్ళుదెచ్చి
పండితాగులతోనుపేణిళ్లుగాచి । ధమిడితాగులతోనుచన్నీళ్లతోడి
చన్నీళ్లుకేకిళ్ళు సవముగాజేసె । ముత్యాలముంగలామగుడలందియ్య
పగడాలమంగలాపణతులందియ్య । మహిమతోమహారాజుమజ్జనమాడె
పట్టునివస్త్రములమేనుకట్టొత్తి । పట్టువస్త్రంబులెకట్టనిసురు
రత్నాలసొమ్ములెరాజుమరికిదిని । హెచ్చయినచేవులముత్యాలపోగులను
ఆణిముత్యపుసరులువానికేయిమారె । మకరమాణిక్యాలఅసింహాబలుడు

గంధకస్తురిపరిమళద్రవ్యములు । బాగుగాధరియించె ఆసింహబలుడు
ఏడునిలువులభమిడిమేడలోపలను । సన్నబియ్యము మంచిచాయపప్పులును
కందపెండలము కాయగూరలును । నానబాలుపాయసము ఆవులనెయ్యి
భక్తితోనారగించె నాసింహబలుడు । గంగజలములు దెచ్చి హస్తములు గడిగి
పచ్చిపోకలేపండుటాకులును । పచ్చకర్పూరాన తాంబూలమిచ్చె
తాంబూలమును వేసె సేనాపతి కిమ్మడు । ప్రొద్దుపుచ్చారేక పాలతితిమ్మడు
కీచకుడు పోయె కేళివనములకు । దానిమ్మవనములే దబ్బవనములును
నారింజవనములే నిమ్మవనములును । చామంతివనములే జలధికాలువలు
భానువంకను జూచి పద్మముల జూచి । గ్రుంగెటిభానుడూ గుర్తింకున్నాడు
విల్లంబు బుచ్చుకొని మండపమ్మునను । మండలాపతికి దుగుమహిమతో నిలచి
గ్రుంకకున్నా నిన్ను కొట్టేవననెను । అనియిట్లు కీచకుడు ఆడుమాటలకు
సూర్యుడు మాచిట్లు శాపంబుబెట్టె । పాపనుడ నీజీవ్వాపదును యీరాత్రి
గడగడవణకుచు గ్రుంకె సూర్యుండు । పడమర భానుడు గ్రుంకెనంతట్లో
ఆక్కడ భీముండు వంటశాలలలోను । పావకుడ నీవు నాకు బంధుడవై తే
శాకపాకమ్ములక్షణములో జేతు । అనియిట్లు భీముండు వంటచేయగను
వీరకేళుకులొచ్చి విస్తర్లు వేసె । అవిరటుకొలువుల వారినందరినివేపి
పళ్ళెవారికి కెల్ల పరగవడ్డించి । తానారగించె షడ్భక్ష్యభోజ్యములు
సంతుష్టిగాగుడిచి సరయూనదినీళ్ళు । వాంఛతీరగ త్రాగె వరుస భీముండు
పసుపుబూసి భమిడి చెంగులచీరగట్టె । అగుస్థములవీరమద్దులను బెట్టె
గట్టిముట్టెలు బెట్టె కడియములు బెట్టె । పరగనా భీముడు పతకములు వేసి
ఉరమున అవికెందుభరగొలంబెట్టె । కుచములమర్చెనే వాయునందనుడు
ద్రౌపదినితోడుకొని వెళ్ళె భీముండు । ఇదియేమి చోద్యమే చిత్రపుత్రిక
విరహానిను గోరి వీడేలచెడనే । వీడిలక్ష్మిరాజ్యము నేలపాలాయె
భక్తితో తనసతి అకుచట్టియ్య । వీడెమ్ము చేయూచు వేదుకలతోను
కలసిమచ్చట గ్రాలు కాంతతో నుండ । అల్లంతటవచ్చేటి యాసింహబలుని
రాకలు జూచిరి రాజ్యాధిపతులు । సింహబలుడొచ్చెనని దీపంబులార్ప
వెలుగేల ఆర్పితివె వెలదిరో నీవు । అనియిట్లు కీచకుడు ఆడుమాటలకు
మాయద్రౌపది బల్కె మాయతోడుతను । దీపంబులుంతురా లోకంబులోను
యేవురు మొగులాలినయియుండనేను । దీపంబులుంతునా లోకంబులోను
బిర్వేలమూపితివె దేవె నేరాగ । బింబంబు బోలు నీ దేవినీముఖము
వెలుగునమాణిక్యముదీప్తిలుచుండ । యేపారిమాణిక్యము యెందుండు చెప్పుమా
అనుచుదానీగొమ్మ ఆదుగటవేసి । బలువుకుచాలకాపట్టుమంచంబు

విరిగినయంతలో విమలాక్షిబలికె । మంచమువిరిగితేమరణమందురు
పురుషులకువీలుగాదు బుద్ధేమిచెప్పుమ । మెల్లనేగొప్పుబట్టి మెల్లనేదీసి
చందమామనుబోలు సఖియనీమోము । కళదప్పియున్న దేకాంతిరోనేడు
పగలుజూచితేచిగురుటాకులనుబోలు । మాపుజూచిన మద్దిమ్రాకులనుబోలు
ఆడకట్టుగాదనుచుఅనినిశ్చయించి । మనసులోపలచింత మరిదిగులుపడెను
ఆడదెబ్బగాదనుచుఅవరిపడితేవా । చెంపపెట్లూ బెట్టెతానుభీముండు
కదలకతన్నెనేకన్నూడిపడెను । ఆచితన్నితెయూడె ఆదంతములును
భీముండుసింహబలుడు యుద్ధంబుసేయ । మూడులోకంబులు ముందరవణకె
గడగడభూదేవిఅప్పుడేవణకె । కాళ్లునువ్రేళ్లునుఅన్నియును విరచె
పొట్టచించిబుర్రపొట్టలోపెట్టి । యువిదవీడీనెత్తుర్రిబొట్టెట్లకోవ
అనిచెప్పిభీముడు అక్కడగదలి । ఒప్పెటిగుండములో స్నానములుచేసి
కాంతయొక్కడికిపోక నింటికిబొమ్ము । అనిచెప్పిభీముడు అక్కడవెడలి
తనకొలువుచోటికితానేగుదెంచె । అప్పుడుపాంచాలియక్కడవెడలి
కీచకులవీధిలోతాకేకవేసె । మీకీచకునిజంపగంధర్వులొచ్చి
యేరాజుజంపెనో చూతామురారె । రారేచూతామురాచవారల్లా
తమఅన్ననుజంపిందియీపాపకర్మి । తమఅన్నచిరిప్రక్కను దీన్నికట్టరే
అంతలోనేవచ్చిరి వానితమ్ములును । నూరుగురు కీచకులునిముషానవచ్చిరి
అంతటయీమాట వినివిరటరాజు । కంకయ్యతోజెప్పెకీచకునిచావు
ఈమాటరారాజువిన్నానుయపుడు మనపట్నముగెలుచుకొనిపోయెదరునమ్మ
యెవరికితెలియకుండకవాన్నిపంపించు ; అనియిట్లుధర్మజాలుఅనతియ్యగను
అట్లేనేయుమనెను ఆవిరాటూరాజు । అతనిప్రక్కనుదేవి ద్రౌపదనికట్టి
ప్రేతభూములలోకి కొంచబోయిరిగ । ప్రేతభూములలోను పతివ్రతాతాను
అన్నహారములేక అపలుకుబలికె । ధర్మమ్ముదలిపేటి ధర్మజాలుతమరు
పతివ్రతపాంచాలినిజూచి పొండయ్య । గోవులనుగాసేటిగోపాలమీరు
పతివ్రతాపాంచాలినిజూచి పొండయ్య । ఆపంటకాలలో ఆభీముడుండ
ఆదేవిపలుకులుకర్ణములబడెను । కోపగించీలేచి తానుభీముండు
ఉగ్రుడైతావెళ్ళె తా నుభీముండు । నూరుగురుకీచకులనిముషానజంపి
నూరుగురకీచకుల నొక్కనిముషాన । అగ్నిహోత్రునికితానాహుతులుచేసె
లక్కటికొప్పుమెత్తిరుక్కితీకనోయనుచు । సంతోషమునసుండెఖవళాయతాను
స్నానంబుచేసుకునితిరుగితావచ్చె । మొగలనుదాచుకొంద్రుమగులంవరును
పోదరులను దాచుకొందురుసఖియలంవరును । యింటింటజాతర్లుచేతుమేతల్లి
ఈయేటిబిడ్డలు నీవేరనుమ్మి । పాంచాలిరాకజూచి సుదేష్ణయపుడు

సుధేష్ణకా పెద్దగా శోకింపదొణకె । విరటునింటికి నేడు రావంగనేల
వచ్చినదాని జాలిమోహించనేల । వీనిరాజ్యము శవముపాలాయె
యింక నెవ్వరిజంప నేతెంచినావె । యికను నీపురముకు జనుదెంచుమనెను
అనియిట్లు సుధేష్ణ యాడుమాటలకు । నేనేమిచేసినే నెలతలరో నేడు
నీవల్ల నేరమే నిజముగా నమ్ము । దక్షిణగోవులతరిమిపట్టగను
తాబోయి విడిపించె తాను ధర్మజులు । ఉత్తరాన గోవులు పురిమిగట్టగను
తాబోయి విడిపించె తాను అర్జునులు । యేవురుశెనిమిట్లు మధ్యపాంచాలి
విరటుపాకట్లోను కొలువుగూర్చుండ । చూచివిరటులరాజు సాష్టాంగమొరిగె
జూచివిరటులదేవి సాష్టాంగమొరిగె । చూచిపురజనులంత సాష్టాంగమొరిగి
సంతోషమున నుండె ధర్మరాజపుడు । యీ కథ యెవ్వైన పాడినా విన్నా
ధర్మంబుగలదని ధర్మజులు అనిరి । నిత్యకల్యాణములు సత్యముగ గూడ॥

## 15 శాంతాకళ్యాణము.

శ్రీరామమహిమంబు సృష్టిలోపల వెలయ భేరీలు మ్రోగుచుండె ।
సంతానము లేదని తండ్రి చేసిన తపస్సు ధరణిపై మ్రోగుచుండె ।
భరతసౌమిత్రియు నందముగా నేరీలక్షీరగా పలికెరచన ।
శాంతను తెచ్చిరయా ఋషులు తెచ్చినరీతి జగతిలో మ్రోగుచుండె ।
శాంతను పెంచెయా దశరథపుత్రికయనిరి ।
కౌసల్యకూతురు గారాలపట్టియనిరి ।
పసిడిబొమ్మల్లు కుందనపు తలుపులనిరి ।
పదికోట్లమాణిక్యాలు అపణికిసొమ్ములనిరి ।
పమిడినీళ్ళముంచిన జలతారు చీరలనిరి ।
పదికోట్లచెలికత్తెలు అపణతిని గొలుచుచుండె ।
చెలికత్తెలతో ఆశాంత ఆడుచుండె
కూతురుని పరీక్షించి కుందనపు ప్రతిమ అనెను ।
బాలను పరీక్షించి బంగారుబొమ్మ అనెను ।
మాతల్లి రమ్మని ఆరాజు తొడలనుంచె ।
ఆడివత్తివమ్మ మేనెల్ల చెమటబట్టె ।
ముద్దుగనిలచెను బాల ముడిసవరించుకొనెను ।
తండ్రిచాటున బాల కిలకిలనవ్వెను ।

పెళ్ళిప్రియముకాంతకు ప్రేమతో చేతామనెను ।
తనయపెళ్ళిచేయ తండ్రిమనస్సున దలచెను ।
పట్టిదీర్చిఆరాజా పణతులతో ఆడుమనెను ।
ప్రాణపతినిదలచి ప్రాణేశుడు వచ్చెవేగ ।
పతిరెదురుగవచ్చి పతిపూజజేసెదేవి ।
హంసతూలికాళయ్య నారాజాకూర్చుండెను ।
కనకపళ్ళెములోన కర్పూరపువిడియమిచ్చె ।
కౌసల్యచేవిడియంబు ఘనమున అందుకునెరాజా।
పరిమళవస్తువులు సతిపతులు స్వీకరించిరి।
సతినికౌగిటజేర్చుకొని సంతోషమున బలికెను।
కౌసల్యతో రాజా సుతిపెళ్ళి చేతమనెను।
పతివాక్యములువిని పణతిఆనందపడెను।
మనవిగలదనిసతి మొక్కినిలచి పలికె।
లక్షణంగలకాంత లక్ష్మినిమించి యున్నది।
శుభలక్షణమ్ములు గలవిభువరుజేర్చ వలెను।
సూర్యచంద్రులకన్న సుప్రకాశత మించియుండె।
వనములన్నితిరిగి దేవఋషిని తెస్తునసెను।
కళ్యాణకట్నాలు కాంతకురొరిగింపుమా।
సుతాభరణాలు సుదతివర్ణింపదొడగె।
ఏబదికోట్లబంగారము ఆవెలదిసొమ్ములనెను।
నలభయికోట్లబంగారము నానుతో సూత్రమనెను।
కోటిమాణిక్యాలు కొలికితో సూత్రమనెను
వెలలేనివేవేలు గజకంఠమాలలనెను ।
యింపైననీలాల సొంపైన సొమ్ములనెను ।
గోమేధికమ్ములు పలకసరుపేటలనెను ।
ఏబదికోట్లసరములు ముత్యాలహారమనెను ।
నలభయికోట్ల వెలబాలవంక చంద్రహారమనెను ।
దొడ్డదొడ్డముత్యాల సారంపుతోడుగులనెను ।
యింద్రనీలంపుసరులు జవననాది గొలుసులనెను ।
శుద్ధసువర్ణపుసరులు సుదతిశృంగార మనెను ।
రెమ్మైనపచ్చలు మెడబన్న సరములనెను ।
అచ్చమాణిక్యాలు పచ్చలాపతకమనెను ।

సోపాణిముత్యాలు సూడిగమ్ములాయెను ।
ముద్దులుగొలుసులు పోచీలుఅందమాయెను ।
కనకగాజులనడుమ ఘనకంకణములాయెను ।
మొగలిపువ్వుకడియాలు ముందర మురుగులాయెను ।
సన్నంపుకెంపులు సందిటీదండలాయెను ।
సన్నంపుకెంపులు జవనాడిపట్టెడాయెను ।
సన్నంపుకెంపులు ముత్యాలహారమాయెను ।
బాజిబందులుగట్టి పైనభుజకీర్తులాయెను ।
అందమైనబావిలీలు అరివేణిరేఖలాయెను ।
కమిడికొప్పుగొలుసులు జడచాలందమాయెను ।
నలభయికోట్లబంగారము రాగిడీబిళ్ళలాయెను ।
సూర్యచంద్రకాంతి చూపుగలవజ్రమాయెను ।
చేరుచుక్కబొట్టు కరకోటివజ్రమాయెను ।
పదికోట్లబంగారు పణతివడ్డాణమాయెను ।
వన్నెగలనడుములు వజ్రాలుకట్టుమాయెను ।
కనకకంఠమాల కడుమంచి పోద్యమాయెను ।
పంచనవరత్నాల పాదాలఅందెలాయెను ।
పాదపట్టంబున పాదలగొలుసులాయెను ।
పాదఅంగుళ్యాల రంగైనమట్టెలాయెను ।
కోటానకోట్లు బ్రహ్మతోడుగులాయెను ।
ఇంద్రగోపలపట్టు యింపైన రవికెలాయెను ।
చంద్రకాంతిపట్టు జడతాబందులాయెను ।
పదికోట్లఏనుగులు పణతికిఅరణమాయెను ।
అరవైకోట్లఅశ్వాలు అతివకు అరణమాయెను ।
పచ్చలపల్లకీలు పణతికి అరణమాయెను ।
అరవైకోట్ల అందలాలురాణువ శాంతకుఅరణమాయెను ।
పదికోట్లపెట్టెలు పణతికి అరణమాయెను ।
వెయ్యికోట్లచెంబులు కేయింతామాయెను ।
రాజ్యంబులోసగము రాజ్యముశాంతకాయెను ।
నీమమేటికిఅయోధ్యయే అరణమాయెను ।
వినుటమాత్రమెగాని సవతులుంగలిగుండగా ।
సవతులమీదను సుదతికి రాజ్యమేమియ్యగలము ।

ఒకటిరెంటామూడు ముగుదలవికూడుకుంటి ।
యీమూడుజగములు ఏలెంచిపోషించెను ।
వలసితె స్త్రీవికనుక పణతినిపోషిస్త్రివి ।
ఆత్మగూడుకసతికి ఆతివయిట్లని పలికెను ।
లీలవినోదపుకాంతులు దేవినిమించుచుండె ।
వీదిరాజ్యముదేవునికృపను పాలించుచుండు ।
సుతులుంగలిగినరీతి కాకంటపరికెను
సుతులుగలిగిమీదటసుతకుఒక రాజ్యమిస్తు
పతిపతులుభాషించు నెడతెల్లవారె।
అప్పుడుపరవాయిద్యంబులు చేయుచుందురు లోకులుకేగ।
పిలచిరాజ్యమంత్రినినారాజా కాంతకల్యాణమానెను
కదుసంభ్రమునఆరాజా గణపతినిపూజించెను
దేవకన్యలందరినిపిలచి దేవఋషి తేబంపెను
దేవఋషి తల్లివచ్చినతరువాత దశరథేశ్వరులు ఎదురొక్కనిరి
మంగళస్నానాలు శాంతకు జలకమాడించిరి
చలువపువ్వులచీర సఖియకు కళ్ళొత్తించిరి
దివ్యాంబరపుచీర దీప్తిల్లగట్టి
దివ్యాంబరపురవిక కాంతిల్లదొడగదేవి
దశరథులువేలెంచి కాంతచేఫలమునుంచిరి
కాంతకోరికలువున చెదరిజూచెరాజా
కోటిధనమును ఆరాజావిప్రులకు విడియంబొసంగ
దశరథులదేవిదమ్మని దేవదుందుభులుమ్రోయ
దేవతలుచేమ్రొక్కి పలికెనపుడు
దేవఋషిపాదాలు దశరథులుగడిగిరి
కౌశల్యదశరథులు కన్యధారోసిరప్పుడు
సురలెల్లదీవించి శుభసూత్రముగట్టిరి
ముత్యాల తలంబ్రాలు వనితపన్ని శిరసునుంచిరి।
వజ్రాలతలంబ్రాలువనితపన్ని సిరస్సుననుంచిరి ।
మాణిక్యాల తలంబ్రాలు కాంతమహాలక్ష్మి తలబోసిరి,
పతిపతులుతలంబ్రాలు చెండుబంతాడిరప్పుడు।
సఖులుతలంబ్రాలుపొయ్య సప్తమహాఋషులునవ్విరి।
తనయుతలంబ్రాలుపొయ్య తల్లులానందపడిరి।

దేవఋషిచెయ్యనుంచి మాపట్టిబాల యనెను।
మహారాజుపలుకులకు మహామునిశిరస్సాంచెను।
అంతలోవాల్మీకి కడకలపొంగిపలికెమదిలో ।
మహారాజతనయ మహాఋషులాదేవియనెను ।
కౌసల్యసుతజాణ తగుమీకు కాంతయనెను ।
అయిదుదినములపెండ్లి అతిఉత్సాహముచేసిరి ।
పారిగందు గౌరిపోలన్నవారాదేవి।
నల్లపూసలు కుత్తిగంటునాతి మెడనుగట్టిరి ।
పందిళ్ళుమెరయగా పణతివివండాశించిరి ।
సకలదేవతులకెల్ల దశరథుడు కట్నాలిచ్చిరి ।
దశరథులకట్నాలు అందుకొని దేవతులిట్లనిరి ।
కూర్మిగలఋషి మేడలకీతూతుగనంపించమనిరి ।
మళ్ళిపంపుదాము మాకేమీపలకవలదు ।
అంతలోవాల్మీకుడుకలపొంగి పలికెమదిలో ।
ఋశ్యశృంగుడు శాంతను ఋషింల్లెకుపంపమనెను ।
మళ్ళిపంపుదాము మహారాజానతెగవలెను ।
వాల్మీకి పలుకులకు వంపొంగుగాజామదిలో ।
యింతమునికివ్వగా మగువయెగవాయెమాకు ।
సంతానములేదన్న చింతేలవానపుణ్ణోన ।
మహిమీదగలిగితె మాతల్లిభాగ్యమనెను ।
వినవయ్యావాల్మీకుడ వినయముచేయనేల।
అర్ధాంగసుతపంప అధికారమెవరిదనెను ।
తాపంపదలచితె తనదేవియొప్పదనెను ।
సుతకొరకై పతిమమ్మునెదురాడునేమోను ।
అర్ధాంగినేఅడగ మాటదలిగరాదు ।
సుతమందిరములోపల ముసలాడిగరగివలెను ।
ఋష్యశృంగుడు మానగరపతిపలుసిరమనెను ।
పుత్రికయింతాయె పుత్రుడుదయించేను ।
దేవలోకంజొచ్చి దేవతులసాధింపరాదు ।
తండ్రిచాటునబాల తనయశిరస్సుంచుకొనెను ।
చీనచీనాంబరాల సుతనేత్రములొత్తెను ।
వగపనేటికిఅమ్మ మళ్ళిపంపననెను ।

మూలధనమునీవు ముద్దుపాపవమ్మ ।
ధర్మకతజావునీవు మమ్ముగన్నతల్లివానైను ।
తనప్రాణవల్లభుని దండెత్తిభాషింపగా ।
తప్పచేయకఆముని తప్పకసతినిజూచె ।
మునిఅభిమతము ఆరాజువిన్నవించె ।
కనకమేడఋషిని కడుకీర్తిమునవుంచవలెను ।
అంతలోవాల్మీకి వలపొందిపలికెమదిలో ।
సుతుపయిభోగములు వేడుకలుజూడవలెను ।
ప్రాణసతినితలతువని ప్రాణసఖుడువచ్చెవేగ।
సతియెదురుగావచ్చి పతిపూజచేసెదేవి ।
హంసతూలికశయ్య ఆరాజుకూర్చుండెను ।
కనకపళ్ళెరాల కర్పూరపువిడియమిచ్చె ।
కౌసల్యచేవిడియము గగనముగ అందుకొనెరాజు ।
పరిమళవస్తువులు పతిసతులు స్వీకరించిరి ।
పతినికౌగిటజేర్చుకొని సంతోషమునబలికెను ।
సుతువేడుకలు చూడవలెననిపట్టెబాలను ।
రాజుపణతినెట్టుగాతాను వనతపస్వికిప్రణతెట్టగానేరను।
అతివగూడి అతిరంతులేజేసెను ।
పంజరమ్ములుజూపి జంమలేఆరగించు ।
పతిసేవచెయ్య పణతియెంతికలదురాజ ।
పతివచనమునకు కౌసల్య మతిసమ్మతించదాయె ।
స్త్రీమర్మముచేత చిత్తమునస్పర్శించెఋషి ।
స్త్రీలవిలాసమున చిత్తమునస్పర్శించెఋషి ।
కౌసల్యకరముపట్టుకొని రాజు కాదునామాటవినుమ ।
పగవనామాటకు యెన్నడుమారుగొని పలుకవైతి ।
చనువుచేసినన్ను చవకచేసిపలికితివి ।
ఋషిస్త్రీయౌవనములకుచనుదెంచినవనతపస్విని కావలేము ।
నాఋషిసేవకు ఋషిశాంతనుబంపితె వువయించుననిరిథ్రియలు ।
శుభస్యశీఘ్రము సుదతిఆనతియ్యవేగ ।
రాజేంద్రునీయాజ్ఞవిని యితనికియింతిని స్తి ।
లిపంచితెమారేమిపలుకపలదు ।
వికలదేజేవి హరికొంకు మాటవినుము ।

లలాటవిరుదముని ఉగ్రతపస్విసుమ్ము ।
ఋషిసంహారాలు మానాపలేని సార్థించుదేవి ।
రంభశృంగారించిన నవరత్న మేడనుంచి ।
సతిని అనుమతిపలికి నదరులో కేగరాజా ।
దేవతలు పిలిపిలిపించి దేవఋషులే వేల్చిరి ।
సకలఫలములు దేవఋషి మేడనుంచిరి ।
సంపూర్ణ ఫలములు సతిపతులు దానమిచ్చిరి ।
కోటానకోట్లు బ్రహ్మసభకు వేగ చేయించె ।
యత్నమామునీంద్రుల సపనూహెఋషులు అరగించిరి ।
పంచభక్ష్యాన్నములు పెట్టి అరగించ బెట్టి ।
వింతవింతలు మేడలు నీటు శృంగారించిరి ।
భమిడితరగోళ్ళ అండజములు వేసిరి ।
మేలిమితలగుడ్డలు మెరపు బొక్కలుఅమర్చిరి ।
పూబోణులా బొమ్మన పుష్పజాతులు అమర్చిరి ।
అందంపానుపున నవరత్నగొలుసులు అమర్చిరి ।
కనకకస్తూరిదీపాలు కడువేడ్కతోనుంచిరి ।
కర్పూరపుతాంబూలంతో కౌసల్యసుతనునగరికి పంపించెదేవి ।
దశరథులు ఏతెంచి నవరత్నశయ్యజూచి ।
సుతసుందిరమ్మునుజూడ వైకుంఠమనిరి ।
మునికాంతలేతెంచి ముదితక్కట్లనిబలికిరి ।
ఋష్యశృంగుదుచూచువిభుడు వేగనిరమ్మనిరి ।
కాంతలందరుగూడి కౌసల్యకిట్లనిరి ।
ఋష్యశృంగఋషి మేడకు కూతురినంపించుమనిరి ।
తల్లి చాటుబాల తనశిరస్సొంచుకొనెను ।
చీనిచీనాంబరాల సుతినేత్రములొత్తెను ।
కాటుకలుఅంటెనని కన్నీరువత్తెతల్లి ।
రోదనంచేసితే ముఖము వెల్ల చెదురునన్ను ।
మగువనిమతుక్కలు మహారాజా మీతండ్రిచూడగలిగె ।
అనిపల్కి కౌసల్య శృంగారంచేయగల్గె ।
వైద్యూగాబులు పన్నీటజలకమార్చెతల్లి ।
దివ్యాంబరపుచీర దీప్తిల్లగట్టెనుతను ।
తాంబలపూలరవిక కాంతిల్లదొడగదేవి ।

పసిడిజిలుగులబాగయిన పట్టురవికదొడగిరి ।
పంచవరత్నాల బాగుగావలపోసిరి ।
పెరవిప్పనార్చి నెలబాలజడయల్లిరి ।
కురులుజక్కగాదువ్వి పారిజాతములుముడిచిరి ।
ముఖముకైవసిదీర్చి మొగమోహనాంగివనిరి ।
నుదుటతిలకమొప్పగాదీర్చి కొలుకులపన్నంపు కాటుకిడిరి ।
దొడదొడ్డతోడుగులు దేవికాంతకుదొడిగిరి ।
ఘనమైనతోడుగులు దేవికాంతకుదొడిగిరి ।
అకులుచుట్టితల్లి మడుపులేఅందిచ్చెను ।
సుతకుతాంబూలంబిచ్చిచూచి కౌసల్య పలికె।
సుతతాంబూలంచాయ సూర్యునిమించియుండె ।
యీమురిపెమెంతపుణ్యాత్ముడో యీముగుదనుపొందగలిగె ।
కమసోద్భవుడు వుకనుదిష్టితగిలిసన్న ।
నీలాంజనముకని నిత్యతాంబూలంబుంచిరి ।
మేన మయిజారుకొంగుస బంగారుముడిచికాంతకిచ్చె ।
పచ్చలపావాలు పట్టెపాదాలకిచ్చె ।
రంతుచేయకమ్మ రతికేళిగృహముకరుగు ।
మహాఋషిచిత్తాన మనస్సెరిగిమసలవమ్మ ।
వసంతఋతువునతపసికి మనసెరిగిమసలవమ్మ।
ఋషినీకుపతియగుట నీజన్మసఫలమమ్మ ।
మాతల్లినిన్నుపంపినందుకు మాకోర్కెలీడేర ।
పరమపతివ్రతవమ్మ పతిపూజచేయవమ్మ ।
కవుగలిమ్మనీవిభుడు గగనపడిఅడుగునమ్మ ।
వెల్లపాన్పుమీద విభుడెల్లు వినయమునకవుగలిమ్మ ।
సురతికేళికడుగును విభుడు చిరునగవులునవ్వవమ్మ ।
పతినిమెప్పించుకొని రతికేళిమేలమాడు ।
హంసతూలికాశయ్య అతిసరసాలాడవమ్మ ।
పాదములొత్తవమ్మ పానములొత్తినీవు పతినిఒప్పించవమ్మ ।
యేకాంతమందు విభుడు ఎవరికిఎరిగింపరాదు ।
మాతకుఎరిగింపవమ్మ మముగన్నతల్లివనెను ।
అడుగడుగుకుఅతల్లి సుతకునవరత్నాలోసి ।
సుతనుమేడలకంపి నిట్టూర్పుబుచ్చితల్లి ।

పట్టెచాలకబక్క పణతిరొట్లుతొళునా ।
తలచినేధరణిపతి తగునీకుచెల్లవనుచు ।
మహారాజాపలుకులకు మారాడవెరచితపుడు ।
శాంత అత్తింటికేగి శాంతముతోనుండి అచట ।
పసిడికొలుసులతొంపు కుందనపుగడియవేసె ।
మహారాజసుత వెళ్ళి మహామునియెదుట నిల్చె ।
అనృడుదయించెనని ఆమునిభ్రాంతిగొనెను ।
తేటచూపులయింతి ధరణిపైనిలచె నఫ్రుడు ।
సముద్రుడగుశాంతాపతి తనశయ్యతోడల గొనెను ।
వచ్చునోరాదోయని మదితల్లడించె విభుడు ।
చిరునవ్వులునవ్వుచు శృంగారవతిని బిలచె ।
పతియాజ్ఞాపూజించి బన్నస్వరములు కదలగా ।
అడుగుఅడుగునసతికి అందెలుమ్రోయుగాను ।
హంసనడకలఆశాంతను అందుకొని తొడలనుంచె
కర్పూరతాంబూలం కడుభక్తితోడనిచ్చె
సఖముకోఱకుచుపతికి స్నేహమున అందించెను ।
బన్నస్వరములపైట పతిజారదీయుచుండె ।
ఆభరణములన్నియు అటుతొలగదీయుచుండె ।
పరిమళమ్ములుపెక్క భామపైజేయుచుండె ।
పరిమళమ్ముదరగా పణితిశిరస్సంచుకొనెను ।
తపస్సులన్నిమాని ధవళాయుచేతిరివిమా ।
మమతతో నామనసునను మరియాదగానుగొనుమా ।
చిత్తమునవీకొరకు రాణివాసమునకొస్తి ।
శాంతావిలాసమునకు మహారాజానగరుకొస్తి।
దేవతలుబొగడదేవి నినుపెళ్ళాడితి ।
పంచభక్ష్యపరమాన్నములు కౌసల్యవడ్డింప ఆరగిస్తి।
ఋషిపల్లెఅనగాను యీసడింపేల యింతినీకు ।
కలికిచిలుకలకొలికి ప్రేమించిపలుకునాతో ।
విభునిప్రార్థనవిని యింతిశీఘ్రానలేచె ।
కౌసల్యంలికినరీతి శాంతతాపతియెదుటనిలచె।
బాలపచ్చంపువ్వుల సురటిచాలగవిసరె మునిపతికి ।
అతివసురటిబట్టగా అత్మలోనవ్వుకొనెను ।

సుందరేలబట్టేవు సుదతినీచెయ్యి కందదటవె ।
నాకరముకందగా నీకరముకందదటవె ।
నీకరముకందితే కౌసల్యనినుజూచిఓర్వదనెను ।
అనుమనోచ్చకుంటు విభునితోడపైజేర్చుకొనెను ।
బంతులాడుదామని పతిబంతులందుకొనెను ।
బంతులేఅందుకొని పంజరమ్ములో అడ్డుగొనెను ।
దేవఋషిచెలి దగ్గరవేసిగెలిపించె శాంతవిభుని ।
తనకర్పూరతాంబూలం యాశాంతపుక్కిళ్ళనుంచె ।
తెల్లవారగవచ్చె గేవిఋకళమునింతమనిచెప్పెను ।
అరుణోదయమాయెను తపస్సు మానుమెచ్చె ।
దశరథులకడకేగి తల్లడగ దేవతులిట్లనిరి ।
తెలివిచాలనుఋషికి వేగుదప్పెను మూడవరా ।
శృంగారపుమోహాన చిక్కివున్నాడు శీఘ్రనతేర్పుమనిరి ।
దేవతులపలుకులు దశరథులు నవ్వుకొనిరి ।
నాట్యకన్యలబెట్టి భంగరుమోగించెనపుడు ।
తుంబురునారదులు పాడమృదంగములు మ్రోయగాను ।
అంతలోదేవఋషి అంతలోమేలుగాంచె ।
యెదుకొమ్ముపైబూనిన శాంతిచెయి పెల్లంగదించె ।
ఋషివరా వికలనను మాతప్పుగాచుమనెను ।
మదినియూరు దయబూని నన్నుకరుణించుమనెను ।
ఋష్యశృంగులకు ఋషులుచేతులొగ్గిరంత ।
నవరత్నపీఠములు మహారాజె పరిపించిరి ।
అంతపుష్పపుదకములు తరువులు దించిరి కొలనుకు ।
యేతెంతునని గొబ్బుననడిచెఋషిమహాఋషి ।
వెంటనే మహామునులు వారితో చనుదెంచిరి ।
అంతటమహారాజు మనములు తెలుసుకొనిరి ।
మూడుదినములుమునవెుప్ప మజ్జనముగావించుచు ।
యేడుదినాలు ఋషినియమునాతీరమ్ముమీద ।
ఏతెంచరాజాఅసంగతులేగాని గతిమాకుగానరాదు ।
అనుమవల్కుచువారు అంతతీరమునకు జనిరి ।
కామరొప్పగాఋషి కొలువులో కూర్చుండెను ।
శాలాగడియలు జపముశీఘ్రనతాను జేసి ।

ఋషిసతీతలపులతో మదిని సంతోషచిత్తుడాయె ।
తల్లులెతెంచి బాలను పరీక్షించివారు ।
చలవచేరలు చూచి వారిలోవారునవ్వుకొనిరి ।
మహాఋషిమక్కువలు మగువచెల్లించెన నెడు ।
వారిపలుకులువిని శాంతతనశిరస్నాంచుకొనెను
మాతల్లి సిగ్గేల నుమ్ము కరుణించవమ్మ ।
అల్లునికి గూతురికి ఆదేవితొట్టమర్చెను ।
పసిడితొట్టెలోను పణతిపవళింపపెట్టె ।
తల్లినిద్రించుమని తల్లిచేయూచి పాడెనపుడు ।
పరిమళమ్ములు పైజల్లుచుండెతల్లి ।
సురటిచేతబట్టి సుపుత్రివిసరుచుండె ।
నగరికియెప్పుడునరుగును పరమఋషి ।
నేత్రములుధ్యానించి చెప్పుడుజాతు ।
శిశువజాముకాని వెన్నడుధర్మసంతానములకు ।
డాళలేనని మోహములజిక్కి మిగిలిమేడలోనుకలు ।
హంసతల్పమ్మపైని వేదఋషిగూర్చుండ వెంటిరమ్మనిపిలచెను ।
హారములుకదలగ హర్షమునసేవించుటకును ।
బన్నసరముపైట పతిజారదీయుచుండెను ।
యాభరణముల్నిటను అటుతో లగతోత్రియుచుండెను ।
పరిమళమ్ములుపెక్కు పాలిళ్ళపైనలుగుచుండెను ।
పరిమళమ్ములు అందుగావించిశిరస్నాంచుచు ।
తాశిరస్నాంచగాతపః శాంతవేడుకొనును ।
శాంతహారాలని గ్రుక్కనశాంతననెను ।
యింతివిరహాగ్ని పొందవిభుడుదలపోయుచుండె ।
భానుడుగ్రుంకెను మహారాజ కొల్వుచాలించివచ్చి ।
స్నానసంధ్యాలువార్చి సరగునఆరగించెశాంతాపతి ।
పంచభక్ష్యాన్నములు పళ్లెమునసుంచగాను ।
అరగించుమనితల్లి అతివకు యిట్లనిపలికెను ।
పట్టుతనముపహించుకొని దీక్షయైనిలుపవమ్మ ।
పట్టుతనములు వహించుకొనికూడును శాంతాభుజించెను ।
మేడకుపులికాపుచేయించి సుతశృంగారముచేయగలిగ ।
వెయ్యెరుగబులుపక్కెటజలకమార్చెతల్లి ।

పంచనవరత్నాలు బాగుగజడవేసిరి ।
కురులునొప్పునవార్చి నెలబాలజడలల్లిరి ।
కురులు చక్కగదువ్వి పారిజాతములుముడిచిరి ।
ముఖముకై వడిదీర్చి మొగకోహానాంగియనిరి ।
నుదుటతిలకమొప్పగదీర్చి కొలికలసన్నంపు కాటుకిడిరి ।
దొడ్డదొడ్డతొడుగులు తనయకాంతకిడిరి ।
తేజమయినతొడుగులు దేవికాంతకిడిరి ।
ఘనమయినతొడుగులు కౌసల్యనుతికాంతదేవితొడిగె ।
ఆకులు చుట్టియిచ్చి తల్లి మడుపులందించెను ।
సుదతితాంబూలముయిచ్చి చూచికౌసల్యపలికె ।
చదరఖంజగవిడియము నేర్పుతో చేయనమ్మ ।
అడుగుముందరివేసి అతివగొబ్బుననడిచెను ।
మరమేడలోనడవగా జూచి తల్లులనవ్విరి ।
కొంతకాలముదాకి చెలులారబుషియింట వెరచుచుందురు ।
దాక్షిణ్యంపురీవమ్మ పెద్ద యూరమునసుంచిరి ।
నేడుయేమొసుదతి పతిమతిని మెచ్చుకొంటు ।
మనకాంతకివియేమివింతవిపలికిరి రాముమాచువిభుడు ।
వేగమె వెళ్ళుమని కాంతలంవరు[illegible]సి కౌసల్యకిటనిరి ।
కౌసల్య వేగమెబుషి మేడకు తూతునంపించమనిరి ।
సమ్మతిని పతివున్నతములుజేయ ।
పువ్వులు మేడలువదలి పూబోణిఅతివనాకొరకు ।
ఆరగించను వెరస్త్రివా నెలతవావిరహాగ్ని ।
బాధకోడితి నీసన్నిధినేనిచ్చలేను ।
చలువపువ్వులవలువపై సతిమహాముని వెళ్ళెను ।
అంతలో దశరథులు అర్ధాంగి మేడకొచ్చె ।
సతియెదురుగావచ్చి పతిపూజచేసెదేవి ।
హంసతూలికాశయ్య ఆరాజా కూర్చుండెను ।
కనకపళ్లేరాల కర్పూరవిడియమిచ్చి ।
కౌసల్యవిడియముగనముగ అందుకొనిరాజా ।
పరిమళవస్తువులు సతిపతులుస్వీకరించిరి
సతినికౌగిటజేర్చుకొని సంతోషముననలికెను ।
నుతవేళభోగములు వేడుకలుదెల్పవలెను ।

ఋషులు కాలకని విభోగములవలంబించుచుండెను ।
మహాఋషిముఖ్యులు మగువ చెల్లించెకేడ ।
రాత్రిం గలఋషిని కనకమేడలనంచుకొను ।
కనకవేడుక ఋషిని నిలిపెటిమాత్రముసీవకాగదు ।
సూత్రధారవల్లగడి మూర్తిమించుచుండె ।
శాంతికళ్యాణము జగతిపై మెరియుచుండె
ఇదియెవరవ్రాసినా చదివినా యెప్పుడుకల్యాణమగును ॥

# 16 కామేశ్వరిపాట.

"మనవాడు పాలకొలను"

శివశివాదేవర శివనందికొల్ల । కదలెనే కైలాసగిరిపర్వతమునను
పుణ్యతీర్థములాని పాలకొండగాను । పుణ్యములకునేను పొందగాక్షేత్ర
పురుషోత్తమునియందు బుద్ధినేసుంచి । పుణ్యమైయుండు పుడమిలోపలను
కామేశ్వరికల్పమ్మ ఘనముగాజెప్పుదు । మనవాడు పాలకొలను
శుకపికశారికా బకపంక్తితోను । సరసమైనట్టి సుందరులతోను
ఫలపుష్పములనొప్పు పాదములతోను । చిగురులుకైచు తీర్థగమితోను
మల్లెచేమంతులు మొల్లలతోను । తెల్లవిరిసియున్న కరజాజులతోను
నల్లనిక్లిన్న ద్రాక్షలతోను । యుల్లసమైనట్టి యుయ్యాలలతోను
అరటితోటలతోను పెనచకన్నట్టు । గంధపుతీవల పొదరిళ్ళతోను
కలహంసలున్నట్టి కొలనులతోను । పాలుపొందు పర్ణశాలలపంక్తితోను
వలనొప్పుకాషాయవస్త్రములతోను । చెలగుచుండెడివేద మంత్రములతోను
నీలకృష్ణాంజననిచయములతోను । ఆజ్యధారలుగల్గు యజ్ఞాలతోను
పూర్ణమైయుండు పొందుపురుషులతోను । తెలగుచుండెడి నైమిశారణ్యమందు
మాకరణ్యదగు నైమిశారణ్యమందు । కపిలభార్గవకణ్వకాణ్వాల
కౌశాదివాల్మీకి వసిష్ఠమైత్రేయ । పరాశరవ్యాసభాగభద్రకర్ణాట
యాజ్ఞవల్క్యబాహ్లికాబాహురరాట । శాండిల్యభృగుగాత్రి మాండవ్యమందా
కౌండిన్యకాపాలకా గాణాపత్య । మనవాడుపాలకొలను
అతిశాంతముతో సహితమైరైన । సూతునిలాకాదిఖ్యాతునిగాంచి
అడిగిరిమునులెల్ల ఆనందముగను । పవిత్రములోను సువ్రతమగుచుచాల
ధనకనకవస్తువాహన శుభములను । ధాన్యాదివాహనసు సంతానములను
కలుగజేసెపుణ్య కథయొద్దయనిన । కలిగల్మషంబెల్ల గలిగిపోవగను

చెప్పుమన్ననుసూతుడపుడుపలికె । మనవాడుపాలకొలను॥
వినుడిఓమునులార వీనులలరగను । వినుతికెక్కినట్టు విస్తారముగను
సర్వజనులకునెల్ల సౌఖ్యంబుగాను । బూర్వయుగంబందు పూజితమైన
పార్వతీకథలెల్ల బ్రణుతికెక్కగను । బ్రహ్మనారదుల సంవాదమేగల్గు
బ్రాహ్మణులకు హితవైన నాఖ్యానమొకటి । మనవాడుపాలకొలను
నిత్యమైవెలుగొందు సత్యలోకమున । ముత్యాలగద్దియను ముదముతోనుండి
వానితోపలుమారు వాక్రుచ్చుచుండి । మునుదనుమిగులవినయమునబొగడ
సనకాదులెల్లను సన్నుతింపగను । వారికథానాకు మరివర్ణింపుమనిన మన॥
నారదువిద్యావిశారదుగాంచి । పరమరహస్యమై బరగునీకథయు
విరివిగచెప్పెద వినుమనిపలికె । మనవాడుపాలకొలను॥
వెలియుడీదేవశివనందినెక్కి । దేవమార్గమ్ముబట్టిదివ్యమైనట్టి
దివ్యమైపెంపొందు రత్నములతోను । దివ్యమైనక్రీడాభవనములతోను
యక్షకిన్నరుల విమానములతోను । నక్షత్రపర్యంత శిఖరములతోను
పక్షులరొదగల్గు వృక్షములతోను । నాగకన్యలయొక్క నాట్యములతోను
బాగయినసురపొన్న పంక్తులతోను । బెదరిబాగుశేశ్యకదుపులతోను
సుదతులశోభనగణములతోను । మలయుచుదిరుగు దివ్యమునులతోను
నెమిళ్లతోగూడు మామిళ్లతోను । రాగునామముబల్కు రాచిల్కలతోను
చంపకాశోకపున్నాగములతోను । నుండునవరత్న రాసులతోను
విలసిల్లు విరజాజి మొగ్గలతోను । లలిమీరు తామరకొలనులతోను
నిర్మలిన్యమంగానట్టిహర్మ్యములతోను । ధర్మనిర్మితమయినబాణములతోను
వేదాంతములుబల్కు విద్వాంసులతోను । వాదులాడెడిసూరివర్గములతోను
కూడియున్నకులాచములకుసాగ । కదలిరికైలాస పర్వతమ్ములకును॥
ఇహామందుపోయిపోయియికపోయిపోయి। భోగవతికన్నలావాగడగంటిదేవ
మాంకాళియొక్కరై మాధవియొక్కరై । అవసరమోహమునయెదురున్నవారు
విశ్వరేహన్నలా దివ్యకన్యకలు । బరచిచెప్పకరారె విశ్వేశమారు॥ మ॥
అంతటాకైలాసగిరిపైకిసేగి । హర్మ్యమధ్యమునందు యానవొప్పగాను
తామరలవాసనలతోడనుగూడి । ప్రేంఖదప్పెడియనటి పాదలతోగూడి
వాకుచిమ్మకలహంసవితతితోగూడి । వీకరత్నాలతో విలసిల్లుచున్న
రాకేందుముఖులతో రంజిల్లుచుండ । నల్లెలతోగూడుచుంటపమ్ములకు
మహాదేవిశివునితో మరివేగవచ్చి । ప్రమదులనుముట్టితాప్రార్థింపుచుండ
కవనిత్యమైనట్టి గద్దియపైని । సురలుపూలవానలుగురియుచుండ
వందుందుభులును వాయించుచునుండ । రంభపూర్వ్యనినాట్యమాడుచునుండ

జంభారిస్తోత్రములు సలుపుచునుండ । జయజయధ్వనులతో జరుగుచునుండె
రయమున వింజామరలు వీచుచునుండె॥ మ॥
అంతటదేవికి దాహంబాయెను । ఆనచేతకూలాన తవ్వెరిచెకోలను మ॥
ముత్యంపుకోలనారాయె శ్రీపర్వతాన । వజ్రంపుచాయలదె కోలనుదకమ్ము
వజ్రంపుకోలనారాయె శ్రీపర్వతాన । కస్తూరిచాయలదె కోలనిఉదకమ్ము
నీలంపుకోలనారాయె శ్రీపర్వతాన । నీలంపుచాయలదె కోలనిఉదకమ్ము
పగడంపుకోలనారాయె శ్రీపర్వతాన । పగడంపుచాయలదె కోలనిఉదకమ్ము
రత్నాలకోలనారాయె శ్రీపర్వతాన । రత్నంపుచాయలదె కోలనిఉదకమ్ము
గంధంపుకోలనారాయె శ్రీపర్వతాన । గంధంపుచాయలదె కోలనిఉదకమ్ము॥మ॥
ముంచిఆరగించె మూడుదోసిళ్లు । ముంచకారగించె మూడుదోసిళ్లు
ముంచిఆరగించె యేడుదోసిళ్ళు । ముంచనారగించె యేడుదోసిళ్ళు
ఏడుదోసిళ్ళకు ఏకగర్భమ్ము । యొక్కొక్కగర్భము తొమ్మిదినెలలు॥స॥
చిరితొడలబుట్టింది చిరివేణితాను । చిరివేణితాగోర చిక్కపుట్టమ్ము
పెందొడనుబుట్టింది పేర్వేణితాను । పేర్వేణితాగోర పెద్దరంగమ్ము
వీపునబుట్టెను వీరభద్రుండు । వీరభద్రుడుతాగోర వింజామరములు । మ॥
అరికాళ్ళబుట్టింది అసకమ్మతాను । అసకమ్మతాగోర యిసకల్లుపుట్ట
మడమలపుట్టింది మాంకాళితాను । మాంకాళితాగోర మంచివల్లెల్లు
ముణుకున్నబుట్టింది ముద్దరాలుతాను । ముద్దరాలుతాగోర ముత్యాలపేరు
కటియందుబుట్టింది కనకమ్మతాను । కనకమ్మతాగోర కమలపత్రములు
బొడ్డునబుట్టింది పోతన్నతాను । పోతన్నతాగోర బొండుమల్లెల్లు
పేరురమునబుట్టింది పేరిందేవితాను । పేరిందేవితాగోర పెక్కుజననమ్ము
జంఘానబుట్టింది జక్కులమ్మతాను । జక్కులమ్మతాగోర సన్నవలిపెమ్ము
కొనలందుబుట్టింది కొండవేణితాను । కొండవేణియాగోర కొలకల్లుపట్టు
వెన్నునబుట్టింది యెన్నమ్మతాను । యెన్నమ్మతాగోర యెఱ్రబాణమ్ము
రొమ్మునబుట్టింది రత్నమ్మతాను । రత్నమ్మత గోర రవ్వంపుపట్టు
చెక్కులబుట్టింది చేమంతితాను । చేమంతితాగోర చిత్రంపురవిక
కన్నులబుట్టిందికలికికామన్న । కామన్నతాగోర కనకాంబరాలు మన॥
ఏడుగురుఅక్కలుఆరుగురుచెలులు । యెంతో మోహముతోనుతమ్ములిద్దరను
ప్రేమతోనానాటపెరుగుచునుండ । కామన్న అందరిలోనలీలతా మెరసి
పెరుగుచుకామన్న పువుపొదలనెక్కె । పొదలనుపువ్వులావడినిండ గోసి
యాపువ్వులు ఈశ్వరుని నేత్రములజల్లె॥ మ॥
కనుదృష్టిమధ్యమాయెకానరాదాయె । కానగా కాశివుడు కాపాడుచుండె

దోసెడురత్నాలు తాదోసితెచ్చి । మొరకనువడిగితె కానున్నతాను
సుతులనుఅడిగితెసుదతి కానున్న । సుతులనుగృహమున పెంపొందుచుంద్రు
వారంతమనసులో యేమికావీరు । పప్పుపంచదారలెల్ల కోరేరు
ఓప్పగానడపప్పు పళ్ళుకోరేరు॥ మ॥
వనముకో వలగూన వాసంతమొకవె । వలగావఅక్కలకు రంగమ్మపాసగె
మునుగుచుతొలిఅంటిమునుమాఫ్రభాద్దు । శ్రీలక్ష్మిఅక్కలు శృంగారవతులు
శ్రీలక్ష్మిబాలలు శివునిపంపునను । శ్రీపురపట్నానికివచ్చిరందరును
కొలవవలెనా మేశ్వరినిజాలసేర్పరించి । పెట్టవలెచిత్రింపుసిరిపట్టుచీర
మనముగొల్చురానుముహినివెలనుగను। ముందుగొంచుదామమున మొప్పగాను
అనిపలుక-సఖులతో కైలాసనగరికి । మునుతూర్పభాగమునవనిర్మించెబ్రహ్మ
అరుదయినవారికిఅమృతంపుకొలను । ఆకోణముప్వమున అమరినాకొలను
వెండిపుయ్యాలలతో వెలసినాకొలను । భమిడిపుయ్యాలలతో బ్రబలినకొలను
రత్నాలయుయ్యాలతో రంజిల్లుకొలన । పచ్చలుయ్యాలలతో బ్రబలున్నకొలను
వజ్రాలయుయ్యాలలతో వనగైనకొలను॥ మనవాడు పాలకొలను॥
అంటిసీడలదాక అతురించెకొలను । దబ్బనీడలదాక దాపించెకొలను
యిప్పనీడలదాక యిమిడించెకొలను । చాటంతిత్రిములదాక వచ్చిందెకొలను ॥
చిలుకలుచెలరేగిఆడేటికొలను । హంసలుప్రతినశకలునడిపించెకొలను
తుమ్మెదరఝుంకారాలు మోసినకొలను । రత్నాలతానేస్బరాజిల్లుకొలను
మంచిముత్యము లో మహినొప్పకొలను । చక్రివాకములతో చెన్నొందుకొలను
నాచుకుల్లలతో నాడెమయినకొలను । నీటివాసములునిండున్నకొలను
తామరపువ్వులతోతరుచైనకొలను॥ మనవాడు పాలకొలను॥
చిటిచిట్టిముత్యాలకుంచ చేబట్టి । చీరవేశికొలనాడవేంచేయరమ్మ
పెదపెద్దముత్యాలకుంచచేబట్టి । చీరవేణికొలనాడవేంచేయరమ్మ
అనేకముత్యాలకుంచచేబట్టి । అపకమ్మకొలనాడవేంచేయరమ్మ
మరకతముత్యాలకుంచచేబట్టి । మాంకాళికొలనాడవేంచేయరమ్మ
ముదమొప్పరత్నాలకుంచచేబట్టి । ముదురాలకొలనాడవేంచేయరమ్మ
కనకంపుకుంచయూకమందుబట్టి । కనకంపుకొలనాడవేంచేయరమ్మ
జాజిమొగ్గలకుంచచేతనేబట్టి । కందువేణికొలనాడవే చేయరమ్మ మన॥
కోరిపగడపుకుంచచేతనేబట్టి । కందువేణికొలనాడవేంచేయరమ్మ॥
యెరుపుధాతుకుంచచేతనేబట్టి । కన్నెమ్మకొలనాడవేంచేయరమ్మ
రత్నాలదాపినకుండచేబట్టి । రత్నంపుకొలనాడవేంచేయరమ్మ
చారెడుముత్యాలకుంచచేబట్టి । చామంతికొలనాడవేంచేయరమ్మ

ముద్దపసుపులొప్పచేత నేబట్టి । ముత్తయిదులకొలనాడ వేంచేయరమ్మ
కొట్టుపసుపులొప్పచేత నేబట్టి । గొంతులుకొలనాడ వేంచేయరమ్మ
అనుపుపసులొప్పచేత నేబట్టి । అక్కలూకొలనాడ వేంచేయరమ్మ
చాకలియీపతలుచంక బెట్టుకొని । చాకలియిసకమ్మకొలనాడరమ్మ
ముక్కోటిదేవతలుకొలనాడారమ్మి । మునిరాజులందరుకొలనాడరండి
సంతెన్నవాండ్లుడకొలనాడరండి । నాతులందరుగూడికొలనాడరండి
వీరింటపేరంటాళ్లుకొలనాడరండి । వీరింటకామన్నకొలనాడిరమ్మ మన॥
కొట్టుపసుపొకచేతకుంకుమొకచేత । వెళ్ళిరేఅక్కల్లుకొలనువిడనాడి
కట్టుకొన్నచీరెల్లుగట్టుకొన్నబెట్టె । వొకవంకకన్నెల్లువాలలాడేరు మ॥
అందరుఅక్కల్లలోపెలికేటితమ్ముడు । పోతన్నతావచ్చిఘడియలువేసె
ఘంటలఅఘడియఘల్లునావేసె । కెంపులఅఘడియకుదురుగావేసె
పచ్చలఅఘడియపరుగునావేసె॥ మనవాడుపాలకొలను॥
తూరుపుమాదికా కలితుమ్మిపువ్వల్లా । మాచేతపువ్వల్లమీరుగొల్తురయ్యా
గిలిగిలిముత్యాలకొండకాచాలా । ఈరాత్రివాకిళ్ళువుంచరకఘడియా
దక్షిణామాదివాకిలితామరపువ్వల్లా । మాచేతపువ్వలాగొల్తురయ్యా
గిలిగిముత్యాలుకొండికాచాలా । యీరాత్రివాకిళ్ళువుంచారేఘడియా॥మన॥
చాకలిమడతెలుచక్కగాపరచి । ఏడుగురుఅక్కలకొనాడబెట్టె
పాదాలచక్కగాపసుపురాసి । పరిమెళకుంకమ్ముపారాణిబెట్టె మ॥
వారింటఅక్కల్లుయేమికోరేరు । చలిమిడిపడిపప్పుచాలకోరేరు
బంగారుకలశకుపరిమెళమద్ది । బంగారుకలశకుముత్యాలుఅద్ది
బంగారుకలశలోపానకంబోసి । పట్టుచీరదెచ్చిపైనొప్పగప్పి
తమలపాకులమీదకామన్ననుంచి । మల్లెపువ్వులునుతెల్లపువ్వులును
తంగేడుపువ్వల్లతోనుయీకామునిపూజింత్రు।మహిసాక్షిగుగ్గిలధూపమ్ము వేసి
బంగారుపళ్ళెములోపాలునెయిబోసి । బంగారుకడియముపాలలోవేసి
వారింటఅక్కలుకొలనాడరండి । వారింటపేరంటాండ్రుకొలనాడరండి
వారింటదేవతలుకొలనాడరండి । వారింటకామన్నకొలనాడరమ్మ॥ మన॥

## స్నానకాలు,

గంగస్నానాన నెలకొన్నయట్టి । సాగరసంగంపుకాముకొలనాడామ్మి
కూర్మపుస్నానానా నెలకొన్నయట్టి । కూర్మగుండికకామూకొలనాడరమ్మి
అరసావెల్లిస్నానానా నెలకొన్నయట్టి । అంచగారుకాముకొలనాడరమ్మిమ॥
ముఖలింగస్నానానా నెలకొన్నయట్టి । జక్కులకామునీవుకొలనాడరమ్మి

జగన్నాథస్తానాన నెలకొన్నయట్టి। వేపాగుందిగలకాముకొలనాదరమ్మ
గయాక్షేత్రపుస్తానాన నెలకొన్నయట్టి। గరుడవాహనకాముకొలనాదరమ్మ
కాశీపురస్తానకాన నెలకొన్నయట్టిగంగాభాగీరధికాముకొలనాదరమ్మ
ప్రియాగస్తానన నెలకొన్నయట్టి। పుణ్యతీర్ధపుకాముకొలనాదరమ్మ
చిత్రకూటపుస్తానాన నెలకొన్నయట్టి। చిత్రింపుకామేశ్వరికొలనాదరమ్మ
ద్వారకాస్తానాన నెలకొన్నయట్టి। దూర్వగాకామేశ్వరికొలనాదరమ్మ
మధురాపుర స్తానాన నెలకొన్నయట్టి। మహాలక్ష్మికాముకొలనాదరమ్మ
హరిద్వారపుస్తానకాన నెలకొన్నయట్టి। అందలకామేశ్వరికొలనాదరమ్మ
ఉజ్జయినిస్తానన నెలకొనినయట్టి। పుత్రికామేశ్వరికొలనాదరమ్మ
గంగోత్రిస్తానన నెలకొననయట్టిగంగయమున। కొలనాదరమ్మ
కేదారిస్తానాన నెలకొనినయట్టి। కనకఘంటలకాముకొలనాదరమ్మ।
గౌరిమయూరపుస్తానాన నెకొలనియట్టి।గురుతయినకామేశ్వరికొలనాద
బదరినారాయణస్తానాన నెలకొనినయట్టి।బంగారపుకామేశ్వరికొల
నాదరమ్మ
కుండలేశ్వరపుస్తానాన నెలకొనినయట్టి। కనకహారపుకాముకొలనాదరమ్మ
సోమనాథపుస్తానాన నెలకొనినయట్టి। సౌభాగ్యపుకామేశ్వరికొలనాదరమ్మ
నీలకంఠపుస్తానాన నెలకొనినయట్టి। నవరత్నాలకాముకొలనాదరమ్మ
భరద్వాజపుస్తానాన నెలకొనినయట్టి। భోగవతికాముకొలనాదరమ్మ
కురుక్షేత్రపుస్తానాన నెలకొనినయట్టి। కోమలికామేశ్వరికొలనాదరమ్మ
నర్మదాస్తానాన నెలకొనినయట్టి। నిర్మలకామేశ్వరికొలనాదరమ్మ
మహేశ్వరస్తానాన నెలకొనినయట్టి। మంగళకామేశ్వరికొలనాదరమ్మ
కైలాసస్తానాన నెలకొనినయట్టి। కమలాంగజకాముకొలనాదరమ్మ॥మ॥
సింహాచలస్తానాన నెలకొనినయట్టి సంకాకొప్పులకామికొలనాదరమ్మ
పిఠాపురపుస్తానాన నెలకొనినయట్టి। పరమాహ్లాదపుకామకొలనాదరమ్మ
కోటిపల్లిస్తానాన నెలకొనినయట్టి। సప్తగోదావరి కామకొలనాదరమ్మ
రాజమహేంద్రపుస్తానాన నెలకొనినయట్టి। అఖండగోదావరికామకొలనాద
చెల్లూరిస్తానాన నెలకొనినయట్టి। ముత్యాలకామేశ్వరి కొలనాదరమ్మ
పేరూరుస్తానాన నెలకొనినయట్టి। పెంపొందుచున్న కామకొలనాదరమ్మ
బెజవాడస్తానాన నెలకొనినయట్టి। భీమాకామేశ్వరికొలనాదరమ్మ॥మన॥
కంచెల్లిస్తానాన నెలకొనినయట్టి। కంచుమేడలకామ కొలనాదరమ్మ
కాళహస్తిస్తానాన నెలకొన్నయట్టి। కంచుఘంటలకాముకొలనాదరమ్మ
కాంచీపురస్తానాన నెలకొన్నయట్టి। తమలపాకులకామ కొలనాదరమ్మ

శ్రీరంగస్థానాన నెలకొన్నయట్టి । దివ్యకామేశ్వరి కొలనాడరమ్మి
కావేరిస్థానాన నెలకొన్నయట్టి । కల్యాణకామేశ్వరి కొలనాడరమ్మి
కుంభకోణస్థానాన నెలకొన్నయట్టి । కనకాఘంటకామ కొలనాడరమ్మి
చంద్రపుష్కరిణిస్థానాన నెలకొన్నయట్టి । రామాగల్లికామకొలనాడరమ్మి
సుబ్రహ్మణ్యస్థానాన నెలకొన్నయట్టి । సౌభాగ్యపుకామేశ్వరికొలనాడరమ్మి
అనంతశయనస్థానాన నెలకొన్నయట్టి । ఆరామములకామ కొలనాడరమ్మి
దర్భశయనస్థానాన నెలకొన్నయట్టి । ధమ్మిళ్ళకామేశ్వరి కొలనాడరమ్మి
మనవాసాలశాంతీశ్వరస్థానాన నెలకొన్నయట్టి । శృంగారపుకామేశ్వరి
శ్రీశైలస్థానాన నెలకొన్నయట్టి । చిత్రమూకామేశ్వరి కొలనాడరమ్మి
భద్రాచలస్థానాన నెలకొన్నయట్టి । భద్రంపుకామేశ్వరి కొలనాడరమ్మి
ఈపురస్థానాన నెలకొన్నయట్టి । వాడైనకామేశ్వరి కొలనాడరమ్మి॥మ॥
ముట్టరమ్మ యీకోలను మూడువేలు । చేపట్టరమ్మ యీకోలనుబదివేలు
రెత్తరమ్మ ఈకోలనూరైదువేలను । దించరమ్మ ఈకోలనుదీర్ఘాయువౌను
ఈకరణీజేవికి కామేశ్వరిపూజా నాగమ్మదేవతకు రేకమైదనరా
చేసినపూజలు శృంగారమొప్ప । పూచినకల్పకముపాలుప్పుకన గారగను
లోకములోజనులకు ప్రాకటంబుగను । లోకములోవిలసిల్లురూఢికెక్కినవన
ఆయురారోగ్యములధనధాన్యములును । ఆంద్రారక మందుసంతానములను
యిచ్చేననుచును చెప్పె బ్రహ్మశారదుతో । మనవాడుపాలకోలను॥
ఈకోలనుకొలిచినకాపువేరమి । కామన్నకల్పవృక్షమ్మ
ఈకోలనుగొలిచిన అతివపేరేమి । అతివపేరుశీతమ్మ అడానేర్చుదువా॥మ॥

# 17 సత్యభామసరసము.

వసుదేవదేవకీ వరపుత్రుడనగ । వర్ణించుగోపికా వల్లభుచరిత్ర
అరవిందనాభుడికి అర్ధాంగిలక్ష్మి । సత్యభామాదేవి సరసముగనాడె
పిలిపించిచిరినవ్వు తెలుకు మొగమునకు । పసులాపతిచ్చెనేపరమాత్మదేవి
అలకతేపురుష్యరే అరుగులమీద । కులకరేకస్తూరి శ్రీఘంబుగాను
మున్నగాపసుపూడ్చి పన్నీరుచల్లి । కనకంపుగడపలా కస్తూరిజల్లి
ముత్యాలముగ్గులు పెట్టేటివారు । రత్నానరంగవల్లి రాశేటివారు
మాణిక్యము దివ్వె పెట్టేటివారు । మకరతోరణాలు కట్టేటివారు
మాత్రాన్నసున్నంబు ధవళించువారు । పచ్చాకుపందిళ్ళు వేసేటివారు

పసుపుటాకులుదళ్ళు కట్టేటివారు । కట్టాణిపాచేరులు కట్టేటివారు
పాలుపైనపూతలూ పూసేటివారు । యెన్నిక తెలనాకులిచ్చేటివారు
పచ్చనిపాదాలు వొత్తేటివారు । రత్నాల స్తంభాలుయొత్తేటివారు
కస్తూరివాసనలు కలిపేటివారు । చిప్పల్ల శ్రీగంధంతీసేటివారు
వారిజలోచనుడు వారిళ్ళకడకు । వలసగినముఖవారు వచ్చుటయు నెరిగి
పచ్చంగవేసినా పందిళ్ళుమెరయ । నిలువుటద్దముదెచ్చి మెరుగుతుడిపించి
మేలయినకస్తూరి మెదిపేటివారు । యేడునిలువులభవిమిడి మేడలోపలను
భమిడితోణిలోళ్ళదేపట్టెమంచమ్ము । హంసతూలికాపాన్పుపట్టుజాలరులు
అచ్చుతులుగూర్చుండ నమరినపాన్పు । శృంగారరాయుడీచంగల్వపాన్పు
బంగారుజనపోతపాన్పునపరచి పొన్నలుబొగడులు బొండుమల్లెలను
అమంచిపాన్పున అవిచాలపరచె పొద్దున్నపూచినాపొన్నపువ్వులను
అమంచిపాన్పున అవిచాలపరచి ఝామాయపూసినా జాజిపువ్వులను
అమంచిపాన్పున అవిచాలపరచి అప్పుడేపూసేయి అచ్చమల్లెలను
అమంచిపాన్పున అవిచాలబరచె ఘడియలోపూసినవి కనకాంబరాలు
అమంచిపాన్పునంఅవిచాలబరచి నీకోయిపూశాయినీలాంబరాలు
అమంచిపాన్పునఅవిచాలబరచె । నాగలోకానవున్నసల్లకలువలును
అమంచిపానుపునయవిచాలబరచి । పొద్దోయిపూసేవిబొండుమల్లెల్లు
అమంచిపాన్పునయవిచాలబరచి । మధ్యాన్నయిపూసేది మంకెనపువులు
అమంచిపాన్పునఅవిచాలబరచి । ఝామాయెపూసేవిసన్నజాజాలును
అమంచిపాన్పునఅవిచాలబరచి । తొడిమెలపూసినవి కేతకీపువ్వులు
అమంచిపాన్పునఅవిచాలబరచి । పందిళ్ళపూసేవి బంతిపువ్వులును
అమంచిపాన్పున అవిచాలబరచి । నిత్యయూపూసేవినిత్యమల్లెలు
అమంచిపాన్పునఅవిచాలబరచి । జాజివిరజాజిసహస్రిమల్లెలను
పారుజాతమ్ములుబాగుగాపూచె । ఘనముగా పూచినవిగన్నేరుపువులు
అమంచిపానుపున యవిచాలబరచి । బాగుగాపూసినవిచేమబంతిపువులు
అమంచిపాన్పునయవిచాలబరచి । పందిటపూసినవిసీతపురజాతములు
అమంచిపాన్పునయవిచాలబరచి । వాసనగలమంచిఅపువులు
అమంచిపాన్పునయవిచాలబరచి । ఘుమ్ముఘుమ్మనియేటిగులాబిపువులు
అమంచిపానపునయవిచాలబరచి । పరిమళముగలమంచిపచ్చచామంతి
అమంచిపాన్పునను అవిచాలబరచి । యెన్నికయైనట్టియెర్రచామంతి
అమంచిపాన్పున యవిచాలబరచి । తెల్లైనరేకులతెల్లచామంతి
అమంచిపాన్పునయవిచాలబరచి । వరుసతోపూసినవివకుళపుష్పములు

యీమంచిపాన్పున యవిచాలబరచి । వట్టివేళ్ళసురటి ముత్యాలసురటి
యీమంచిపాన్పున యవిచాలబరచి । పన్నుగులయట్టి భమిడికెప్పెలను
యీమంచిపాన్పున యవిచాలబరచి । పచ్చిపోకలుమంచిపండుటాకులును
యీమంచిపాన్పున యవిచాలబరచి । అత్తరువుపన్నీరుఅనురంగపరచి
చేడులెల్లా పనులు చెప్పిచేయించి । చిరశృంగారంబు చేయంగదలచె
సంపెంగనూనెతో శిరసాస్నానంబు । జవ్వాజికస్తూరినలుగొప్పపెట్టి
గంధపుటకలులిడెకమలాక్షికపుడు । వెండిగాబులతోటివేణ్ణీళ్ళతోడి
భమిడిగాబులతోటిచలినీళ్ళతోడి । చలినీళ్లువేణ్ణీళ్ళుసమముగాతోడి
ముత్యాలచెంబులతో ముదితలందియ్య । జలకంబులాడెనే సర్వేశ్వరులదేవి
పట్టువస్త్రముచేత దేవితలయొత్తె । హంసదూదిపాన్పున అవిశలగడాలు
అచ్యుతులుకూర్చున్నటకమనపాన్పు । శృంగారరాణులకుచంగల్వపాన్పు
కడువేగవేయించి యలరాచదేవి । గంధకస్తూరికర్పూరజవ్వాది
పన్నీరుచందనం బాగుగాజేసి । చేడియకుయీపనులు జెప్పిచేయించి
పచ్చిపసుపుపన్నీరు జలకంబులాడి । పచ్చపట్టుచీరబాగుగాకట్టి
నల్లపట్టురవికె నాతితాతొడిగి । అన్నియలంకారాలు అతివకుబెట్టి
గజదంతచిక్కట్ల తలచిక్కుదీసి । ముత్యపుసరులెల్ల ముడివగదువ్వి
పొగడపువ్వులన్ని బాగుగాదువ్వి । నీలంపుసరులన్ని పాపిటలుతీసి
చెంపకొప్పునదుర్కి మైచామంతిపువ్వులు । ముదపాపిటనడుమముత్యాలుకూర్చి
మొంగలిరేకులుదుర్కిమిన్నల్లెలనుదుర్కిమె । చుక్కబొట్టునునుమటపక్కంగదీర్చి
చిటికెనబొద్దును చెలియతాబెట్టె । బొబ్బరికాయలుపొందుతోబెట్టె
మూడువేలువెలగలముక్కెరయాబెట్టె । కుదిరెముత్యాలనత్తురబెట్టె
వాల్గువేల్వేలు వగలునానుమెడవేసె । పదివేలచేయభస్నస్వరములువేసె
పణతితనపద్మాల భమిరెవెట్టింది । వెయివేలువిలువగలఆహారంబు
కోటికెల్వేలువగల గొలుసుమెడవేసె । కొక్కెంపుతారమ్ము కొప్పపవరమ్ము
నానుసలిరడుగుపెట్టె కమలాయతాక్షి । తనకమ్మలనుపెట్టెనుపూగోకెశపుమ
విడిముత్యాలు విడనేవలాలు । వుత్తండాలవేరె వొప్పతోబెట్టె
పదివేలుచేసేటిపాంజేబులుపెట్టి । పణతితనపద్మాలపట్టెడెట్టింది
నీలాలుస్థాపించు కీలుకడియములు । నవిరుక్మిణీదేవి కంకంబుపెట్టె
ఆరగించివెళ్ళె అచ్యుతుడుదేవి । పచ్చన్నబాగాలు పుక్కటనుబోసి
పండుతెల్లనిఆకులు పిడికిటనుట్టి । పాన్పిద్దుపోయెనుచూచెమొపాండువోవొదినా
ఝామువోయెను రెండుజాములయిపోయె । కేశవుడురాడాయెనీలవర్ణుడు
గోపస్త్రీలలతోటి కూడినవ్వాడుమ । మరచెనే నామీద మక్కువలన్ని

రాజీవలోచనుడు రాకతా జూచి । గడియగ్రిక్కినబెట్టి కంకణాలుకదల
అంతలోవచ్చెను కాంతకృష్ణుండు । గరుడవాహనమయిన గరుడాద్రినెక్కి
కోమరయినముత్యాల గొడుగులుబట్టి । బడిచెంబుదళముల పాదములు గడిగి
పనిచేయవచ్చిన పరిచారకులకు । బాగాలుయిప్పించిపంపినారాత్రి
చామరలువిసరేటి సఖియలిద్దరకు । తాంబూలమిచ్చితా తావేసుకొనెను
తలుపుమేడలమీదయెవ్వరోగాని । పేరుచెప్పకమీరు రారాదయనెను
పేరులమీదనీకు ప్రేమాయెనేమో ఎవరిరోగోపికాపల్లభుడనేను
గోపికుడనైతేను గొల్లపల్లినుండు । ముద్దురాళ్ళకడపప్రొద్దున్నపొమ్ము
జలధరుడందురేచెలియనాపేరు । జలధరుడుఅయితేనుజలములనిగేవా
నరహరియైనట్టినరసింహుడందురు । నాతనికేమిగావలె నయముతోచెప్పు
నరసింహమైతే మామానగరికేలుండు । వెంకటేశ్వర్లందురే వెలదినాపేరు
వెంకటేశ్వర్లయితేను తిరుపతియుండు గోవిందుడందురే గోపినాపేరు
గొండవో గొండెవో నిన్నునేనెరుగ । అచ్యుతుడందురే అతివనాపేరు
అచ్యుతుడవో మచ్చువోనిన్నునేనెరుగ । బలభద్రుడందురే పణతినాపేరు
భావవోమరిదివో నిన్నునేనెరుగ । శ్రీకృష్ణుడందురే చెలియనాపేరు
చీరవోరవికవో నిన్నునేనెరుగ । చేదసములు పలుకచేతగాదేమొ
పద్మాక్షినీకాళ్ళుపట్టేదాననెను । ఆమాటవినిసత్యభామతావేగ
పాన్పునదిగ్గునాదిగితీసెనాఘడియ । కయ్యాలపైకూర్చుండె శ్రీకృష్ణుడపుడు
ముత్యాలచెంగుతాముసుకుతదీసి । అలుకలేటికినీకు అంభోజగంధి
కోపమేటికినీకు కుసుమసుంగంధి । నామీదకోపమా నలినాక్షినీకు
కొంగుమెత్తిచూడవే శుకవాణితన్ను । కొట్టుకుపోయిరాకగ తడువుంటిగాని
కాంతనిన్నువిడిచిఘడియుండగలనా । నామనసుయెరుగవా నళినాయతాక్షి
నీమనసుబ్రహ్మరుద్రాదులెరుగుదురు । మనసులోపలకల్లమనసులేనాక్షి
మాయదారివియగుటరెరుగుదుమేము । నిన్నుకమలాక్షిమావల్లతప్పేగలదింకా
తప్పులన్నిటికినిదయయుదయచూడవలెను । తప్పులన్నియుమాకవొప్పులేకావా
కమలాక్షితనవిభుని తలయెత్తిచూచె । చెక్కిళ్ళకాటుకలు చక్రధరునకును
కస్తూరినలుపులేకమలాయతాక్షి । మెడలుపరిమిళమేమి వోకృష్ణచెప్పుమా
వలపునూపు పరిమళము వోసిరజాక్షి । చీనిచీనాంబ్రాలు బరిపనుపులాయె
శ్రీకృష్ణనీవున్న చెలువేమిచెప్పుమా । వలతోటిపనుపులో వాలలాడగాను
వొళ్ళంతపసుపాయె వోసత్యభామా । మాటమాటకుబొంకు లాడకనీవు
మూరుమాటలకల్ల వొకమాటబొంకువాడుజెప్పిన। మాటనేటికాడితివి
పరమాత్మునిపెదవి పగిలున్నదేమో । దోరమామిడితేనె లారగించగనెపెదవి

గొల్లవారితల గొలివలిగరమ్మ । వారాడినపంతాలు ఈడేరనమ్మా
నేడుమాదైవమ్ము వారిగూడెనమ్మా । ఏమిచేయగవచ్చు యిపుడు నాగతికి
మత్సరవాలుకొగుణం మానేసురమ్మ । అచ్చగామావేడుకలువచ్చుటయులేదు
రుక్మిణిపతియేమొ పోబోకుమనెను । తాలిమిసతియింట వుండకపోతె
యిచ్చోటకుమిమ్ము రావగరమ్మనిరి । పచ్చిమమింతవుడికించనేల
పద్మనాభునే పిలిపించవలెనా । నామీదభక్తికిచాలనమ్మితినినలినాక్షి
నామీదపేర్మి నీకింతనిలోచలేదు । నీసెగదలోకద్రొక్కినపాము
మిట్టిపడ్డట్టు అంతకోపముతోను । ఆయింతియూండేగ అరచురలేని
మాటమ్ములోపలను అరచపడితన్ను । నేటివున్నవిభుడితో నేడుమీబుద్ధంత
యేయింతియెరుగు అనుచును గనులనీళ్లు । వోనేడ్చుచుండెను నాసత్యయపుడు
తలవంచిపట్టుకొని సఖియుతానుండె । చెడెరోనీవద్ద చెలికత్తెలెల్ల
సఖియరోనాతప్పు లడగవేవారిని । చెలియలునీవును యొక్కటేగాదా
చెలియనీవద్ద తిర్గురులంచమ్ము । ముగుదరోనిను చూడకుండేను నాకు
ఒక్కనిమేషము ఒక్క యేడయితోచు । కమలాక్షి అరఘుడియు కానరాకున్న
కాంతనాకన్నుల కట్టినట్టుండు । పువ్వులబోణిరో నీవుచెప్పినబుద్ధి
చిగురుబోణిరో నేనుయెవరికోసమ్మె । యింతపదార్థంబుచెప్పినీయింటపెడుదు
మునుపుమజ్జనభోజనంబులు నీయింట । యింకనిద్దలుగాసేవలునీయింట
నీమాటముందరా నామాటవెనుకా । రుక్మిణిచెప్పినా నీవుచెప్పినను
వింటునేరాధికా విననునేచెలియా । భామరోనీకునేపాలివాడానా
పద్మగంధిగోనన్ను యేలుకొమ్మనెను । పల్లెంచిన్నెలు యీపట్టపగులు
వన్నెలుమాటలు యెన్నడాడితినో । ఒకనాడురాధికాగృహములోపలను
శీతజలము లవాలాడున్నవాడు । చెప్పిపంపించినపనులు చేయరయితిరి
ఆవేళభామనేను వచ్చిందియెరుగ । యొతిగితేమి తండ్రి వసుదేవుడాన
ఒట్టుమీకున్నదా పురుషోత్తముడా । సత్యంబుమీకున్న చామర్లగంధీ
అగ్నిసతిఅయితేను అంటనివ్వనుగా । మిత్రిసతిఅయితేను పొందనివ్వనుగా
తరుణులకనకడకు రాకుండజేసి । తనకైనకాపురంలేకుండజేసి
యికపెక్కుడిబ్రికుతుమన్నారుతనను । యెన్నడుయిరుగిళ్ళవెళ్ళనివాడవు
ఏపొద్దుయిరుగిళ్ళ ఏతెంచనేర్చితి । యెన్నడుకాపురం ఎరుగనాటింది
కాపురంశేనినాడుకాగలదేది । యీచీకటిరపికలీసామ్ములన్ని
మేడలుమడుగులు గుల్లెసాలల్లు । పట్టుమంచముపరుపులివెక్కడివె
బరిదారికలుగెల్ల నెవరుతెచ్చారు । యీనాళ్లుయెవరితో భోగించినావు
యీనాళ్ళుయెవరితో వలికించినావె । యినాళ్ళుయెవరితోకూడివున్నావె

వారిరూపు పేరుచెప్పవేనాతో । శ్రీకృష్ణుచెప్పేను లెస్సతో వినుము
మాయదారివాడు మరితంత్రిగొట్టు । మరితంత్రిగొట్టయినటవటవవాడు
అబద్ధాలకోరు అంటకోటుండు । అంటికియినఅటుమటలవాడు
నల్లనివాడైన సుందరుడేవాడు । కళలుగలిగినవాడు కాంతిగలవాడు
భార్యలుగలవాడు పరమపావనుడు । ఉరువునశ్రీదేవినుంచుకున్నాడు
తిలకమ్మునబోలు అతనిపలువరస । అతనిచెక్కిలిమించుటద్దములుబోలు
మకరకుండలములు పెట్టినవాడు । పిల్లనగ్రోవిచేత బట్టుకున్నాడు
అతనిపద్మంబులు శంఖచక్రములు । అతనితో పోరాడ ఓపదుగమీకు
పంతపుగపసరులు అవుటనేసి ందుకొరకేనోరు మూసుకొనియుంటి
నాతినీకేమైన యెదురాడినానా । చెలులంతైతో చనువుచేసెకృష్ణుండు
అంతలో చెలికతెలిట్లనిరపుడు । పోయిపాలకులవిభుని కొనితేరమ్మా
కొలువుతప్పినమాటనేటికాడితివి । ఇన్నాళ్ళులాగునయివినీతులమ్మా
సవతులమీదబత్తుకు సఖి మరోతనిరి । నడివీకనున్నవరు పిలిపించినారు
భూతాలవలెమీరు బుద్ధిచెప్పేరు । రాక్షసులవలెమీరు తగవుతీర్చేరు
మందలావులవలెమీరుమనవిచెప్పేరు । అతనిపాదుకునాపాదుగురయించూస్తావో
సత్రాజిత్తనగను లోకప్రఖ్యాతి । లోకప్రఖ్యాతైన రజకూతుర్ని
గుణమురయగనివానిని తెచ్చుకుంటిని । పశులకాపరివాడైకారివాడెం
గొల్లబోయిడవగుచు యున్నవాడవు । అదియేలపొమ్మని అదిగొల్లబుద్ధి
రొమ్ముదనివాడినిపాడుగుగలవాడిని । చక్రనివోశభుని తెప్పించుకోనవె
గూర్చుండతీరదే కుసుమసికగంధి । గొల్లభామలయెదుట చూచుచున్నారు
సిగ్గునతలేచి శ్రీకృష్ణుడపుడు । మురళీధరుడు వెంగపాలముందర నిలచె
ప్రార్థించియాసత్యభామ తాలేచి । పీతాంబరచెంగుపిగులగాగొట్టె
పట్టంగతవిలిశిరుసు తావొంచుకొనియె । యింతచేసినపతిమీద లేదుగోపమ్ము
గుండుపెట్టిగానిగోపికరోచూడు । కొండగొడుగట్టిగా గుండెంతబరువు
నీరుపట్టెగాని నెలతరోచూడు । నీరుమోసేవారికినీ రెంతబరువు
పాముపట్టెగాని పణతిరోచూడు । పాముమీదనునిద్రి పవ్వళించేరూ
చిల్లరకాదునుమ శ్రీకృష్ణగుణము । చెల్లంగనోకభామ చేసిపంపించె
అప్పుడుసత్రాజిత్తు పంపేటివాడు । ఆడబడుమలబుద్ధి యేమనిజెప్పె
యేమనిచెప్పకుంటె వినసఖ్యమారెు । మిమ్ముశిక్షింపుమ నీవిన్నపముగాదె
అట్టెశిక్షించుమని అచ్యుతుడుబలికె । కొట్టుమనిబంగారపు కోలవేలికిచ్చె
బంగారపుకోల తానుపారవేసుకుని । అక్కడఅయింత అట్టెనిలచె
మొక్కవలుతక్కవలు ఏమిఆడితినా । పట్టుకొనివిభునికి పాదాలవొత్తె

కొడుకులకనుకోరవె కుసుమసిరిగంధి। మనువృత్తియొత్తవేమనసుసరిగంధి
సత్యభామసరసమ్ముపాడినావిన్న । సతిపతిదంపతులు యొకబాయకుందురు
యీపాటయెవ్వరు పాడినాగాని । జొందిలో కైలాసం పొందుదురువారు

# 18 రుక్మిణి చిలుక రాయబారము.

పారిజాతపదంబైన పంచవన్నెలచిలుకరావే । నావిభునితోడితేవే
నన్నాడినట్టిమాటలన్ని వింటివా ।
మేనమామకొడుకు కీర్తిగా గాతనుపంతమాడెను ।
తన్నేగాని పెండ్లియాడననుచు పట్టుబట్టెనే ।
విప్రునిబంపితి కబురుతెలిసుగదాయె చిలుకరో ।
ఏవిధమ్ముకైన తనవిభునితోడితేవే ।
భీష్మకకొమారుడు పంతముతో పట్టుబట్టె ।
శిశుపాలునకిచ్చి పెండ్లిచేతుననుచు బలికెనే ।
తాపెద్దకొడుకుకాని యెరుగనిలిచి బలికెను ।
తాబట్టినాకుందేటికి మూడేకాళ్ళనును ।
కమలనాభునిపొందు యెన్నడు కన్నులగందును ।
కరుణాకటాక్షులు యెన్నడుతన్నుమోహించునో ।
పరమదయాళూడువచ్చి తనయెదుటనిలచుని ।
కరుణతో నన్నుపెండ్లాడునా । గారవించునా
గౌరిదేవినితాముపూజించి నగరికిరాగాను ।
కనకరత్నమువలెతాళిపట్టెడగట్టెనా ।
మునులెల్లదీవించి ముత్యాలతలంబ్రాలుబోసెరా ।
సురలెల్లదీవించి మంగళసూత్రముగట్టెరా ।
ఘనులెల్లదీవించి కంకణమ్ము చేతగట్టెరా ।
విదర్భదేశమువారు విచిత్రముపడితన్నుజూతురా ।
సిగ్గుపాడిశిశుపాలుడు తనతలవంచునా ।
వెరవకుమనిచెప్పి వెన్నుడునను చెట్టబట్టూనా ।
రుక్మాంగునిపంతాము నిన్నీవడివానికెక్కునా ।
కరుణతో శౌరిపెండ్లాడునా ।
నగవకేవో యక్క వైకుంఠధాములువచ్చును ।

వచ్చినక్షణములో మెచ్చైనవరములు యిచ్చేవా ।
మెచ్చినాకంఠేలుగట్టేవా ।
అలాగేఆదిశేషులు మమ్మాదరించితె ।
ఘనమైననావజ్రాలాయందెలు కాళ్ళకుగట్టెను ।
ఎర్రనిముక్కుకి వెండిపమిడిపాదిగేను ।
పచ్చనిరెక్కలకు హెచ్చైనముత్యాలగుచ్చేను ।
పుట్టించిపట్టాభద్రులకిల్లాడసేయావె ।
ఇంకొక్కజన్మాన రాజాధిరాజులపట్టివి ।
కొడుకులుం కోడండ్లు అల్లుళ్ళు ఆడబిడ్డలు ।
మనమలు సకలసంపదలుకిలుగాకోరవె ।
అదియేమెఓయక్క అందుకువె నాసిస్తినా ।
గట్టిగా వైకుంఠపురమందు తనకిల్లుగట్టవె ।
ఎన్నడు తన్నెడబాయకు । మనిచెప్పెను
అక్కరోజూడుమనిచెప్పి గోపురామెక్కెనూ ।
దిక్కులూదీములు నాలుగురాజ్యాలు జూచేను ।
దక్షిణభూమంత తప్పొకతలయెత్తిజూసేను ।
ద్వారకాపురమందు కనకగోపురాలుజూచెను ।
అభిషేకపూజలు చేసేటివారినిజూచేసెను ।
నవ్వుచువచ్చేటి నల్లవారినిజూసెను ।
బాగుగవచ్చెటి పచ్చబిళ్ళనువారినిజూసెను ।
బలరాముడుమొదలగు ఘనమైనదొరలాలుజూసెను ।
ఆవెనుకవచ్చేటిద్వారపాలకులనుజూసెను ।
ఈవెనుకవచ్చేటి విప్రపాలకులనుజూసెను ।
ఎక్కువగుర్రాలు యేనుగులకదుపులుజూసెను ।
శృంగారవనములు శ్రీకృష్ణు పొగడజూసెను ।
వేగమెగోపురము దిగిచిలుక తావచ్చెను ।
ప్రదక్షిణములుచేసి పాదపద్మములకొరిగేను ।
వసుదేవనందనుడు వచ్చిరమణినిచేకొనును ।
చేరువలగ్నమురమ్మనికృష్ణునితోజెప్పెను ।
వేగమెగోపురము దిగిచిలుకతావచ్చెను ।
అక్కరోనాకింత పుక్కెరబెట్టవాజెప్పెను ।
నీపాటకధారుడూయేవంకవచ్చునో జూచితి ।

చక్కెరబెట్టెను పుక్కెరబెట్టెనా చిలుకరో ।
చల్లన్నినాప్రాణనాథుణ్ని పొడగంటివా ।
అందెలుగట్టెను చిలుకారో । అరటిపండు పెట్టెద
ఆనందకృష్ణమ్మ ముచ్చటలన్ని వింటివ ।
గంధముబూసేను పువ్వులుముడచేను చిలుకారో ।
పుండరీకాక్షులు యేవంకవొచ్చేరో జెప్పవె ।
అక్కారో జెప్పమని నేజెప్పి గోపురమెక్కితీ ।
దిక్కులుదీపులు నాలుగురాజ్యాలు జూచితీ ।
దక్షిణభూమికప్పక తలయెత్తి జూచితీ ।
ద్వారకాపురములో కనకగోపురమెక్కితీ ।
అభిషేకపూజాలు చేసేటివారి జూచితీ ।
నవ్వుచువచ్చె నల్లబిళ్ళవారిని జూచితీ ।
బారుగావచ్చేటి పచ్చబిళ్ళవారిని చూచితీ ।
బలరాముడు మొదలైన సమమైనదొరలఁ చూచితీ ।
ఆవెనుకవచ్చేటి ద్వారపాలకులను చూచితీ ।
ఈవెనుకవచ్చేటి విప్రపాలకులను చూచితీ ।
శృంగారవనములు శ్రీకృష్ణుడుపొగడగా మూచితీ ।
వేగమె గోపురముదిగి అక్కారో వచ్చితీ ।
వసుదేవనందనుడ వచ్చిరమణిచేకొనును ।
చేయవలగ్నమురమ్మని కృష్ణునితో జెప్పితీ ।
రూపించినీవిభుని రూపమంతా నేనుచెప్పేనూ ।
అలిమకసాలియక భక్తితో గూర్చుండివినవమే ।
అందమయినామంచినీలవర్ణునిశిఖపైని ।
పొందూగజుట్టేను పారిజాతపూలబంతులు ।
మంచికిరీటము మకరకుండలములుబెట్టేను ।
వెలలేనివజ్రాల పోగులుబెట్టెను ।
వెన్నుడుబాపిలి ముత్యాలనీలాల పోగులుఃనీటుగాను ।
కట్టెనుపీతాంబరము వల్లెవాటుగాకృష్ణులు ।
అద్దంపుచెక్కిళ్ళు ముద్దులుగారును అక్కారో ।
కలువరేకులవంటి కన్నులతీరె అక్కారో ।
మన్మథునిచేతిసింగిణీవిల్లే కనుబొమ్మలు ।
మందరత్నములవంటి బంతులతీరే పలువరుస ।

అరటిబోదెలవంటి చక్కనితొడలే అక్కరో ।
చెరకుకోలలవంటి చక్కనితొడలెఅక్కరో ।
ఎగుభుజమ్ములతీరు ఎంతవింతలగాదెఅక్కరో
ఘుమఘుమమని యేటికుంకుమపరిమళముదీరీ ।
సందిటిదండలు జతలతావేజాలుమెరయగా ।
పచ్చలకడియాలు ముందరముత్యాలమురుగులు ।
చిత్తజాదండ్రికి ముత్యాలకంఠము లందమాను ।
ఘంటలమొలత్రాడు జమిలిగంటలుమ్రోయుగా ।
చందమామతోను సరసములాడుచుకదలెనూ
ఆడుచుపాడుచునిరువంక చామరలివ్వగా ।
ఆకులుపోకలు అతివలుమణచియియ్యగా ।
మణులందికోలుపులో చిన్నారినవ్వులునవ్వుచు ।
వ్యాసవాదులకయిన వర్ణించిపొగడవశమటే ।
హరివాసుదేవుడో యెవ్వరోగాని తెలియదు ।
వాకన్నులకుజాడ వెన్నెలవలెనున్నాడు ।
రూపించినీవిభుని రూపమెంచమాతరమటే ।
చిలుకపలుకగ రుక్మిణిచూచి చిలుకాకిలకిలనవ్వెను ।
అక్కరోయిటువంటి మాటలకెవరయినఁభ్రమసేర ।
చెలికత్తెలందరు గుంపులుగూడుకునవ్వేరా ।
కన్నవిన్నవారందరు కేకలువేయ్యేరా ।
నసుగన్నతల్లి యిదినీకుబుద్ధిగాదమ్మరో ।
చిలుకరోయేమానిచెప్పెదు యికనేతాళలేను ।
శ్రీకృష్ణరాయులుకోటవాకిలి దాటివచ్చెరా ।
రుక్మాంగునినగరిలో విడుదులువిడుతుర ।
పప్పుపాలుఒప్పుగ కూరలునేతులు ।
అప్పాలుగానావిభునికి పుల్పాలుదెత్తురా ।
అంతటగోపాలకృష్ణుము వాకిటనిలచెను ।
కళ్యాణివగడక నీప్రాణనాథుడువచ్చెను ।
ప్రతిములుతపములు పంటితిరోనీకుచేకూడెను ।
వారిజనాభులుపనితరో నీసామ్ములాయెను ।
కలకంఠుడునీగుణములు మెల్లగావచ్చెను ।
పీతాంగనానా డుఅశోకవృక్షముక్రిందను

చింతింపుచుండగ హనుమంతరాయలువచ్చిరి ।
ఆనవాలుదెచ్చి అతివశోకముతామాన్పెను ।
అలాగేతనవిభునితెచ్చి తనప్రాణమిస్తిని ।
చిలుకరమ్మని అక్కుణముక్కునచేర్చెను ।
చిలుకారమ్మని భమిడిపంజరములోనుంచెను ।
చెరుకులుఫలములుదెచ్చి చిలుకకిచ్చెను ।
భీష్మకమహారాజుఅంతఃపురములోకొచ్చెను ।
పేరంటాళ్ళెల్లార కన్యనుశృంగారించండి ।
సంపెంగతైలాన సొంపుతోశిగస్పుఅంటిరి ।
గంధాముఅటకతిబెట్టి జలకమూలార్చిరి ।
పోగకన్నులమంచి తీరుగాకాటుకదీర్చిరి ।
తీరుగాకస్తూరి తిలకమునుదుటదీర్చిరి ।
ఘుమఘుమని యొటికుంకుమపరిమళములలదిరి ।
పసిడిపువ్వులచీరమొలబోసి వేగగట్టిరి ।
చిత్రజాతల్లికి ముత్యాలరవికదొడిగిరి ।
ముత్యాలముడిమీదరత్నాలరవ్వదాపిరి ।
ఎక్కువయినమంచియేడువారపుసొమ్ములుంచిరి ।
శృంగారించుకు రుక్మిణివోడుకుకదలిరి ।
గౌరిదేవిపూజఘనముగచేయ రుక్మిణీ ।
శ్రీకృష్ణమూర్తినివలచుచు పార్వతికిమ్రొక్కుచు ।
దేశాధిరాజులు చూడగనొవెలకు వెలదిపల్కె ।
గౌరిదేవినిదెచ్చికనకంబుగద్దెపైనుంచిరి ।
ప్రతిభతోదేవిని పూజింపదొణగెను ।

ఉ॥ నమ్మితినామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ములబురాణదంపతుల మేలుభజింతుగదమ్మ మేటిపె
ద్దమ్మదయాంబురాశివిగదమ్మ హరిన్పతిసేయుమమ్మ నిన్
నమ్మినవారికెన్నటికి నాశములేదుగదమ్మ యీశ్వరీ.

అకూలుపోకలు రుక్మిణినోటబోసిరి ।
మల్లెలమెల్లలా రుక్మిణిదేవి పూజించెను ।
భక్తితోసాష్టాంగదండము గౌరికిబెట్టెను ।
తిరిగిమళ్ళునుకలరాజా నందరినిజూచుచు ।
శ్రీకృష్ణరాయలు కానరాకపోయె చిలుకరో ।

ఈక్షణముతప్పితె శిశుపాలుని పాలుఅగుదునే ।
అనిరుక్మిణితాను చింతించుచురాగాను ।
దేశాధిరాజులు చూచిమూర్ఛలుజెందిరి ।
పొంగుచును శిశుపాలుడు నవ్వుచునిలచేను ।
దేశాధిరాజులకువర్ణించ తరముగాదు ।
భీష్మకమహారాజా రుక్మాంగుడుజూచుచుండగా ।
శ్రీకృష్ణరాయులుయేతెంచి దేవినితీసుకూ ।
బంగారురథముపయిరుక్మిణినుంచ కదలెను ।
రథముజూచిశిశుపాలుడు తనతలవంచేను ।
శంఖముపూరించి శ్రీకృష్ణరాయులుకదలిరి ।
వెనుకముందరపదివేల రాజులుండగాను ।
అంచలచాలఅడుగులు బెట్టుచునడుచుచు ।
రాజులవాహనములు గుచ్చిరుక్మిణితో జెప్పుచు ।
కంచురథముయొక్క కాంతరో మీయన్నవచ్చెనే ।
వాడిమీసమునేను గొరిగింపకతునుజూడుమీ ।
వెండిరథముయొక్క శిశుపాలుడువచ్చెజూడుమీ ।
దేశాధిరాజాచూడగ వీడితలలువంతును ।
దశదిశలుగెలువలేక వారు నిలచిరి ।
అర్ధణముగొరుగగ రుక్మాంగులు తాననడచెను ।
బలరాముడువచ్చి సేనలందరపారదోలెను ।
సభరాజులజూచి శిశుపాలుడుతానుబలికెను ।

## కీర్తనలు.

ఏమయ్యసఖులారమిమునమ్మిజవరాలిగోలుపోతి॥
శాఖామనుదెచ్చి నాకియ్యకున్నాను ప్రాణములునిలుపలేము॥
పతినిరూడిప్రాణధారణముకంటెను భూమిపైవ్రాలుటమేలా॥
నాపతినియెత్తుకనిపోవుచున్నాడు వీడెంతసామంతుడో దైవమా॥
చుట్టుకునిమీరుండ గొల్లవాడెచటుండి యెత్తుకొనిపోయెనో॥
మితిలేనిగోపకాంతలుయుండగ తాను క్రొవ్వసేగోపాలుడు॥
కలకాలంబూని యొకపండుపండితె చిలుకవిధంబాయెను॥
ఏమయ్యసఖులార మిమునమ్మి జవరాలిగోలుపోతి॥
అనిశిశుపాలుడు దుఃఖించుచుతానుమళ్లేను ।

అప్సరసలాడగ పువ్వుల వానగురిసెను ।
ద్వారకాపురమందున నగరివాకిటా నిలచిరి ।
ఎదురుగ సేసలు జల్లిరి పేరంటాండ్రు వచ్చిరి ।
రుక్మిణీదేవిని అంతఃపురములోనుంచి ।
దిక్కులవారిని దేవుల పెండ్లికి రమ్మనీ ।
ఎల్లుండి లగ్నమురమ్మని శుభలేఖ వ్రాసిరి ।
కరకంఠుడప్పుడు గౌరితో గూడివచ్చెను ।
పద్మసంభవుడు సరస్వతితో గూడివచ్చెను ।
చెలికత్తెలందరు పీటలు పుస్తకంబులు ।
కొల్లలుగా పెళ్లి ధనములు బట్టుక వచ్చిరి ।
చక్కగ ద్వారకాపురమంత రాజులు నిండిరి ।
భీష్మక మహారాజు తన సతితో గూడవచ్చెను ।
అంతఃపురములో కాంతలందరు గూడుక ।
సంపెంగ తైలాన సొంపుతో శిరస్సు అంటిరి ।
గంధము అటకలిపి పన్నీట జలకములార్చిరి ।
కురులు చిక్కులు దీసి పువ్వులు మల్లెలు ముడిచిరి ।
సోగకన్నుల మంచి తీరయిన కాటుక దీర్చిరి ।
తీరయిన కస్తూరి తిలకము నొదుట దిద్దిరి ।
పట్టుపీతాంబరము మొలకు బోసివేగ గట్టిరి ।
వైభోగపు చెలికుకు వైడూర్యపు రవిక దొడిగిరి ।
ముత్యాలముడిమీద రత్నాల రవ్వలు దాపిరి ।
ఎక్కువైన ఏడువారముల సొమ్ములుంచిరి ।
ఘుమఘుమమనియేటి కుంకుమపరిమళములద్దిరి ।
గౌరిదేవిని దెచ్చి కనకంపు గద్దెపైనుంచిరి ।
ఆకులు పోకలు రుక్మిణి దోసిట బోసిరి ।
మల్లెలు మొల్లలు రుక్మిణి పూజింపుచుండెను ।
నాదు అచ్యుతుని విభునిగా నేనుగోరితి ।
కొడుకుల కూతుళ్ళనిమ్మని గౌరికి మ్రొక్కెను ।
నవ్వుచు సరస్వతి రుక్మిణితోడ బలికెను ।
విప్రునిబంపి రామకృష్ణుని చేరగొంటివి ।
అని వారు బలుకగ నవ్వుచు తలవంచెను ।
భీష్మక మహారాజు అంతఃపురములోకి వచ్చెను ।

కన్యనుదోడుకరమ్మని వారితో జెప్పెను ।
పజ్జాబాలలుబోని కన్యను గంపలోనుంచిరి ।
భీష్మకమహారాజు తనపతిగూడినిలచెను ।
శ్రీకృష్ణమూర్తికి కాళ్ళుకడిగి ధారబోసెను ।
రుక్మిణీదేవిని ప్రీతిగా సమర్పించెను ।
అప్సరసలాడగ దుందుభులు మ్రోయగకృష్ణుడు ।
రుక్మిణీదేవిని కళ్యాణమాడె ఘనముగా ।
వచ్చినవారికి వరుసతో కట్నాలిచ్చిరి ।
సతులనుగూడుక సంతోషమునవారు వెళ్ళిరి ।
శిగ్గుపడిశిశుపాలుడు తన తలవంచెను ।
వెరవకుమనిచెప్పి గట్టిగ తనచెట్టపట్టెను ।
రుక్మాంగుడిపంతములన్ని వడిగాసాక్కెను ।
గుంపులుగూడుకు పేరంటాండ్రు సొంపుతో ।
పాడుతువచ్చి రోకళ్ళుచేతబట్టుకు ।
పంకజనాభాలమీద సుంకులుచెరగిరి ।
అచ్చటనాగవల్లి యమరారజేసిరి ।
నాగవల్లి బుత్తిగంటు మెడనుగట్టిరి ।
తల్లికి దండ్రికి రుక్మిణీదేవి మ్రొక్కెను ।
కన్నీరుదెచ్చుకొని కౌగలించి వాపుబలికిరి ।
కన్నతల్లివినీవు వగవాగనేటి కమ్మారో ।
మేము ధన్యులమయితిమి కృష్ణుడల్లుడుకాగాను ।
కన్నతల్లికి మ్రొక్కి కన్నీరుదెచ్చుకు వగచెను ।
కన్నతల్లి వినీవు వగవకె ధన్యులమయితిమి ।
అన్నిచెప్పికన్యకు తమరు తమపట్నముకువెళ్ళిరి ।
రుక్మిణిగూడుకు సంతోషమునయుండిరి ।
ఈపాటయెవరయిన పాడినావ్రాసినను కృష్ణులూ
అష్టఐశ్వర్యములు అష్టసంపదలు యిచ్చును ।
కన్యకలుయీపాట పాడిన విన్నవారికి ।
కళ్యాణమౌనని రుక్మిణితానుబలికెను॥

---

# 19 రుక్మిణీదేవి ముచ్చట.

ఆటకూటంబులోను । రుక్మిణినాటకపుకాలలోను
పారుజాతపుశయ్యపై । రుక్మిణీవలించిరయో కృసాదూ
కలికిశ్రీగోపాలుడు । రుక్మిణికాగిటచేర్చుకొనెను
మూగునకుచములనదుమును । ముత్యాలసరులుగుంపిసలాడగ
సిరులునాట్యముచేయగా । పైటచెరగుజీరాడగాను
కౌలమితోడుగరుక్మిణి । తనవిభునివద్దనేకూడుండగా
సరసమునసాయింటికి । చొచ్చితారానేమిపనియున్నది
యిదియేడసవతితనకు । కోమలీయిదియెవ్వతెతనకును
యెంతదుండిగతనములు । కోమలీయేయింటికేచెల్లును
ఏయింటికేచెల్లునేకోమలీ । యీయింటికేచెల్లును
పిలిచినాపలుకదమ్మా । దానిబడాయిరేమొకాని
నిలిచిననిలువదమ్మా । దానిఅహంకారమేమొగాని
వంచినావంగదమ్మా । దానివయ్యారమేమొకాని
చూచినాచూడదమ్మా దానికండ్లు । మింటనేఅంటున్నవి
కౌలమితోశ్రీకృష్ణుడు । దానికియింతదనువిచ్చినాడె
యేమిజాచీతలచెనే కోమలీ । అదియెంతసుందరమ్మా
పాలిర్చుజాచివలచె । దానిమంచిపలువరుసజూచివలచె
వలదితేవలచెగాని । విభునితనవశము జేసుకపోయెను
సత్యభామయుండుగాని । ఎన్నడూతనమేళ్ళకపడురాదు
చూడనైతేచిన్నది । అభామపంతమేఅటువంటిది
చెలువంపుకుందనములు । దానిమంచి చెక్కుటద్దములబోలు
చక్కదనంబెమిగుల । విధినమరిసఖియచిగురాకుబోణి
కులుకనవ్వులకృష్ణుడు । అతగాడిని మోహించకతీరదమ్మా
కలికిశ్రీగోపాలుడు । దానికాగిటజేర్చుకొనెను
కురులునున్నగదురిమిరయు । శిరసుపైగొప్పగా బెట్టితుసుము-
పొగసైనదానినొదట । కస్తూరిపొగచక్కగదిద్దెను
అమగువచనుగవలపై । ప్రేమతో అరదనేశ్రీగంధము
కోడివచ్చినవారికి । యింతేసికూమములుగలిగెనమ్మా
జారస్త్రీలకుహితవుడై । అదిమొదలుశేరదేతనయింటికి

పుట్టుమొదలాదిమ్మరై । పశులతో బోయడై తిరిగినాడె
కౌమరప్రాయపుస్త్రీలను । పట్టుకొనికోడిగంబులుచేయుచు
పలుగాకుతెల్లగూడి । ఆగొల్లపణతులను మరగినాడు
పదహారువేలస్త్రీలు । ఎనమండ్రుపట్టపుదేవులమ్మ
వారుయిందరుచాలరే । యిప్పటివారకాంతలుచాలరే
ఎందరైననుచాలరే । పణతిగోవిందునికౌగిటకు
నళినాక్షివినగదమ్మ । అదియైనవాకైన తెలియరాదు
బాలప్రాయమునకైన । అదిమొదలు భావించితెలియరాదు
అతనికో వినగదమ్మ । తనవిభునిరాధాంగికౌస్పగిస్తి
కౌగిటనున్నవిభుని । రాధాంగివచ్చితీసుకుపోయెను
పరుపుపైనున్నవిభుని । అదియెంతపాపితీసుకుపోయెను
అట్టిచెట్టలుబట్టుకపోగాను । చూచుచుంటిని కోమలి
ఆవేళతనదేహము । పరవశములైయుండెనే కోమలి
అయింతితనమీదను । అతియేమొతెచ్చిచల్లెనెమందులు
అచ్యుతుడుదానింటికి । పోయినప్పటివేళనుంచి
యింతికోతనకన్నులనీళ్ళు । కుప్పలైకురిసినవి
కుప్పలైకురిసినీళ్ళు । కోమలీకురిసిపొట్లించినవి
తరుణికోవగవకమ్మ । నీసోగకన్నులేరెత్తివారెు
మొన్నరాతిరివేళను । అతనిపాతున అరగించినఅన్నము
పెట్టినాయిష్టాన్నమ్ములు । అయింతిముట్టలేదే కోమలి
ముడువబోయినపువ్వులు । తనకంతయిచ్ఛలేదే కోమలి
పూయబోయినగంధము । తనకళ్ళునున్నంబులైతోచును
పరుపుమీదపరుండబోగా । తనకింతబుద్ధిపుట్టదే ఓకోమలి
అతివకో తాంబూలము । తనకంతో అసహ్యమైతోచును
చూస్తివా ఓకోమలీ । యిందొక్కమాటకలదుచెప్పెద
లక్షవేలాడేసెడి తనమెడను । పచ్చలాపతకముండె
అచ్యుతునికంఠమాలతగులుకొని । అదిచిక్కుబడియుండెను
అచిక్కుదీసితాను । పరుపుపైబెట్టుంటిని
ఎంతపలుపే కోమలి । దానిముఖముచూచుచు సెలోలుడారెు
చూచుచుసెలోలుడారెు । దానిమెడనువేసెనేఅపతకము
వాదిగాదేపతకము । ఆసత్యభామదేఅపతకము
అచ్యుతునిపెండ్లినాడు । అల్లునికివారణమిచ్చినపతకము

అంతలోకేగోమలీ । అభాన ఆపగబంపెనుగోమలీ
పతకంబుతీరుగాను । పతకంబుచేయింపవేసినాను
ఎల్లుండియీపాటికి నీవొచ్చి । గొంచుబోవేపతకము
అనియిట్లుఅయింతికి । అయింతిఒప్పాగా జెప్పంపెను
నారదుడుఒక్కనాడు । పేరిమతోపువ్వుదెచ్చెనుగోమలీ
తెచ్చినీలావర్ణుడు । అపువ్వుతనకుయిచ్చెనెగోమలీ
యిచ్చినీలావర్ణుడు । తనలోనుతాను తాపంబొందెను
ఆవేలఅస్తగించి । అపారుజాతమేగొంచుపోయె
దానికాళ్లుబట్టుకు । దానిపెరటనేసెనేఅచెట్టును
ఇంద్రుడుమెచ్చడాయె । నాతండ్రిచంద్రుడుమెచ్చడాయె
జారుడికితెచ్చిచ్చెనే । తమతండ్రిచోరుడికితెచ్చిచ్చెనే
తండ్రేమిచేసెనమ్మా । తన్నిచ్చితానెతెచ్చుకుంటిమి
రుక్మాంగుడన్నమాట । అదియెల్లతానుకానాలాయెను
యెంతపాద్దుపోయునా । తననువిడచియుండడేశ్రీకృష్ణుడు
అటువంటిశ్రీకృష్ణుడు । దానివలతగిలిపోయెనెగోమలి
ప్రేమవచ్చెనెగోమలి । తనమీదప్రేమచాలించెగదవే
యశోదశ్రీకృష్ణుడు । తనతోనుయెంతకూడియుండునే
ఎంతకూడియుండునేగోమలీ । ఏలాగుకూడుండునే
చెప్పవమ్మారుక్మిణి । చెవులకుసంతోషమైయుండును
సరసంబులాడుచుండు । తనతోనుసయ్యాటలాడుచుండు
కేళింపుచునుండునే । తనతోనుక్రీడకల్పుచునుండును
అద్దంబుజూపుచుండు । తనకతడుఅనుమణిచీయిచ్చెను
ఆభరణములుసొమ్ములు । తనకతడలంకరించుచునుండును
మాణిక్యాలగొలుసులు । తనమెడనుచక్కగావేయుచుండు
తేనెతోఅరటిపండ్లు । తెప్పించితనకారగింపుచుండు
కలియావదివెలభక్తితో । బంగారువింజామరలువిసరును
నీమిటెప్పుడుగాదునే । గోమలీవిభుడుచేసినమన్నన
మొన్నరాతిరివేళను । అతనిపొత్తున ఆరగించినయన్నము
పెట్టినాయిష్టాన్నము । తానింతముట్టలేదేగోమలీ
చిలుకకూపద్యంబులు । తానింతచెప్పలేదేగోమలీ
చిలుకలుపలుకవాయె । గోమలీయవిచిన్నబోయున్నవి
తాచిన్నబోయుండగా । గోమలీఅవిచిన్నబోయున్నవి

హంసలుఆడవాయె । కోమలీఅవిచిన్నబోయున్నవి
తాచిన్నబోయుండగా । కోమలీఅవిచిన్నబోయున్నవి
రతిహంసపడుపదాయె । కోమలీఅవిచిన్నబోయున్నవి
తాచిన్నబోయుండగా । కోమలీఅవిచిన్నబోయున్నవి
ఆటకూటంబులన్నీ కోమలీఅవిచిన్నబోయున్నవి
తాచిన్నబోయుండగా । కోమలీఅవిచిన్నబోయున్నవి
నాటకపుశాలలన్నీ । కోమలీఅవిచిన్నబోయున్నవి
తాచిన్నబోయుండగా । కోమలీ అవిచిన్నబోయున్నవి
అచ్యుతుడుకూర్చుండెడి । రత్నాలమేడచిన్నబోయెను
తాచిన్నబోయుండగా । కోమలీ అవిచిన్నబోయున్నవి
నారదుడు కూర్చుండెడి । భోజనప్రసాల చిన్నబోయెను
తాచిన్నబోయుండగా । కోమలీఅవిచిన్నబోయున్నవి
చిత్రపుకవికెలోన । రత్నాలటూగుటుయ్యాలవుండు
యెవేళతనురిద్దరు । యెప్పుడువూగుమందురెకోమలీ
నడుపలేనివిరుక్మిణితన్నతిను । చంకబెట్టుకుతిరుగునె
చంకబెట్టుకుతిరుదునే । శృంగారవరములను విహరించునే
మల్లెపూవులుకోయనే । నెలతరోమరులుకొల్పుమపల్కునే
వానిపరికేగినీవు నెలతరో । వర్ణించినాకష్టము
విభునిమనమునుద్రిప్పుచు । వేడ్కతో నాధునోడొగ్గనివేగమె
వచ్చినాచేరిమలంది । రైకొమ్మివనితరోసౌఖ్యములను

# 20 శాంతగోవింద నామములు.

ప్రథమచరణముచివర గోవిందారామయనియు, రెండవ చరణము చివర గోవింద అనియు పాడవలెను.

పాలసముద్రముమీద గోవిందారామ భద్రాద్రిశయనులు గోవిందా। శేషశానపుమీద గోవిందారామ లక్ష్మితోపవళించె గోవిందా । ఆదిలక్ష్మిదేవి । శిరసుచక్కగబెట్టె । హస్తములుబట్టెను । రావణునిచరలన్ని । చరలొచ్చివున్నవని । అష్టదిక్పాలకులు । ఆదిదేవతలెల్ల । విష్ణుతో చెప్పిరి । చరలనుభవించియు । వారిచరలు విడిపింతునని । నోటివట్టపు చేడె । సీత

ప్రక్కనుపరచిరి । పళ్ళుపంచదార । పసిబాలకిచ్చిరి । ధూపములుదీపములా
నయివేద్యములుయిచ్చె । తల్లికిసమర్పించి । బాలునియెత్తుకొని । పవళించ
బెట్టిరి । మండోదరీదేవి । చేతులెత్తిమ్రొక్క । వెరిగిరావణాసురుని । సం
తునిగాలెజాడుమని । చల్లగారక్షించు । లంకరక్షించుమీ । అంతటవిప్రు
లు । వికవికనునవ్విరీ । లంకరక్షించుటకు । పన్నెండుయేండ్లకును । మగుడి
వచ్చునులక్ష్మి । తాళములువేసిరి । సముద్రమునవిడచిరి । సముద్రుడు మూ
డేళ్లు । చక్కంగపెంచెను । తనకు బరువైనట్లు । పాలసముద్రునకిచ్చె ।
యేడునెలలుఅతను । భామినిపెంచెను । పాలసముద్రుండంత । ఆదిశే
షునకిచ్చె । ఆదిశేషునఅంత । అందముగ పెంచెను । తనకు బలువైనట్లు ।
భూదేవికినిచ్చెను । భూదేవి పన్నెండేండ్లు । యిసుకతిన్నెనువుంచె । గురుపు
త్రుడనువాడు । గుణములుగలవాడు । తల్లినిదండ్రినీ । కావళ్ళవుంచుకుని
వనములను తిర్గుచు । ఫలములుపెట్టుచు । అరణ్యముమధ్యకుచేర । అంత
టవృద్ధులకు । దాహంబులాయెను । అనపకాయబుర్రితో । వుదకంబుముం
చగా । బుడబుడమనగాను । యేమిటోజంతువని । దశరథుడుబాణంవేశె ।
యెవ్వడోనరుడిప్పుడు । ప్రాణములుతీసెను । నాతల్లిదండ్రులకు । నేనొక్క
తనయుడిని । కళ్ళుయినలేనట్టి కబోదులువారు । కండ్రిదాహముగొన । తీర్ప
గలేనైతి । మాతల్లిదాహము । మీరుతీర్చండయ్య । శాపంబులిత్తురు । అను
భవించూవని । సుమంతుడుశోకించె । నమహారాజశోకింగ । యింతపాపపు
వేట । యెన్నడూసేసెయుగ । బాణంబు తీయుమన । దశరథుడు తీసెను ।
సుమంతుడుతిర్గెళ్ళె । బుర్రతోటిసీళ్ళు । రాజాచేతబట్టి । మాట్లాడకుండాను
దాహమునుయిచ్చాడు । చేతనూతడిముకొని । పుత్రుడూకాదని । పోరములు
పతికములు । అధికముగవున్నవి । నీవెవ్వరోచెప్పు । సుతుడుయేమాయెనని ।
కేటప్యాగమనివేస్తి । సుతుడీల్గెననిచెప్ప । నీవెవ్వరనియడిగ । దశరథరా
జానను । ముదుసలులుశోకింప । యినక..డువేడెను । రాజ్యమంతయుయిత్తు ।
రమణులనుయిస్తును । మిమ్మునయిద్దరిని । కావళ్ళవుంచుకుని । వనములుత్రి
ప్పుచు । ఫలములుకోసిస్తు । అయోధ్యపట్నానికి । వెంటబెట్టుకుపోదు ।
యెందరుఅయినను । నాసుతుడగుదురా । ఆదినారాయణుడు । నీగర్భమున
బుట్టు । అపుత్రిపుత్రాయని । ప్రాణంబువిడుతుమని భూసురుడు శాపంబిచ్చె ।
ప్రాణాలువదలిరి । దశరథుండంతట । సంస్కారములుచేసి । అయోధ్య
కూవెళ్ళె । ఘంటానమ్రబతులు । భేరీమృదంగములు । రథచతుర్యగములు ।
యేనుగంధర్వుల్లు । యెదురుగారాగాను । అవతిలికిబంపించి । చిన్నప్రచ్చు
కురాజా । అంతిపురికేతెంచి । దేవికౌసల్యతో । కడువేగముజెప్పె । మాకు

వెల్తురు లేవు । బాలుడు లేని వెల్తి । చంక బాలల చూచి । చిన్నబోయెను రాజా । చిన్నబోయిన రాజా । చాపపై పవళించె । కౌసల్యమహాదేవి । పతికి పాదము లొత్తె । సుమిత్రమహాదేవి । సురటీలు వేసెను । అంతట మహారాజా కౌసల్య తో బల్కె । యెన్ని రాజ్యములయిన । యేలితిని నేనయిన యెన్ని దేశంబు లయిన । చూచితిని నేనయిన । పుత్రులు లేనట్టి । పుట్టుదరిద్రున్నయితి పుత్రులు ప్రభవించ । పుట్టగతి చూపించు । అప్పుడు కౌసల్య । మహారాజుతో యిట్లనియె । ఉత్తరపు భూమినీ ఋషివర్యుడున్నాడు । అచటకీ చన రెండు । పుత్రులు గల్గుదురు । పుణ్యాలము అవుతాము । అంతట మహారాజు । ఉత్తరభూమికేగ । ఋషివరుని చూచి । ప్రదక్షిణనమస్కారము జేసె । రాజును ఋషి చూచి యెన్నడు రానివారు । రాను కారణమేమి । మా కోర్కె లడిగెరె । మాతో సుపండెను । అంతట మహారాజు । ఋషితోను బల్కెను । యెన్ని రాజ్యములయిన । యేలితి నేనయిన । యెన్ని దేశములయిన । చూచితిని నేనయిన । పుత్రులు లేనట్టి । పుట్టుదరిద్రున్నయితి । పుత్రులు గలుగుటను । పుట్టగతి చూపవలెను । దక్షిణ భాగమందు । రాజఋషి వున్నాడు । అచ్చటికి యేగితే । పుత్రులు గల్గుదురు । పుణ్యాలు అవుతాయి । ఆరువైఆరు వేల । సంవత్సరములకిచ్చట । లేకలేక వారికి । ఒకకన్య జన్మించు । ఆ బాలను పెంచితే మీకు సుతులు కలుగు । యిత్తురో యివ్వరో । సంశయము గా బల్కె । మీవంటివారికీ తప్పకాయిత్తురనె । ఆ వివాహంతోను । అతివేగ వెళ్ళెంచె । అంతట దశరథుడు । అయోధ్య చేరెను । కౌసల్య సుమిత్రా । పతికి యెదురుగ వచ్చి పాదంబులు కడిగిరి । సింహాసనం వేసి । క్షేమవార్తలు అడుగ । సతులతో పతి బల్కె । సతులార మీకిపుడు । సమ్మతంబా యెనా । మాకు సమ్మతమనిరీ । అంతట మహారాజా । కైక నగరము జేరె । కైకతో తా జెప్పె । అతివరో వింటివా యీ దినమందునా । వసిష్ఠ వాల్మీకులు । గౌతమ జమదగ్ని । అత్రి కశ్యపులు । మహాఋషులు చెప్పేరు । దక్షిణా దిశయందు । రాజఋషి వున్నాడు । అచ్చటికి చనువెంచిన । మనకు పుత్రులు కలుగుదురు । పుణ్యాలము అవుదుమనె । పతిమాటవిని కైక । అపరిపడి తానుండె । అంత కౌసల్యనగ । అతిపరాక్రిమశాలి । కోరకొడుకుల గంటె । గొడ్రాలిననయి వుందు । అదలించి రాజును । ఆ తలికి తా బంపె । చిన్నబుచ్చుక రాజా । నగరిలోకే తెంచె । రాజతో కౌసల్య । అరళ్ళబెట్టుకడి । అతిననమీరిపుడు । బుజ్జగించి చేరి । ముద్దుగా అడగండి । వశిష్ఠ గౌతములు । కైక నగరము వచ్చి । అడిగిన ధనమిత్తు । అతివరో నీకిపుడు । కోరిన ధనమిత్తు । కోరిన నగలిత్తు । కోరికలన్నియు దీర్తు । కోవలిసికిపుడు । ఒక్కరికి అయినాను । పుత్రులు పుడితేను । రాజ్యమునకధి

పతులు । రాజుల్లు అవుతారు । నన్ను పుట్టగరాదు । నాథుడా నీవిపుడు । నన్ను అంటగరాదు । ప్రాణనాథాయనె । వశిష్టగౌతములు । వెకవెకనవ్విరీ చిన్నబుచ్చుకురాజా । తననగరుకేతెంచె । నాకువశమూకాదు । నల్లరాయియిది । పాషాణమనిపల్కె । రాజుచేశినపుణ్యం । వ్రాసిఫలమిట్లుండె । మగువచేసినపుణ్యం । మరియామరుంచిదిఅనెను । అప్పుడుకౌసల్య । కైకనగరుకువచ్చె । చెల్లెలారమ్మనె । ముద్దుగుమ్మరావె । మూడవభార్యమరమ్మనె । అక్కమాటలువిని । కైకతామండిపడి । అక్కరోకౌసల్య । అతిపరాక్రమశాలి । కోరికొమ్మకులగంటె । గోడ్రాలవయివుంచు । పట్నంపునీకేలు । కానిపను అయివుంచు । అపలించి కౌసల్యను । అవతలికిపంపించె । చిన్నబుచ్చుకుచేడె । రాజుచేసినపుణ్యం । వ్రాసిఫలమిట్లుండె । తననగరుకేతెంచె । పతితో సుమిత్రి । కైకదగ్గరకొచ్చి । రమణీవిరమ్మని । రహస్యముగజెప్పె । చెప్పినస్తీవనీవు । చెంపలుకొట్టేస్తు । సుమిత్రి చెప్పగా । సువతిసమ్మతించె । మందరతోకూడ । శరలివతుమనెను । రాజు బావాడమ్మ । లక్ష్మిమీదేసుమి । రాజుతోకూడాను । రథముమీరెక్కించి । కాలినడకవుమేము । కదలివస్తామన్న । కాంతలారమీరు । కాలినడకవస్తె గడియలోవత్తునని । కైకప్రయాణమాయె । సుపతివొప్పినది । సుమిత్రిజెప్పెను । కౌసల్యతోజెప్పె । కైకమహాకేవికి ।। యేబుద్ధిపుట్టునని । అప్పుడుకౌసల్య ఫణివార్లబిల్పించి । రథముతెప్పించుమనె । ముత్యాలచేరులు । పగడాలకుచ్చులు । నీలాలతోరణం । వజ్రములదాపించె । రథమును తెచ్చిరి । కౌసల్య కెరిగించె । కైకనుబిలిపించె । రాజాకప్పగించె । అప్పుడుకౌసల్య । ఫణివార్లనుబిలికించి । చాటించుమనిజెప్పె । పట్టుచీరలకుంచ పదికోట్లరమ్మనిరి । ముట్టజాలకుంచ । మూడుకోట్లరమ్మనిరి । తలగడిగిరమ్మనిరి । పసుపునూనెలుపోసి । ముట్టజాలకుంచ । మూడుకేలొచ్చిరి । భమిడికవచంపరచె । గుర్రములు తెప్పించిరి । భమిడిపల్లంవేసె । రాజానుకైకమ్మ । దంపతులు రథమెక్కి । జయభేరివేసిరి । జగమెల్ల మ్రోసెను । ధనరాసులుతెచ్చి । కౌసల్యతాబట్టె । పసుపుకుంకుమపళ్ళు । సుమిత్రితాబట్టె । అనసూయరుంధతి । అహల్యభామామణులు । ముత్తయిదువులువచ్చె । రామచిలుకలు రెండు శ్రీమతో యెదురయ్యె । వేశ్యస్త్రీలువచ్చె । సురశాంతములువచ్చె । గరుత్మంతుడువచ్చె । శకునంబుదీర్చెను । మంచిదీశకునాలు । మళ్ళవద్దుపైనం అందలములెక్కి । అంచంచమాజిలీలు । పన్నెండుగడియలకు । పట్నంబుబయలుదేరె । అప్పుడుకౌసల్య । సుమిత్రితోబలికె । రాజపత్నులంతాము । కైకదానీసుమనె । అప్పుడుసుమిత్రి । అక్కకుమ్రొక్కెను । మందర

పంచశరుడ నీకేజయతు । పరగంగా మత్స్యలినిస్వామి
గజ్జరూపున వెసబోయి । ముదముతో మూడడుగులనడిగి
బలికిశిరస్సున పాదములిడిన । పరమాత్మనీకేజయతు
జనకునికూతురు జానకిదేవి । దేశాయీలు మిమ్మున పొగడ
నిముషమ్మున పెండ్లిఆడిన । నీలవర్ణుడా నీకేజయతు
కలికికాంతల అభిమానమ్మున । ఘనముగమీరటు కొల్లలుగొంటిరి
కలికావతారుడ మమ్ముకరుణించు । కలకలనవ్వుచు కమలనాభుండు
అంబుజాక్షితో నిట్లనిబల్కె । పాడచిన ప్రొద్దుబోవలెవానకు
వేడుకజూదం బాడుదురమ్మ । అనుచును తననాథుండిలువ
వారించెనుగా లక్ష్మిదేవి । గజవరదుని కరములుబట్టి
పగరాంగణపు నగరికిజనిరీ । చతురంగపు శాలలలోను
చిటిచాపలు శ్రీహస్తమునబరచిరి । దలపడియింతిట సంతోషమ్మున
గూర్చుండిరిగా పరుపులమీద । కొండితో జేసిన సొగటాలేమొ
వెన్నుడుతాను దెప్పించె । రత్నాలసొగటాలేమో లక్ష్మితెప్పించె
బంగారుసొగటాల్పాళి పద్మనాభుడుబరపించె ।
ముందరపందెము వాదీయనుచును । మురియుచుశ్రీవిష్ణుడుబల్కె
అతివతోను ఆడగవచ్చి । ఆభరణమ్ములు సొమ్ములుబెట్టె
చేర్పుతో మొలనూళ్ళుబెట్టె । మేలయినా పతకంబుబెట్టె
యురమునయుత్తర జంధ్యంవేసే । మొలనూళ్లు మ్రోయుచునుండే
మోహనాకారువికపుడు । అతియగుదేవుండపుడు అందెలుపాదములబెట్టె
వక్షస్థలమునా వనమాలా । అచ్యుతుడుతా ధరియించె
చెక్కుటకుండలములు । ధగధగలాడుచును మెరయగను
ధగధగలాడే ముత్యపుపోగులు । చెలువులను మెరయగాను
ముద్దుముఖమ్మున ముత్యపుతిరుమణి చక్కగతాను ధరియించె
నెలవంకబోలు వెన్నుదురువిూదను । చంద్రవంకాతిలకందిర్చె
పిగిలిపింఛలతలకూజుట్టి పీతాంబరముపైనిగప్పె । వన్నెకాడేకల్కివిష్ణుండు
వల్లెవాటొప్పగ వేసితాను । పొడుచుసోలుచు వేణునాదం
చక్కగానువారియుంబట్టె । కన్నులుగీటుచు సన్నలుజేయుచు
పారిజాతాండవమాడుచును । దేవేంద్రాదిదేవతలెల్లా దేవదేవునిచూడవత్తురు
అత్రిరుడుమొదలగు । హరిదాసులెల్లాగూడి
భక్తితో భోగపద్రిదులు । పద్మనాభుని జూడవత్తురు
నాతులారా నాథునికొల్వుడు । నవ్వుచురారే కొమ్మలారా

యిట్టిదేవునిహోమలుఅంతా । అప్పుడయిన జూచితిరిమీరు
అంతటనూ అలక్ష్మీదేవి । ఆభరణములు సొమ్ములు పెట్టె
నేర్పుతో మొలనూళ్ళు బెట్టె । మేలయినా పతకంబెట్టె
పచ్చలకెంపుల బన్నసరములు । మెడనిండా దిగవేసేనుచాలా
మన్ననియానుచములనడుమను । చెన్నమరిన చంద్రహారంబెట్టె
రత్నాలుదాపిన రవికాదొడిగె । ఆభరణమ్ములు సొమ్ములుబెట్టె
నాతినాసికమ్మున ముక్కెరబెట్టె । నవరత్నములగీలించిన
వడ్డాణం నడుమునబెట్టె । సౌందర్యభూషణాలువుంచె
పద్మనాభులదేవికనుక । కంకణములుతూటిగాజులుమురుగులయిన
కరములమంచె । చక్కనగుసందటిదండలుబెట్టె
సర్వేశ్వరులదేవికనుకా । సంపెంగ తైలంశిరసున బెట్టికొప్పుదిద్ది
కొప్పుమీదరత్నాల । కొప్పుగొలుసులుంచి[illegible]బెట్టె
ముద్దుముఖమ్మునముత్యపుతిరుసుణి । ముద్దులుగుల్కగ తాను బెట్టె
చక్కనగునుదుటిమీసను । చంద్రవంకన తిలకందీర్చి
పణతీతనపాపిటయందున । బంగారంపు మాముకముంచె
కలికీతనకన్నులమీదను । నిగనిగకాటుక మెరయగను
యిత్తిగతీవంచా ఆదిముక్కపగడా । అద్భుతికఅచ్చోగ అతిశారయునుచు
జవ్వనుచూ జూడనుచూ । పారికపలుమారు
బలుపైనపందెములను । పద్మనాభులదేవీవేసె
ఆటలతో వారూ । ప్రొద్దుబుచ్చుచుండగను
పాపకర్ముడు । పాండురాజులఘాతకుడు
ప్రజలద్రోహుడు దుశ్శాసనుడు । ద్రౌపదినిసభలోన
వలువవలిమ్మనివిప్పగాను । అన్ననీవేడిక్క అనుచుఆద్రౌపదిఅపుడుబల్క
ద్రౌపదిపల్కులు కృష్ణునికంతో । నాదంవలెవినగానెచ్చె
అక్షయమనుచూసొచికలేయా । కోట్లపాదుగునా చీరలుపడెను
మేట్లకొలది రవికలుపడెను । కట్టలేకను ద్రౌపదిదేవి
విప్పలేకను దుశ్శాసనుడు । స్వామిమహిమయిది యనితలచి
ఇచ్చేటివాడు విశ్వంబరుడుండగ । విప్పగనెవరితరమయ్యా
చుక్కలపాడుగున రానులుచీరలు । చొక్కమైనరవికెలతోళ్ళు
కొలువుకూటమున కలవారెల్లా । పట్టుచీరలు బంగరురవికెలు
కట్టుకొనిరవీరజాతులు । పంకజనాభుండైన శ్రీకృష్ణుడుపక్కనవ్వె
సాధుడనీవూ నవ్వినవిధము । నాకెరిగించుమిశ్రీకృష్ణ

నీరజనాభుడ నవ్వినవిధము । నీతితోడుత నెరిగింతూ
కమలనాభుడ నీతోడ బొంకి పొందికవైచితి నా
భువననాభుడ నవ్వినవిధమూ । బొంకక నాతో నెరిగించు
నాతీరూపువల్లని గాని । నాకూతగదని నవ్వితిరా
వనితాతవంతవచ్చినదాని । వలచుటతగదని నవ్వితిరా
పదహార్వేలనుగువలగోపల । పణతీతగవని నవ్వితిరా
రుక్మిణిమొదలగు పట్టపుదేవికి । పొంకముగాపువ్వుదెచ్చిస్తే
పంకజాక్షి సత్యభామా । పల్కానిఅందుకు నవ్వితిరా
మారిమీగుఅచ్చటికేగి । ఆభామకోపందీర్చి
శిరీకృతో నేవ్రక్షముదద్ధి । వేసినందుకు నవ్వితిరా
యెల్లపడుచులలోకెక్కువైన । రుక్మిణికివరములిచ్చా
పెక్కువినమ్ముల సిరిమునపొందిన । మక్కువలకు నవ్వితిరా
ద్రిమ్మరిగాడవునీవుపతులను । దిట్టవయిచెట్టాబట్టి
చెంగాబిడ్డల చెలువముతో తెచ్చి । నీచందంగాదునమ్మి
హెచ్చవునానీగుణము । తచ్చనసేయకువోకృష్ణా
తచ్చనగాడవునీవుగాకృష్ణా । హెచ్చులుకాయకు నేలుదువా
యెన్ని నేర్చుకుంటేనేవు । యింతులనెల్లచేపట్టి
లోకములు అన్నీ సాదునబట్టి । మోహరూపునా
జారగుణంబులు చోరత్వంబులు । యెన్ని నేర్చుకోమీయున్న
అనామా ఆలక్ష్మీదేవీ అచ్యుతులను । డాయగవచ్చీ
చిరునవ్వులునవ్వుచును । మురయుచు శ్రీకృష్ణునికొంగుబట్టె
ముత్యాలహారం మెరయా । మురహరుడుమదితోనవ్వె
పతికొంగుబట్టినవారికి । తప్పులేదానరణిలోన
నాకొంగుబడితేయాను । నేరములు యేమయినాగలవా
నేడుగాదేవికొంగుబట్టి । బహుగాకాలం ఆయెనేలక్ష్మీ
తరుణ్నీనాచిటికనాబట్టి । తరుణులచేతా పూజలుగొంటివి
గోవిందుడాలక్ష్మీవని । కోరికలన్నీ యడుగుచునూ
పురుషోత్తములా దేవీ నానిభూజనమెల్లా । వెదుకొనుచున్నరు చిక్కితినీ చేతయునుచూ
చిరునవ్వులునవ్వుచును । పక్కనహరి చెక్కిలినొక్కి
మారియచుచుమురిసు ముద్దిడగా । నవ్వినపురుషుని బంటనబెడదుర
యీలోకమునందయినస్త్రీలు । నాతిరోనన్నా బందవబెడితివి
నేడునాకుకానుకవచ్చు । నాతిరో నేను నవ్వినవిధమూ

వామనావతారమున బలినిమూడడుగులడిగి । త్రిభువనమాక్రయించితిగాని
గోపిదేవినేను కొంగనెరుగ ।
పరశురామవతారమున వసుంధరాజులనెల్ల । యిరవైయొకమారు బరిమార్చి
పృధివియేలితిగాని గోపిదేవినేను । కొంగజూడా
శ్రీరామావతారమునసిరులుఅనుభవించి। దురాత్మురావణుద్రుంచియేలితిగాని
గోపిదేవినేను కొంగనెరుగ ।
బలరామావతారమునపృథమినాగటినెత్తి ।
క్రూరదైత్యులదునిమిధరణియేలితిగాని । గోపిదేవీనేను కొంగనెరుగ
బుద్ధావతారమున ముద్దులుజూపించి । గొల్లముద్దియలతో ఆటలాడితిగాని
గోపిదేవినేను కొంగనెరుగ
విల్లానువిరచితిని మల్లూలజంపితి । రణయుద్ధములోనకంసుజంపి
కాళింగిమడుగొచ్చి కలికినాగులయొక్క । కన్నులావిషములుపిక్కటిలగా
పడగమీదపాదాలు పరగమోపియు నేను । తాండవంచేసితి తరుణిఅప్రుడు
కొంగయెట్టిదోయొప్పగ గోపిదేవి
యేడుసముద్రమ్ములూ యేకమయిపారగా । అక్కడాతమ్రియాకుమీద
వటపత్రశాయినై బవ్వళించితిగాని । మగువలో కొంగ నేనెరుగమ్మ
నన్ను వెరపించేవు నలినాక్షి కొంగనుచు । కొంగజూప వెతల్లి కొంగజూపు
అనినోరు దెరవగా అఖిలబ్రహ్మాండములు । తనయునికుక్షిలోనిండియుండెను
పారేటికాల్వలు పర్వతమ్ములుచెట్లు । పాతాళములుపెక్కు బ్రహ్మనదులు
చంద్రసూర్యులుసప్త సాగరమ్ములును । త్రిభువనంబులువాదియాయశోదా
భయమందివెరచియు తననుతునకిట్లనెను ।
నాయన్ననీమహిమ బ్రహ్మాదులెరుగరు । వెన్నడానిన్ను నేకన్నబలిమి
కొంగంటెవెరతువనిమరచిపల్కితిగాని । మురవైరిమాయమాయెక్కడాను
తనతల్లివెరచుటకు తననోరుమూసుకొని । మందకునుగొంపో శిశువనన్ను
అనిపల్కుమాటలకువద్దుశ్రీకృష్ణమ్మవద్దుపురుషోత్తమావద్దువద్దనితల్లిమళ్ళిచెప్పి
మగుడశ్రీకృష్ణమ్మ నుయ్యాలలోవుంచి । భమిడిపుయ్యాలచేరుపరగబట్టి
జోజోమత్స్యావ జోజోకూర్మావ । జోజోఅచ్యుతా జో అనంతా
శంఖుచక్రధరా అనియిట్లుయశోద । అంకించిపాడగా అతివలొచ్చి
పెరుగుదు పెరుగిడి యురుగిళ్ళకుపోయినాను । తరికదవతాపెరుగుతాగిపోరు
అనియిట్లుయశోద అంకించిపాడగ । పొరుగింటివనితతాబోరునవచ్చి
పాలిడిపాలిడి యురుగిళ్ళకుబోయినాను । యీడముంతలపాలుతాగిపోరు

యేమిసేయుదుమమ్మ యచ్చటికిఁబోదుము । పందుంసేతికివున్న వెన్నదినెను
అంతటఒకచెలియ అతివేగిరంవచ్చి । చెప్పకుడిగోపిదేవి చెవినిపెట్టదుగా
మనమెంతపించినా మాధవునిచరియలు । పానుపేలేదమ్మగోపిదేవి
పోదాముసదరమ్మ ఆసామితోనునకు । రారాపుతేలయిక మనయిళ్ళకు
యీరీరుజలజాక్షులందరునుజెప్పగా । వినిగోపిదేవినాకొడుకుముచ్చకదరా
వారిజాక్షులార మీయిళ్ళగలమంచి । నెయిపెరుగులుబోసిబాలుపెంచు
కొడుకుమంచిదాదుఁను అచ్యుతులకు । కాపుంచిగొల్లకజకెను గోపిదేవి
తమతల్లితోగ్రివలు తనయుడుగు కెరిగి । వారికంటెనుముందుతానుబోయి
యేయిల్లుజూచిన పాయిసపుకడవలూ । యేయిల్లుజూచినా పాలునెయ్యి
యేయిల్లుజూచినా పెరుగులూమీగడలు । వెన్నజాట్లతోను నిండియుండె
ఈరీతిగానుండి గోపిదేవియూర్చిల్లి । గొల్లవాడలుదిరిగెను
గలకుంభములన్ని కలశలన్నియు నిండె । దండిక్షీరములతోను
కలశతో ఒకవనిత జలకంబుసేయూని । యశోదకొళ్ళకడుగుటకివ్వగా
కలశలోనిరంత క్షీరంబులయిపోయి । సిగ్గుపడియాచేడె శిరసువంచె
వెన్నదిన్నాగుర్తులూ తెళ్ళజూపారమ్మ । పాల్దాగినదుత్తలాజూడరేవే
యేపాలుయేనెయ్యి యేర్పడకదిన్నాడు । నాకొడుకుముచ్చనైనిచ్చెదను
నీకొడుకుముచ్చగాడచ్యుతుల. యోగ్యుడూ । ముచ్చలముమేమువీముగుదలనిరీ
కాంతలంతాగూడి కట్నాలుయిచ్చిరీ । మళ్ళినగరికిజనెను గోపిదేవి
పులికాలుపులికరతు పాంబాగ్రిణిగుగ్గిలం । అగరుధూపములచే దృష్టిదీసి
ముద్దాడిపాలిచ్చి సతులచేతికివ్వ । గొల్లచేడియలెల్ల ముద్దుగొనిరీ
ఆదిత్యవారమున అష్టమిదినమందు । బాయకను ఈపాటపాడినావిన్నా
భక్తిముక్తులుగల్గు పరమాములుగల్గును । పాటచెప్పుడుమీరుబాయకండి

## 36 సీతాదేవి వామనగుంటాలాట.

వామనగుంటాలాడుదాము వనితజానకీ ।
పామజవరదారావయ్య నాస్వామి రాఘవా ।
ముత్యాలవామనగుంటాల పీటలుంచుకూని ।
మూగుదపీత మనమిద్దరమాడుదామటే ।
వజ్రాలవామనగుంటాల పీటలుంచుకొని ।
వనితమనమిద్దరమాడుదామటే ।
కెంపులావామనగుంటాల పీటలుంచుకొని ।

సొంపుతోమనమిద్దర మాడుదామటే ।
రత్నాలవామనగుంటాల పీటలుంచుకొని ।
రమణిసీతామనమిద్దర మాడుదామటే ।
పచ్చాలవామనగుంటాల పీటలుంచుకొని ।
పణతిఃమనమిద్దర మాడుదామటే ।
నీలాలవామనగుంటాల పీటలుంచుకొని ।
నీలవేణి మనమాడుదామటె ।
రాముడుకదలెను రత్నంపుచవికెకు రమణిసీతన గూడుకొని।
కర్ణకుండలములు కదులుచుండగాను కాకుత్స్థతిలకుడాడెను ।
పచ్చలబావిలీలుగదల పణతిజానకియాడెను ।
రెంచామునుంచాము అవులనూ సీతదీసెను ।
పసిడిడబ్బీలన్ని పందెములుగెల్చి పరమాత్ముడేదీసెను ।
చిన్నబోనుయేలనీవు చెలియజానకీ ।
విభుడుయిశ్ళన్న నందాలన్ని తానేదీసెను ।
అఖిలబ్రహ్మాండములే ఆటపీటములూ ।
పలుధర్మములచేత ప్రజలరక్షించూటె పసిడిడబ్బులూ ।
సఖియనీతో ఆటనేడుసంభ్రమాయెనే ।
ఆటచాలానికనూచెలియ పీటగట్టువిూ ।
పీటగట్టుమనిబొంకి పారిపోదురా ।
ఆటకరువైవేలుయివ్వవలె కలిగున్నవోలిఃట్టక అడుగుదాటికదలనివ్వనూ ।
విలువునిలువుమనుచు సీతఆజ్ఞచేసెనూ ।
స్వామిపైవోణిఅయిన పట్టుకుఅసెను ।
పుడమిలోనెవరయినా ఆటవోడితె ।
తానువీసమిత్తురుగావి వేలుయిత్తురా ।
నేనుగెలిచినా వోడినానీసొమ్ముగాదటే ।
నీవుగెలిచితేను నాసొమ్ముగాదటే ।
భరతలక్ష్మణాలువింటె నిన్నుగేలిచేతురే ।
నావారంతావింటే నవ్వుకొందురే ।
గాలుచాలుస ఖియ జాణవందురే ।
దొడ్డనేర్పరివందురే ।
అయితేసీతా నాచేలితో యేమిపున్నదే ।
ముప్పదిరెండువేలాదిముత్యాలుపతకాము ముగుడపుచ్చుకో ।

పదితేళ్ళున్నవి బంగారుబటువులు పణతిపుచ్చుకో ।
చంద్రకాంతులదీప్తి శోభిల్లుచున్నట్టి కిరీటమున్నదిపుచ్చుకో ।
మామగారునాగవల్లినాకిచ్చిన ముద్రికయున్నదిపుచ్చుకో ।
పడకటింటిలోన పదిలక్షలజేయుపానుపున్నదిపుచ్చుకో ।
అయితేసీతానాచేతిలోను యింకాయేమియున్నదే ।
కోసలరాజ్యమంతా కోమలియున్నది యేలుకోగదే
గొల్లదాన్నికానుస్వామి పల్లెకేగిచల్లఅమ్మను ।
అయితేసీతానాచేతిలో నింకానేమియున్నదే ।
ఏనుగులుగుర్రములు హెచ్చుందళములున్నవే ।
పురుషరాజవునీవు భూమీశుడవుగనుక యెక్కుటకునీకదగుగాని ।
యేచక్కట్లునాకేలచెప్పేరు యికమీరుస్వామి రాఘవా ।
నవ్వుకొనుచు సీతకేచిపోయెను ।
అటుగంటం స్వామిచేతికిచ్చిరి ।
చైత్రశుద్ధనవమినాడు ఓడినందుకూ ।
చిల్లరనగలన్నీదీసి సీతవోలియిచ్చేను ।
అరువైశేలుకాంతకు అరణమిచ్చేను ।
నవ్వుకొనుచుసీతతాను మాటకేగెనూ ।
కౌసల్యాదిఅత్తలంత చూచినవ్వేరి ।
భూపుత్రిమీదంపతులలో ఎవరుగెల్చిరి ।
రమణినీవువోడినావ చంద్రకోడనా ।
మీకొడుకుగడుసుగనుక డిబ్బిదీసెను ।
కానుకలందియుపుడు మీకుతెచ్చియిచ్చును ।
మాకివియేకాకకీర్తియూర్మిళనుగుడలందరు మాబావతోడు ।
గెల్పులన్ని విన్నవించుచు ।
అనగవిరునవ్వునవ్వి బావతోడి పదివేలకట్నమిచ్చేను ।
భరతశత్రుఘ్నులంత పణతిని పరిహసించిరీ
అనుచుదంపతులుకలిసి అధికసంతోషమునొందిరి ।
పుడమిలో ఈపాటబాడిన పుణ్యకాంతలు ।
సీతారాములదయనుగూడి వర్ధిల్లుచుందురు॥

# 37 శివుడు పాలారగించుట.

మహాదేవుడను పేరశివభక్తుడొకడు । ఉదయానపొరుగూరకేతెంచదలచి
పిలచెనుతనముద్దుపట్టిదగ్గరకు । పొరుగూరుకేబోయి పొలతినేవత్తూ
మాయమ్మమాతల్లి మాచిట్టిబొమ్మ । మీబొమ్మలకువెల్ల పాత్రికలుదెస్తు
కొమ్మపొరుగిళ్ళకు పోబోకుసుమ్మీ । బాలలతోగూడి కయ్యాలుదేకు
పూనినమావ్రతం తప్పబోకుండ । గుడికేగినిత్యమ్ము కుంచెడుపాలు
అనుదినంశంభునకు నైవేద్యమిమ్ము । అనివిన్నవించియూ జననిజనకుండు
తల్లివెళ్ళంగాను తరలాయెతాకీ । కాళ్ళుముఖమునుగడిగి స్నానంబుజేసి
శుచిశుభ్రమెతాను శెగనువిడిచి । గోక్షీరములన్ని మరగంగగాచి
కొలిచికుంచెడుపాలు కొలలోనుబోసి । కొలచేబూని శివుద్వారంబుజొచ్చి
పాలకొలశివుని ముందరబెట్టి । ఆరగించుమిదేవ హరహరయనిన
ఆరగించకహరుడు నుయుగునమదాగె । మరివచ్చిచూచి వామతరిగ్గకుండె
క్షీరంబుచేకొనవు యేలసర్వేశ । త్రాగుటకుచాలవాకాగనులేదా
కాటనబోయెనా మీగడలేదా । పాచైనగలిసెనా పరమాత్మదెలుపు
కొలవెలితాయెనాకుంచెమూశివ । వుట్టిమీదటికలోవున్నదినెయ్యి
అదిఅయినవడ్డింతు నీవారగించు । చిన్నటుకమీదను అరిసెలున్నవిగ
అదిఅయినవడ్డింతు నీవారగించు । పినభద్రికుజాతరవేడుకలలోన
పాయసంబెట్టింతుబంగారుతండ్రి । లోకేశ్వరునిపెళ్ళి చూడబోతాము
పాలారగింపుమీ ఓపరబ్రహ్మ । యెన్నివిధములయేడిన యేలదయరాదు
కటకటాపోయికన్నీరునించి । దిగులుపడిగరగూలి మూర్ఛలునొంద
కాలుచేతులుకొట్టి కలువరంబొంది । తెప్పిరిలితెలిసితాచప్పునలేచి
భుజియించుమని తెల్విగద్దెరచేసి । యీపాలుతాగవని మావానువింకె
చంపుదురుయికనన్ను సందేహమేల । యెప్పటికినాముప్పుతప్పదుయనుచు
యిచ్చటశిశుహత్యయిపుడుజపుదును । అనియాడుచెలిపల్కులాలించిగౌరి
కటకటశిశుహత్య మనకేలనయ్య । పాలారగించుమోపరమేశ్వరుండ
బాలభక్తికిమెచ్చి ఆసాంబశివుడు । కొలతోపాలెత్తి తానారగించె
నన్నింతచేచితివి చిన్నదాన్నగుట । కరకంతయీమాట గైకొనకున్నా
కొట్టుదునాచేతి కుంచెకోలతోను । అనిబల్కెఆకన్య యిల్లుచేరంగా
వూరికిబోయినాతల్లి దండ్రులు । యెదురుగావచ్చినా బిడ్డనుజూచి
యెదుండిన పిల్ల యెలనాగజెప్పు । బాలయొక్కడాసి అడిగ సిద్ధి
మీరుచెప్పినట్టు శివునికేపాలు । అరగింపుచేసి అమ్మయిపుడో స్థి

ఈశ్వరుడురుచొప్పట పాల్గొనుచున్నా । సక్కగబోసితివో కూలనేసితివో
ఆడేటిబాలలకు బోసినచ్చితివో । శేషయినచూతాము యీకన్యవహిమ
అనితేఁపోయుచు తెల్లవారంగ । మఱనాడుతాలేచి శివభక్తుడంత
గోక్షీరములుగాచి కొప్పెరలబోసి । బోరుననమాశ్శివు ద్వారంబుజొచ్చి
తెచ్చినఆకోల శివసన్నిధుంచి । అరగించుమిదేవ హరహరాయనగ
చిరుతబోయీవారని సన్నిధినినిల్చె । అరగించుటలేదు ఆసాంబమూర్తి
ముక్కంటిబిల్లడే ముద్దుఁగుమ్మా । లింగమూర్తియు అరగించడిప్పుడూ
ఓబాలయున్నటికి వల్లడేపాలు । ఛాట్టజీలునిన్ను పొడుతునయంచు
శిఘ్రానతనపుడు శిక్షజేయంగ । హాశివశంకరా హరహరాయనుచు
బాలస్మరియించెనూకైలాసపతిని । పార్వతీపతితన పత్రింబుతెరచి
కన్యనుభక్షించె కడపీక్రతోడ । కూతురువహాత్మ్యంబు జూచిజనకుండు
అధికదుఃఖముతోడ సతికినిదెల్పె । ఆశోకమునతల్లి వాడలుచువచ్చి
కూతురుగుణములు మదినిదంపోసి । చిత్తమ్ముఅంతాను శివునిపైనుంచి
చక్రిధరులకుతన [illegible] । బొమ్మలసాడవే నాముద్దుగుమ్మ
చెంగునారావమ్మ ఓకలాకంఠి । గుజ్జనగూడుపండు చెలులతోగూడి
నీవాడుబొమ్మలు రెవ్వరికిస్తు । పసిపుత్రిబాలాది బంగరుబునీవు
వినువిడచిమేమెట్లు జీవించగలము । సుతకుముక్తైవల్య పదవిచేకూడె
అనుచుశోకించి దంపతులుయేగ । యీపాలమంజరీ పాడినావిన్నా
పంచపక్షంబుల పఠనజేసినను । కైలాసవాసులయి ఘనముగానుందు్రి
శంకరానీపాద సన్నిధినిచేర్పు । జనులనందరిజేలు జనలోకసంద్య॥

## 38 శకుంతల సీమంతము.

దుష్యంతునిరాణికిని । దోయజగంధి శకుంతలకు
గర్భమునెన్నెలు గలిగినతోనే । కాంతకుఁపావెప్పెను కాంతులుచాలా
అన్నముయించుకతినదూ । అటలిసలు మరనదు కోరిస్వారముకఁబెదరు
కోపలి కోరునాఫలపు । ఆశ్రమవాసులగనదు ఆసించదుతానతిరసము
చింతచిగురులన గోరు । చేమంతులనటగనబోదు
పుల్లటిఫలములు గోరు । ఒల్లదునదీపనవాతి
ఓకలింతలతిఘనమాయెను । ఓర్పులకరువాయెను
సతికబట్టలెత్తుగజెట్టె । పలుమారుపవళించు
చిక్కినికంకముసన్నంబాయె । నడుములావుగా జాతియమూర

ముఖమువెల్లనై ముదితకు నొప్పె । నింతియురంబులు నింపుగ పెరిగె
ఆచందముగని చెలులూ । ఆయింతికి తామిట్లనిరి
అన్నము తినవింపుగాను । ఆకలిగాదని యేల్కొనవు
కోకిలస్వరముకె జెదరెదవు । కోరుచ మెత్తని సుపులను
అభ్రము వాసనలు లగనవు । ఆసించవు నతిరసము
ఓకిలింతలతి ఘనమాయె । ఓపిక లేకను పోయె
బట్టలు నెత్తుక బరచి । పవ్వళింతలతి ఘనమాయె
గర్భచిహ్నములివి గావా । కామిని దాచెదవేలా
చెప్పెదమిప్పుడె చేరియా । చెలగుచు నాకన్యానను
అనుచు సతులు నపహాస్యములాడి । అతివకు తామసమొచ్చె
బొబ్బరి రొట్టెలు గోరె । పాలతులు తెచ్చిరి చాలా
విప్పరి పేలాలడుగా । నింతుల వేసిరి వేగ
ఊచబియ్యమును గోరా । ఉవిదలు తెచ్చిరి చాలా
కందవడియములు గోరా । కాంతలు వేచిరి వేగ
పుల్లరేగులను గోరు । పూబోణులగన బోదు
రొండకాకలకుయింతి । నడలుటగన పూబంతి
తల్లికి జెప్పుదమనుచూ । తక్షణమె గౌతమికడకేగి
చేడెగుణంబులు జెప్పి । సెరపుమనిరి సీమంతము
రాజా వేటకై వచ్చి । రమణితో గలసిననాడె
గర్భము నిలిచెను సుతకు । కబురంపుము ఋషిసతుల
అనవిని గౌతమి వేగా । అతివను జూచెను పేరిమా
హర్షమొందుచును చాలా । అతివకు జేసెను సేవ
అమరించెను పండ్లెన్నో । తరులఫలంబులు గోసి
తరుణికియిచ్చెను చాలా । చందనతరువుకడకేగి
గంధపు చెక్కలు దా తెచ్చి । బండరాళ్ళపై రాచి
భూమిని దీసెను గంధంబు ।
అడవిపువ్వులను దెచ్చి । అతివకు దువ్వెరి తలను
గోరోజనముల దెచ్చి । గొబ్బున నుంచిరి నుదుట
పర్ణశాలయందంత । పడతులు బెట్టిరి ముగ్గులను
మామిడాకులను దెచ్చి । మగువలు గట్టిరి తోరణము
గౌతమియందరకపుడు । కబురంపెను రమ్మనుచు
సీమంతంబును చేయ । చేరిరి చెలులాతోట

ప్రేమతోయొకసతియపుడు । బెట్టెను బేలపువుండలను
ఇంతిరొక్కసతియపుడు ।
ఇచ్చెనునివ్వరిమిటుకులను । వారిరొక్కసతియచట
నయముగబెట్టెనుదుంపలను । శాకుంతలకొకకాంతి
శాకంబులుదినిపించె । పృథ్విదిసెదుయీపతికి
పుట్టెనుపట్టపురాజనుచు । మంచిమహాతజామునందు
మగువనుకూర్చోబెట్టి । ఇంపుగపాడుచుసతులు
ఇచ్చిరిమంగళహారతులు॥

## 39 శ్రీ కన్యకామ్మవారి పాట.

శ్రీరాములకు మ్రొక్కి సీతకును మ్రొక్కి ।
గణనాథునకు మ్రొక్కి శరకంటు మ్రొక్కి
మునులతో సూతుండు మును చెప్పినట్లు । కన్యకాచరితంబు కరమొప్పచుండ
చెప్పెదవినుడిమీచిత్తంబులలర । శివుడుపార్వతిపెండ్లిచేసుకువచ్చి
కయిలాసగిరియందుకరమొప్పుచుండ । కొలువుకూటమునందు కూర్చున్నవేళ
కరమొప్పసురలెల్లకామకలొసంగ ధనదునిజూచియా తరుణేందుధరుడు
దివినుండివచ్చియీదేవతలంత । కానుకలనుమన కర్పించుచుండ
భూలోకవాసులుకానుకలుమనకు । తేకున్నహేతువదెల్పుమనియనగ
తారకాసురభీతితరలిదిక్కులకు । పారిరిజ్ఞానులౌ వైశ్యులులేక
కానుకలురాకుండె గౌరీశయనగ । నీకుండుధనదుతో నిట్లనిపలికె
వాణిజ్యగోపరిపాలనాదులను । వ్యవహారములనిచ్చి యవనిసుశాలి
గంధర్వవరులచేగనిరిశాపములు । అతిమదిసెరిగి శశాంకధరుండు
వైశ్యులభూలోకవాసులజేసి । ధనకనకాదులు దద్దయునొసగి
వస్తువాహనధాన్య బహుమతినొసగి । రత్నపరిమెళాదిపరీక్షలనొసగి
క్రయవిక్రయంబులనయబుద్ధినొసగి । రమ్యనగానందరాజ్యలాలించి
రక్షించుమమ్ముదేవయక్షరాణ్మిత్ర । యనిశంకరునివేడ నభయంబొసంగి
అతిసంతోషమునమందుడనశంభుడనిరొ । మరికొంతకాలంబు జరిగినవెనుక
వైశ్యులుశివద్వారపాలకులయియుండ । వానిఘోరగను దూర్వాసమునివచ్చి
హరునిదర్శింపబోనాటంకపరుప । రోషంబుచేగొప్ప శాపంబొసంగ
సూపుడుమునీంద్రునకాసనంబిచ్చి । రోషంబువారించికూర్చుండబెట్టె

బ్రహ్మాదిదేవతలు భవునిదర్శింప । వచ్చినవారికినిచి పీఠములు
కొలువుననుండియాకోమట్లజూచి । బహుశాపములమీరుపతితులయియుంట
కైలాససుఖమునకర్హులుకారు । భూలోకమునకేగి పుణ్యాత్ములగుచు
శాపములన్నియు బాపుకొనిమీరు । శుద్ధులయికైలాస సుఖ మొందుదనిన
వినివైశ్యులందరు వెతజెందివేడ । కరుణించిచెప్పెనా కైలాసపతియు
భూలోకమునమీరు పుట్టినవెనుక । నగరేశ్వరుండను నామంబుచేత
అచ్చటవెలసి మిమ్మాదరించెదను । శ్రీగౌరి వింధ్యవాసినియనుపేర
వెలసియిష్టార్థములనిచ్చుచునుందు । అన విని నారాయణుని జేరి మ్రొక్క
పార్వతీనాథుడు పల్కినరీతి । భూలోకమున మీరు పొలుపారుచుండ
ధరణిమీపురిజనార్దనుడనవెలసి । శిరిగూడిమిమ్మురక్షించుచుండెదను
అనవినివైశ్యులత్యానందమంది । విష్ణుదేవునిపాదనివేడుచునుండ
వైశ్యులనుజూచియావాసుదేవుండు । వసుమతికిప్పుడుబోవకతప్పదనుచు
భూలోకమునమీరు బుట్టినవెనుక । జగతినిభాస్కరాచార్యుడనంగ
కోమట్లకెల్లనుగురువయిపుట్టి । ధర్మశాస్త్రంబులుదగుబోధపరచి
పిదపకైలాసపదవిత్తుననగ । ఈశ్వరునాజ్ఞచేవిలనుదయింప
నారదమునియొక్కనాడువైశ్యులను । జూడవచ్చిన గని శుభమమాకనుచు
నర్ఘ్యపాద్యములిచ్చి యామునికిమ్రొక్కి । వారికష్టంబులువరుసతోదెల్ప
మునినాథసుశ్రేత్రియొక్కటిదెల్పు । మనమునిహిమగిరికతిసమీపమున
ఘనవశిష్టాశ్రమమున కామధేనువర । గర్భమందొక్కవత్సరంబున్న
కుడిచెవిలోనుంచి వడిపురుషగణము । వామకర్ణంబున వనితాగణంబు
బుట్టుదురందునపూతాత్ములనుచు । దెల్పినారదముని దివికేగుదెంచె
నారదవాక్యానుసారంబుగాను । హిమగిరివసిష్టాశ్రమముజేరి
కామధేనువుగర్భంబులోన । వసియించిబుట్టిరి చెవులలోనుంచి
వరకుబేరునిగూడి వనజగర్భుండు । పుష్పకంబెక్కి యాభూమికేతెంచి
ఆబాలురకు జాతకాదులొనరించి । వుపనయనాదుల నొప్పగాజేసి
అరదంబుపయిజేర్చి ఆబాలకులను । తీరగుగౌతమీ తీరంబుజేర్చె
అరుదగుపెనుగొండయను పురమొకటిగల్పించె ।
ధనకనకసంపదల నలకపురముకన్న చోద్యంబుమైనట్టిపురము
మణిమయసౌధాళి మహితవనాళి । భూలోకవైకుంఠ పురమనదనరె
వర్ణింపశేషుని వశముగాదనగ । దీనికిసన్నిధి దివ్యమానట్టి
ఘనపురంబులు పదునెనిమిదిగాగ । విశ్వకర్మసృజించె వేడుకతోను
వరజగన్నాథాఖ్య పురమాదిగాగ । గ్రాసంబునకునిచ్చెకమలోద్భవుండు

పాలు పొరు పెనుగొండ పురములోపలను । శ్రీవింధ్యవాసినిశ్రీనగరేశు
లనకోనక కులజనార్ధనులనగ । వెలయు దేవతల కోవెలలు గట్టించి
సకలోత్సవంబులు జరుపుచునుండి । భైరవాదుల నెల్ల భక్తిపూజించి
వ్యవహారముల యందు వాసిదప్పకను । దానధర్మంబులు మానకెప్పుడును
ముదమున పెనుగొండ పురవాసులయిరి । అపుడు కాలంకాయనాఖ్యమునికిని
మొక్కిధర్మంబులు చక్కగా విల్పి । కుసుమశెట్టి యనంగ కోమటియొకడు
ఈశ్వరారాధనయుంపారసేయ । నీకుంక పుత్రకామేష్టిసేయుంగ
పుత్రులుపుత్రికలు బుట్టెదనరగ । పుత్రులుగలిగిన పున్నరకమెడలు
లేకున్నగతులు లేవందురియులను । యనికుసుమాంబిక తనపతికి మొక్కి
బహుచింతగుందిన భార్యనుజూచి । భూరిధర్మంబులు బోధించిచెప్పె
పూర్వజన్మంబున పుణ్యంబులేమి । నేనికిప్పుడు నిట్లు చింతింపనేల
పూర్వజన్మంబున పుణ్యమేమయిన । జేసియుండితిమేని సిద్ధింపకున్నె
పుత్రికామేష్టిచే భూతేశుగొలచి । ప్రార్థించగానిచ్చునడత పుత్రులను
యనిపుత్రికామేష్టి ఆరంభింపంగ । పరమేశుడప్పుడీయనితనుజూచి
వనజాక్షిభువినొక్క వైశ్యకులమందు । పుత్రులకోరుచు పుత్రికామేష్టి
చేయుచునున్నాడు శీఘ్రంబునేగి । పుత్రులనిమ్మని పురవాసుండనిన
గౌరిపుడమికివచ్చి కరుణవైశ్యునకు । ప్రత్యక్షముగనున్న పదములకు మ్రొక్కి
దీనులయివేడగా దేవియిట్లనియె । కొడుకులు కూతుండ్రు కులముద్ధరింప
గల్గుదురని వరంబులునిచ్చెననియె । బ్రహ్మదులను భక్తిపూజించి
విప్రోత్తములకిచ్చె వివిధదానములు । వారుడు గౌరియు కుసుమాంబగర్భమున
కరుణతో కవలలుగా నుద్భవింప । బ్రాహ్మణులను పిలచి వైశ్యోత్తముండు
జాతకర్మాదులు జరిగించియువల । విద్దెబుద్ధులు నేర్పి వృద్ధిబొందంగ
అపుడు కన్యకకు పరిణయముసేయదలచి । జతనంబు సేయు వాసనుయంబునందు
ఆటశౌనకాదులకా సూతసూతి । చెప్పినరీతిగా జెప్పదవినుడు
ఘనుడు కాలంకాయన మునీశ్వరుండు । విష్ణువర్ధనుకథ విశదంబుగాను
వంశక్రియంబునువర్ణించెనపుడు । ఆనవిమార్కండేయమహాముని ఆశ్రమంబరన
రాజమండ్రంబనుపురము నేలెడు । రాజనరేంద్రుడుగర్భమున
వైశ్యశాపంబున వరచిత్రకంఠు । డనెడుగంధర్వుడు యవతారమొంది
విష్ణువర్ధనుడనవిఖ్యాతినొంది । రాజమహేంద్రాఖ్య రమ్యపట్టణము
తనరాజధానిగా దగనేలుకొనుచు । కులధర్మములనెల్ల కొదువలేకుండ
కొమరొప్పపల్పుచు కొలువుపొగించి । మంత్రితోనిట్లనుమనుజేశ్వరులను
రోనిమిదివాళ్ళకు యేతెంచునటుల । రావించుమనిన యారాజాజ్ఞ తటుల

పంపించిచాటింప పదివేలన్నృపులు । సకలాయుధంబుల సంహతితోను
జనుదెంచియుండగారాజగధీశ్వరుండు । చతురంగబలముతో చనుదెంచి యపుడు
విఖ్యాతిసర్వదిగ్విజయంబుజేసి । తీర్థయాత్రలనెల్ల తిరిగిసేవించి
రాజమహేంద్రి పురంబుతాజేరి । పెనుగొండమహిమంబు విష్ణువర్ధనుడు
వర్ణింపుమనుచుఆవైశ్యులువచ్చి । విష్ణువర్ధనునకు వినుతులునేసి
అంతకుసుమశెట్టి యనువైశ్యకుండు । సకలభూషణములు కానుకలిచ్చి వేడి
పెనుగొండకువేంచేయ పెద్దగాకోర । పెనుగొండకేతెంచి వినయంబుతోను
శివకేశవులభక్తి సేవించిరాజు । ఆకుసుమశెట్టియొక్కాత్మజజూచి
అతిమోహమున విరహాగ్నిలోమునగ । అదిగనుగొనిమంత్రియారాజుతోను
వాసవియనుకన్యకోప బుమారు । ఆశజెందితివింత కతిచింతయేల
ఆకన్యదెచ్చిమీకర్పింతుననియు । అనికుసుమశెట్టినిమంత్రిగాంచంబొప్ప
వాసవియనుకన్య వనజాతాక్షి । విష్ణువర్ధనునకు వేడ్కనిమ్మనిన
కుసుమశెట్టియు బహుకోపంబుతోను । వైశ్యకులోత్పన్న వాసవిమిన్న
ధరనురాజులకీయ తరముగాదన్న । అనిపల్కవిష్ణువర్ధనమహారాజు
పటురోషమున పెండ్లియిద్దనిపల్కె । అప్పుడుకోమటులతిభీతిజెంది
ప్రభువులకోపంబు ప్రళయకాలంబు । ఆలినిచ్చినమనకపకీర్తివచ్చు
నియ్యకున్నబ్రతుకనియ్యడీరాజు । వైశ్యులవెల్లనువసుమతిలోన
వెతకిచంపించునీవిష్ణువర్ధనుడు । కోమటులపుడగ్నిగుండమేర్పరచి
చూడదోవవాసవి తరలాక్షిజూచి । తనతండ్రితోడనిట్లనిచెప్పదొడగె
పరమునచేనీనీకూతురనయితిగాని । ఆదిశక్తినిదేవతారాధ్యనేను
రూఢిగానాదిజరూపంబునీకు । జూపింతుననివిశ్వరూపంబుజూపె
ఆరూపమునుజూచి యతిభీతినొంది । చేతులుమోడ్చినిచ్చేష్టుడైయుండ
ఆవిశ్వరూపంబునపుడుచాలించి । వాసవిరూపంబువనజాక్షిదాల్చి
జనకునితోగూడ సభకురాజూచి । మెండుగానానూటరెండుగోత్రముల
వారుభార్యలతోడ వచ్చిరాసభకు । సభలోన భాస్కరాచార్యులకుమ్రొక్కి
చిన్నబోయానకుసుమ శెట్టిముఖంబు । కూతురుభావమెటులున్నదోచెప్పుమీ
యిప్పుడువీరితో నిప్పులోబడగ । నొప్పునోయొప్పదో యుప్పతియనగ
మిన్నకతనతండ్రి యున్నసమయమున । తనవిశ్వరూపంబుతండ్రికిజూప
ఆశ్చర్యమునవైశ్యులందరునులింప । విశదంబుగాతనవృత్తాంతమెల్ల
దెలిపెనునగరాలకును తేటపడగ । తగనూటరెండుగోత్రజులరావించి
కోరినవరములుం కొమరొప్పనొసగి । యొప్పటికన్యయైయెదుటనునిలచె
గురువులుతమశిష్యకూటంబుగాంచి । నిలనుమేరినకంబులివ్వనివారు

తెలుపన థోలోకములు జెందగలరు । అప్పుడు మాండవ్యమహామునీంద్రుడు
వాకన్యకప్పుడు మేనరికంబు వ్రాసె । తనమాగుకూతురు తగదనతలంచి
అన్యకన్యల పెండ్లి యాడంగరాదు । తెలియక వరియించితే పాపమగును
తల్లిగా భావింపదగు నన్యకన్య । యనుచు సగరాలకు నన్నిధర్మములు
వర్ణాశ్రమాచారపద్ధతులు దెల్ప । నపుడు శాలంకాయనాఖ్యుతాపసుడు
శిష్యసంఘంబుతో చెలగి మచ్చి । సభను వెంచేయ వైశ్యాగ్రణుల్ మ్రొక్కి
యుచితాసనంబులనుంచి పూజించి । విష్ణువర్ధనుభావమును చెప్పి
అగ్నిప్రవేశప్రయత్నంబు దెల్ప । శ్రీ కృతిగోత్రప్రవరలు దెల్పుచును
భూసురశాపంబు బోవుట కొరకు । వహ్నిగుండంబులో బడిన మీకెల్ల
కైలాసవాసంబు గలుగును మీకు । అని చెప్పి బ్రాహ్మణుండాశ్రమంబేగ
గరిమతో వైశ్యులు గురువును గాంచి । మమీద కరుణంబ్రమాస వేడుకొనగ
కుసుమశెట్టియు నగ్నిగుండమేర్పర । భిలవారణ పెన భృత్యవరుల నింపించె
అతడేగిన గరేశు అలయంబెదుట । ముఖ్యాగ్నిగుండంబు ముందుగ గల్పించి
మహనీయవాసవాంబకు పెండ్లియనుచు । వాటించి చెప్పిన పాటి తెరవులను
పెంపుమువాలాతనంబు పెంపారనునిచి । పరిణయోచితవయి నవరశానుకలను
శుభలేఖలను చాల సొంపుగా వ్రాసి । రేపటిరోజున రేడేగుదెంచు
వాసవాంబకు పెండ్లి జేసెదమనగా । వైశ్యాధారి నిసేదువారములందు
వరుసగా పూజింపవలయునటంచు । విరివియాగవనంబు విడిదిగా నిల్పి
హితుడైన తన పురోహితుని బంపించె । అవ్వ సఖీమాయ నందుమాయి మరచి
యేమి దెలియక నతడేమరివుండె । అప్పుడా వాసవి భ్యంజనము చేసి
నీరొత్తిరి చెలులందరు గూడి । కురులు నున్నగ దువ్వి కొప్పుగా ముడచి
నుదుటను తిలకంబు నొనరంగ దిద్ది । నఖశిఖాంతము భూషణములను బెట్టి
తమాతమాలాడుచు తల్లి యిట్లనియె । వాసవి మాతల్లి వరమున గంటి
నీముద్దుముచ్చట లేమినేగంటి । కోవ నిక్కెట్లు గుండంబులోన
పడద్రోయనగునమ్మ పద్మాయతాక్షి । అని విలపించుచు రాజాను పెనుగొండ
లలితాంగి నీకింత లావణ్యమేల । వేర్వేరు బొమ్మల పెండ్లిండ్లు చేయ
నెవ్వరు మాయింట సిభరాజగమన । చిలుకల పలుకులు చెప్పు నెవ్వారు
రెన్ని నోములు నోచి నోచియే నాట్లు గంటి । నెలతలందరు నన్ను మెత్తురనుకొంటి
పైడిగిన్నెలలోన పాలు నెయిబోసి । పంచదార యొకింత మించగా వేసి
బహువిధంబుల బోలపాడి త్రాగింతు । నీముద్దుపలుకులు సింపుగా వినుచు
పాలతి నీబుద్ధులకలరుచునంటి । వ్రతముల కెల్ల సఫలమింతగలిగె
పుత్రికా వేష్టి జపాలతి శంకరుడు । వినుమా కునిచ్చెన తనయను జేసి

కలికితొమ్మిదినెలలుకడుపులోమోసి । పెంచినసందరి విడచిపోదగునే
నీముద్దుమోమునెప్పుడుచూతుననుచు । పొంగుచునుంటినోబంగారుతల్లి
అగ్నికీలలకట్లుఅప్పగించెదను । బ్రహ్మవిష్ణాదులు యీపాటువినిన
రెవరుచెప్పెద మూకేది త్రోవమ్మ । అంతవిరూపాక్షుడాకన్యజూచి
యేలపుట్టితివి మాయింటనోయమ్మ । అనివిలపించుచున్నట్టిసమయమున
తననిజరూపంబు తల్లికినిచూపె । కనులచూడగలేక కాంతలందరును
కనులుమూసుకొనంగకన్యయయినిలచె । కుసుమశెట్టియునెల్లకోమట్లుగూడి
తగువారితోగూడనూరెగగుండములు । యెవ్వరెవ్వరికేదియేదియటంచు
మండుచున్నట్టిగుండములలోన । శిఖిజ్వాలలెల్లకొనిచెలరేగుచుండ
పరవిజొచ్చినవహ్నిచల్లనయియుండె। అందులోనుప్రధానమయినగుండమున
పరమేశ్వరధ్యాన పరవశమయిన । వాసవియనుకన్యవహ్నిపయినలిగె
యామెకోపమునకు యనలుండుజడిసి । ప్రత్యక్షమయివాసవాంబకిట్లనియె
యిటువంటిఘనుల నేనెట్లుదహింతు । దహియింపదురితంబుతప్పనేయనగా
చేతులుజోడించి చిచ్చులోయుంచి । బయటకువచ్చిన వైశ్యులచూచి
మీయందుదయచేతనిమ్మగాల్పకను । యుండితిగాని వాయుగ్రతగనుడు
యనుచుభగభగమంటలాకాశమంట । వైశ్యులందరుతమవనితలతోడ
భూషణంబులుదాల్చిపాలుపారుచుండ । కుసుమాంబమొదలగుకోమటిసతులు
ఆకన్యకాంబకు అభ్యంజముజేసి । సాంబ్రాణిధూపంబుజక్కగాజేసి
పచ్చకర్పూరాది పరిమళములొసగి । మండుచుండెడు అగ్నిగుండములుజేరి
వలగొనిమ్రొక్కిరు వహ్నిపడబోవ । కలగిసాగరములు కలుషములయ్యె
చుక్కలుదివినుండి మిక్కిలిగరాలె । సూర్యచంద్రాగ్నులు సూటులుదప్పె
పరమేశుడంతటప్రత్యక్షమయిన । శ్రీవాసవాంబికశితికంఠుచూచి
తగునూటరెండు గోత్రజులయినవారు । సౌఖ్యసుఖంబిచ్చి రక్షింపుమనిన
వసుధయందిష్టంబువచ్చినన్నాళ్ళు । మోదించికైలాసమునకు రమ్మనియె
వాసవాంబచ్చట వైశ్యులజూచి । యచ్చటనుండిమీరిండ్లకుచేరి
కన్యకాంబనొక్క కలశమేర్పరచి । భక్తికాలంకాయనోక్తమంత్రముల
పూజింపగామీరు పుత్రపౌత్రాది । వివిధసంపదలచే వృద్ధిపొందెదరు
కోమటులారామీకులమందుబుట్టు । కూతులెల్ల కురూపవతులగుదురిలను
యనిశాపముపెట్టె నావాసవాంబ । ఆమాటవినివైశ్యులతిచింతగనిరి
పరమేశుడావాసవాంబనుబట్టి । మహనీయమయినట్టి మధ్యగుండమున
చొరబడనంతలోజూచికోమటులు । తమగుండములయందుతమరు దొరబడగ
పుష్పవర్షముగురిసెపాలుపారనపుడు । వానవాదులనిష్టవరములనిడిరి

ముదముతో కయిలాసపురమునకేగి । హరునిగొల్చి మనఖండానందులయిరి
భువిబాలనగరులుఁజదుఃఖమొంద । గురుడువారలమదిగుదురబోధించె
వీరలదుఃఖముల్విని గాఢభటులు । వృత్తాంతమంతయు నిభీతినొంది
విష్ణువర్ధనునకు వేగదెల్పుటకు । రాజమహేంద్రవరము చేరంగరాగ
కరమువిహారించ్చగలవారుగాన । రాజాపెనుగొండకు రాబయలుదేర
చాకలజూచి రాజతికోపమునను । పెనుగొండవిడచివచ్చిన హేతువడుగ
కుసుమకోమలికన్యకోట్టుగూడి । చిచ్చులోజొచ్చెనని చెప్పగానపరి
కాలమృత్యువుబోలు కూలంబువాల్చి । వేలకొలదులతలగూలంగవేసె
ఆపార్వతీకృపను శాపంబుబోవ । గంధర్వరూపంబుకరమొప్పదాల్చి
బాలనగరులను చేపట్టికదలించి । వీరలందరవెంటబెట్టుకొని తాను
కాశిగయాప్రయాగలుపుణ్యనదుల । క్షేత్రంబులన్నియు సేవించియచట
చేయించెనతడు విశేషదానములు । పితృదేవతులకు సంప్రీతిజేయించి
తగనుద్దీపించి యంతర్ధానమొందె । తగవాతవిష్ణువర్ధనకుమారుండు
జనకునిసంగతివిని చింతజెంది । కులగురుడౌధౌమ్యుబిల్పించివేగ
పితృకార్యమంతయునతిభక్తిజేసి । తనపరివారంబుతో పెనుగొండవచ్చి
బాలనగరులనెల్లనిట్లప్రార్థింప । నన్నురక్షింపుడు నారాజ్యమందు
అర్ధరాజ్యమును మీకర్పింతుననిన వినుపించుకొనకయున్నను వారిజూచి
మీకిచ్చురాజ్యంబుచేకొనకున్న । నిపుడుప్రాణములు మీకొప్పింతుననగ
కరుణతో బాలనాగరులాలకించి । కన్యకాంబకునుతుల్ కావింపదేవి
ప్రత్యక్షమాసప్తరాత్రింబులు । నీతిశాస్త్రములన్నియును బోధపరచి
నిజరూపమునతానునిలచిదీవించి । నిరాజసుతుడిచ్చినరాజ్యమర్ధంబు
నాకుపట్టాభిషేకంబుగావించి । విరూపాక్షు గావింపుడనిన
మార్కండభాస్కరుడు । మొదలుగాగలమునులుమోదంబుతోను
కన్యకాంబకుగట్టిరపుడుపట్నంబు । భక్తితోకన్యకాచరితంబువినిన
వ్రాసినచదివినపరమేశ్వరులు । భుక్తిముక్తులనిచ్చిబ్రోతురుగాక

## 40 సుభద్రసారె.

చిత్రింపుపాంకోళ్ళురత్నబొగడల్లూ । అర్జునుడుందొడిగెవేళపడకటింట్లో
నడుమువాలుగుడికలునవరత్నసేత । తలాపిదిక్కునాతామరశేబెట్టి
పాన్పుమీదపవళించె పద్మనాభుడు । అకిదుగోపోకిదుగో అడకత్తెరదుగో
మునసంపుకాయిదుగో చుట్టియున్నదేమే । ఆకేలపోకేలఅడకత్తెరేల

కున్నంపురాయేల చుట్టియ్యనేలా । అనగపార్ధుడువవ్వి అతివకిట్లనెనూ
పున్నమ్మనాడయిన బూరెలొండుకుని । పుణ్యుడారమ్మనిపిల్చిరెమివాళ్ళు
అమావాస్యనాడయిన అట్లువండుకొని । అల్లుడారమ్మనిపిల్చిరెమివాళ్ళు
కనుమునాడయినాను గారెలొండుకొని । కొమడారమ్మనిపిల్చిరెమివాళ్ళు
మావాళ్ళుపేదవాళ్ళుమాకేమికలదు । పెట్టగలపెద్దింటపెండ్లాడితేను
అచ్చటలుముచ్చటలు అన్నియునుజరుగు । అతివపక్కుఁలువిరిగుడ్లెర్రజేసి
ఎడమమీసందువ్వి పాంకోళ్ళుమెట్టి । పాంకోళ్ళతోదన్నిపక్కుఁననవ్వ
ఘూలుఘూలుమనిగోడపైకెరిగి । ఇంటిసామ్ముతీసి భరిణెలనుంచి
మాసినబట్టగట్టినుకుసులువిప్పి । మువ్వలాముద్దున్నిచంకబెట్టికొని
గంటలాబొల్లుచెట్టపట్టుకొని వెళ్ళేనే । సూభద్రఅన్నవాకలకు
వాకిట్లవారన్నదిదురకయనించె । అంతిపురికునివదినెరొయిగురునవచ్చి
ఆడబిడ్డనుజూచిఅతిజాలిజెంది । నిద్రపోతున్నావునీలవర్ణుండ
నీచెల్లెలువచ్చిందినిద్రలేవయ్యా । నాముద్దుచెల్లెలాయే మెసుభద్రా
రేమనువుంటెంగగుర్రాలుండంగ । హాదాలువుండగాపల్లకీలుండ
బంటులావుండంగ బానిసలుండంగ । కాలినడకలతోనుఒంటరిగనీవు
విడిబడివచ్చుటకునగరద్దమేమె । పున్నమ్మనాడయినబూరెలొండుకొని
పుణ్యుడారమ్మనిపిల్చిరేమీవాళ్ళు । అమావాస్యనాడయినఅట్లువండుకొని
అల్లుడారమ్మనిపిలిచిరెమీవాళ్ళు । కనుమునాడయినానుగారెలొండుకొని
కామడారమ్మనిపిల్చిరెమివాళ్ళు। పుల్లవిరుపుమాటలాడిపురుషుమావన్న
గుడ్లెర్రగాజేసిచూదాలదన్నె । మాటలుచునువస్త్రీనీఅన్నామీకడకు
చెల్లెలనువోదార్చి చేరంగదీసి । కంటతడిబెట్టకుమికాంతరోనీవు
దండెమునావున్నాయి కొత్తచీరేలు । యిదుగోనెచెల్లెలా నీకుఅరణమ్ము
పెట్టెలోవున్నాయిపట్టుచీరేలు యి॥ చె॥
గూట్లోనువున్నావి గుండుగిన్నెలను యి॥ చె॥
అటుకుమీదనువున్నవి అంచుబిందెలు యి॥ చె॥
భరిణెల్లోవున్నాయి పతకముల పేర్లు యి॥ చె॥
సావిట్లోవున్నాయి కావడిపెట్టెల్లు యి॥ చె॥
రత్నాలకోళ్ళది పట్టెమంచమ్ము । ముత్యాలజాలరుపచ్చలదోమతెర ॥యి॥చె
వారంపుసామ్ములు । మందసమునుండె యి॥ చె॥
శాపాలుభామాలు । బానిసలుయుండేర యి॥ చె॥
అనుచువిష్ణుడుయిచ్చి సతులకడపంపె । పెదయింటిపెదవదినెపోయివచ్చెదను
పోయిమీఅత్తింట బుద్ధిగలిగుండు । చిన్నింటిచినవదినెపోయివచ్చెదను

పోయిమీఅత్తింట బుద్ధిగలిగుండు । మారిపెంపుముద్దువదినెపోయివచ్చెదను
పోయికోడకనిగని రొత్తుకొనిరమ్మి । బుద్ధిగలముద్దువదినెపోయివచ్చెదను
ముద్దులాబాలుడిరొత్తుకొనిరమ్మి । చిన్నోదినావదినెపోయివచ్చెదను
చిత్రాంగిబాలుని రొత్తుకొనిరమ్మి । పెద్దదిమావదినెపోయివచ్చెదనూ
యిల్లూవిడిచుకపొమ్ము రామముద్దుగుమ్మ । యింటివాసాలన్ని బండిపైవే
యుంజారువాసాలముట్టించిపొమ్మి । యెండినధాన్యమ్మురొత్తుకొనిపొమ్ము
పండినపంటకము కట్టుకొనిపొమ్మి । కాళ్ళమట్టెకోడు దీసుకొనిపొమ్మి
కట్టుకొనుబట్టయున ఒకటియుంచకము । అనినగుజదుజలాడిఅతిపదుఃఖించి
అన్నరో వింటిరా అలిమాటలను । కొన్నబాసలంటే కొదువేమిటనకు
మనఅమ్మకొన్నది మాయమందరను । పదవేమోసుభద్రాపంపేవత్తును
పల్లకియెక్కించి పరమాత్ముడప్పుడు । నవరత్నాభరణాలు పట్టుమంచములు
ఆవులుఆశ్వాలు మేలందానములు । కాపాలుబానిసలు కలవియున్నియును
కానుకలుగాయిచ్చి కవలాతుడంపె । సిరిసంపదలుగల్గి స్థిరముగానుండి
అర్జునుడుసుభద్రాయులవితోనుండె । ధరణిలోగలయట్టిదంపతులంతపాట
పాడినవిన్న ప్రిబలులయియుందుర్రి॥

## 41 ప్రయాగదళము.

గ్రక్కునప్రయాగపట్నము కాంచిరివార్షములోన ।
చక్కగపాగిదండప్రణామంబులు సమర్పించి ।
ఎక్కుజన్మములురొత్తి యెక్కువయినభాగ్యములు ।
చక్కనిభాగీరధితల్లిని నేబోడగంటి ।
జన్మపావనమాయెను భాగీరధిదర్శించినమాత్రమున ।
అక్షయంబగుపుణ్యములు అమరపతి మాకొసగాగంటిని ।
త్రివేణి భాగీరధిగంటిని సరస్వతియమునాకంటిని ।
బిందుమాధవుల కన్నులపండుగానుకంటిని .
భాగీరధీవైభవములు వైకుంటములోన ।
పసుపులుకుంకుమకాటుక పరిమళద్రవ్యములు ।
పద్మాక్షులుపూజంతురు భాగీరధీదేవమ్మను ।
పొమ్ములుచీరలు రవికెలు ఘుమ్మను గంధపుష్పములు ।
కోమ్మనీకిదికానుకనుమ్మా । భాగీరదమ్మాగైకొమ్మా
మేలయినభూషణములు పాడిమితోధరియించి ।
పాతకమయిన! త్రివేణి పాదమ్ములు సేవించి ।

కాళింగుమర్దనమిది కడుతీర్థములోయనుచు ।
కమలాక్షుడుజేసెను దశాశ్వమేధయాగములు ।
ఆహోయీకోలనుకు పడమరదక్షిణాంబుధనుచు ।
అలివేణులుగూడుకునీ అందరుకదులుచునూ ।
సుదతికితూర్పుదిక్కున దూసిపట్టణమనగా ।
పణతికిపడమరదిక్కున ప్రయాగపట్టణమనగా ।
తరుణికిదక్షిణదిక్కున రామేశ్వరమనగా ।
సువిదకునుత్తరదిక్కున కాశీపట్టణమనగా ।
అవినాలుగుపట్నంబులుఅమరించెనుకమలజుడు ।
శ్రీమదమ్మనేతెంచిప్రయాగస్నానముజేసి ।
నీమముతోచనుతెంచిరి భాగీరధిస్నానముకు ।
మందరగిరివరునిగొనియాడుచు మహాదేవులబొగడుచును ।
పొందుగదివ్యవిమానమందుకుని హర్షంబుతోను ।
అందమయినపల్లకీలు అందమయినరధములను ।
పొందుగకొల్లరిబండ్ల సందడితోనడువగను ।
అశ్వములుగజములు అమరినలోటిటలరా ।
విశ్వమ్ములోచనుదెంచిరి వివరమ్ముగకాశికినీ ।
కాశీపట్నములోనా భాసురముగప్రవేశించి ।
గంగాస్నానముజేసి మంగళగౌరినిపూజించి
విశ్వనాధునిఅన్నపూర్ణను అందముగమొక్కి ।
అండజవాహనుడైన దండపాణినిసేవించి ।
నిండినవేడుకతోను గణపతినిబూజించి భాగీరధీనదుమను ।
అందముగలవారికృందప్రస్తంభంగంటి ।
పాపమ్ములుబాయవలెనని పంచక్రోశందిరిగితినీ ।
ముక్తిమండపంరొక్కి త్రిమూర్తులకెదురుగనిల్చి ।
సత్తులుజల్లుచుప్రజలు సరగునగయకేతెంచి ।
వటవృక్షముదర్శించి నటభోజనములుబెట్టి ।
వైతరణీగోదానము వైభవముతోనేయుచును ।
తిలతర్పణమ్ములు విడచిరిద్రవ్యములతోను ।
పితృదేవతలకు పిండములుంచిరి వేదమంత్రములతోను ।
తీర్థవిధోప్యగబెట్టి దీపారాధనజేసి గదాధరునేవించికదలిరి ।
జగన్నాధమునకు దరిసించిపురుషోత్తము రారోజగన్నాధమునకను మా

మూరియుచు తమ కావళ్ళు మూపులపై బెట్టుకుని ।
గోవిందలు బాడుచు కదలిరి గోదావరినదికి ।
గోదావరిస్నానము జేసి యుదకము కొప్పెర్లను బట్టి ।
గోదానంబులు భూదానంబులు కోపారోప్పగ జేసి ।
సప్తసాగర సంగమంబులకు సరవితో డజేర ।
స్నానమ్ములు జేసి సిద్ధుల మఠముల చిత్రవిచిత్రము జూచి ।
సిద్ధుల కైలాసంజని బుద్ధినిడలపోయుచును ।
క్షేత్రపుపోష్యములుండి నవనందుల సేవించి ।
తిరుమలకొండకుజని వేంకటేశునిజూచి ।
తిరుపతులు తిరుమంటపమ్ములు । దేవాలయములు జూచి
కాళహస్తికిజని కాళహస్తీశ్వరుని జూచి ।
కుంభకోణమును కామేజని కుంభేశుని జూచి ।
కావేరితీరముజని స్నానమున జేసి కావేటిరంగని సేవించి ।
వింజిల్లుచు రామేశ్వరమునకు రభసముతో జనిరి ।
దశరథరాములపాసగాక కట్టిన సేతువులోను ।
ధనుష్కోటిలో స్నానము జేసి । సేతుమాధవుడు రావలింగనికి
నామమంత్రములతోను । గంగయుదకము అభిషేకము జేసి
పిండివంటలు పేరిన నేతులు । పాయసాన్నములతో దండిగ
రాజాన్నంబులు తమరంతా సమర్పింతు । జేజే శంఖురురాణి
జేజే ఓభవురాణి । యనిపాడుచు నచ్చిరి మధుర పురమునకు
మధురాపురమునకు జేరి మీనాక్షిని సేవించి । యీశ్వరు నిదర్శించి
కాంచీపురమునకు జని యా కామాక్షమ్మను జూచి । శ్రీశయిలంబునకు జని
మల్లిఖార్జున భ్రమరాంబల పూజించి ।
దక్షిణవాటికకు జని భీమేశ్వరుని । మాణిక్యాంబను జూచి
పీఠికాపురికే జనియు । పాదగయ స్నానము జేసి
కుక్కుటేశ్వర కుంతీమాధవు జూచి । రాజేశ్వరలక్ష్మికి నమస్కరించి
బెజవాడేగి కనకదుర్గతల్లిని సేవించి ।
యాత్రలు పూర్తి జేసుకు మరలిరి । సంతోషముగాను యిండ్లకు జేరి
బంధువులు ప్రియులు హితులు గూడకొని । కాలభయిరవుని సంతర్పణ జేసి
గంగపూజ జేసి బాజ భజంత్రీలు । బాకాలోళ్ళతో డగంగాకయారాగంబు జేసి
సుఖముగనుండిరి సుందరాంగులెల్ల । బాయికయూపాటబాడిన యింతులకెల్ల
పరమేశ్వరు డిచ్చును కైవల్యపదవి । కడు సంతోషముతోడ

# 42 తిరుమంత్రము.

హరిహరిరామానుజా నీమతమందు నమ్మినహరిదాసునీ
హరిహరిభూములందూ యీవనమందు దిరుమంత్రముకొరకై
భూములన్నియూ తిరిగితీ మంత్రోపదేశముకొఱకు బుద్ధిమిముకూడితి
యిమ్మనిమీవెంటను అలసటలేక వెదకివెదకితిరిగితీ
గోవత్సస్థలమందునా ఆచార్యులు దాహము తెమ్మనెను
అటుయిటువెదకిచూచి జలమందక యిదియేమిచోద్యమనుచు
ఆకాశమందుజూచి అయిదు తుంబవీధిని వెళ్ళగా
రొంగపిపోయెంత్తులా మీరెళ్ళేటి జలమున్నస్థలమేదయా
వినవయ్యహరిదాసుడా మేమెళ్ళేటి నీడదప్పికరానయా
పయినపక్షులువెళ్ళగా నీడనవీచి కొలనుతావుకువచ్చెను
కమండలాముతోనూ తీర్థముతాను గ్రక్కునచేరబూనెక్
తనగురువుయేమాయెనో అనుచూతాను పరుగుపరుగునవచ్చెనూ
అంతిఆచార్యులా ఎటమపదమువేంచేసెకాలమందూ
ఇంతకాలమందునా యీ బిడ్డకు అంటదాయెనుమంత్రము
తనమనసుజాలినొంది మేదినియయినిహస్తముంచితుడిచి
ఘనమయినతిరుమంత్రము ఆచార్యులు వినయంబుగావ్రాసిరి
దేహమక్కడవిడచీ ఆచార్యులు జేరిరిపరమపదము
యీటిసానివక్కతె తిరుమంత్రము వినయంబుగాచదివెను
అకునవ్రాసినకునీ హస్తమునంబ ఆచారు తుడిచివెళ్ళె
జలముదెచ్చినదాసుడు ఆచార్యుల స్థలముదగ్గరకొచ్చెను
జలమారగించరయ్యా అవిడదట మమ్మురక్షించరయ్యా
నివ్రితేనిఘనులా యీ స్థలమందు నిద్రింపతగదులేండీ
చెంతస్థలమందున్నట్టి చెరుప్పువుజూచి గుండెలెగసిగొట్టెనూ
గురువునెరుగనయితిని యీవనమందు గుట్టుతెలియకపోతినీ
జలధిగట్టుకుపంపెనా గురువునన్నుడవిపాలుజేసెనా
గురువేమిజేసెగదా యీవనమందు గుట్టుతెలియకపోతినీ
గురువుపైచెయ్యిచని తనగురునివూపివూపిలేపెను
తనమనముదృష్టిచేత తనగురువునకు తగినక్రియలెల్లజేసి
అంతఅంతటపరమాత్ముడు అతోప్రవసు పనులగాచుచుండగా

పనులుగాచెటిబాలుడా యీతోవ్రవను పద్మాలెందరువెళ్ళిరీ
వినవయ్యహరిదాసుడా యీతోవ్రవను యీటిసానివెళ్ళెను
యీటిసానెకుఅబ్బెనా తిరుమంత్రము వీధంతావిరజల్లెను
ఆటసానెకుఅబ్బెనా యీమంత్రిమందరికి యెరుకాయెనా
అందరిని వెదుకుకుంటూ వెళ్ళిరి వారుహస్తినాపురమందునా
పల్లెగుడిసెలయందునా చోళపురాజు పట్నమందునజొచ్చిరీ
అమ్మమ్మముమ్మేలుమీ చెప్పినపనులు ఆజ్ఞతోచేయించుమీ
మీరుజేసెడిపనులు మాకేలయ్యా మావద్దవుండుమానే
ధర్మరాజానేసెడీ యజ్ఞముజూచి హరిదాసుడెళ్ళగాను
యెవరయ్యాహరిదాసుడు తెలియకమీరు యిబ్బందిపడకరండీ
సమయానద్వందార్థము తిరుమంత్రము సమకూడదాయెమాకు
తలియాకుపుచ్చుకుని పాతనవేసి తలచేనుఆచార్యులా
నాగవాసములేనిఘంటలు ఘల్లుఘల్లున మ్రోయగను
సభవారుఅంతవచ్చి తెరచాటున సభదీర్చికూర్చుండిరీ
యెవరయ్యాహరిదాసుడూ ఇచ్చటికిమీరెందువేంచేస్తిరీ
సమయానద్వందార్థము తిరుమంత్రము సమకూడదాయెమాకు
యీటిసానివద్దనూ తిరుమంత్రము యిప్పిస్తెపదిలక్షలా
ఆమాటలువింటునే ధర్మరాజు ఆశ్చర్యములబొందెనూ
వేయిబ్రాహ్మణులకెల్లను సమకూడదక వైష్ణవుండెక్కడా
ఈటివాళ్ళనుపిలువుడీ యిచ్చటికి మాటలాడించుదామూ
యీటిసాటివానివచ్చెను దండంబెట్టి నాట్యమాటలుజూపెను
మాటలజూచిమెచ్చి మేలిమిమిద యానతివ్వగాను
మిద్దెలస్థలముక్రింద కర్ణములకు ధరణిపైబడవేసెనూ
అయాకుతీసుకుని ధర్మరాజుహరిదాసు కివ్వగాను
ఆకుపాతననేసెనూ హరిపురమందు దాసుడైనిలచుండెనూ
హరిదాసుకథలన్నియూ నన్నాకన్నా వ్రాసినాచదివినాను
ఫలమయినతిరుమంత్రము దొరకును వినయంబుగానమ్మడీ॥

## 42 తులసి గోవింద నామములు.

భక్తితో తులసికిగోవిందా రామ । పాదుఅయినాజేతుగోవిందా
కృష్ణతులశమ్మాకు గోవిందారామ । (మొక్కఅయినాజేతు గోవిందా

నిత్యపుదకంబులు గోవిందారామ । నిమ్మళంగా బోతు గోవిందా
భాగీరథీనీరు గోవిందారామ । భమిడిబిందులబోతు గోవిందా
పాదములుగడిగితిరు గోవిందారామ । పైజల్లుకుందుము గోవిందా
కంచుకొప్పెర్లతో గోవిందరామ । కాశీపుదకంబుబోతు గోవిందా
విరివిగల కొమ్మలతో గోవిందారామ । విస్తీర్ణమైవుందుగోవిందా
కడసారకొమ్మకు గోవిందారామ । పరగనైదోదళము గోవిందా
గోమయంబెచ్చిరయా గోవిందారామ । బృందావనము అలికి గోవిందా
ముత్యాలముగ్గులు గోవిందారామ । ముదముతో నేబెదుదు గోవిందా
వజ్రాలముగ్గులు గోవిందారామ । వరుసతో నేబెడుదు గోవిందా
కెంపులముగ్గులు గోవిందరామ । సొంపుతో నేబెడుదు గోవిందా
పచ్చలముగ్గులతో గోవిందారామ । పద్మాలు నేబెడుదు గోవిందా
దామరాపద్మంబు గోవిందారామ । యేప్రొద్దు నేబెడుదు గోవిందా
అష్టదళపద్మమ్ము గోవిందారామ । నిష్టతో నే వుంతు గోవిందా
వానరుచాతుర్మాస్య గోవిందరామ । ఒక్కద్వాదశినాడు గోవిందా
నీమమ్ముతో ప్రజలు గోవిందారామ । నిన్నుపూజించితె గోవిందా
అష్టహారతిలోను గోవిందరామ । అరువై వేలవత్తులేవేసి గోవిందా
యేకహారతిలోను గోవిందారామ । వెయ్యికోట్లవత్తులేవేసి గోవిందా
పంచహారతిలోను గోవిందరామ । పదివేలవత్తులువేసి గోవిందా
రాగిపళ్లెంలోను గోవిందారామ । లక్షవత్తులువేసి గోవిందా
ఆవునెయ్యితోను గోవిందారామ । మహాలక్ష్మికి దీపంబువుంచెగోవిందా
సాంబ్రాణిధూపంబు గోవిందారామ । కదళిఫలశర్కరలు గోవిందా
అవుసరంయిచ్చిరి గోవిందారామ । పాయిసంబూరెలు గోవిందా
నైవేద్యమిచ్చిరి గోవిందారామ । సిరిసంపదలతోను గోవిందా
స్థిరముగా నుందురూ గోవిందారామ।

# 43 తులసి పూజాకల్పము.

## శ్రీ తులసిమహాలక్ష్మీపూజ ప్రారంభః.

కేశవ. నారాయణ, మాధవ, గోవింద, విష్ణో, మధుసూధన, త్రివిక్రమ, వామన. శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ, అదోక్షజ, నారసింహ,

అచ్యుత, జనార్దన, ఉపేంద్ర, హరే, శ్రీకృష్ణాయనమః ॥ ఉత్తిష్ఠంతు భూతపిశాచా ॥ ఏతేభూమిభారకాః ఏతేషామ విరోధేన బ్రహ్మకర్మసమారభే ॥ ఓంభూః, ఓంభువః, ఓంసువః, ఓంమహః, ఓంజనః ఓంతపః, ఓగ్ంసత్యం, ఓంతత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్యధీమహి, ధియో యోనః ప్రచోదయాత్ ॥ ఓమాపో జ్యోతి రసోమృతం. బ్రహ్మభూర్భువస్సువరోం మమోపాత్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం, శుభేశోభనే, ముహూర్తే శ్రీమహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే॥ భరతఖండే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన సంవత్సరే, అయనే, ఋతౌ, మాసే. పక్షే, తిథౌ, వాసరే, శుభ, నక్షత్రే, శుభయోగే, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, శుభతిథౌ శ్రీమతి, గోత్రవతి, నామధేయవత్యాః, ఆచరితవ్రత సంపూర్ణసకల ఫలావాప్త్యర్థం లక్ష్మీనారాయణదేవతాసహిత, శ్రీతులసీదేవ ఉద్దిశ్య తులసీదేవతా ప్రీత్యర్థం, శ్రీసూక్తవిధానేన ధ్యానఆవాహనాది షోడశోపచార తులసిపూజాం కరిష్యే॥ ఉదకంవదలిపెట్టి గంగకలశారాధనం కరిష్యే॥ చెంబులో అక్షతలు గంధం ఉంచేది. కలశస్యముఖేవిష్ణుః కంఠేరుద్ర సమాశ్రితాః। మూలేతత్రస్థితో బ్రహ్మమధ్యే మాతృగణాస్థితాః। కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా। ఋగ్వేదోథయజుర్వేద కలశాంబుసమాశ్రితాః కలశేగంధపుష్పాక్షతైరభ్యర్చ్య। అకలశేషు ధావతి పవిత్రపరిషిచ్య తేఉద్ధృ ద్రవ్యక్షేషువథకతా। అపోవాఇదగ్ంసర్వం

విశ్వాభూతాన్యాపః। ప్రాణా వా ఆపః। పశవఆపోన్నమాపోమృత మాపః సమ్రాడాపో। విరాడాపస్స్వరాడాపశ్ఛందాగ్ంస్యాపో జ్యోతీగ్ంష్యాపో। యజూగ్ంష్యాపస్సత్యమాపస్సర్వాదేవతా ఆపోభూర్భువస్సువరాప ఓం ॥ గంగేచయమునేచైవగోదావరి సరస్వతి । నర్మదేసింధుకావేరి జలేస్మిన్ సన్నిధింకురు॥ ఆయాంతు శ్రీతులసీపూజార్థం దురితక్షయకారకాః। కలశోదకేనపూజా।

ద్రవ్యాణిదేహమాత్మానం సంప్రోక్ష్య కలశఉదకంపువ్వులమీదను తులసిమీదను శిరస్సునచల్లుకొనేది॥ ధ్యానం॥ తులసీస్యమృత జన్మాసి సదాత్వంకేశవ ప్రియే, కేశవార్చన యోగ్యామే వరదా భవసర్వదా। కృష్ణానందాశ్రు సంభూతే వరదేవతులసిస్వయం త్వామద్య వాహయామ్యర్చ్య కమలాపతివల్లభే ఒషోడశోపచారపూజాంకృత్వా హిరణ్యవర్ణాంహరిణీం సువర్ణ రజత

స్రజాం । చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥ శ్రీతులస్యై
నమః ఆవాహనం సమర్పయామి॥ తులసిపైని పుష్పముంచేది తాంమఆవహ
జాతవేదో లక్ష్మీమనపగామినీం యస్యాం హిరణ్యం విందేయం గామశ్వంపు
రుషానహం శ్రీతులస్యైనమః ఆసనం సమర్పయామి పుష్పం ఉంచేది॥
అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోధినీం

శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మాదేవీజుషతాం తులస్యైనమః
పాదయోః పాద్యం సమర్పయామి ఉదకముచల్లేది, కాంసోస్మితాం హిరణ్య
ప్రాకారామార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీం పద్మేస్థితాం పద్మవర్ణాం
తామిహోపహ్వయే శ్రియం తులస్యైనమః, హస్తయోః అర్ఘ్యం ఉదకంవిడి
చేది, చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం లోకే దేవజుష్టాముదారాం
తాం పద్మినీం శరణమహం ప్రపద్యే, అలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే తుల
స్యైనమః ఆచమనీయం సమర్పయామి ఉదకము విడిచేది, ఆదిత్యవర్ణే తప
సోధి జాతో వనస్పతిస్తవ వృక్షోథ బిల్వః, తస్య ఫలాని తపసా నుదంతు మా
యాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః, తులస్యైనమః స్నానం సమర్పయామి, నీళ్లు
చల్లేది, తదనంతరం పంచామృతస్నానం సమర్పయామి, దధిక్రావ్ణో అకారి
షం జిష్ణోరశ్వస్య వాజినః సురభినో ముఖాకరత్ ప్రాణ ఆయూగ్ంషి తారిషత్
పెరుగుతో స్నానము, ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమవృష్ణ్యం భవా
వాజస్య సంగథే, పాలతోను, శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవస్సవితో
త్పునాత్ అచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః, నేతితోను, మధువా
తా ఋతాయతే మధుక్షరంతి సింధవః మాధ్వీర్నస్సంత్వోషధీః మధుసక్తముతో
షసి మధుమత్పార్థివగ్ంరజః మధుద్యౌరస్తునః పితా మధుమాన్నో వనస్పతిః
మధుమాగ్ం అస్తు సూర్యః మాధ్వీర్గావో భవంతునః, తేనెతోను స్వాదుః పవ
స్వ దివ్యాయ జన్మనే స్వాదురింద్రాయ సుహవీతు నామ్నే స్వాదుర్మిత్రాయ
వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః శర్కరతోను,
తదంగ శుద్ధోదకస్నానం సమర్పయామి, ఆపోహిష్ఠా మయోభువః తాన ఊ
ర్జేదధాతన మహేరణాయ చక్షసే యోవశ్శివతమో రసః తస్యభాజయతేహనః ఉ
శతీరివ మాతరః తస్మా అరంగమామవః యస్యక్షయాయ జిన్వథ ఆపోజనయథాచనః
శుద్ధోదకస్నానం సమర్పయామి॥ ఉపైతుమాం దేవసఖః కీర్తిశ్చ మణినాసహ
ప్రాదుర్భూతోస్మి రాష్ట్రేస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే తులస్యైనమః వస్త్ర
యుగ్మం సమర్పయామి ॥ క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్య
హం అభూతిమసమృద్ధించ సర్వాన్నిర్ణుదమే గృహాత్ తులస్యైనమః
యజ్ఞోపవీతం సమర్పయామి ॥ గంధద్వారాం దురాధర్షాం । నిత్యపుష్టాం క

రీషిణీం । ఈశ్వరీగ్ంం సర్వభూతానాం తామిహోపహ్వయేశ్రియం ॥ తులస్యైనమః దివ్యశ్రీచందనం సమర్పయామి॥ మనసః కామమాకూతింవాచస్సత్యమశీమహి పశూనాగ్ంం రూపమన్నస్యమయిశ్రీ శ్రయతాంయశః తులస్యైనమః ఆభరణార్థం అక్షతాం సమర్పయామి॥ కర్దమేన ప్రజాభూతామయి సంభవకర్దమా శ్రియంవాసయమేకులే మాతరంపద్మమాలినీం॥ అథాంగపూజా తులస్యైనమః పాదౌపూజయామి, విష్ణుప్రియాయైనమః గుల్ఫౌపూజయామి, రంభోర్వ్యైనమః ఊరుపూజయామి. క్షీరాబ్ధితనయాయైనమః కటింపూజయామి సకలసురపూజ్యాయైనమః నాభింపూజయామి, ఇందిరాయైనమః ఉదరంపూజయామి, బృందావనవాసిన్యైనమ. వక్షస్థలంపూజయామి, మహాలక్ష్మ్యైనమః, స్తనౌపూజయామి, భుజాయైనమః ఉదరంపూజయామి, బృందావనవాసిన్యైనమః హస్తౌపూజయామి. సుముఖాయైనమః ముఖంపూజయామి, రమాయైనమః లలాటంపూజయామి, ఇందుసోదర్యైనమః శిరంపూజయామి, శ్రీతులస్యైనమః సర్వాణ్యంగాని పూజయామి, కుంకుమసహితపుష్పైః పూజయామి, అని కుంకుమపువ్వులు అక్షతలుతో ఆఖరువ్రాసిననూటయెనిమిది నామములచేతను పూజజేసేది.

ఆపస్రిజంతు స్నిగ్ధాని చిక్లీతవసమేగృహే నిచదేవీం మాతరం శ్రియంవాసయమేకులే తులస్యైనమః, ధూప మాఘ్రాపయామి॥ ఆర్ద్రాంయఃకరిణీం యష్టింసువర్ణాం హేమమాలినీం సూర్యాం హిరణ్మయీం లక్ష్మీంజాతవేదో మమావహ తులస్యైనమః దీపం॥ ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిపింగళాం పద్మమాలినీం చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥ తులస్యైనమః నైవేద్యంసమర్పయామి॥ తాంమ ఆవహ జాతవేదో । లక్ష్మీమనపగామినీం । యస్యాం హిరణ్యం ప్రభూతంగావో దాస్యోశ్వాన్ విందేయం పురుషానహం శ్రీతులస్యైనమః తాంబూలంసమర్పయామి యశ్శుచిఃప్రయతో భూత్వాజుహుయాదాజ్య మన్వహం శ్రియః పంచదశర్చంచ శ్రీకామ స్సతతంజపేత్ తులస్యైనమః నీరాజనం సమర్పయామి॥ ఆనందః కర్దమశ్చైవచిక్లీతఇతివిశ్రుతాః ఋషయః యస్త్రేత్రయః ప్రోక్తాస్స్వయం శ్రీదేవదేవతా । పద్మాననేపద్మఊరుపద్మాక్షీ పద్మసంభవే త్వమాంభజస్వపద్మాక్షీ యేనసౌఖ్యంలభామ్యహం । అశ్వదాయీగోదాయీ ధనదాయీ మహాధనే ధనం మేజుషతాం దేవీంసర్వకామార్థసిద్ధయే ॥ లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం దాసీభూతసమస్తదేవవనితాం లోకైకదీపాంకురాం । శ్రీ మన్మందకటాక్షలబ్ధ విభవద్బ్రహ్మేంద్ర గంగాధరాంత్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందేముకుందప్రియాం

శుద్ధలక్ష్మీర్మోక్షలక్ష్మీర్జయలక్ష్మీ స్సరస్వతీ శ్రీలక్ష్మీర్వరలక్ష్మీశ్చ ప్రసన్నా మమసర్వదా। వరాంకుశౌ పాశమభీతిముద్రాం కరైర్వహంతీం కమలాసనస్థాం బాలార్క కోటి ప్రతిభాంత్రినేత్రాం। భజేహమాంబాం జగదీశ్వరీంతాం సర్వమంగళ మాంగళ్యే శివేసర్వార్థ సాధకే శరణ్యేత్ర్యంబకేదేవీ నారాయణినమోస్తుతే తులస్యైనమః॥ సువర్ణమంత్రపుష్పం। ప్రదక్షిణం॥ యాని కానిచ పాపాని జన్మాంతర కృతానిచ తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే। పాపోహం పాపకర్మాణాం। పాపాత్మాపాపసంభవాం త్రాహిమాం కృపయాదేవి॥ శరణాగతవత్సలే అన్యధాశరణం నాస్తిత్వమేవ శరణం మమ తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష జనార్దనీ। తులస్యైనమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి। నమస్కరోమి దేవిత్వాం విష్ణువక్షస్థలెస్థితాం। ప్రణతార్తిహారేన్నిత్య మభీష్ట ఫలదాయక॥
శ్లో॥ యస్యస్మృత్యా చనమోక్త్యా తపః పూజాక్రియాదిషు న్యూనంసం పూర్ణతాంయాతి సద్యోవందేతమచ్యుతం। మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దని। యత్పూజితం మయాదేవిపరిపూర్ణం తదస్తుమే। అనయాధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయాభగవతీ సర్వాత్మకా శ్రీతులసీదేవతా సుప్రీతా సుప్రసన్నావరదాభవతు" అని ఉదకంవిడిచేది తులసీ దేవతా ప్రసాదం శిరసాగృహ్ణామి॥ తలపైనుంచకొనేది॥

## శ్రీ తులసిపూజాకల్ప నామావళి ప్రారంభః

ఓంప్రకృత్యైనమః
వికృత్యైనమః
విద్యాయైనమః
సురభ్యైనమః
పరమాత్మికాయైనమః
వాచేనమః
పద్మాలయాయైనమః
పద్మాయయైనమః
శుచయైనమః
స్వాహాయైనమః
స్వధాయై నమః
సుధాయైనమః
ధన్యాయైనమః
హిరణ్మయైనమః
నిత్యపుష్టయైనమః
విభావర్యైనమః
అదిత్యైనమః
దీప్తాయైనమః
రమాయైనమః
వసుధాయైనమః
వసుధారణ్యైనమః
కమలాయైనమః

కాంతాయైనమః
కామాక్ష్యైనమః
క్షీరోదసంభవాయైనమః
అనుగ్రహప్రదాయైనమః
బుద్ధయైనమః
అనఘాయైనమః
హరివల్లభాయైనమః
అశోకాయైనమః
అమృతాయైనమః
సర్వభూతహితప్రదాయైనమః
శ్రద్ధాంతాయైనమః
విభూత్యైనమః
శ్రీపార్థ్యైనమః
లోకవినాశిన్యైనమః
ధర్మనిలయాయైనమః
కరుణాలోకమాత్రేనమః
పద్మప్రియాయైనమః
పద్మహస్తాయైనమః
పద్మాక్ష్యైనమః
పద్మసుందర్యైనమః
పద్మోద్భవాయైనమః
పద్మముఖాయైనమః
పద్మనాభప్రియాయైనమః
వరారోహాయైనమః
పద్మమాలాధరాయైనమః
దేవ్యైనమః
పద్మిన్యైనమః
పద్మగంధిన్యైనమః
పుణ్యగంధాయైనమః
సుప్రసన్నాయైనమః
ప్రసాదాభిముఖ్యైనమః
ప్రభాయై నమః
చంద్రవదనాయైనమః
చంద్రాయైనమః
చంద్రసహోదర్యైనమః
చతుర్భుజాయైనమః
చంద్రరూపాయైనమః
ఇందిరాయైనమః
ఇందుశీతలాయైనమః
ఆహ్లాదజనన్యైనమః
పుష్ట్యైనమః
శివాయైనమః
శివకర్యైనమః
సత్యైనమః
విమలాయైనమః
విశ్వజనన్యైనమః
తుష్టయేనమః
దారిద్ర్యనాశిన్యైనమః
ప్రీతిపుష్కరిణ్యైనమః
శాంతాయైనమః
శుక్లాంబరాయైనమః
శ్రియైనమః
భాస్కర్యైనమః
బిల్వనిలయాయైనమః
యశస్విన్యైనమః
వసుంధరాయైనమః
ఉదారాంగాయైనమః
హరిణ్యైనమః
హేమమాలిన్యైనమః
ధనధాన్యవిధ్యాయైనమః
సిద్ధయేనమః
స్త్రైణసౌమ్యాయైనమః
శుభప్రదాయైనమః
నృపవేశ్మగతానందాయైనమః

వరలక్ష్మ్యైనమః
వసుప్రదాయైనమః
శుభాయైనమః
హిరణ్యప్రాకారాయైనమః
సముద్రతనయాయైనమః
జలాయైనమః
మంగళాయైనమః
దేవ్యైనమః
విష్ణువక్షస్థలస్థితాయైనమః
విష్ణుపత్న్యైనమః
ప్రసన్నాక్ష్యైనమః
నారాయణసమాశ్రితాయైనమః
దారిద్ర్యధ్వంసిన్యైనమః
దేవ్యైనమః
సర్వోపద్రవవారిణ్యైనమః
నవదుర్గాయైనమః
మహాకాళ్యైనమః
త్రికాలజ్ఞానసంపన్నాయైనమః
బ్రహ్మవిష్ణుశివాత్మికాయైనమః
భువనేశ్వర్యైనమః

# 44 తులసి దళము.

శ్రీనివాసమూర్తి సేవజేసి నేను విన్నవింతు । మానసమున తులసిదళము మహిమ దెల్పెద । తులసిదళముమహిమ దెలియ తెలియ నెవరివశముగాదు । తులసిదళము సకలలోకముల పవిత్రము । తులసిదళము మహిమ యెంత వర్ణింపనలవిగాదు । సరసముగ వినగ నలరుచు సరగ చెప్పెద । మునుపు మీరి నట్టి ద్వారకాపురమ్ములోన కృష్ణు । డెలమితో పదియారువేల రాజ్యమేలుచుండెను । ఇంద్రపదవికన్న యెక్కువై చెలంగుచుండు దేవేంద్రపదవి జూడవలెను యేపుమీరను । నారదుడువచ్చి లోకనాథు కృష్ణుపన్నతించి। ద్వారకాపురమ్ము మహిమ తెలియ జూచెను । బాగుమీరగాను సత్యభామ నగరికేతెంచి । వదనమెత్తి భామతోను పలుకబల్కెను । అమ్మ మున్ను ముందు పూజలెన్ని యెట్లు జేసినావో । చెన్నుమీరగాను భర్తవెన్నుడౌటకు।
తిరిగి మగని యెత్తు ధనము మరల భూసురులకొసగి । ముఖ్యముగ నికొనగవలెను వ్రతమాహాత్మ్యము । కోరి భక్తితో దానమిస్తు కొమ్ము లేనుగుదానమిచ్చు దారి జెప్పగనుచు తిరుగ తిరస్కరించి అడిగెను । నా మనోహరుని లోకనాయకుని దానమొంద । నోమునీందరి నీకు తప్పవో పరిన్యాయ అంజలిని బట్టుకొని వినయముతో సత్యభామ । మరియు చేతులెత్తి మ్రొక్కి మునుపు పల్కెను । స్వామి కృష్ణ చెట్టబట్టసఖుల కోర్కెలెల్లదీర । మనవియొక్కటున్నదనియు మనవిజేయ బల్కెను । యింటి నీ గృహంబులోను వింతగాను మనవిలేదు । మనవియొక్కటొచ్చెనని మగడునవ్వెను । స్వామి నారదుడు వచ్చి వ్రతము ఒకటి చెప్పినాడు । విభుని దానమియ్యమని వ్రతము చెప్పెను । భామ నన్ను దానమియ్య వ్రతము

ఒకటిపట్టినాక కానివెనుక । స్తునేను కదలిపొమ్మని కొంకముతో భూషణము లలంకరించి మంచిగంధం । పొంకముతో నురులు సాగనుపణతియంగన । యనిశధాస్తు తెమ్మటంచు వడిగవిభునితోడితెచ్చి । కెందిత్రాసుతోడునపుడు వింతగా నుమానియెదట నిల్చెను । లెక్కలేనిమాటలన్ని ఒక్కవంకరాసి పోసి । వొక్కవంకకంస వైరి నంచెముదమున । యెత్తురాకపోసిధనము యే మినిష్టకోల్లుగలవు । యెంతగానతూచినాను తూగదాయెను । యేపుమీర నింద్రపదవి చూడబోయి తెచ్చినట్టి ధనము వేసితూసినాను మొగ్గదాయెను రాజసూయయాగమునకు రాజులెల్ల పూజచేయు । మణులువేసితూసినాను నిండెదాయెను । కాలదిజాంబవతీ మిత్రవిందరాధ మొదలుగాగ సతులకుకలిగి నట్టిధనము లంతకలియజేసిరి । హితులు మంత్రులు పురోహితులు సతులు మిత్రులును యితరమయినవారు చాలకనకమిచ్చిరి । అంతయీతీరమయిన వారుచింతసేయగాను బుద్ధిమంతులయినవృద్ధవుండుమంతనమ్మునతెలియదింక రుక్మిణీసతులు యేమొయింతధనము । కలదుయంకమనకు అశకల్గెన్నదు అనుచువృద్ధవుండుబల్క మదినిసత్యభామదలచి రుక్మిణమ్మకడకునేను యెట్లు బోదును । యింతకాలముయెంతనకు యతులాలయెన్నడయిన । చేరిరుక్మిణీ కినేను సేవజేసిన । విభుడుతనకులోలుడనుచు తెడ్డుతోనుబోధపడితే । తానుమరీణాణతనము మాటలాడున । చనుగానిరుక్మిణమ్మ కడకునేనుబోన టంచు । పంతముతో సత్యభామ పలికెనప్పుడు । నోరుపంతమాడితేను నోస లుపంతమాడునటమ్మ । వారితోడరుడు తన్నువంచదలిచెను ... ...

గద్దెపైనకూర్చుండి కనులబాష్పములుగురియ లజ్జతోనుబల్క సత్యభామఅ ప్పుడు అనుచుసత్యభామబల్క వదినీవృద్ధవుండు తలచి । రుక్మిణమ్మకడకుబో వనీకులజ్జలేటికే నీకన్నపెద్దవనిత వినుముగారుక్మిణమ్మ । మొక్కవచ్చురుక్మి ణీకి మాదమతరగ । భూతదయలుగల తల్లిభూములన్ని పాలింప । ఆదికాల మందులక్ష్మి అవనిదియాయెరుగవ ముఖ్యమయిన ప్రాణనాథుడు దక్కలేనీకు చాలు । చేతగాదరుక్మిణమ్మకడకు బోవను । అనుచువృద్ధవుండు బలుకమదిని సత్యభామదలచి కవడవశమువచ్చెనని కదలివచ్చెను । అందుచేరిముందుని లచి సుందరీజనాంగియపుడు । సందడితో రుక్మిణీకి మొక్కనిలచెను । అక్క నాడునితో జేసినప్రతిజ్ఞకేమొదారిజెల్లె । ధనముగూడెవారి బోదరుడు తన్ను వంచించదలచెను । కల్గనీకుకలధనమ్ము కానవచ్చుసగము ధనము । కలిసిజేసిదాచివారు యెత్తుకాదుగా కాలదినీకు కలధనమ్ము వేగదెచ్చి విభు నికిస్తె । తిరిగికృష్ణమూర్తి నిపుడు తెచ్చుకుందును । అనుచు సత్యభామబల్క మదినిరుక్మిణమ్మనవ్వి । నాడుదూడదానమంద సత్యభామదాన మపుడు

విచ్చు విభుడు బోవుట వల్ల యొక్క వింతదోచెను అయినగాని తనకుగ లుగు అంతవస్తు విచ్చువలెను । గాని వెనుకవస్తునేమ కదలిపొమ్మని అను చుసత్యభామను పదహారువేల సతులు జేరి । వింతగాను తోలిపంపిరి వేట్క లలరగా । వెలయుగాను నగరిలోను తల్లిదండ్రులుండగాను తల్లిదండ్రులివ్వ వలెను సకల జనులకు నందుడా యశోదదేవి ముందుగాయుండగాను, దేవి దానమిచ్చుటేమొ తెలియదాయెను ॥ పట్నంపుస్త్రీ అయినయిచ్చినా చె ల్లుగాని, వేశ్యకాంతదానమిచ్చు ధర్మమున్నదా । స్నానమాచరించి మంచిసరసవస్త్ర పట్టుగట్టి మేన సొమ్ములన్ని బెట్టిమెరుపు దీర్చెను । పొంక మయిన భూషణము లలంకరించి మంచిగంధం పొంకమూతో సతులుజేగ అపుడనుర్చిరి । అందముతో తులసిదేవి అరుగుఅలికి ముగ్గుబెట్టి పణతిసక కలోపచారమునపూజచేసెను । హేమమయమైన రత్నగజపీఠమందు తాను। వీనుములర వుంచెవళవనేర్పుతోడను । అతివకుతాంబూలముచెలులుఅంది యిచ్చుచుండ । గానుభూషణములు మెరయుగాను కదలివచ్చెను । వచ్చినా రదునికి మ్రొక్కివాని కోర్కెదీరునట్లు । రుక్మిణమ్మ ధనముత్రాసులో నిలువగాను । హెచ్చిదేవమునీ చాలమేలుమేలనే । వెలదినీకుకలధనమ్ము వేగదెచ్చివిభునిస్తి ॥ యెంతసేపువిష్ణుమూర్తి నిచ్చిపోదును । అనగనవ్వ భీష్మపుత్రివినయమొప్ప మ్రొక్కినిలిచి । ఘనులుమీరుయెరుగరాని కారణ మున్నదే । సకలజగములెల్లయితని గర్భగృహములోనుగలవు । వనజనాభ యితడు సత్యవంతుడాయెను । ఆదిమూలమయిన విష్ణుఅతనిదైవమాయే నే మెం । వేదములు శాస్త్రములం వెలసియున్నను । తులసిదళముల చేత బట్టి తూగవలెను అనుచుబాల । చెలియమానితోడతా । బ్రతిజ్ఞబట్టెను । మొద లుమట్టుధనముఅంతామొదట అంటతీసివేసి । చెలియకుడకలోను తులసిదళ మునుంచెను । అపుడుసకలజనులు జూడఅద్భుతముగవిష్ణుమూర్తి । కపట మేమిలేక తూనికమరబొచ్చెను । అపుడురుక్మిణీనిజూచి అమ్మనీవుతులసి పూజ । యెన్నగానుజేయుటచె కలిగెభాగ్యము । కాదుకబరికాదు యేమొం కానవచ్చునో వినోది । మగువతులసిదళములో దెమహాప్రభావము। తులసిప మహిమయెవరుపాడినను విన్నగాని । పరమపవిగలుగుపాతకములుబోవును వకరముగతులసి పూజచేసివిష్ణుసేవచేసి । యేకదంతునిదలచి తులసిమహిమ విస్తరించెద । మహామునులారతులసిమహిమ । మహిమకెల్లదొడ్డ మహామహి మతెస్పపూజచేసి । భూతికొందరు । పుత్రపౌత్రసమస్తమయిన భోగమను భవింతురుగాని । పవిత్రులైజన్మిస్తురెల్లకాలము । యేలమిపట్నానరాజుయేలు చుండెనుతులులేక । చెలిమిమీరదప్పిచింతసేయుచుండెను । అంతలోపవశిష్ఠ

మూని అచటికేతెంచిరాగ । చింతదీరువిధము అతనికి చెప్పుమనిరి । వృద్ధుల యిరియికను గూరు చెయ్యవు లేదు గాన । శుద్ధముగ నతులసిపూజ చేసుకొమ్మనె । విన్నవెంగళుపతి రాజు భూమియున్న పదును జేసి । చెన్నుమీర గుంపితులసి వనము వేసెను । పాలు నెయ్యి చెఱకు మంచి పానకంబు తేనె వారి కేళజలము జేసికొన్నా ల్పెంచిరి । ఆదరమున దంపతులు సకలోపచారంగాను । క్రమముతోరిగి పూజయేడాదిజేసిరి । అంశము సలితనము పోయె । కొంత చిన్నవయసు వచ్చె । రాజాపకుకాంతుడను సుకులు కల్గిరి । వేశ్యాకోధ భరతుడను చు పేరు ప్రఖ్యాతి గాను అతనికిచ్చె । రాజ్యమేలె భరతవంశము తని పేర ప్రబలమాయెను । సరసముగ సౌఖ్యమిచ్చు స్వామిసన్నిధిని జేమఱ । పరమశోభనమిది ప్రథమపటలము.

## రెండవపటలము.

ఓ యువిప్రులార మీరు ఒకకథవినుడి మీరు । బాయక పకలవిధములయి నపాతకమ్ములు । మేలుగాను మంచితులసి మీదనుండి వచ్చునట్టి గాలిబారి తేను మహాకులప పాప్మపోవును । తొల్లి లుబ్ధకుండ డొకడు దోషకారియొకుక వాడు కల్లవాడు గలిమిసోతు కాదుమానుషి । కుటిలవర్ధనుండు మనుజుల కూడ గొట్టి చంపివేసి । మాంసమారగింపు చుండెను । నరులజంపి భూసురుల జంపిమనిషి మాంసమారగింపు మెండె ననేకకాలము ... ... ... యీవివిధము వభోజనములు జీవహింస లెల్ల జేసి తోర్చిననచుప్రాణములను సంహరించెను । ఒకానాడు భార్యజంపి మాంసమారగింపు చుండె । ఒకానాడు తల్లిపంశ్రులు నుగ్గు జేసెను । ప్రాణులెవరు దొరకకున్న భక్షణాధకాము యితన ఆత్మసుతులగొట్టితా భోంచేసెను । మరణసమయమందు దేవ సుహిమతో చలేదుగాని పుణ్యవశము నతనిమీదతులసిగాలిబారెను । తులసిగాలి బారినపుడె యమభటులువచ్చి కపటముతో వాణ్ని బట్టికొట్టికట్టిరి ।వినయముతో విష్ణుభటులు వీనివగ్గరకువచ్చి యమభటులనుపారదోలి విష్ణుపురికి దెచ్చిరి । కాలకింకరులు యముని కీప్రకారము తెలియజేయ చాలకోపించి యమడు విచారమును బొందును । దోషకారియొకకవాణ్ని చూచి తేను పాతకములు వాసుదేవుపటపారిపోవుట వరుసయేమిటో । తెలసుకోక మనసులోని తెగులు పోవదను చు లేచి । బలముతోను వేగిరమున పైనబూరెను.

భూతగణముగొలువగాను మహిషరాజు మంచి కావుపోతునెక్కి వేగవిష్ణుపురికివచ్చెను । నిల్పినాపు నీవు దండకార్యములకు కర్త జేసి బలమూది కిజేసి నావు క్షేప్యమగునా । చెక్కించవలెవీణ్ని చెక్కివెయ్యవలెను డొక్క

తొక్కసందు నాను వీనితొక్కవలెనయ్యా । పొట్టచింపవలెను వీణ్ణికట్టి పెట్టికొట్టవలెను కొట్టిమంటలంటునా పెట్టవలెనయా । దుంటగీడుదోషకాని దొంగవంటివాడుదేవ నీదంటనుండతగడు నాదండకంపుము । గురుతుగాను మరలమరల వాడిసరకమునకు పొత్రితయిన యెరుకవాణ్ణి తెచ్చినావు యేమిపాపము । దశపాతకములన్ని ముందుజేసినాడు తుదకు అగణితముతని మీద తులసిగాలిబారెను । తులసిగాలిబారుటాచే యెరుకవానికి మోక్షమిస్తి దోషమితని యందులేదు గానయముని హెమ్మనే । అనుచువిష్ణుమూర్తిబల్క మోక్షమొందియముడు తనలోకమునకు తరలివచ్చెను తులసియింటనిల్పు వారు తులసిపూజచేయువారు తులసియందుభక్తులయి మ్రొక్కువారలు । తెలసివారిదిక్కున యమభటులుచేరలేరుగాన స్మరించితేను మోక్షమిచ్చు పుణ్యమొచ్చుద్వితీయపటలము॥

## 45 సీతాదేవివేవిళ్ళు.

సృష్టంతయేలేటి రాముచంద్రులూ । రాజ్యపాలకులయిన రామచంద్రులు యెదురులేకా భూమి యేలుచున్నారు । ఆనందభక్తులయి అయోధ్యలోను అంతటాజనకసుత గర్భిణమ్మలాయె । నెలనెల్లిరెన్నెల్లు అమరియుండగను వేవిళ్లుఘనమాయె లోకుల్కెలాయె । తలవాల్చికుడిచెయ్యి తలక్రిందనుంచి పాన్పుమీదపవళించె పద్మాయతాక్షి । అన్నమ్ముముట్టదూ ఆరామసీత తాంబూలము వెయ్యదుసర్వేశ్వర్లదేవి । నిత్యతనదాసీల నిల్చిపిలువదు పాదాలువత్తుమని పణతిపలుకాదు । మధురమగుమామిడిపండ్లుగోరు అతిపఅరటిపండ్ల నవియైనగోరు । కాంతఖర్జూరములైననుగోరు పణతిపనసా పండ్లవ్వయినగోరు । వెలదివెలగాపండ్లనయిననుగోరు నాతినారింజపండ్లనయిననుగోరు । పాలకొమ్మలమీదిపండ్లయినగోరు చింతకొమ్మలమీది చిగురయినగోరు । దోరచింతలుగోరు తోయజగంధి యీరీతికోరికలుకోరుచుండగను । ముగుదకుముత్యాలపట్టెడేసడలె నాతికి నడుమువడ్డాణమేసడలె । పణతిచేత బాజబందులేసడలె అచ్చునవరత్నాల పేరులేసడలె । అనేకరత్నాలసొమ్ములేసడలె పాన్పుమీదపవళించె పద్మాయతాక్షి । ధర్మసేనుడుతన సతిమేడకొచ్చి రెప్పవేయకను కనువిప్పిహాహాన । తప్పకజూచెను తరుణితావంక పణతిగానిరమ్మనె రామచంద్రులు । యేమేమిజనకసుత నీవున్నవిధము

.కారడవిదిరిగావు కష్టపడ్డావు । ఆనాడుయీరీతి వడిలుండలేదు.
అడవులన్నీదిరిగి అకుభక్షిస్తె । ఆనాడుయీరీతివడిలుండలేదు
బావులనీళ్ళన్నిచేదిపడతాగ్రిగి । ఆనాడుయీరీతి వడిలుండలేదు
యెండలోనేయెండి వానలోనేతడిసి । ఆనాడుయీరీతి వడిలుండలేదు
పండుటాకులవలె పాలివున్నావు । పారుటాకూవలెపవ్వళించావు
నీవిధములక్ష్మన్న కెరిగింపవలెను । గాజాలమరించినా గడపలుదాటి
ముత్యాలమర్చిన ముంగిళ్ళుదాటి । రత్నాలమర్చిన మేడలమదాటి
పగడాలమర్చినపందిళ్లుగాటి । పచ్చలమరించినారచ్చల్లుదాటి
వచ్చేనేరఘురాములక్ష్మన్నకడకు । అల్లంతటొచ్చేటి అన్నగాడజూచి
కొగడవిమామ్మారుపద్రిదక్షిణంజేసే । సాష్టాంగదండప్రణామంబుజేసే
వందనముజేసికదుముందరనిలచి । అన్నవినులక్ష్మణావిన్నపమునాది
అన్నమీవదినెంత బడలివున్నదీ । కారడవిదిరిగిందికష్టపడ్డాది
ఆనాడుయీరీతివడిలుండలేదు . అడవులన్నిదిరిగిఆకుభక్షించి
ఆనాడుయీరీతివడిలుండలేదు । బావులనీళ్ళన్నిచేదిపడత్రిగి
ఆనాడుయీరీతివడిలండలేదు । యెండలోనేయెండివాననేతడచి
ఆనాడుయీరీతివడిలుండలేదు । పండుటాకువలెపాలివున్నది
పారుటాకూవలెపవ్వళించిందీ । నాచేతినొక్కటిముద్రుటుంగరమూ
ముంజేతదొడగొచ్చుక్కలక్షుమన్నా । అయింతిగర్భిణినితావిచారించి
మనసుసంతోషానమరిపొంగుచుండె । పాలుపొంగినట్టుపొంగిలక్ష్మన్నా
నక్షత్రపర్వతంనడచినట్లుండె । చుక్కలపర్వతంచూచినట్లుండె
అట్లయితెమావదినెన్నచూచివత్తును । అంబులుఅయుధాలన్నికడనుంచి
బిగదీసిలక్ష్మన్నపిడికట్లుకట్టె । లక్షకేలాగొడుగుతాచేతపట్టె
వచ్చేనేలక్ష్మన్నవదినెమేడలకు । అల్లంతటొచ్చేటిమరదినిపొడజూచి
కాళ్ళపాపీరావెకదుశీఘ్రమునను । బంగారుచెంబుపన్నీరుదెచ్చి
పాదములుకడిగించెనారాముదేవి । బంగారుతీగెలాతివాసిపరచి
పచ్చకర్పూరాన తాంబూలమిచ్చి అలసివచ్చినారుకూర్చుండరయ్యా
సాష్టాంగదండప్రణామంబుజేసె । వందనంజేసి కదుముందరానిలిచి
అమ్మమేమెపోతాము అజ్ఞయివ్వండి । వేగిరం మీఅన్నకడకు పొండయ్యా
కదువేగమీఅన్నకడకుపొండయ్యా । గాజాలమరించినా గడపలుదాటి
ముత్యాలమర్చినా ముంగిళ్ళుదాటి । పచ్చలమరించినా రచ్చలుదాటి
పగడాలమర్చినా పందిళ్లుదాటి । అల్లంతటొచ్చేటి అన్నపొడగాంచి
పొడగనిమూమ్మారు ప్రదక్షిణంజేసి । సాష్టాంగదండప్రమాణంబుజేసె

వందనము జేసికడుకుంద గానిలచి। మీకంటె ఘనులయి పుట్టనున్నారు
మీ రేలు రాజ్యమ్ము లేలనున్నారు। మీ రెక్కసింహాసనం యెక్కనున్నారు
మీ చేతి ఆయుధం పట్టనున్నారు। అయింతిగర్భిణని తా విచారించి
మనసులో సంతోషం మరి పొంగుచుండె। పాలు పొంగినట్లు పొంగ రాముండు
నక్షత్రపర్వతం నడచినట్లుండె। చుక్కలా పర్వతం చూచినట్లుండె
ఆలంకలోపలా దండుదిగి రాగ। అక్కడ రావణబ్రహ్మ కూతురు
అలిగి ఆ త్రింటికి వెళ్ళిపోగాను। హస్తములు చేపట్టి యెత్తలేనయితి
నిండుగా వున్నది నీలభవనాద్రి। పక్కలు వింతుంది పంకజగంధి
ఆయింతి కదిముదురు గర్భిణోయన్నా। యీయింతికిది లేతగర్భిణోయన్నా
వెండిబల్యాల వారు వేయిలక్ష వేలు। రాగిబల్యాల వారు లక్ష వెయి వేలు
కంచుబల్యాల వారు కమ్ముకున్నారు। పాదాల చప్పుడు పణతి వినకుండ
పాన్పుమీద నొచ్చిరి పద్మనాభులును। కూర్చున్న దాసీలు నిల్చుండి వంతా
ఆడవలెనో వలె గెల్వవలెగాని। ఆటవిడిచీ మీరు లేవ పనిలేదు
చిరునవ్వు నవ్వి రీ దాసీలు అంతా। వుత్తర దక్షిణం చూచెనా దేవి
తూరుపూ పడమరా చూచెనా దేవి। అడేటి సాగటాలు అటు పార వేసి
పాన్పుమీది కొచ్చెను పద్మాయతాక్షి। గుబ్బిచ్చి కాగాలించి యెత్తితోడనుంచి
అటుకులు చక్కిలాల్మంచి వస్తువులు। యీమాట మా అమ్మకు చెప్పిపంపితేను
యీక్షణము తెప్పిస్తు యిందీవరాక్షి। పాలపళ్ళు మంచి ఖజ్జాయములును
యీక్షణము దెప్పిస్తు యిందీవరాక్షి। అనాడు నీ మేడలో స్త్రీనే దేవి
చాలచిక్కంటినే చదరాలనీవు। అనాడు నీవద్ద నేపవ్వళిస్తె
చాలచోటాయెనే చదరాలవారు। యీనాడు నీ మేడలో స్త్రీనే దేవి
చాలనిండుంటినే చదరాలదేవి। నీను తుంనీవును పైబవ్వళిస్తె
పాయలక్రింద నేనే పవ్వళిస్తు। రాజాధిరాజులకు విన్నపమయ్యా
రాజులల్లుళ్ళకు విన్నపమయ్యా। రమణులకునందరికిదీ వినలయ్యా
ఆమాట మీ రేల ఆజ్ఞ జేసేరు। మామీద దయవుంచి మమ్ము రక్షించు
దండంబు దండంబు నీకు రఘురామ। యీపాటపాడినా విన్నానుగాని
ఇహ పరంబులయందు సుఖము జెందుదురు।
మోక్షమిచ్చును మీకు రామచంద్రుడు॥

---

# 46 గంగా గౌరి సంవాదము.

శివశరణ మాంపాహి శివశరణ పాహి । శివశరణ మనసాల శివునకు శరణు
గురుశరణ మాంపాహి గురుశరణ పాహి గురుశరణ మనసా లిగురువునకు శరణు
హరిశరణ మాంపాహి హరిశరణ పాహి । హరిశరణ మనసా లిహరునకు శరణు
యొక్కన గౌరమ్మ యీలసందిమీద । కోసిన పూలన్ని కొమ్మ విరవకను
ముడిచెనుఅ పూలు ముందుగా తాను । ముడువమిగిలిన పూలు పళ్ళెమునంచి
పంపెనుగవరమ్మ గంగ మేడలకు । వాడిన పూబంపినవనివి యీవరమ్మ
వాడలిన పూబంపింది సవితయీ వరమ్మ । చాలకుంటే తెన్నుసరికొల్లలాడు
సరికొల్లలాడను సరిదాననటవే । సరిదాన్ని కాకుంటే శివుడేల దెచ్చు
శివుడేల దెచ్చును జగమేల మెచ్చు । శివుడికిచ్చిన్నాలిని నీకుచెల్లెలను
తన్నెనుతనసవతిగుండెల్లు గల । అక్క మీ పాదాలరాలినవన్న
సందుల్ని గట్టిస్తు గొందుల్ని గడుదు । కొడుకు వీరన్నకు కోటగట్టిస్తు
కోడలు భద్రాద్రికి మేడకట్టిస్తు । బసవన్నకు దుకు సేసంచటరుగేస్తు
శివునికి శివపూజ గద్దిగట్టిస్తు । నీకునా కు అనగ సరిగద్దెకడుదు
సరిగద్దెకట్టను సరిదాననవటవే । సరిదాన్ని గాకుంటే శివుడేల దెచ్చు
శివుడేల దెచ్చును జగమేల మెచ్చు । శివుడికిచ్చిన్నాలిని నీకుచెల్లెలను
తన్నెనుతనసవతిపళ్ళెన్నిరాల । అక్క మీ పాదాలరాలినపల్లు
కూర్చుండియేరిస్తుగుండుగంపలను । నిలుచుండి యేరిస్తు నిలువుగంపలకు
పండుండియేరిస్తు వకటయిన లేక । పిన్నలకు పెద్దలకు పెద్దలకు నీవుపంచిపెడితే
పసిపుత్రిబాలాదికేపంచిపెడుదు । సమముగా పంచిపెట్టనీవు సరిదాననవటవే
సరిదాన్ని కాకుంటే శివుడేల దెచ్చు । శివుడేల దెచ్చును జగమేల మెచ్చు
శివునికిచ్చిన్నాలిని నీకుచెల్లెలను । అనిపలికి గంగమ్మ జనెను మేడలకు
అంతటగవరమ్మకు చెంగుతనూనె । ఉదకాలజాడలు కానరావాయె
తనకొడుకు వీరన్నను గ్రక్కునా బిలిచి । రావోయి వీరన్న రాజశేఖరుడా
వయసుగలిగి వద్దిగాలుకీవు వీరన్న । ఉదకాలజాడలు కానరావాయె
ఉదకాలజాడలు చూచిరా కొడక । అటుబోయి వీరన్న ఆకొలను జూచె
ఆకొలమఉదకాలు దాచిందిగంగ । ఇటుబోయి వీరన్న ఈకొలను జూచె
యీకొలను నీరంత దాచిందిగంగ । చిలకసముద్రమున జాడచిన్నపెత్తులేవు
పాలసముద్రంజాడ పాతికత్తులేవు । ఎచ్చటతిరిగినా వుదకంబు లేదు
వీబూదిగుండాన యింకిపోయినవి । మల్లయ్యగుండాన్న మరిగిపోయినవి
పకతులగుండాన చట్టిపోయినవి । వెళ్ళెను వీరన్న గంగమేడలకు

శివపూజమాతల్లి చేసుకోలేదు । ఉదకాలజాడలుకానరావాయె
ఉదకాలజాడలు మిమ్మడుగమనెను । మీఅమ్మతక్కువేమినాయెక్కువేమి
పుట్టించగిట్టించ శివుడుకర్తగును । నోచిననోములకుగౌరితాకర్త
యేపొద్దుగంగతో యెదురువాదమ్ము । కూడదనిచెప్పమీఅగౌరతోను
యీపొద్దుగంగకుతాఁమెుక్కమనుము । గంగసమ్మతిచేతఘనఉదకమెుచ్చు
నదులన్నినిధులైనిండుండునయ్యా । స్నానపానమ్ములుసకలజపములు
నీరుంటెనెరవేరు నెలమివీరన్నా । మీతల్లిస్నానంబుఅటుజేయవచ్చు
అనిచెప్పవీరన్న తల్లి మేడలకు । చనిదెల్పెనీచక్కప్రదమంబుగాను
మీయమ్మతక్కువేమి నాయెక్కువేమి । పుట్టించగిట్టించశివుడుకర్తగును
ఆయుష్పపోయుటకు బ్రహ్మకర్తనెను । అందర్నిరక్షించవిష్ణుకర్తనెను
నోచిననోములకు గౌరియేకర్త । ఆనీళ్ళజాడకు గంగతాకర్తా
యేపొద్దుగంగతోయెదురుకయ్యమ్ము। యేపొద్దుగంగతోయెదురువాదమ్ము
కూడదనిచెప్పుమీ అగౌరితోను । యీప్రొద్దుగంగకు తాఁమ్రొక్కమనుమీ
గంగసమ్మతిచేతఘనవుదకమెుచ్చూ । నదులన్నినిధులన్నినిండుండునయ్యా
స్నానపానమ్ములు సకలజపములును । నీరుంటె నెరవేరునెల్లవీరన్నా
నీతల్లిస్నానమ్ముఅటుజేయవచ్చు । అనిచెప్పుమనిచెప్పెనమ్మరోయనగ
ఆపల్కులువినిఅంబతానుతులో । కంటనునీరుంచికఠినంబుగాను
నీచదానింటికిపోలేనుకొడకా । జాలారిదానితో పొత్తేలనునకు
నీవైయునకోయిరాముద్దువీరన్న । వెళ్ళెనువీరన్నగంగమేడలకు
యెన్నడునామేడయెరుగగవుతండ్రి । యేమిపనికొస్తివినీవువీరన్న
అనిబల్కవీరన్నగంగతోజెప్పె । ఐమిదినములనుంటస్నానంబులేదు
అరుదినములనుంచి శివపూజలేదు । శివపూజమాతల్లి చేసుకోలేదు
ఉదకాలుజాడలూ కానరావాయె । ఉదకాలజాడలు నిన్నడుగమనెను
మీయమ్మతక్కువేమినాయెక్కువేమి । ఆమెకంటెనువతి నాయందుకద్దా
ఉదకాలజాడలునేనెరుగనమెను । ఆమాటవీరన్నవిని నుండిపడుచు
తలపగులకొట్టైను చంపినేనెను । యమభటులకునిన్నునప్పగించేను
యమదండనలనిన్ను చాలజేతును । వద్దువద్దువీరన్నవావమ్ము నాతో
పోవోయివీరన్న పొంకమ్ముమాని । వచ్చెనువీరన్న తల్లిమేడలకు
యేమనిదెల్పెరా యెలమిగంగమ్మ । మీయమ్మతక్కువేమి నాయెక్కువేమి
ఆమెకంటేఘనత నాయందుకద్దా । ఉదకాలజాడలు నేనెరుగననెను
ఆమాటవిని పుర్నాదేవిదిగులంది । యెందుకీవైరమ్ము యేమిపాపమ్ము
దైవవిధిగనుపమెుతరమె యెవ్వరికి । శివునికిచిన్నారి శిరసెక్కగనక

ముచ్చట్లమురియుచు ముదితకూర్చుండె । అనితానుతలపోసి తాపయనమాయె
ముందరనువీరన్న వెనుకగణపన్న । యిద్దరినడుమను గౌరితానడచె
గవరప్పరాకలు గంగిప్పజూచి । పంచనచేరూటకు వనితతాదలచి
పచ్చిచేపలుదెచ్చి పందిళ్ళువేసె । గుండుచేపలుదెచ్చి తోరణాలుగుచ్చి
పెద్దచేపలు పంచెటరుగులుగట్టె । కప్పజచ్చిననీళ్ళు కళ్ళాపిజల్లె
చేపజచ్చిననీళ్ళు చెయ్యితాగడిగె । యెన్నడునామేడ యెరుగవూ అప్ప
ఏమిపనికొస్తివీ నీవుగవురప్ప । ఆమాటలువిని వారు రాణిజెప్పె
అయిదుదినములబట్టి స్నానమ్ములేదు । ఆరుదినములనుంచి శివపూజలేదు
శివపూజఅయినాను చేసుకోలేను । ఉదకాలుజాడలు కానరావాయె
ఉదకాలజాడలు చెప్పుగంగమ్మ । వుదకాలజాడలు నేనెరుగనెను
నాకొడుకువీరన్న నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగ
నీకొడుకువీరన్న నాకొడుకుగాడా । వుదకాలజాడలు నేనెరుగనక్కా
నాకోడలుభద్రగిరిని నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగా
నీకోడలుభద్రగిరి నాకోడలుగాదా । వుదకాలజాడలు నేనెరుగనెను
నాకున్నరవికెలు నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగా
నీకున్నరవికెలునాకునులేవా । వుదకాలజాడలు నేనెరుగనెను
నాకున్నచీరలు నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగా
నీకున్నచీరలు నాకున్నులేవా । వుదకాలజాడలూ నేనెరుగనెను
నాకున్నసొమ్ములూ నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగా
నీకున్నసొమ్ములూ నాకునులేవా । వుదకాలజాడలు నేనెరుగనెను
నాఒక్కశివుని నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగా
యిప్పుడన్నామాట తప్పకుమిఅక్కా । యీమాటకుసాక్షి యెవరినీబలికె
భూమిఆకాశమ్ము అవిరెండుసాక్షి । మద్దులుయూరేళ్లు అవిరెండుసాక్షి
సకలదేవతలువారెల్లసాక్షి । అనుచుసంతోషించి గంగప్పతాను
గుప్పుగుప్పనగంగ వుప్పొంగుచును । యేరులన్నీచాల యేకమయినిండ
గౌరిస్నానముజేసి శివపూజజేసి । శివుడొచ్చురాకలు గౌరితాజూచి
ముడిశాగరిమొక్కనబెట్టె గవరమ్మతాను । భోజనతలుపెయ్య మేలాయెనక్కా
భూమియాకాశమ్ము వారిద్దరసాక్షి । సుద్దులామూరెళ్లు అవిరెండుసాక్షి
సకలమైనదేవతలు వారెల్లసాక్షి । యీశ్వరాగవరప్ప యిచ్చెనునిన్ను
అనిచెప్పశివుడప్పుడుఅందరినిగలిచి । సాక్ష్యంబుచ్చుకొని సకియగౌరితో
మీకిద్దరకుకలహంబువద్దని । పలుకవారంతసఖ్యులై పొరలుచుండిరిగ

దుడుకున బాధించిదుఃఖపెట్టించె । అనిధర్మనందనడు అనినమాటలకు
వినియుసావిష్ణుండు వివరముగబలికె। వినవోయి ధర్మజా బహుళచింతలును
పోయేటిరొయుకవ్రితం అనతిచ్చెదను । భాద్రపదమాసమునశుక్ల పక్షమున
చతుర్దశితిథియందు అనంతువ్రతము । దానిప్రభావంబుదగనెరిగింతు
యమునానదికి నేగిపూజగావించి । పంచవన్నెలముగ్గు లమరబెట్టించి
సప్తఫణాకారసహస్రమూర్తి । కావించిఅపూర్ణకలశమందుంచి
పుష్పగంధాక్షితలఃపురుషోత్తమని । ధూపదీపములిచ్చిసయివేద్యమిచ్చి
పవిత్రముగకుంకవబొట్టుబెట్టి । పద్మాలఃగుమూరవస్త్రంబుగట్టి
అచ్చగోధుమపిండివంటకంజేసి । హెచ్చుగవిప్రునికఒకదానమిచ్చి
తోరితోరము చేతకోనగట్టుకుని । విష్ణుండ నేనుసుమికృష్ణుండ నేను
శివుడునే నేనఃబ్రహ్మయును నేను । సూర్యుండ నేనుసుమిచంద్రుండ నేను
అష్టవసువులు నేను శేషుండు నేను । ద్వాదశాదిత్యులఃయేకాదశరుద్రులు నేను
యాగంబులు నేనుయజ్ఞములు నేను । ప్రీతితో వేసేటిపిండాలు నేను
అర్థులకుబెట్టేటిఅన్నమ్ము నేను । ఋగ్వేదమ్ములఃయజార్వేదములు
నేను వేదమ్ములుసర్వమూర్నేను । అథర్వణవేదంబుఃర్థమ్ము నేను
అక్షయంబగుచున్నఆవటముక్రింద । అర్తితో కుడిచేటిబ్రాహ్మణుడ నేను
అశ్వత్థవృక్షమ్ముఅవనిలో నేను । మార్గశిరమాసమ్ముమహిమీద నేను
వారములలో కెల్లవిశేషమైన । భానువారము నేనుపార్థివోత్తముడ
యిన్ని నేనగుటకుయి దినిశ్చయంబు । ఇంతినంతసందేహమిసుమంతలేదు
నల్లకలువఃబోలుశాతికన్నులును । పీతాంబరధారినిపురుషోత్తముడను
శ్రీవత్సలాంఛనంచెన్నగలవాడ । ఆజానబాహుడఅనంతుడను పేరు
కృతయుగపుకథయొకటిగలదుచెప్పెదనుకలదుసుమఃతుడబ్రాహ్మణోత్తముడం
ధర్మవతియనునొకయింతిపెండ్లాడి । ధర్మార్థకామమోక్షంబులుజరిపి
సద్గుణశీలనొక సుతనుతాగనియె । సుతకుసుశీలయని నామంబులిడిరి
దైవవశంబునదేహంబువిడచి । సతియుమరణంబయిజనెనుకైలాసం
కర్కశయను పేరుకన్యకనుదెచ్చి । చేసెనఃపరిణయంనుమంతునవును
కర్కశదినదినఃయిల్లిల్లుదిరిగి । కలహంబుబెట్టునుకదుప్రేమతోను
వీధివీధులవారువెరచిపోయినను । వాడులేదనిపెక్కువాడలేదిరుగు
తోసెమ్మనీవునాతో వోడితివనుచు । అశమ్మరమ్మనుచుకాల్దువ్వుచుండు
వెలపెట్టికోన్నట్లువీధివీధులను । కలసిజగడము దెచ్చుకర్క శెప్పుడును
సుశీలపెరుగ బ్రాహ్మణునియింట । కన్యయున్నదనికౌండిల్యునకుదెలిసి
పరిణయంబగుటకువచ్చెనచ్చటికి । వచ్చినమునికితగవందనంజేసి

అర్ఘ్యపాద్యంబిచ్చి ఆసనంబిచ్చి । పెద్దలుంచిన శుభముహూర్తమున
వేదోక్తవిధముగా పరిణయంజేసె । భార్యను బిల్చి గా వేదబ్రాహ్మణుడు
సుతకు కట్నము యేమియిత్తామనెను । సుతకు పెండిలి యెట్లు జేయుదామనెను
పతిమాటలకు సతి ఆగ్రహంజెంది । పంట్లు పటకటగోరికి తల్పు మూయంగ
కూతుని అల్లునికి సారేమి లేదు । పేలపిండియిచ్చి అంపెదననుచు
పిండిమూటయుగట్టి బిడ్డకునిచ్చి । పంపెను కూతుర్ని తనపతితోడ
బంగారు రథమెక్కి మునితోడగూడి । పరగ సంతోషాన మునియానంచేసె
మార్గమధ్యంబున ఆయమునదరిని । పురుషులు స్త్రీలును నిండియుండగను
యిచటుండ కారణంబేమని వారినడుగ । అనంతుని వ్రతము ఆచరించితిమి
కాంతలనడిగెను మానీశ్వరుండు । యీ వ్రతము తెరగెల్ల మాకు దెల్పుడి
అనగ వనితలు మునికి అనతిచ్చిరి । భాద్రపదమాసమున శుక్లపక్షమున
చతుర్దశి తిథియందు భానువారమున । యమునానదికేగి పూజమరజేసి
పంచవన్నెలముగ్గు లమరంగయుంచి । సప్తఫణాహారమూర్తి గావించి
పూర్ణకలశంబు గట్టి పాలుపొందనిల్పి । పుష్పగంధంబులు అక్షింతలును
ధూపదీపము నిల్పి పూజింపవలయు । ముజ్జనికుంకుమ పట్టుగంటిబెట్టి
పద్నాలుగూమూర కాలువయుగట్టి । అచ్చగోధుమపిండి వంటలుంజేసి
హెచ్చయిన విప్రునికి దానంబుయిచ్చి । తోరము హస్తమందునగట్టి
భుజియించవలయును భూసురోత్తమ । అంతట సారుండు అతివేడ్కతోడ
యింటికి జనుదెంచి యింతితో గూడి । యమునానదికిబో స్నానమ్ము జేసి
వ్రతములు జేసిరి పృథివంత మెచ్చ । ఆతని విష్ణువు మెచ్చ ఆవిష్ణుండు
కుటీరములు దివ్యభువనంబులాయె । రత్నాలరాసులతో నిండి యుండెను
నవరత్నసొమ్ములు ముని భార్య బెట్టె । సుఖముతో గూడి శుభలీలనుండె
సతిచేతనున్న తోరంబు జూచి । పతికి గర్వంబువచ్చి పణతి ఇట్లనియెను
కంకణములాదిగా కరమునను యుండగ । నూలుదారంబేల ఓనారినుగిరో
అనుచు కోపంబువచ్చి హస్తంబుచేత । తాడించి మంటలో పడవేయగానే
యీమాత్రమునహిమచే నల్లభుకవిసర । అనంతుడు మనకిచ్చె నఖిలసంపదలు
అనుచుమండెడు అగ్నిలో నూలుదీసి । సుశీల తా వైచె క్షీరంబునందు
పశువులను దొంగలు తోలుకొనిపోయె । యిల్లు హుతాశనునకు వేల్పు ఆయె
వెళ్ళిన భాగ్యంబు వెళ్ళెలకడను । కుడువకూడును లేదు వస్త్రంబు లేదు
సతివివశచిత్త వ్రుడశికష్టపడును । పళ్ళతో నిండిన చూతవృక్షమును
చూచికనుగొంటివా అనంతునీయనిన । కాననని తా దల్పె చూతవృక్షంబు
కొంతదూరముబోయి ఒక గజమును చూచి । గజమని వెదుగుదువ అనంతుననెను

యెరుగననియేనుగు ఋషితోడబల్కె । వృషభము గార్దభమా రెండుగన్పడగ
చూచితిరెమాయనంత దేవునియనగ । యెరుగమనియా రెండుయేర్పడగదెల్పె
అవులేగ౯ జూచె నంతబ్రాహ్మణుడు । దేవునిజూచితిరే ధేనువాయనగ
యెరుగననియదిదెల్పె విప్రునికపుడు । యెండలకొండల యలసటనుజెంది
పారుండువడదగిలి పుడమిపైబడగ । వృద్ధరూపంబున యావిష్ణుమూర్తి
ఋషికితానెదురయి నిల్చుండియడిగె । అలసియుసొలసియు అన్నమిటులేక
కారడవులలోదిరుగ కారణంబేమి । చేరువదేవేంద్రపట్టణంగద్దు
పోయిభుజించుము ఋషివర్యయానిన । వెళ్లెనుబ్రాహ్మణుడు దివ్యనగరమునకు
నవరత్ననిర్మితనగరు గనుగొనిరి । ఆడెదురంభలు అప్సరస్త్రీలు
తుంబరులునారదులు గానములుసేయ । శేషపర్యంకమున బ్రహ్మాండమూర్తి
శ్రీదేవిభూదేవి పాదంబులొత్త । దర్శనంబిచ్చెనాధరణిసురునకు
పూర్వజ్ఞానంబున దెలిసిబ్రాహ్మణుడు । ఓపుండరీకాక్ష జేచక్రహస్తా
జేజగన్నాధరో గోపాలకృష్ణ । అనుచుస్తోత్రముచేయ నామురవైరుండు
మూడువరములు౯గోరు నీకిత్తుననగ । సతిసుతబాంధవులు గల్గ నొకవరము
అష్టధనములు౯గల్గ రెండువరములు । మూడువరములతో సాయుజ్యమిమ్ము
యిభరాజవరదుండ యిచ్చెవరములు । వరములనుహిచేమ౯వరలిబ్రాహ్మణుడు
అడిగెనాబ్రాహ్మణుడుఅనుమానములు । ఓభక్తకల్పకా దేవదేవేశ
విందుగా కాపెనెనే చూతవృక్షంబు । పండయినముట్టదే పక్షికొక్కటయిన
అచూతవృక్షంబువేదపాఠకుడు । శాస్త్రమెవ్వరికినీచెప్పకయున్న
అతనికియీగతిఅనతిచ్చితిని । యేనుగనుజూచితినిరో దేవదేవా
యొకరాజాపాదము చేకుంజరంబాయె । గార్దభముజూచితినికరుణాకరుడా
యీవిధియివ్వనివానికీగతిగల్గె । ఆబోతుజాస్తినీవారివారిదినిన
హంకారమనియేటిఆదిజీవరాశి । అనిఆవిష్ణుండుఅన్నమాటలకు
సంతోషమునుజెందిపాండవాత్మజులు । ధర్మజుడుజేసెనేఈపుణ్యవ్రతము
పోయినారాజ్యంబు అష్టసంపదలు । యిచ్చెనువిష్ణుండుయీప్సితార్థములు
వందనంజేసిరివరాహరూపునకు । కష్ణజేకృష్ణజేకృష్ణమ్మదలతు
యిష్టసంపదలు౯మాకిచ్చిరక్షించు । పాపములుపడద్రోచిమమ్మురక్షించు
కాళింగవర్దనుడ కాచిరక్షించు । గోపికావల్లభా శ్రీపద్మనాభా॥

---

# 48 ఉషా స్వప్నము పాట.

(ఆటలన్నియూ గలవు)

అన్నంబుదినరాదాయె నాటలకుబోదాయె । నట్టినిలుచుండునంత
నిదురబోదాయెను నీరంబుగొనదాయె । నేలబున్నుండునెపుడు
కలువరింపు మనుండు గలకంఠివనుచుండు । పలుకదెవ్వరితోడను
పూలుగోయదాయె పుష్పాసుల్గొనదాయె । బుద్ధినిలకడసేయదు
పన్నీరుగొనదాయె పరుపుముట్టదాయె । పాటలుపాడదాయె
కథలుచెప్పదాయె కబురులాడదాయె । కాంతలతో గూడదాయె
సుందనగిదియాడదు గుడిగుంజలాడదు । దాగుడుమూతలాడదు
ఊగెయ్యాలాడదు దాటుబిళ్ళాడదు । గిట్టమీదకోడియాడదాయె
నెత్తినగాళ్ళాడదు వాత్తిచేతులువేసి । కత్తిబదాటాడదు
వామనగుంటలాడదు పాచికలాడదు । వాంలాటలాడదు
బంతులాటాడదు ఒరచజల్లినయట్టి । చింతగింజలాడదు
బొమ్మలాటాడదు బూజమాటాడదు । నిమ్మసిళ్ళాటాడదు
నాయప్పసవరమును నాకిదెమ్మనునాట । సయ్యముతోతానాడదు
వానవానచెల్లప్ప వాకిలదిరుగుచెల్లప్ప । పాటలాడదెపుడు
చల్లోయమ్మచల్లలని స్తంభములుపట్టుకుని । గొల్లాటలాడదాయె
వెన్నెలాత్తాడదు వెలదులనుగూడుకొని । వెసగద్దుకదురాడదు
కాళ్ళగజ్జెయనుచు కంకణమ్మెయనుచు । కాంతతానాడదాయె
వేగుచుక్కయని వెలగమొగ్గయని । వెలదితానాడదాయె
దోపిడీపుల్లయని దొంగాడిపుల్లయని । తొయ్యలియాడదాయె
చిన్నిబిన్నెంతగద్దు సింగరగాఱెంతగద్దు । తాళిబేళెంతగద్దు
తానురమొగల్లాయని తద్దాటలాడదు । తరుణిటిల్లాటాడదు
చెమ్మచెక్కయని చారడేసిబుక్కయని । సఖియుతానాడదాయె
అట్లుపొయ్యంగనని ఆరగించంగనని । యతివతానాడదాయె
దాచుకోమూచుకోసంబారిబుద్ధియని । తరుణితోబంతాడదు
చిత్రరేఖయుసాడిచెలికతైదరిచేరి । చెలియతోనిటులబల్కెను
పూర్వరీతిగేకపోలికంతయుమీరి । పూబోడియెటులుంటివె
నీకుగలిగినకలయు నీమదిగలకోర్కె । నెలతనాతోజెప్పవే
సుందరుడెవ్వడో చూరగొనెనీమనసు । సుందరాంగిరోపల్కవే

వెలసివీలీల నెడదచింతింగ । నెలమి నాతో దెప్పవే
చెలికత్తెకడనిటుల చెప్పకుండుటతగదు । చెలగి సత్యము జెప్పవే
ఎన్నడును యిటువంటి వెరుగవు సేకిటు । లేటికే చింతింపగా
దుస్స్వప్నమాయెనో ధూళి పడనాయెనో । దోషంబు బాయుకొరకు
రక్షరేకును గట్టి రమణి మంత్రించి । రాత్రి భూతీ యిసంగవ
తాయెత్తు గట్టెదను తరుణిరో చెప్పవే । తగనిటుల కృశియించగా
అనినవ్వు మ భూతమంట లేదతివరో । యాత్మచోరుడు వచ్చెనే
అనగానె చెలికత్తె యంతయును దెలుసుకొని । అతివ యింద్రుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యింద్రినాయకుననన్న । నతిపాపమబ్బునాకు
అనగానె చెలికత్తె యంతయును దెలుసుని । యబ్జభవుడే తెంచినా
అనగానె కాదమ్మ అబ్జసంభవునన్న । నతిపాపమబ్బునాకు
అనగానె చెలికత్తె అంతయును దెలుసుకొని । యార్యావిభుడు వచ్చెనా
అనగానె కాదమ్మ మారుడంచు బల్కినను । నతిపాపమబ్బునాకు
అనగానె చెలికత్తె యంతయును దెలుసుకొని । యాజయంతుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యలజయంతునినన్న । నతిపాపమబ్బునాకు
అనగానె చెలికత్తె యంతయును । దెలుసుకొని యలవసంతుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యావసంతునినన్న నతిపాపమబ్బునాకు
అనగానె చెలికత్తె యంతయును దెలుసుకొని । యాకుబేరుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యక్షేశుననివచో । నతిపాపమబ్బునాకు
అనగానె చెలికత్తె యంతయును దెలుసుకొని । యబ్జబంధుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యబ్జబంధుండనిన । నతిపాపమబ్బునాకు
అనగానె చెలికత్తె యంతయును దెలుసుకొని । యానిశాపతి వచ్చెనా
అనగానె కాదమ్మ యానిశాపతికన్న । నతిపాపమబ్బునాకు
అనగానె చెలికత్తె యంతయును దెలుసుకొని । యంబుజాక్షుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యంబుజాక్షునిరూప । మనుసునే కొంచెముగను
అనగానె చెలికత్తె యంతయును దెలుసుకొని । యామన్మథుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యామన్మథునిరూప । మమరెచాలవరకు
అనగానె చెలికత్తె యంతయును దెలుసుకొని । యనిరుద్ధుడే తెంచెనా
అనగానె కాదంచు నవునంచు బల్కక । యతివశిరమును వంచెను
చేతితో దలయొత్తి చెలికత్తెనవ్వినను । సిగ్గుచే దలయొత్తదు
కాలివేలితోడ నేలను రాయుచును । కాంతదా తలయొత్తదు
పయిట సవరించును పాపిడి నిదిద్దును । పడతి తా తలయొత్తదు

మురుగులొత్తుకొనుచు ముక్కెరసరిదిద్దుచును । మదిరాక్షియొత్తదు
కురులుదిద్దుకొనుచు కొప్పుసవరించుచు । తరుణితాతలయొత్తదు
ముఖముపైచెమ్మటను మాపటితో తుడుచుచును । సఖియతాతలయొత్తదు
రత్నాలహారమునురదనమున దొరకుచును । రమణితాతలయొత్తదు
రవికముడిగిల్లుచును రాయిడికినొక్కుచును । యువిదతాతలయొత్తదు
అట్లుండచెలికత్తె యంతయును దెలుసుకొని । యామెతండ్రికినిట్లనె
అయ్యానీపుత్రికకు యవ్వనముపచ్చెను । అనిరుద్ధుమీదిప్రేమ
కలగాంచనిత్యమును పలవించుచున్నదిక । కౌతుకముసేయవలయు
ఆన నుషాజనకుండు హర్షణంబుమితిమీరి అట్లనేచేతుననగ
ఆమాటచెలికత్తె యామెయొద్దకుబోయి యంతయును దెల్పగాను
ఆకొన్నమనుజునకన్నంబుదొరకిన । ట్లామె సంతోషమొందె
పేదకునులభియించు పెన్నిధివిధంబునను । వెలదిసంతోషమొందె
దగగొన్నమనుజునకు దాహంబుదొరికిన । చందమున సంతోషమొందె
నడిరేటమనుజునకు నావదొరికినయట్లు । నాతిసంతోషమొందె
పడగొన్నసస్యంబు వానదడిపినయట్లు । వనితసంతోషమొందె
తరువాతవారలని తనరవివాహమై । ధరణిసంతోషించిరి
ఈపాటపాడిన కన్యలకునుపెండ్లి । కావచ్చు హరికరుణను

# మైరావణ చరిత్ర పాట.

రాణువపోరెను రాజ్యముపోవును । రామయుద్ధమందు ఆహా!
పరబలమునసే మిగిలియుండినను । బ్రతుకుతెరవుతగునా
రాముడునరుడని తలచినందులకు । రాపిళ్ళయెయ్యెనుగా
కోటిలోనతల దూరిచియిప్పుడు । కోకటికై వెరపా
కలదుగదానొకమిత్రుడువాడు । బలవంతుండతడు
పాతాళంబునరాజ్యమేలుచు । ప్రబలియుండువాడు
నవరత్నంబుల దగద్ధగితమగు । సింహాసనము
దానిమహిమచే నాతడేలుపా । తాళముగడగడగా
అపదిమిత్రిము సంపదిమిత్రిము । అతడేయాజాడ
ఆపదధర్మోద్ధారకంబుగా । నతనిదల్తునిప్పుడు

## రావణుడు పతితావలంకేశ్వరుని దలచుట.

దలపుదలపులో తగిలియుండగనే । తనకెదుట నతడు
పతితావలంకేశుండను వాడు । పనికని యడుగుచును
వానిజూచి సంతోషముగా । వణుడు పల్కెనపుడు
రాఙుపపోయెను రాజ్యము పోవును । రాముయోధుడు
వరబలమున నే మిగిలియుండెను । క్రతువు తెరవు తగునా
ఆపలుక్కులువిని యతిరౌద్రముతో । యనియెనతండిట్లు
వరపులస్త్యునికి పరపౌత్రుడవు । పాడియయ్యెయిట్లు
దీనజనుసివలె దీనతిబల్కుట । మానుష్యా ఋపుడు
నాజీవంబును ధారపోతు ని । ర్ణయము చెప్పుమనగ
రామలక్ష్మణాలు శూర్పణఖను శూరి । మముగదరిగినారు
దానియేద్పువిని చెవులు తెగుటగని । నేనుపోతినటకు
మారీచుడునా వెంటవచ్చె కడు । మండిభటుండతడు
వాడులేడియై మాయజూపగా । వానివడతిసీతా
లేడినిదెమ్మని రామునిచాలా । వేడగానునతడు
మాయలేడియది మనకేలనగా । మటసినదు సీతా
అంతట వాడడు రాగ లేడియై । మాయుదారితీసె
రాముడుదానిని వెంటపగిలి యట । రాకయుంటజూచి
మరదిలక్ష్మణునిపంపె నచ్చటికి । మహిళామణియంత
ఆమె ఒంటరిగానుండగనుంగొని । కామార్థతినేను
పోయి విమానముపైనెక్కించుకు । పోతినతిపగొనుచు
క్షత్రియవీరుడు రామనరుడు నను । చంపి సీతగొనగ
యెత్తువేసెనొక పెద్దయెత్తు యది । యేమనియడిగెదవా
ఎరుగుదుగద వానిలి శూరుని । హితుడంగునకు నతడు
ఆతనిజంపి వాలినిసతినిసుగ్రీవున । కితడొసంగినాడు
దానితోడ సుగ్రీవుడుకోతుల । దానపొసంగినాడు

### హనుమంతుడు వార్ధి దాటుట.

వారిలోన హనుమంతుడొక్కడు । వార్ధిదాటినాడు
లంకజేరి, మనలంకిణిజంపియు । లలనసీతవార్త
రామలక్ష్మణులకెరిగించియు పో । రాటబెంచినాడు
వారధిదాటగ కోతిమూకచే । వార్ధిగట్టినాడు

దఢదడదడదడ ధవుడాయించుచు । తరలెకోతిమూక
దండలు కేలు లక్షలకోలదిగి । వచ్చిచేరి లంక
దణదణదణణదధవుడుచేసిరి । దండుగట్టుకొనుచు
మంత్రిప్రహస్తుడు చిటికెలోన । మటుమాయింబైనాడు
అతికాయుండును మహాకాయుడును । అకంపనపుత్రుండు
మకరాక్షుండు మహోదరుండును । మహాపార్శ్వకుండు
కుంభనికుంభులు ఇంద్రజిత్తును । గూడిన పుత్రకులు
హతమైనారని రావణుండు తా । వాడలియేడ్వగాను
మిత్రుడు కన్నుల నీరుదెచ్చుకొని । మేనుగదలగాను
చెప్పవైతివే దలపవైతివే । చెనటినరుండెంత
అనవిని పౌలస్త్యుండనె నిట్టుల । నతడునరుడుగాడు
మనవిభీషణుడు వానికూడికదా । మంతనంబుసల్పి
రాజ్యమిట్టిగతి దెచ్చినాడుసుమ । రాముడులేకుంటే
లంకదాటియిటు కాలుపెట్టుటకు । జంకకుంపలేదు
బొటబొటబొట కన్నీరుగారగా । వాడలుచుదుఃఖింప

## ప్రతాపలంకేశ్వరు డోదార్చుట.

గని ప్రతాపలంకేశుండిట్లనె । వనటమానుమయ్య
నేటిరాత్రియే రామలక్ష్మణుల । వీటబుచ్చికాళి
కాలయంబునను బలియిచ్చెదముహం । కాళిదేవికిపుడు
అపలుకులువిని యానందముతో । ఆరావణబ్రహ్మ
మంచుకొండవలె పొంగిపోయెను । మంచువిరిగినట్లు
తనమెడనున్న చంద్రహారమూ । తనిమెడజొట్టుచును
దండము దండము దండమనుచు పడి । తడవలు పొగడగను
పాతాళేశ్వరుడప్పుడుపోయెను । పాతాళంబునకు
పోయిరాములను పట్టితెచ్చుటకు । బోదమనుచుతలచి
బహుప్రయత్నములు సలుపుచుండెనట । భవ్యులతోనిచట
దెబ్బతినినపులి రావణాసురుడు । బొబ్బరించుచిపుడు
రాడు, రానికారణమేమోయని । తోడివారలెల్ల
నాలోచించ విభీషణుండు తా । లోనికేగియపుడు
తనప్రియురాలిని సరమజూచి తా । రణమేఘునియాడుగ
సభకువచ్చి సుగ్రీవాదులతోనిటు । సలిపె భాషణంబు

రావణునికి పాతాళరావణు మై । రావణుండుగలడు
మాయలమల్లుడు మోసగాడు బలుం । మాటకారియతడు
రామలక్ష్మణులమోసవృత్తిచే । రాత్రిపూట యతడు
దొంగిలించుకొని కాళిదేవికి । బలియిచ్చెదననుచు
చెప్పిపోయె మనకేమిదారియని చిత్తవ్యాకులుండై
బలికిన నందరు వాదుగజాలిరని । భయకంపితులైరి

## హనుమంతుడు శ్రీరామలక్ష్మణుల కాపాడుట.

తుదకువిభీషణుడిట్లనె హనుమం । తుని ముఖంబుజూచి
నీవలన నెగావలె యేపనియైనను । నీకంటెను ఘనుడు
స్వామిభక్తుడును బుద్ధిమంతుడును । సచ్చరితుడుగలడె
సుగ్రీవాదులు జాంబవంతుడును । స్తోత్రములొనరింప
పొంగుచు పెంచెను హనుమంతుడపుడు । పూర్ణముగనుతోక
పాతాళాంతరమునసుండియు నది । బర్వె సకలలోక
వ్యాప్తంబై బ్రహ్మాండమంతటను । ప్రబలుచుండెనపుడు
ఆవాలంబున కట్టె కోట భువి । నంటనుండుచోట
అచ్చటనుంచెను రామలక్ష్మణుల । నంటముట్టరాక
పారాకుంచిరి వానరకోటుల । పరిబలి చుట్టుజేరి
పోటుబంటుడై జాంబవంతుడును । చాటుమాటుగాను
పారాయిచ్చుచు వచ్చిపోయెడి । వారినిగనుచుండె
సుగ్రీవాంగద గంధమాధనులు । సుషేణులుగ స్త్రీలు
తిరుగుచు మరుగుచు చూచుచుండిరి । తెరపిలేక యెపుడు
వేగుమాపుతో దిరుగుచుండె వి । భీషణుండుచుట్టు
ఇట్టులవానర వాలపుకోటను । గుట్టుచెడకయుండ

## పాతాళలంకేశ్వరుడు రాముల దొంగిలింపజూచుట.

పాతాళంబున మైరావణుడు । జాతదయాపరుడై
రావణబ్రహ్మకు మాటయిచ్చిన । రాముంబట్టంగ
విధిచెందుటిది మిత్రధర్మమా । నిందవచ్చుననుచు
మూడవజామున నిద్రలేచి సతి । మోముజూచునంత
ఆడదాననని యుగడుసేయకుడు । ఆడెదనొకమాట
మీరుమనసులో రాముని బట్టగ । కోరుచుంటిరాన
రాముండీశ్వరునవతారమ్ము । సీతయాదిశక్తి

వారిబట్టగాబోయిచెడెను రా । వణుడులంకతోడ
గోలుపోయెపుత్రులను బంధువులు । గోలుపోయెలంక
గోలుపోయె సోదరువిభీషణు । గోలుపోవుయుసురు
స్త్రీచెరబట్టిన శిండాలుండని । స్త్రీలుగోణుగుచుండ
శిగ్గులేకయె తమ్ముజెరిచెనని । స్త్రీలుతిట్టుచుండ
తరుణినిమ్మనగ తన్నుదన్నెనని । తమ్ముడెడలుచుండ
తనయులుబంధులు పోదురనుచుతన । తరుణిదుఃఖమొంద
ఇప్పుడో ఇంకనుకానేపటికో । యీల్గనున్నవాడు
కడుదుర్మార్గపు చేష్టలచేతను । కాగియున్నవాడు
వానికిబాసటగాజనినీవును । బంధుజనులతోడ
పరిజనములతో సతీసుతులతో । మరణముకెందెదవా
పాతాళంబు సమస్తభాగ్యమును । పాడుచేయదగునా
అనివాపోయెడి తనసతిగాంచుచు । ననియెను వాడందు
ఆపద్ధర్మముగా నన్నడిగెను । అతడు రావణుండు
మాటయిచ్చితిని రాముదెత్తునని । మాటపరాకయిన
నీతిదప్పుదును ఖ్యాతిదప్పుదును । నీమముచెడబోవు
కావునతప్పదు రామునిదేవరె । కాదనకింకమీద
ఘటికాసురుడా కాగలకార్యము । ఘటనచేయుమయ్యా
ఓయి సుచర్మక ఓయీఘటకా । నోపికబూనుచును
మీరిద్దరులంకాపురమునగల । వీరులైన రామ
లక్ష్మణమూర్తుల దెండిశెగమే । తక్షణంబు పోయి
వారిగాత్రి మన కాళీదేవికి । వారబోయవలెను
వారితలలు మనకాళీదేవికి । బలులుపెట్టవలెను
చెల్లెలిముక్కు చెవులనగోయగ । చెల్లెలేడ్వగాను
అన్నయుండి తానూరకుండునా । అవిడయేడ్పులకు
అందమైనదా సీతయంచును । అవిడచెప్పగ
పోయి కష్టపడితెచ్చె రావణుడు । పాలతిలంకలోకి
అంతమాత్రమున కింతయుద్ధమా । ఎంతపొగరొ చూడు
వాలిజంపి సుగ్రీవునకిచ్చెను । వానిభార్య తార
ఏమిధర్మమో ఏమినీతియో । ఏమిరాజకొడుకో
కోతిమూకలను వెంటవేసుకొని । కొండలగొట్టుచును
వార్ధిగట్టెగద సేతుబంధనము । వానితీరువాడు

పోండి పోండి లంకాపురికిప్పుడు । పోండి తెండివారి
స్వామిభక్తిగలవారలయితిరా । వారి తెండి యనగ
మంత్రులిద్దరు బయలుదేరిరి । మంచిదనుచు లేచి

## ప్రతాపుని మంత్రి లంకలోనికి వచ్చుట.

త్రుటిమాత్రంబునవచ్చిజాడ । నొక్కటిగానరుగా
ఎక్కడజూచిన తోకయొక్కటే । నిక్కమని పెంచె
దానికితుదయు మొదలునులేదు । దానిలేదు తెలియ
పాతాళంబున తోకయున్నది । బర్వెనిటునదియు
భూమ్యాకాశంబంతయుతోకయె । బుద్ధిమకిలపడియె
ఘటకుండప్పుడు తోక పండ్లలో । కడగియెత్తగాను
పండ్లువిరిగెను తోకలేవదు । బరువుగాపలేక
దొర్లికిందబడిదొర్లజొచ్చెను । తోకతాపుచేత
రెండవమంత్రియు తోకముక్కులో । చెంపజాచెగాని
ముక్కువిరుగగా మూలబడియెను । మూల్గువెంటబడగా
ఇద్దరుమంత్రులు దద్దరిల్లుచును । యిద్దియేమిమాయ
ఎవ్వరితోకది యొక్కడతోకిది । యేమితోకయనుచు
నెవ్వరినడిగిన నెరుగమనిరిగా । నేరుపరుపలేక
తిరిగితిరిగి చెడతిరిగి మరలి వే । మరలివచ్చివారు
స్వామితోవారు తిరిగినాము మా । స్వామిభక్తిచేత
ఎక్కడజూచిన తోకమాత్రమే । యెరుకపడునుగాని
పుట్టువెక్కడో అంతమెక్కడో । బుద్ధితోచలేదు
తిరిగినాము చెడతిరిగినాముగుమి । దివ్యప్రభూత్తంపా
యనుమాటలవిని యాతడునవ్వుచు । నవియెనిట్టులపుడు
పోయి తెచ్చెదను రామలక్ష్మణుల । పోండియిళ్ళకును
భద్రము భద్రము పాతాళంబున । భద్రమనుచుజెప్పి

## ప్రతాపలంకేశుడే రాములను గొనిపోవుటకై వచ్చుట.

ఒక్కక్షణములో నెగిరిపోయి । నాదిక్కువ్రాలినాడు
నిమిషములోన విభీషణుభూమిక । నెటియుదాల్చినాడు
చూచినవారు విభీషణుడేయని । శుభములడిగినారు
ఇక నోకజామే పొద్దున్నదనుమ । యేమరి యుండకుము
రామలక్ష్మణుల నోహనుమంత । రక్షింపుమిజాగ్రత

యనిహనుమంతుని ముఖమువారంబున । జని వారినిగాంచి
మోహజనకమగు పుష్పొడిజల్లిన । మూర్ఛిల్లినవారి
రామలక్ష్మణులనిద్దరిపెట్టెను । గోముమీరబెట్టి
పెట్టెచంకలో పెట్టుకవచ్చి । కీర్తిగదురననియె
ఓహనుమంతా మైరావణుడు । హోయలకారివాడు
మాయవేషములు దాల్చివచ్చువాని । మాయ తెలుగలేరు
జాగ్రత జాగ్రత పోయివచ్చెదను । జాగ్రతనుమ్మయ్యా
అనుచుబోయి పాతళమందుగల । అంబికగుడిలోను
పెట్టెదించి యాగుడికితలుపును । బెట్టి భార్యకడకు
వచ్చి యిట్లనె ఓమాతంగీ । దెచ్చినానువారి
దెచ్చినానునిమి కాళికిబలిగా । యిచ్చువాడ రేపు
ఆమాటలువిని గగడ వడకును । ఆమెయనియెనారా
చేయరానిపని చేసినందుకును । చేటువచ్చుమనకు
లంకపాడుపడు రావణుజచ్చెను । పొంకవదుగు మనకు
నిన్నువారె బలియిచ్చెదరపయి । నిజము దెలియలేవు
రామలక్ష్మణులు దేవులువారిని । దోషులనుచుదెచ్చి
చంపజాచెదవు పిచ్చివాడ నీ । సాహసమేమందు
ఇప్పుడయిన గొనిపోవారిని । చప్పుడుగాకుండ
లంకలోననిడి చెంపకేసుకొని । నింకబ్రతుకవాడు

ఇచ్చట విభీషణాదులు రాముల పోకడ గనిపెట్టుట.

ఆనెడు భార్యగని యదలాయించుచు । నలిగెను నాతడు
ఇచటలంకలో విభీషణాదులు । ఇంపుమీరగ స్త్రీ
తిరుగుచునెప్పుడు తెల్లవారునా । దివ్యమూర్తులకును
యుద్ధవిజయమును రావణువధయు । నెప్పుడుజరిగెదునో
జాగ్రత జాగ్రత హనుమంతుడా । జాగ్రత్తవినిపలుక
ఘనువిభీషణుని గాంచివానరుడు । కదగియిట్లనియె
యిప్పుడేగదా వచ్చిపోయితివి । యింటిలోనికనగ
తెల్లపోయియనె విభీషణుండు । తెలిసితప్పినాము
నావేషముతో మైరావణుడు । మనలమోసపుచ్చె
వదదు పడుడని లోనికరుగగా । ప్రభులు లేరుచూడ
లోకచట్టయేచట్టకొన్నది । శ్రీకరుంటలేరు

ఏమిచేతమని పిలుగుకొనుచు । వారేమిచేతమనుచు
సుగ్రీవాంగద జాంబవంతులు । సుషేణులనువారు
కపికోటులు భల్లూకకోటులును । కకవికలైయుండిరి
ఎవరికోసమీ యుద్ధముజేసితిమి । యెవరికోసమిటుల
వార్థికట్టి రిపువర్గముచంపితిమి । పారావారంబు
తల్లడిల్లగనులంకాపట్నం । బెల్లకూల్చినాము
ఏమిచేతమిపుడేమిచేసి ప్రభు । హితముజరుపగలము
అని చింతించుచునుండ విభీషణు । డనియె నపుడులేచి
చింతించుటచే కార్యంబౌనే । చింతమాని యిపుడు
చెప్పెడుపలుకులు వినియాకైవడి । చేయదలచుకొండి
లంకకెడమపార్శ్వంబున కవతల । లావుమీగులువనము
కలదా వనిలో కలదొకకొలను । కలువలుతామరలు
సొగసగుపూవులు సువాసనలతో । సొగసుగులుకుచుండు
అందొకపద్మము శతపత్రంబది । సుందరంబుగాను
వికసించును నోంకారవిధమున దా నిని । వేడుకగునుచూడ
దానినాళమతిసూక్ష్మము సుమ్మీ । దానిదూరిపోగా
పాతాళంబగపించును చూడగ । ప్రభలవెలుగుచుండు
మైరావణుడా పాతాళంబున । మహిమమీరనుండు
వాని జయించియు రామలక్ష్మణులు । బూని తేరవలయు
నని చెప్పిన వినిహనుమంతుండె । మనవిభీషణాధ్యు
జాగ్రత తోడుత చూచుచుండుడీ । సకలజనులుకలసి
అనిచెప్పుచు తాసూక్ష్మరూపియై । అపుడా కొలనికిపోయి
పద్మనాళరంధ్రముజొచ్చియు । పాతాళంబునుగనెను
ప్రథమద్వారము బుడబుడదూరగ । పారాయిచ్చుచునున్న
మత్స్యవల్లభుడు మారుసుతుని । మరిమరి గిరగిర త్రిప్పి
విసరివేయగా పద్మగర్భమును । వెలువడికొలనికివచ్చి
పద్మనాళరంధ్రముజొచ్చియు । పాతాళంబునుగనెను
ప్రథమద్వారమును పరుగునజారగ । పట్టుకొనెనుమరల
మత్స్యవల్లభుడు మారుతిసుతుని । మాటిమాటికిటువేయు
వచ్చిచిక్కులను పడిరోదవయ్యె । వచ్చినట్లెపొమ్ము
ఈపలుకులువిని హాశ్చర్యంబున । నిట్లడిగెనునతడు
ఎవ్వరిపుత్రుడ వెక్కడివాడవు । ఇక్కడపనియేమి

ఘనవినుమని యాతండుచెప్పెను । ఘనము మీరగాను
వినియుందువుగద రామచంద్రుడను । ఘనదైవతమొకడు
సీతాదేవిని రావణుండుగొన । చింతపొగిలి నప్పుడు
హనుమంతుడను వానరేశ్వరుని । పనిపెసీతజాడ
జామపోవుచుండప్పుడు దధిపై । నంబుజేయుచుండ
జారిపడెను చెమ్మటబిందువు ను । మత్స్యంబొకటి మ్రింగి
గర్భము దాల్చగ నేజనియించితి । క్షణములోననప్పుడె
మత్స్యవల్లభుండందఱునన్నని । మనుతిమీరబల్కి
కౌగిలించుకొని పుత్రకుండనని । కడు సంతోషముతోడ
నే హనుమంతుడనని నాతడువిని । నీనిజరూపముజూపు
మనవుడప్పుడా హనుమంతుడు తన । రూపునికిజూపగాను
తప్పుగాయుమని ధరపైవ్రాలు । తండ్రిపాదములబట్టి
లేవదీసి సుతుతోడ జెప్పెనిటు । రావణుండు సీత
దెచ్చిన జాడనుచెప్పినరాముడు । దైవ్యరయుద్ధము జేసి
ఓడజేసిన పౌలస్త్యునిసుతు । డోడిమిత్రుడైన
మైరావణుడేమాయల బఱపితో । మా రాములదెచ్చి
పాతాళంబునబెట్టినాడు నే । పగిదినైనవారి
గైకొనిపోవలె రాముకార్యమిది । కడగిచెప్పుమునిన
స్వామిద్రోహముకాదా మర్మము । నీదు మెసలిచెప్ప
తండ్రివిగావున చెప్పెదనొక్కటి । ధర్మమొప్పగాను
ఇదిదాటినగలదు తులారంధ్రం । బదిదాటగనచట
నలుబదికోటుల రక్కసిమూకలు । లుతెరగులనుసుంద్రు
వారిదాటినను ధ్వజస్తంభ ను । వ్రేలను గానుపించు
తొంబదికోటులరక్కసి మూకలు । తూగుచుందురచట
వారిదాటినను కాళికాలయము । వరలుచున్నదచట
అచ్చట తక్కినసంగతులన్నియు । నపుడె తెలియుపొమ్ము
పరేమంచిదని పుత్రునువీడగ । చరచరలాడుచునపుడు
హనుమంతుండపు డరుదెంచెను నా । కొలనుదరికివేగ
అప్పుడె యచటికి కలశోదకము । జొప్పడగొనిపోయి
రామలక్ష్మణుల స్నానానంతర మా । సుహానీయులకాళి
గుడిలో బలిపెట్టగ దోర్దండియు । గోరివచ్చెనార
అనుహిళామణి రామలక్ష్మణుల । అన్నజంపుననుచు

కించపడుచు లోగుందుచునుండెను । మంచికాంతిగాన
ఆంజనేయుడీదోర్దండినిగని । అడిగెనువినయముగా
అమ్మచెప్పుము భయములేదు నే । నమ్మగాములను
అనగా నామెయు చెప్పెయుదంతము । ననుమానముమాని
అంతటనాతడు నామెకలశలో । వింతకెప్పయుగుచు
దూరెనామెతో తులారంధ్రమును । దూరుచుండగాను
పెళపెళపెళమని పెద్దమ్రోతతో । భీతిగలుగునట్లు
తులారంధ్రము విరిగిక్రింగబడా । తోడనె రాక్షసులు
ఎక్కడదాస్తివి దొంగవాడు నీ । కెక్కడతాదొరకె
ననుచుండగ నాసాంజనేయుడది । విని బ్రహ్మాండముగ
తోకబెంచి ఘనకాయముబెంచుచు । తోలెనువారలను
కొందఱజంపెను కొందఱజిదిపెను । కొందఱబోడిచేసె
చిందరవందర చేయగతక్కిన । చీమరక్కసాళి
పారిపోయిరా ప్రాంతమునుండి । తేరిచూడకుండ
ఆంజనేయుడావెన్క ధ్వజస్తం । భంబుకదలురాగా
తొంబదికోటుల రక్కసులప్పుడు । దొడరిపోరగాను
కొందఱజంపెను కొందఱజిగిపెను । కొందఱబోడిచేయ
పారిపోయిరా తొంబదికోటులు । తేరిచూడకుండ
అప్పుడుకాళీయాలయమందున । నొప్పుతిరిగియున్న
రామలక్ష్మణులపెట్టెజూచి తా । రయమునగొనబోగా
నక్కడిరక్కసమూకలు రేగి । యుక్కుమిగిలిపోర
కొందఱబాదెను కొందఱమోదెను । కొందఱపరువగను
మిగిలినవారలు పారిపోయి యా । వగ ప్రభునకు దెలుప
నాతడుగ్రుడ్డై మంత్రిపుంగవుల । నాహ్వానముజేసి
యేమిచిత్రమది పాతాళమునకు । నెటులజొచ్చినాడు
ఏమిచేతు మనవీరాలాపము । లామెతలారగను
కొట్టితెచ్చెదముకోతినెక్కడయా । కూరుచుండుడయ్యా
చావుమూడియే వచ్చినాడునుమి । చంపివేతుమిదిగో
చూడుండీయని పండ్లుగొరుకుచు । కూరాలాపముల
కటకటలాడుచు వచ్చిచూడగా । పటుబలవంతుండౌ
తోకవిసరుచు త్రోసివేసెను । తొక్క రక్కసులను
యామడదూరము వడలిపోయిరి । యాయారక్కసులు

కొందఱుజచ్చిరి కొందఱునొచ్చిరి । కొందరేగిప్రభువు
ముందఱవ్రాలిరి పాతాళమునకు । ముప్పువచ్చెననుచు
ఆపల్కులువిని మైరావణుడు । అదరిపడుచులేచి
నిప్పులురాల్చుచు కోతిబట్టుడని । సేతుబంటులైన
మేఘకల్లభుని ఘటకాసురుని । మించిన చర్మకుని
భైరవముఖుని నలుగురిబిలచి । మీరుపోయియిపుడే
కోతిబట్టుడనిపంపెనువారిని । కోట్లసేనతోడ
వెడలిరివారలు చిరుతపులులతో । భేరిమృదంగములు
దిక్కులదరమ్రోయంగ యుద్ధము । రక్కసులావంగ
వారినందరను కాళికిబలియని । బల్కి కోతియపుడు
శివమునజంపెను కోట్లబలమును । చెండికిబలిగాను
పోయికాళితో భద్రమురాములు । పోయిన నీగుడిని
నిన్నుగూడ నేపెకలింతును సుమ । కన్నుకాయమనుచు
పెడబొబ్బలతో నొక్కగంతుతో । ఫెళ్ళుమనుచు బడెను
ఈ వాడావిడికి కోట్లరక్కసులు । ఇజగుజలైపోయి
చాపచుట్టగా పడిపోయిరి తమ । చావువెదుకుకొనుచు
అంతట రక్కసులందరుదిగులున । అదవదలైయాపుడు
వారినివీరును వీరినివారును । విఱుగద్రొక్కికొనిరి
అందఱుద్రొక్కను కోతినాయకుడు । హైసరమజ్జనుచు
పాతాళంబపుడంతయుచిందెను । పారెడునెత్తురుతో
పేగులు డొక్కలు ముక్కలు చెక్కలు । పెద్ద మొండెములను
తలలును కాళ్ళను చేతులు వీపులు । తుటతుటలాడుచును
పగిలిన శిరములు నొగిలిన పొట్టలు । పిగిలినప్రేవులును
అన్నియునేరై పారదొడంగెనుగా । వాళావాళినిజూచి
భూతప్రేత పిశాచిడాకినీ । బేతాళాదులును
యిష్టవిహారము సల్పిరపుడు । సంతుష్టులౌచు వారు
ప్రాణబంధువుడు ప్రభువుచెంగటను । బల్కినపుడునిట్లు
అయ్యో అందరు మరణముపొందిరి । తుయ్యాలించండి
రామలక్ష్మణుల నిచ్చిచేసిమము । రక్షింపుడివేగ
ఆమాటలువిని మండిపడుచుగా । పాతాళేశ్వరుడు
పటపటపలుపటపండ్లు గొరికితా । బ్రహ్మాండంబవియ
సింహనాదమును జేయుగాదేసా । సింహముఖానముడు

సర్పముఖుండును కర్కటముఖుండును । ఛాగముఖాసురులు
అసురులెల్లరును గడగడలాడుచు తా । నపుడు వచ్చినారు
ఏవి... యాగడమేమి బ్రతుకులు । ఏమీవిలయంబు
మీరు మాన్పరా నేనేపోయియుంక । వారి మాన్పవలెను
ఆపలుక్కులువిని అందఱులేచి । హుంకృతిచేయుచును
నడుములుగట్టిరి వానరుపట్టగ । నకరిసర్పవృశ్చి
కాదివాహనంబుల తామెక్కుచు । నట్టహాసములతో
పదునెనిమిదికోట్ల రక్కసబలము । పరుగువారరపుడు
వారిజూచి మనవానరబంటును । పాఱ కాళికడకు
అమ్మా తల్లీ ఆదిదేవతా । అరుగో రాక్షసులు
నీకాహారము నైవేద్యముగా । నిపుడు తెత్తుననుచు
మొక్కి కాళితామదమున । నొప్పంగ మోము చూరికోతి
బడ బడ బడ బడ పరుగువారిపై । బడెనుమూకమీద
చెల్లాచెదరై చెట్టొక పిట్టగ । చేరినారుమూక
కాళ్ళు విరిగియు నడుములు తెగియు । కంఠములే తెగియు
రక్తవరదలై యుద్ధరంగ మది । రహినీగతినుండ
మంత్రులు దొల్లిరిమూకలుజచ్చెను । మనకు గతియికేమి
పాతాళంబునకిక నాశనమే । ప్రభువా యేమందు
మిగిలినవారము అంజనేయుతో । మించిసంఖ్యమొనర
చేసి వెంటనే రామలక్ష్మణుల । దీసియిచ్చి బ్రతుకు
దారిగంపమన మండిపడుచునా । క్రూరవిదుండపుడు
నేనేవత్తును యుద్ధభూమికని । బూన్చె మనెను తేరు
మాతంగి నేయుద్ధముచేయగ । జూతువేమొయిమ్మ
కదనభూమి యిక గడగడ లాడును । కాంతజూడుమనగ

## పత్తావలంకేశునిభార్య యుద్ధము వద్దనుట.

ఆర్యా యుద్ధము వద్దువద్దుమన । కచ్చిరాదుడాపుడు
రామలక్ష్మణులు విడిచిపుచ్చుమన । రాజ్యమేలుకొమ్మి
రాముడు దేవుడు రాక్షసహరణము । నీమములో బుట్టె
నీవిపుడాతని నెదురించుటలు । నీతికాదుమాను
అనగా కన్నుల పెద్దజేయుచును । ననెనా రుద్రుండు
తేరుసిద్ధమై యున్నదిచూడు । వీరసేనలవిగో

లక్షరథములు లక్షగుఱ్ఱములు । లక్షలుకాలదులుగా
పదాతివర్గము చుట్టుకొలువగా । భయమునుగనేమనకు
పాతాళమునకు రాజునుగాక । పరగనయోధ్యా
భూమికిరాజని ప్రజలుపల్కగా । శోకకంబుగనేమి
గజఘీంకృతులు గుఱ్ఱపుహేషలు । కాల్బలములు రొదలు
దుమ్మురేగి యెటులాకాశంబున । దోచుచున్నదోయిపుడు
శూరుడైనవాడెవడీ పడిలో । పోరకుండగలడు
మిత్రునియాపద నీయాపదయే । మించిచూడవదియు
రావణుండనన్ గడగడలాడును । బ్రహ్మాండంబంత
అట్టివాడునను బట్టగోరెనీ । గిట్టవివారలను
పట్టితిరిగియీరొక్కరీతికే । పట్టలేకనిత్యా
నేమనుకొందురు జగతిలోని వా । రేమియుఁజూడవుగా
అదిగో శంఖారావముచేసిరి । పదపడపోవలెను
దారికడ్డముగనిలువబోకు నీ । దారిజూచుకొనుము
ఈపల్కులువిని మాతంగప్పుడు । ఇకనూ గతులులేవు
బ్రతుకుకాలములు సరిపోయెను నా । బ్రహ్మవ్రాలుపోలు
నీవికరావిక నేనికనుండను । నేటితోనుతీరె
పాతాళంబేలెడిఋణమదిమనకు । పాపము పండెనుపో
పొమ్మనిపలుకుచు పెటపెట ధ్వనులను । పోయెనతడుయుద్ధ
భూమినిచూచెను వాంజనేయుని । భోరుకలగననిమె
కోతీ నీకీవేళకుసరియె । కోరుకొమ్మనీకు
కావలసినదేమైనయున్న నే । కరుణనిత్తునవగ
రామలక్ష్మణుల వేగముదెచ్చి । రహియిప్పించితివేని
పోదునేనిక లోకముదుముకొని । పూర్వపుణ్యమనుచు
వీమాటలువిని కడునుగ్రుండై । యికనిలువనిపలికె

## రాక్షసులు ఆంజనేయునితో యుద్ధముచేసి మరణించుట.

మేలుబళాయని ఆంజనేయుపై । మించిపడిరిమూక
గుద్దిరి తన్నిరి తిట్టిరి పట్టుక । కొట్టిరపుడుమూక
ఆంజనేయుడా పడిగనిరథముల । నట్టహాసమునను
తోకజోకతో తుంపెసలాడగ । చూర్ణముగావించి
ఏనుగుగుంపు‥నాదికురికి తా । మానుగమారియించి

గుఱ్ఱపుదళముల నొక్కతోపుతో । కూల్చె రథణిపైని
గడగడలాడుచు పదాతివర్గము । ఈడబడుచునురాగా
నొక్కవిసరుతో దూదిపింజవలె । నూపివైచెవారి
ముక్కలు తెగగా నడుములుపోగా । మూతులువిరుగంగా
రొక్కడివారక్కడజచ్చిరి । యేమిచోద్యమనుచు
పాతాళేశ్వరుడప్పుడు బాణము । ప్రయోగించిచూచె
ఆంజనేయుడా తోకజోకుతో । నప్పుడు రథములను
విరుగగొట్టగా నావిభుడప్పుడు । గరగరలాడుచును
క్రిందినిల్చియే బాణపరంపర । కేవలవర్షముగా
కురిసెనునాతూపులకును నాతడు । కూలెధరణిలేచి
యొక్కవిసరునను తోకగదల్చగ । దొక్కలు పరివిభుడు
పిడిగ్రుద్దులకును బయలువెడలతా । పిడికిలిబట్టుచును
అంజనేయునిముట్టిగొట్టగా । నాతడువాలమున
జుట్టివేసెనాలంకేశ్వరుని । చుట్టుముట్టుకొనగా
గిజగిజలాడెను తోకతెంపగా । గింజుకొనెనుచాలా
అంతికంతకును నురిబిగియంగా । నతడునవ్వాయనిరొ
ఏరావానరయింతకావరము । యెనుగవినన్నెపుడు
అనుచునీగవలె సన్నసన్నమై । యసనిజారిపోయి
తననిజాకృతిని తనరదాల్పగా । దరిసివానరుండు

పాతాళేశుడు ఆంజనేయులతో యుద్ధముచేయుట.

యేమరిపాటుననొక్కతాపుతో । నెత్తికూల్చినాడు
పాతాళేశుడు బాహుబలంబున । పట్టెమరలనతని
నిరువురగ వుర గరగర గురగుర । పరిపరివిధములను
క్రిందికి మీదికి మీదికి క్రిందికి । క్రీడసల్పినట్లు
దొర్లుచు రోలుచు విల విల దిరుగును । తోగినారువారు
తిరిగిలేచి యాలంకేశ్వరుడు । పరుగువారియాంజ
నేయునేయగా నాతడుమరల । నేసివానిగూల్చి
చచ్చినాడురా మనమికరాముల । హెచ్చువేగ్రిమమీద
గైకొనదగునని తలచుచుండగా । గారడీనిబోలె
చుక్కచెదరకను లేచివచ్చెను । యుక్కుమిగిలి ఓడు
మరలజంపెనా వాయుసూనుడా । మాయలరక్కసిని

మరలవచ్చె నారాక్షసప్రభువు । మాయకాదు కాన
గోళ్ళచీరితా చేతులగొట్టితూ । గూల్చికోతియతని
మరలవచ్చె నారక్కసినవ్వుచు । మాయకాదు కాన
అంజనేయుండీయులజడిగని తా । నప్పుడేగి కాళి
గుడిముందర ధ్వజస్తంభము పెరికి । కూల్చెనతడు మరల
నవ్వుచులేచెను నన్నుజంపగా । నెవ్వరికీజగతి
యీపల్కులువిని కాళిగుడికిగా । అంజనసుతుడేగి
కాళీచెప్పుము వీనిజంపగా । గలమార్గంబనగ
నాతనికున్నది బ్రహ్మవరము నీ । వాతనిజంపంగా
నేరవు రాముల విడిచిపొమ్ము । నీ । నేరమేమిలేదు
ఈపల్కులువిని యుగ్రింతోలెక్క న । హీనరోషంబలన
నీగుడియిప్పుడె పెటపెటలాడగ । సాగదీతునని నెను
గుడి శిఖరముపై తోకబెట్టినే । గూల్తు ననుచు బలంబ
పకపకనవ్వుచు కాళి యప్పుడు తా । బల్కె నిటులవినుము
నీవు తులారంధ్రంబుజొచ్చితే । నేస్పమీరబోయి
ఏడుసముద్రములెల్లదాటి యుంచ । యాద్రికొండలెక్క
వేయి శిఖరముల పర్వతమున్నది । వేగజూచియచటు
దాటిపోంగా సప్తగ్రహములు । తనరుచుండునచట
వానిదాటగా నొకగుడియున్నది । దానదాటనేడు
తుమ్మెదలున్నవి వానితెచ్చి యీ । విమ్మహీశునికిని
వాసనజూపిన వాతడుమూర్ఛ । పడుడై తానుండు
నాసిమ్మట గంగావాహిని । నందుగ్రుంకులిడును
నాసీరముగొని జల్లితివా యిక । నాటినుండియాతడు
లేచలేడు మరణించునుగావున । బోవుమయ్య వేగ
యనవిని కష్టము వచ్చెననుచుమది । ననుకొనితోకకుతా
లంకేశుని వడిగానుజుట్టి తా । లంఘించెను వేగ

ఆంజనేయుడు మైరావణుని తోకకుజుట్టి యీడ్చుట.

సప్తజలధులనుదాటి వేగదా । జర జర జనుచుండ
మరియొక్క మొర్రో విడువుమనన్నని । కోటిధ్వజులతోడ
అరచె శరీరము రక్తపరదలై । యాదపదయాచుండ
ఈడదు మారుతి ఈడదు యతనను । వేగమె పొందయాద్రి

చేరి శిఖరములచేరి గృహములను । దేరితు మ్మెదాళి
చేతబట్టుకొని చచ్చెర పాతా । ళంబు వచ్చినాడు
తుమ్మెదవాసన జూపగానె నా । ధుండు మూర్ఛబడియె
వెంటనేమారుతి గంగాజలముల । వేగతెచ్చిపోయ
లంకానాథుడు మరణముజెందెను । లావుపరిగి యపుడు
తల్లికాళీ పాతాళేశ్వరు । దగనీకర్పిస్తి
ఇకనన్నేలుము నీభక్తుడను । ఇహపరములనొసగి
యనగా కాళియనవ్వుచుబల్కెను । హనుమంతవేగనీవు
రామలక్ష్మణులగొని పొమ్మికనీ । లంకనీది యనగా
మత్స్యవల్లభుడు దండముపెట్టుచు । మారుతుగదియంగా
నీవీరాజ్యముల నేలుచుయుండక । నేర్పమీరగాను
నీకీదుర్గండీ సుతుడిప్పుడు । నెఱయునరాజౌను
అపల్కులువిని మత్స్యవల్లభుడు । హర్షముతో నుండ
అంజనేయుడా రామలక్ష్మణుల । నరకటవిడుకొనుచు
రాజమార్గమునవచ్చె లంకకు । రావణహతునకై
వచ్చి పెట్టితాదించి చెప్పెనా । వానరులకుతాను
చేసినపనియందరువిని మెచ్చగ । శిష్టచరితుడపుడు
తెల్లవారగామచ్చుపొడులంతా । మెల్లవిరిగిపోవ
రామలక్ష్మణులు నిద్రలేచిరి । ఏమియు గగకుండ
పిన్మటవారలు రావణాసురుని । వీరరణమునందు
జంపివిభీషణునకు నకు రాజ్యంబును । చక్కగగట్టించి
సీతదీసికొని హనుమంతాదులు । చెలగివెంటరాగ
నయోధ్యాపురి కేగిరప్పుడు । నాటిపాటివారు
మెచ్చుకొనిరి యామహిమైరావణుని । మేలుచరితనెరు
చదివిన వ్రాసిన వినినవారికి । సకలసౌక్యమబ్బు.

# 50 ధర్మాంగద చరిత్రము. (పాముపాట.)

శ్రీరుక్మిణీశ రాజితకీర్తిజాసాంద్ర । సారసదళనేత్ర సజ్జనాధార
ధారాధరశ్యామ ధర్మసంచార । చారుమంజులభాష జగదేకపాల
పాలితామరసత్యభామినీలోల । లోలరసాధీశ లోకసంచార
ధారుణీధవహార దైత్యసంహార । హారకౌస్తుభవక్ష యఖిలలోకేశ

కేశవాచ్యుతవృషికేశ శ్రీవాస । వాసవార్చిత భక్తవరద ముకుంద
కుందకుట్మలదంత గోపికానంద । నందనందన వీరనరసింహరూప
రూపాదిసౌందర్య రూఢిపరితాప । తాపసార్చితపాద ధర్మసద్భావ
భావజజనక వైభవదేవదేవ । దేవతారాధిత దివ్యమందార
తారకాధిపవక్త్ర తాపవిదూర । దూరీకృతాంతక గుజజానవారణ
రణరంగధీరసురార్చిత చరణ । రజతనూపుర మహాలంకారధీర
పోషితగంధేభ భువిపుణ్యపురుష । పురుషోత్తమాచ్యుత పోషితభాగ
సకలాగమామ్నాయ సంస్తవవేద్య । సతతమునిస్తునే సరసినుతించి
ఇంచువిల్తునతల్లి నెవ్వసు బూజించి । చెడుగు దైత్యులచెంప శ్రీహరిదలచి
కడిమిలంబోదరు ఘనతతో నుడివి । నుడువుల సామి సన్నుతితోడ మొక్కి
మొక్కంగబుగజాల యూర్ధ్వులైనట్టి । తక్కిన కుకవుల దవడలు మోది
మోదించియాభవ భూతిబాణాది । యాదిమసుకవులను నటుగొనియాడి
యాడినంతతముగ నతిభక్తవేడి । వేడుకశ్రీరమావిభుగురి జేసి

## ధర్మాంగదరాజు.

జేసెదధర్మాంగ చరితంబు నేను । వాసిగాకవులెల్ల వర్ణనల్ సేయ
నరవిమదీయ వంశంబెట్టిదనిన । సరసతసుదువంశ సత్కులజాండు
గురుతైన కౌండిన్యగోత్రింబునందు । కరమర్థి శ్రీబొమ్మకంటివంశాబ్ధి
వరచంద్రుడగు మాధవాఖ్యుండనంగ । పరమవైష్ణవమూర్తి భవ్యసద్వర్తి
నతనిపత్నియు నరసమాంబయనంగ । పతిభక్తిగలిగిన భవ్యచారిత్రి
పుడమియాఘనులకు పుత్రుడైయేను । తడయుక నరులెల్ల దయచాలగూర్చి
అరయంగనరసింహు డందురునన్ను । హాపిశాంచిశ్రీకృష్ణకర్పితంబుగను
గానకొనియేను యీకృతియొనర్చెదను । ఘనమైనసత్కథా క్రమమెట్టిదనిన
ఒకనాడుగౌతముండుచితసద్గోష్ఠి । నకలంక చిత్తుడైభార్యయుదాను
మున్నవేళను బతికినవిధ మెట్లనియె । సన్నుతి కెక్కిన సౌజన్యనిధివి
సకల నీతిపురాణశాస్త్రంబులందు । నొకటినీ వెరుగనియదియు నీతిగలద
దాసపతియాసీత తారలకంటె । యేపున జగమందు నెన్నంగదగిన
పరమపతివ్రతబాగు గాగలదె । అరయంగయాకథ నానతిమ్మనిన
నంతవాగౌతము డాయింతిజూచి । యొంతయుమోదమున నెలుగింపదొడగె
తెలిపైన కాశ్మీరదేశంబునందు । బలువైభవంబున బరగియుండొంది
కనకాపుర మను ఘనపట్టణంబు । ధనధాన్యములచేత దనరుచునుండు
కోటలు కొమ్మలు కొత్తళంబులును । సొంపైన మేడలు నిండుచెర్వులును

శమ్మనిమ్మత్రికఘనమతిగోర । తొమ్మిదినెలలుసుతుదినిండవచ్చె
చెలికి పుత్రుడుగాక శేషుండుపుట్ట । సలలితంబున మంత్రసానితాజకిని
యులుకుచుదాదోయి యాశ్చర్యముగాంచి । పాలతికిశేషుండు పుట్టినవార్త
తగవిన్నవించిన దైన్యంబునొంది । జగతీశుడప్పుడెంతయుచాలకుంది
వగలచేకందుచు వరుసనిట్లనియె । జగతిగోపలనాదు జన్మఫలంబో
నలినజాకట్టడో నాతిపాపంబో । చెలతకు గర్భంబు నిలుచుట మొదలు
మూరిపెంబుతోడుత ముదముదీపింగ । నరయపుత్రుడటంచు నాసనొందితిని
బూనగపంటికిభువినికీరంబు । కోరియూసించెపై కొన్నయట్లయ్యె
పాపపుబ్రహ్మ తాబాముబుట్టించె । నీపట్లనింక నేనేమిసేయుదును
యనిమదిచింతించి యటుకొంతవడికి । తనమంత్రివరులను దగబిలుపించి
వసుధేశుడప్పుడు వారికిట్లనియె । వినగంగవింటిరే యీవిచిత్రంబు
శేషుడుపుట్టెనే చెలియగర్భమున । దోషంబువలనను దొరకొనెనిపుడు

శేషుడు పుట్టుట.

చింతయూనించితి నిన్నాళ్ళబట్టి । సంతతిగలదని సంభ్రమించితిని
అనిమంత్రివరునితో నారాజుదెల్ప । వినిచింతనేయుచు విస్మయంబంది
తగువారుకార్యసంకతయు విచారించి । జగతీశ్వరునితోటి సరవినిట్లనిరి
రావయ్యరాజేంద్ర రాజయూపలుకు । నీవుచెప్పినవిని నిఖిలభూజనులు
సకల దిక్కులయందు చౌకజేసెదరు । ప్రకటించి యిపుడుసీ పగవారువినిన
సంతోషచిత్తులై సరవినీరాజ్య । మంతయుగొనుటకు నాక్రమించెదరు
వినవయ్యనీవార్త వెలిచేయరాదు । తనయుడంచును బురిదగచాటబంపు
భూసురోత్తములను బోషగరావించి । యాశీర్వచనముల నరయజేయించు
పుత్రోత్సవంబునిప్పుడు సేయవలయు । మిత్రబాంధవులను మేల్మిబిల్పించు
భూసురాశీర్వాదములు బుచ్చుకొనుము । వాసిగా నావిప్రవరులకునెల్ల
సకల దానంబులు సమ్మతిజేసి । పకలేకనీవును సమ్మతినుండు

ధర్మాంగదుడు పుత్రుడుపుట్టెనని ప్రకటించుట.

మునివిన్నవించిన నారాజవరుడు । విని యట్లగావించె విప్రులబిలచి
సుతుడుపుట్టినవేళ జూచివేగ । వరమోదమున చెప్పుడని యన్నవారు
దశయవంశయుగ్నక జాతకంబు । రసికత్వముతో జూచి రాశ్యధిపతిని
నిర్ణయించియువారు నెరయనిట్లనిరి । వసిగాంపరాను దేవతలకునయీవ
జిహ్వలు రెండైనశేషాంశవాడు । గహ్వరంబునజేలగలవాడునితడు
నిజము యీమాటలు నిఖిలలోకములగ । ద్విజులకప్పుడు భక్తినదయ రాజా

గజహయదానముల్ కాంచనంబులును । రజతదానంబులు రత్నదానములు
భూదాన గోదానములు జేసి యప్పుడు । మోదించి ధరయేలె భూపాలుడంత
అంతఃపురంబులో నాగాదాభార్య । యెంతయువగనొంది యిలలోనదనకు
బరగపుత్రులులేక ఫణిపుట్టైనను । పరమాత్ముడూరు మభాగ్యమాయనుచు
చింతించి చింతించి శేషునివప్పుడు । వింతగాజూచుచు వెలదిగుట్టునను
పురమువారడిగిన బుట్టడే యనుచు । బెరుగుబాలునుదోసి పెంచుచునుండె
ధరను యిక్ష్వాకుకు ధర్మాంగదునను । వరపుత్రజననంబు వార్తలందికల
పుట్టెనవిని రాజపుంగవులెల్ల । నట్టి యాశుభవార్త కానందమొంది
ధర్మస్వరూపుడై ధరకీర్తినొందు । ధర్మాంగదునితోడ దనరగావిద్య
మందంగవలెనని యాత్మగోరుచు । యుంచెనవవస్తువాహనములు పనుప
మోదమందుచురాజు మొగిబుచ్చికొనుచు । నాదరింపుచుమరల నారీతిబంపి
మొప్పగాహితులతోను బితమర్తనల । నెప్పటివలె రాజ్య మేలుచునుండె
ఈరీతిపదిరెండు నేండ్లుండెనను । ధాన్యశ్రీయులెల్లదనకునుతిమర
దొరకొని ధర్మాంగదునిపుత్రునకును । కరమధీనమపుత్రికలనిత్తుమనుచు
సారదిగానందంద శుభరేఖలంటకు । పరువడివ్రాసి పంపగసాగిరపుడు
నరపతిచూచిమౌనంగసిగ్గుపడుచు । కొరగానియిదియేటిగోదవమోయనుచు
నేకాంతమునమంత్రి కిట్లనిపలికె । భూకాంతులెల్ల నేర్పునభక్తిమీర
ప్రాకటంబుగ వ్రాసి పంపిరిరీతి । నాకునిగ్గయ్యెడు నందనాయకునకు
నిరుపమగతితోడ నేను యీవేళ । బరువడియిందుకు ప్రత్యుత్తరంబు
నేరనివ్రాయను నేమినేయుదును । యేమివిపరీతము నెట్టులుదీరు
దామోదరించెట్టి తలపంపుజేసె । ననుటకుమంత్రిదానవిమోనిట్లనుచు
జననాథవినవయ్య సకలమానవులు । గరిమపుత్రుడుమీకు గలిగినాడనుచు
మరివిన్నవారలై మాటిమాటికిని । శుభరేకలంపిన సంగొందిమీరు
సభలోనవారల చాలమన్నించి । కరమర్థి మీరు లేఖలు వ్రాయునయ్య

పెండ్లికూతురును వెదకుటకై బ్రాహ్మణోత్తములను పంపుట.

తరువాతబ్రాహ్మణోత్తములనుబంపి । పరిశుద్ధముగుతావుపరికించిచూచి
యరయలక్షణయుక్తమగుతలోదరిని । తేవలెగుణబుద్ధిగుణధుర్య
భావంబులోనీవు పరికించిచూడు । తేకుంటె నపకీర్తి దిక్కులందనిన
భూకాంతుడామాట బుద్ధిశంకించి । యామంత్రివరుజూచి యప్పుడిట్లనియె
నోమంత్రివరనీవు నొప్పజెప్పితివి । అవునునీమాటగా దనరాదుమీర
భువిలోనగల రాజపుంగవోత్తములు । నెవ్వరైనను కన్నెనిచ్చెదువారు

విప్పటిల్లగవచ్చి నిక్కంబుగాను । వరుని జూచెదవన్న వారికి నేను
వరుసతో నెక్కడివని జూడవును । హీనతగాదయా హితబుద్ధియనిన
మానుగా రాజు మంత్రియిట్లనిరి । ఈపనికిచింత నేటికి మీకు
నీపుత్రు జూపి పేరాశ నిడత్తు । యెంతటికైనను నేనన్నవాడ
నింతమాత్రంబున కేటికివగుప । ననియిట్లుబలికిన నామంత్రి జూచి
మనమున మాపించి నతిరాజు పలికె । విదిబుద్ధియవును నీదే భారమనుచు
వదలక నారాజవరులకునంత । ప్రతిలేఖలంపె భూపతిమోదమంది
మతిమంతుడైన యామంత్రియుదాను । శుభదినంబునబడుచు జూడనంపుటకు
విధవంబుతో దుతవిప్రుల బిలిచి । గారవంబున నమస్కారము జేసి
వారితో నిట్లని వరుసమీరంగ । మనపిన్నవానికి మనుజేశులిండ్ల
ఘనమైన రూపురేఖలు గల్గిన జేయు । సుదతి హస్తంబున శుభలక్షణంబు
వదలక చూచి కేవలమయిన కాంతి । గలిగినయట్టి యాకన్యకామణిని
సలలిత రశి నక్షత్రకూటంబు । నొంటిసంటలు గాక యుచితమైనట్టు
లుంటమాట్లాణియై వులు నిశ్చయించి । దోడ్కొని రమ్మని తోడవారలను
వీడ్కొల్పనంతట వేగవారేగి । అంగ కళింగ వంగాంధ్ర నేపాళ
బంగాళ మళవ బర్బర చోళ । కాశికరూశకొంకణటెంకణాది
దేశాధిపతులిండ్ల దిరిగికన్యకల । మరిమరి వెదుకుచు మదివేసరిలక
వరుసతో వారు భూవరు వాజ్ఞబూని । మగువ మంచిది లేక మగుడరాదనుచు
తెగువతో నెక్కొన్ని దేశముల్దాటి । చనుదెంచగానంత సౌరాష్ట్రభూమి
జనపతిపుత్రిక చక్కనైనట్టి । సుదతియా త్రైలోక్యసుందరియనగ
మదిరాయతాక్షి పామజయాననగలదు। అనియొక్క బ్రాహ్మణుండానతిచ్చినను
విని భూసురోత్తముల్ వేడ్కతోనపుడు। మనమున హర్షించిమమతలూరుచును
బుధులెంచుమాణిక్యపురములో వచ్చి । యధికుడైనట్టి రత్నాంగదుజేరి

## బ్రాహ్మణులు మాణిక్యపురమునకుబోవుట.

యారోగ్యమస్తనియతని దీవించి । వారొక్కమనవి భూవరునకిట్లనిరి
స్థిరముగా కాశ్మీర దేశంబునందు । కరమొప్పు నాకనకాపురంబేలు
ధరణీశుడయినట్టి ధర్మాంగదునకు । వరసుందరుడు భాగ్యవంతుండుసుగుణు
డగుపుత్రుడున్న వాడతనికి మీరు । సొగసుగా త్రైలోక్యసుందరినిప్పు
డిప్పించవలెనని యిలమివచ్చితిమి । రప్పించుకన్యకా రత్నంబునిపుడు
విభవంబుమీరుచు వెలసినదాని । శుభలక్షణంబులు చూడంగవలయు
ననవిని రాజేంద్రుడప్పుడిట్లనియె । ననఘాత్ములార యేమనిచెప్పువాడ

నేను ధన్యనైతి నిఖిలలోకములు । నానావిధంబులనాకు సంతసము
అతను రాజులను రాజతనయులను । అతనుకీర్తిశాలిశాలుసతదాత్మ సఖులను
తోయ్యకధన్యాంగనుపతోడ నేను । విద్యలనుపట్టింతు వేడుకగలదు
అనుచు సంతోషించె యా రాజసుతుడు । తనపుత్రి దిమ్మరితలవారి బనుప
వారలుపోయి యావార్తలన్నియును । ఆరాజకాంతల కపుడు చెప్పినను
ఆరాజసుందరు లారాజముఖిని । గారవంబెసగ శృంగారంబు సేయ
నదియునంతటవేగ నరుదెంచునపుడు । మదనునిచే పుష్పమార్గణంబనగ
తొలకరి మెరుపుల తోజయనేత్రి । వరరాజభాగ్యదేవతబోలుననిన
జిలుగుపయ్యెదరాయ చిలుకయోయనగ । వెలలేనిగండుకోవెలయోయనంగ
కన్నులుపిరుదుచొక్కములైనసురులు । చిన్నిచన్నులువింత చెల్వమై మెరయ
పలుకులతేనియలొలుకునాయింతి । కులుకుచు చిలుకల కొమరుకైవసిని
రాయంచనడలతో రాజీవనేత్రి । నాయొద్దనరుదెంచె నంతనారాజు
తనపుత్రి రమ్మని దగ్గరబిలిచి । యనుపొందవరరత్న సింహాసనమందు
తూరిమితో దాపుగూర్చుండబెట్టి । వారితోనిట్లనె వరపుత్రినిపుడు
తోడితెప్పించితి తోయజముఖిని । చూడుడనంగ భూసురులుత్సహించి
యతిసుందరంబైన యతివబంగారు । ప్రతిమబోలినయట్టి పద్మాక్షినపుడు

## అచటి రాజకుమార్తెయ గుమర్చుట.

ప్రేమతో గాంచి సంప్రీతినొందుమను । సాముద్రికము లాన సఖియచేపట్టి
నాయుష్యరేఖయు నందుమనతనము । సాయకయున్నంపసలక్షణంబు
సంతానరేఖయు సామ్రాజ్యకళయు । వింతైనసుళ్లు శ్రీవిలసిల్లుసహాను
గలిగియున్నది హాసకాంతిదేహమున । కొలగినాయువు రాశికూటంబుమైత్రి
గట్టిగాగోత్రసంపుటవలుజూచి । మట్టుగానన్నియు సరిపట్టియున్న
నవనీశుతోడనిట్లనిరి బ్రాహ్మణులు । సరవిగారాశినక్షత్రకూటంబు
లిరువురకుసరియైనపొందికయు । మనుజేశకన్యనిమ్మనవిని యంత
ననుకూలమందివారపుడు వారలకు । పోకలాకులుకట్నములు కానుకలును
తేకువతోనిచ్చినృతివారివెంట । వరునిజూడగ తనవారినిహితుల
దొరలబ్రాహ్మణులనుతోడంపెనపుడు । వాటంబుగా వీరువారునుగూడి
లాటమురాట మాళవమత్స్యపాళ్య । దేశంబులెల్లను దిగ్గునగడచి
వాసిగాపురిజేరి వచ్చినవారి । కోటవాకిటయందు గూర్చుండబెట్టి
హాటకనవమణిహర్మ్యముల్ గడచి । భూవరునొద్దికపుడు విప్రవరులు
వేవేగబోయి దీవించియిట్లనిరి । దేవరయాజ్ఞసందేహంబులేక

కూర్చినయామంత్రి కూర్మినిట్లనియె । వరునిజూడుడిమీరు వరఘనులార
వరయశాస్త్రంబుల నడుగుమన్నంత । సకలశాస్త్రపురాణసర్వజ్ఞుడైన
అకలంకగుణవంతుడైనయావరుని । కన్నులపండువై కరమొప్పుచున్న
సన్నుతముఖశశిని చక్కగాజూచి । సంతసంబునవారు సరవినిట్లనిరి
కంతునికన్న చక్కనివానిమోము । నిండుచంద్రునికాంతి నిగ్గుదాటెడిని
మండలేశ్వరపుత్రువరిజూడకేమి । సుందరాంగిని యీ సుతునకీతగును
ఎందుజూచినవరుడింతవాడేడి । అనిన సంతోషించి యా మంత్రియనియె
వినరయ్యమీరు కోవిదులారవరుడు । అరుణంబుతోడుత అధిపతియిపుడు
పరరాష్ట్రమానకబంపుడు సుతునివిడిచి । చేతిఖడ్గముపంపి చెలియనుదెచ్చు
టీతీరుసుమ్మ వీరిలువన్నెమొదలు । సరవిమీరంజాడ సమ్మతిమైతె
వరఖడ్గవటుగొంచ వత్తుమేవనిన । వినివారుమంత్రికి వెలయనిట్లనిరి
వినవయ్యమంత్రి మాకుఘనకీమాట । వినజెప్పెదము మేము వేవేలకైన
కానసీయి శుభకార్యసిద్ధిజేసెదము । మామాటదోసుడు మరియెన్నడైన
శ్రీమంతుడైన యీచిన్నిపాపనికి । శుభలక్షణంబుల సొగసువానికిని
సిద్ధంబుపడుచునిచ్చితిమిమేమనుచు । శుద్ధమైనట్టి భూసురులకునపుడు
కనకంబువస్త్రములతో కట్నంబులిచ్చి । యనిపినవచ్చియాయనసీమకనిరి
రాజేంద్రకనకాపురమునకుబోయి । తేజంబుగలమహాధీరుడైనట్టి
ధర్మాంగదునిపుత్రితడయకజూచి । నిర్మలచారిత్రినేడువచ్చితిమి
అపాటిబాలకుడవనిపైలేడు । రూపునమదనుండు రూఢివిద్యలకు
విందుగిందుచందురిందునిలవసంతుండు । చంద్రమాకాంతికి సాటిరాదనుచు
వాలాయమెంతైనవరునకునిమ్ము । మేలైనతావని మేమొప్పితిమి
వారింటకట్టిడివరుడురారాదు । వరునిచేఖడ్గంబె వారుబంపించి
పెండ్లిసేయుదురట పృథివీశవారి । ఇండ్లకట్టడికద్దు యిదెనిశ్చయంబు

## ఖడ్గమునకు కుమార్తెను పెండ్లి చేయుట.

వరునిఖడ్గంబైనవామాక్షినిమ్ము । వరలగ్నమిప్పుడే వారలకనుపు
మనివిన్నవించినవాతడుప్పొంగి । దనరంగబ్రాహ్మణోత్తములబిలిపించి
జనవాధుడిట్లనె దయాత్ములార । మనపాప పెండ్లికిమంచిలగ్నంబు
పొసగగాజూచిచెప్పుడుమీరలనిన । విడువక భూసురుల్ వేడుకనపుడు
చంద్రతారాదులుచక్కగాజూచి । కేంద్రకోణంబుల గురుబుధశుక్ర
చరముహూర్తద్వాదశలగ్నంబు । మరిజన్మతారకమయినదేకుండ
పంచకరహితమైపరగులగ్నంబు । పంచాంగదోషముల్పరగకేకుండ

శోధించ మావిభూసురులందరంత । మోదించి చెప్పిరను రాందివిభుడు
కరుణతో నారికేకట్నంబులిచ్చి । తరువాతలగ్నంబు కనుపరచనము
కనకపత్రికమీదకరము మొప్పవేళ్ల । కనరిన పెద్దలతో నిల్లు వ్రాసి

పెండ్లిశుభలేక వ్రాయుట.

శోభనంబును చైత్రశుద్ధంబునందు । ప్రాధవంబగుచున్న పంచమినాడు
గురువారయుక్తమౌ కుంభాంశయందు । మరిరేవతుందువసుహాని వ్యయగుచు
పరువడీఘటికలు పదియుంటిమీద । నరసి వేడుకసింహ లగ్నలెస్స యనుచు
భాసురంబుగలగ్న పత్రికవ్రాసి । భూసురవరుల చేపంచి భూవిభుడు
యీముహూర్తంబున కిప్పుడే తరిణ । రమ్మని కనకాపురంబునకనిపి
అప్పుడు మంత్రి భృత్యాదులబిలిచి । తప్పక మీరలందరుగూడి వేడ్క
పట్టణమంత శోభన కాంతిమీర । ఘట్టిగా పురము శృంగారింపుడనిన
వలనుగా వారును వరుసతో నపుడు । సలలితంబుగ పురజనులతో చెప్పి
కలయనంతటను వేగ మెయింపుమీర । విలసితంబుగ వీధివీధుల యందు
మేడలు ధవళించి మృగనాభిగాల । పూయించె నందంబు పొలుపొందగాను
వాడలశోధించి వరుసవాడాన । రంగుమీరిన గోపురంబులమీద
బంగారు కొండలు బాగొప్పనునిచి । పచ్చ గాజులు చవ్వరములు గట్టి
వన్నె మంటపులెల్ల వాకిళ్ళ నిలిపి । కలకలముగను శృంగారములు సేయ
చెలిమితో పురిచాల నింపొందుచుండె । నా రాజపట్టణమందు రాజాది
కరిమణి జాతినపుత్రి కల్యాణమునకు । చుట్టాలకును వేగ శుభలేఖలంపి
పట్టుగా వారి రాబిలిచి యాలోన । దనరంగ శోభన ప్రస్యంబు గూర్చి
అనయంబు నృత్యవాద్యంబులు యందు । ననురంగ సకలవిద్యాపరుల్ పొగడ
సుముహూర్తమున కదురు చూచుచుండె । నంతనక్కడ వారలా రేఖ మొదలి
యెంతయు వేడ్కతో నెలమి మేలనుచు । దొరలును హితులును నగరాధిపతులు
పరివారములుగూడి బహుళమైరాగ । వింతమీరగనంత పెండ్లిదవళిణ
సంతసంబొదవ విచ్చలవిడినపుడు । కొందరందలములు కొందరేనుగులు
కొందరు పల్లకీల్ కొందరశ్వములు । కొందరు జగడంపు గొడుగులనీడ
కొందరు కాల్నడకోరిక రాగ । పచ్చనిబంగారు పల్లకీలోన
రొసగ ఖడ్గము బెట్టి యేతెంచెనపుడు । బుధులు మంత్రులు సామంతసత్తములు
ప్రిధితబలాఢ్యులౌ భటసమూహములు । వాసిగా నేతేర వైభవోన్నతులు
దాసీజనంబులు దగివెంటరాగ । భేరీమృదంగముల్ భోరున మ్రోయ
భూరి కాహళములు రొద్దుభతముగా మెరయ । రమణొప్పమాగన రాజి రాజిల్ల

గ్రక్కునవినవలెగాక తిట్టినను । మొక్కలంబునమోము ముడువంగరాదు
శాంతిరోషముబుద్ధిగలిగియుండుట । శాంతంబుతోడుత సమరసంబునను
నడుచుకోవమ్మతిన్నగనేర్పుమీర । పుడమిలోపలగల పౌరులుమెచ్చ
ననిచెప్పిపుత్రికననిపెనావేళ । వినయంబుతోరాజువిడువనిమమత
పుత్రికౌగిటజేర్చి పుత్తెంచెనపుడు । చిత్రివేగంబున చెలియాదోడ్కొనుచు
నతివేడ్కతోడుత నావంతిపురుడు । యతులితుడైన ధర్మాంగుదుపురికి
చేరియాశుభవార్త చెప్పించపినను । ఆరాజశేఖరుడానందమొంది

## పెండ్లికుమార్తె అత్తవారింటికి వచ్చుట.

భూరివాద్యంబులుభోరున మ్రోయ । వారికియెదురుగా వచ్చి దోడ్కొనుచు
తెచ్చితాగృహమున తెరగొప్పవిడువ । హెచ్చువేడుకతోడ నిందిరాక్షి
అత్తగారినిజేరి యతివకేల్మోడ్చ । నత్తకౌగిటజేర్చి యానందమునను
ముత్తయిదువైనీవు పుత్రులగనుము । హాసపేడ్కతో నమురవధి బల్లు
మనుచుదీవించిన నత్తవారింట । పనులుజేయుచునుండె పద్మాయతాక్షి
వనితకంతకును యౌవనము నిండినను । ఘనమయినబంగారుకాంతిచెన్నొంది
మొలకచన్నులురెండు మొనచూపవచ్చె । పలుకులుచిలుకల పరిపాటిమించె
చిన్నారికురులెల్ల చెరదీసరొయ్య । కన్నులునిరసించె కలువరేకులను
పిరుదులఘనమయ్యె పిడికెడునడుము । గిరిగట్టచెలికి మోగారుగన్పించె
పురుషునిపైవాంఛబుట్టెనావేళ । పెరుపకమాగనితా వెతుకంగజొచ్చె

## మగనికై వెదకుట.

నంతఃపురంబెదానంతయు జొచ్చి । చింతనొందుచుజూచె చిగురాకుబోణి
మేడలుమిద్దెలు మించువాకిళ్ళు । మాడువులొక్కట్టముల్మరిధనశాల
లన్నియువీక్షించి యతడులేకున్న । చిన్నబోవుచుమేన చెమ్మటలూర
మగువయిట్లనుకొనె మనసులోనవ్వ । డగణితంబుగ పెండ్లియైనదిమొదలు
నెన్నడుపతిని నేనీక్షించలేదు । అన్నాతోడుత నామామగారు
పన్నగానెచటికి బంపెనోయనుచు । కన్నెజేములు గ్రమ్మనావేళ
దనలోనవగచుచు తలపోయదొడగె । నెనయనీసొమ్ములు నెన్నిగలిగనను
పురుషుడులేనట్టి భోగంబులేల । పురుషునిబొందనిపుట్టుకయేల
పురుషునితోడగని పొడిమియేల । పురుషుడేదైవంబు పురుషుడేగురువు
పురుషునితోడ నెప్పుడులియ్యవగుచు । మరుకేళిదేలుచు మగువలెందైన
రోదలుబాయనివారలెంతటిసునలు । పడుచుదనంబున పతిమీదచింత
రాజులగలేనైతినేనిన్నాళ్ళదాక । కరుపిణ హీనుడై కపటంబుతోను

దండప్రణామంబు తప్పక జేసి । నిండుమనంబున నిలచియిట్లనియె
వినవమ్మవో యత్త విన్నపంబొక్కటి । కనికరంబున నిన్ను కావంగవలయు
చెన్నగా నాపెండ్లి చేసిన మొదలు । ఎన్నడు నావరుని సేవించలేదు
యత్తరో మొండ్రిక్కదయులు కీళళ । మత్తిలగా నీవు మగని నాకండ్ల
జూపగవలెనిక చూపకకాని । నీపాదమాన నే నీరునన్నంబు
పుచ్చుకోనిక ప్రాణముల్లనిన । ఆశ్చర్యమంది తో భ్యాలిబుద్ధిజూచి
చెప్పకయున్నని చెలియయేవగునో । చెప్పినయిక నేమి సేయంగగలదో
యున్నాళ్లుదాచిన నిదిదాచబడదు । పన్నుగ జెప్పెదభామయామీద
పాపారమ్మనదూరి పలుకనిమ్మనుచు । అమ్ముగ్ధరాలితో అత్తయిట్లనియె
ఏమని చెప్పుదు నిందీవరాక్షి । భామ నేమిక్కలి పాపాత్మురాల
నానోము ఫలమున నళినగర్భుండు । పూనినాకడుపున భోగి పుట్టించె
పాపగంగయామంత్రిబూమెలుజేసి । రూపగపుత్రిండని యీ భూమిలోన

అత్తనీమగడు శేషుడని చెప్పుట.

మసరిమోసముజేసె ముదితరో నిన్ను । పసిబిడ్డదెచ్చిపాపముగట్టుకొనిరి
నేమి సేతునుతల్లియిదెజాడువనుచు । పాముజూపిన జూచిపడతి మూర్ఛిల్లి
రాంకఘూమునకులేచియెగినోరుశిరము । వకవక లైపోవవాపోయిమారల
తక్కక వేవేగతగ మోదుకొనుచు । అక్కటాదైవంబు ఆరడిబుచ్చె
వెక్కసంబున చాలవిలపింపదొడగె । యెక్కడజొత్తునుయేమందు విధిని
హాజగదీశ్వరా హారామరామ । హాజలజేక్షణ ఆపదీసితివి
జగతిలోయీయాడు జన్మఫలంబు । పగనిట్లు పుట్టించెపాపపుబ్రహ్మ
పుట్టించె నేనాకు పురుషహీనంబు । ఎట్లుగా జేసెనాయే నేమితనకు
పాపంబు జేసితిబావురే తండ్రి । యీపని మాడక యెటులోతప్పితివి
నేనింత పనియౌట నెరుగనే తల్లి । పూనినమ్మితి నేను పురుషుడే యనుచు
యిలలోన నెందైనయింతి పాపంబు । కలదని విందురే కాలాహికిపుడు
ఒరులబిడ్డల దెచ్చియొచితంబుదప్పి । వతికిచ్చెండిజేసిన మానవుల్ గల్గ
నేనెట్లుబ్రతుకుదు నిజముగానిపుడు । పూని నాకెవ్వరు పుడమిలో దిక్కు
వసుధలో నాయీడు వనజాక్షులెల్ల । పోసగంగ తమతమ పురుషులగూడి
మోదముతో డుతను కాపురము సేయంగ । ఆదముగా నేనోచనైతినిగదవె
ఘనుకు నే నెవ్వరి కొంగులబాపితినో । పనుపడనది నాకు ప్రాప్తించెనమ్మ
లోకంబులో పలలోలాక్షులార । యీకొరదీయునా రొన్నంగమీకు
ఓయమ్మలార నాయీసురందరికిని । యీరొండదాకకనిక నెట్లుమాను

నావంటిబిడ్డలునరి నాతులార । వావిరికేనట్టివారలు గాన
యీపనిజేసితిరిందరుగూడి । ఓపాపమతులార ఓయింతులార
యీగుట్టుదాచితిరిన్నాళ్ళుబట్టి । బాగుగాజగతిలోపలగవిపెంచి
నట్టివారలుమీరలకట పాపంబు । గట్టుకొంటిరియెంతకఠినాత్ములమ్మ
అదోషిమంత్రితానదిపాపమునక । యీదోషమునకుదానెట్లులోనయ్యె
నిర్మలగుణశాలినీతిమంతుండు । ధర్మాంగదుండైనదయాళికనిపుడు
ధర్మంబుదప్పియుత్తరినన్నుదెచ్చి । కర్మంబుదానిట్లుకట్టుకొనదగునె
యిప్పుడునాదుఃఖమెంతనెవ్వరికి । చెప్పుకుందునుయింతజేసితిరనుచు

శశిముఖి నిజమెఱిగి దుఃఖించుట.

మేలుగానధిపుకోపించినకేడ్క । వాలాయముగనేనుచసియింతుననుచు
నాలయాసించితి సంభ్రమంబునను । నీలాగుపాపకూట యెఱుగనేతల్లి
యీలోకమందునన్నిట్టిబూమెలకు । నేలపుట్టించెనో యీవిధినన్ను
తొలిజన్మమునచాల దోషంబునేను । అలరంగజేసియీ యవనిబుట్టితిని
జేసినకర్మంబుచేజేతగూడె । ఆసలన్నియును నిరాసలైపోయె
వారకరక్షించు వారికనేరి । యేరీతిబ్రతుకుదు నేమిసేయుదును
ఏమనితలపోతు నేదొలినోము । నోచినఫలమిట్లు నుదుటనుండంగ
నుండంగవచ్చునేనోగివీరిదండ । దండాయమానమై తినకర్మమునకు
ననుదెచ్చిమాతండ్రి నయమింతలేక । ఘనమైనపావనంబు గట్టుకొన్నాడు
పామునకిచ్చెను పదపడివరుని । నేమాత్రమైన తానీక్షించకపుడు
అనిచనిదుఃఖించి,అజ్ఞాయతాక్షి । ఘనకోపదృష్టిచే కాంతలకనియె
ఈమందిరంబేల యీసొమ్ములేల । యీమామనాకేల యీయత్తయేల
వాతల్లిదండ్రులు నాబంధులేల । భూతలంబులు గలపుణ్యభూములకు
దిరుగంగనాపాలిదేవుడేగలడు । తిరుపతులెల్లనుస్థిరముగానేను
పోయిసేవించెద భోగితోగూడి । యీయింటనుండంగ నేమికారణము
పతిబాసిచరియింపపాపంబుమొదలు । పతిముందుగుడువక పణతియేముందు
ఆరగించినడింయైశ్వభుజిని । ఈరసంబునపతి కెదురాడదోషి
మూగజీపైపుట్టు ముందరనదియు । నాగడంబునబతినటమటించినను
పరపురుషులగూడు పాపాత్మురాలు । కరముధీయుది మాలకాకియైపుట్టు
పురుషుడొల్లనియట్టి భుక్తశేషంబు । మరియారగించక మదిరోసుకొనుచు
పారవేసిన గార్ధభంబుగాబుట్టు । వారకపతిరూపుంకరలెప్ప
ధరలోనకుబ్జమై తాజనియించు । వరుమూరలేకున్న వన్నెబెట్టినను

పదునెనిమిదిపుట్టు గుడ్డియైపుట్టు । గొనకొని ధృతరాష్ట్రు గుడ్డివాడైన
గాంధారి తానంతు గానుభావించి । బంధురంబుగ కండ్లపటము పైగట్టి
కాపురంబాయెన గాంధారి జేసి । ద్రౌపదియామహా తారభూపుత్రి
యెంచనుండో వరి యమ్మ గాజగతి । పంచకన్యలుమించ బడరదిక్కులను
దుంటైన మొండైన గుడ్డివాడైన । యెట్టివాడైనను యేమనరాదు

వాముసే పతిగాబ్రోచుట.

అటుగానమగడు పామైన గానిమ్ము । పతిభక్తితోడుత పాలుబోయుచును
పోషించుకొనుచు భూములజూచెదను । శేషువిమ్మని లేచి చెయ్యెత్తి మ్రొక్క
ఆమాటకునువ్వి అర్మిలి మోవలు । భామలందరుకూడి పరగనిట్లనిరి
కోమలినిన్నమ్మ కోపగించకుము । పాము నెత్తుకుపోయి వదితిరో నీవు
ఇదిపంతు చేసుక యీయిల్లు వెడలి । పదపడిపుట్టలో పామునువిడిచి
దిమ్మరివై నీవు తిరుగంగవలచి । నమ్మపమ్మతిబెట్టు మాటలుగాక
నీవేడవనులేడ నీమాటలేవ । త్రోవరుంగవుగానితోవలుగాని
బలువైన మదవులు పర్వతంబులును । పులులుదుష్టులులెళ్లు భూరిసింహములు
గలభూములేకీతి గడువ్వంగగలవు । తలపకకర్యముగాను తరుణిరో నీవు
బాలవుగోలవుపాపంబు గాక । యేలయీపలుకులు యిటుమానుమనిన
చూచియా త్రైలోక్యసుందరి యనియె । యీచిన్నిమాటలుయిట్లాడదగునె
యమ్మలారా నాదు అభిమానమునకు । ఇమ్ముగాకతలు ఎవ్వరున్నారు
నాధర్మ మేసుమ్మి నాకునుసాక్షి । అధనుడాదేవత ఆత్మనన్నేలుగు
నామనసెరుగక నలినాక్షులార । యీమాటలాడేన రింపదుకూడి
మీరేమి యాడిన మిమ్మేమనందు । నారాయణుండుండ నాకేమి భయము
అనివచ్చనూర్చుచు నహిరాజుబెట్టె । అనువొంద దనయత్తనడిగి వేగంబె

పాముసుతీసుకొని పుణ్యక్షేత్రమునకు బోవుట.

తనవడిగట్టుక తర్లెనాక్షణమె । వినిపురజనులెల్ల విస్మయంబంద
నీరజవళ నేత్రి నిలయంబువెడల । నరసియావృత్తాంతమంతయు వేగ
చారులవలన తానన్నియు దెలిసి । ధర్మాంగనుడువచ్చి తావడ్డగించి
మమసించిపోవుట మర్యాదగాదు । క్షమియించుమిప్పుడు సైరింపుమనిన
యింతైనలోంగక యిదియు పామనక । యెంతజేసితివయ్య యేమనుదాన
ఈలోకమందున యీయపకీర్తి । యేలదప్పునునీకు యెవ్వరునిన్ను
అవునందురయ్య యీయుపకారమునకు । భవమునకొడిగట్టి పసిబిడ్డదెచ్చి

తల్లిదండ్రినిపాపి తలవాటజేసి । చెల్లబోనన్నిట్లు జేసితివకట
అనియిట్లు దూరి నా రాజవరుడు । తనత వంచుక తరుణికిట్లనియె
ఓయమ్మ యీ ఘని యీచిత్తంబు చెప్పి । సేయుచెల్లనిపగల్ సేతునే నేను
ఆపాపకముండుడు ఆమంత్రినగడు । యి పనిజేసెను యేమినీవినవ
యేమనగవాడ యిగిరి యేమినాకు । నామనసిప్పుడు నళినాక్షివినుము
పోదగదమ్మ యీబుద్ధులు మను । మాదరంబునమాను మనియిట్టులనియె
నాకు కోపలుగావు నాకుపుత్రుడవు । నాకు దిక్కెవ్వరు నళినాయతాక్షి
యీసంపద భూములిన్నియునీడ । యీసాహసంబేల యిటువత్సమనిన
మానరోపిసనియ్య మమతనీకేల । నీమాటలేలనాకీసంపదేల
భూమిపైనుండి కీర్తి బుట్టునేనాకు । పాముకైనన్నిట్లు పడుబాటుబడుచు
నుండమంచునుబల్కుటుచితంబుగాదు । తిండిచేకండలు దేహంబుపెంచి
ఎవ్వరికితునో యీ దేహసుఖము । నవ్వరాజులెల్ల నామోముజూచి
భూమేలధనమేల భోగంబులేల । భూమీశనన్నింతబోధించనేల
పుత్రులు లేనట్టి పాలతులబ్రతుకు । అంబరసూర్యుడులేని అహములరీతు
శీరితచంద్రుడులేని యారాత్రి । రాతిరిదీపంబు రంజిల్లనట్లు
యిల్లాలురచుతిన్నెరుగనితల్లి । తల్లిదండ్రులకునుతా గానిసుతుడు
సుతుడులేనట్టియా సుందరిబ్రతుకు । బ్రతుకుపర్యంతంబుపరులప్రేష్యంబు
తేజమైనను రాజు లేనియారాజ్య । మాళవుజూడనియట్టి నేత్రములు
నన్నంబులేనట్టి సరునిదేహంబు । సన్నమెల్లనివాని సాగసువీడెంబు
శ్రుతిలేనిపాటకానులులేనిమాట । మతిలేనిమంత్రిగమ్మతిలేనిగురుడు
తావిమాలినపుష్పదానంబుభంగి । శ్రీవిభుమతిలేని చిత్తంబదేల
సుమ్మయ్యనీకునుసుతుడును లేడు । నెమ్మదినుండుడీనేనేలమీకు
మిమ్ముదూరిననికమేలేమిలేదు । ఇమ్మగామంత్రినియేమనరాదు
నాకర్మవశమున నాకిట్టులయ్యె । మీకేమిపోరయ్య మీకుమ్రొక్కెదన
పోరుదగపుణ్యభూములుజూడ । ఈరూడమాప్పటలిదిపాపమయ్య
వదిశలక్కైననీ ట్టనుండ । నిదియేటిమాటలు యిప్పుడునన్ను
పోనిమ్మనుచుగొబ్బున మ్రొక్కితొలగి । తీవరంబునదగ్గ తెగువనాకాంత
అరాజుదుఃఖించెనలివబోవంగ । వారకనాయింటివారెల్లగూడి
పాపంబుయిదియని పరితాపపడిరి । ఆపన్నగముతల్లి అతిదుఃఖమానను
యేపునసిట్లరేద్వ్యంగదొడగ । కోపసంభవహాజగదీశ
యీపాపమేనాకిట్లు సిద్ధించె । ఈలాగు శేషునకీయింతినేల
వ్రాసితిరీలాగు వసుధపైతిరుగ । చెసితిరయ్యయీచిగురాకుబోణి

యెంతగుణాఢ్యురాలెంతవివేకి । యెంతసుందరివౌతివేమనియెంతు
నేనెన్నిజన్మలనన్న యెప్పుడునేసరదు । నన్నుమన్నించును నామీదభక్తి
యున్నదుమరువదు యెంతబోసియిపుడు । పన్నుగానడవులపాలయ్యెగదనె
యెటులనేమరతును యిప్పుడింతయును । కటకటాయీదోషకారిదైవంబు
యిన్నిమాటలుజేసుకొరుగజేతల్లి । విన్నబాపితిగదేనీవారిలోన
తలితండ్రిలీమాటతప్పకవినిన । తలపోసివారేమి తల్లడిల్లుదురో
నాయల్లుమేలనినమ్మిపుత్రికను । నోయమ్మయిచ్చిరేయొగిపాపమనక
వారలేమందురో వనితదెమ్మనుచు । యారాజమామంత్రిమాటలకప్పు
డిటిదోషమనక తానెట్టులోనయ్యె । ఇంతటికర్మంబులిట్లుగానుండె
పదపడగడచినపనికేలచింత । యనుచునాయమిఁజాలి నతిదుఃఖమునను
తనయుఁబాయుటకునుదపియించుచుండె। నటరాజకన్యకయతిఖిన్నయగుచు
పుటభేదమునవెళ్ళిపోవుచుండగను । పురజనులెల్లనప్పుడుజూచియలరి
ధరనెన్నదగినట్టిధర్మాంగదుండు । తనయుఁడులేనివతఁజూనమేలజేసె
ననువారలెందరునతఁడేమిచేయు । పనివడితానేగిపడఁతినిదెచ్చి
ఘనదోషమొదిగట్టెగాయనువారు । యామంత్రివననేలనట్లుగర్భుండు
తామూఁకినిటువలెవసుధపైదిరుగ । ననువొందవాత్రిసిపాడనియెదువారు
వనవాసనువిదూరవలువదాతండ్రి । వరునిజూడకపెరవారిమాటలకు
వాళ్లింబిగొబ్బువవందిచ్చెనుతను । వరుసనీపాపంబువానికిదగులు
నరయుంగదప్పిపోదనియెదువారు । ఆవాతియొంటిగానరుగంగజూచి
భూవాయఁకుందునిప్పుడునూరకుండె । పాపగనొక్కరికైనబొమ్మనజాలె
కడిగందునవడెంతకఠినచిత్తుండో । అనిఅనిపురజనులిట్లులనగనావేళ
తనమదిమోహమంతయుగోసివేసి । శేషుడుదైవంబుశేషుడేగురుడు
శేషుభజింపనిశ్చయమానమము । యీభూషణంబులుయిదియేలయనుచు
అభరణంబులుఅన్నియుదీసి । వీభూతిపైబూసివేగంబెతలకు
పావిత్ర్యంబుగజటాభారంబుదాల్చి । పురుషవేషముచేసెపూబోడియపుడు ।

## స్త్రీ మునివేషధారియయి తిరుగుట.

విరివిగాచక్కనివెలివందర్రాని । వలువతాగట్టియావన్నెయిహాని
వెలయంగరుద్రాక్షపేరులువేసి । మునివేషధారియైమొగమిసేమరక
అనయంబుపాలునెయ్యర్పించుకొనుచు । వనములుగిరులుకేవలమైననదులు
ఘనముగానన్నియుగనుగొందునవుచు । ఘనపర్వతంబులుగనుగొనుచేద్య-
దనరినభద్రాతోతరలాయతాటి । వేత్రవతీకృష్ణవేణికావేరి

పాత్రిమానసర్మదభవనాశిసింధు । భాగీరథీతుంగభద్రికాళింది
వేగవతీజాహ్నవీతామ్రిపర్ణి । భీమరథీమరియు పెన్నబాహువరయు
తాపుసహారిణిమందాకినీసరయు । సారస్వతీనదిచంద్రిపుష్కరణి
పారమానసులెల్ల పరవితో గ్రుంకి । హిమవంతనిషధయాయింద్రికీలాద్రి
అమలనీలాద్రినీలాంజనగిరియు । మలయాద్రిసింహాద్రి మందరాచలము
యిలమించుమహేంద్రాద్రి హేమకూటాద్రి । గంధమాదనముఖ్యఘనపర్వతములు
బంధురంబుగఁ జూచిభామభీతిల్లి । ధరమీదవిరిగెనుదండకారణ్య
మరుదైనయాదంపకాటవిగడచి । మనమునదీక్షతో మహిదిరుగ వెడలి
అంగుగానపుడు పుణ్యారణ్యభూమి । రంగయిన నైమిశారణ్యంబుజేరి
కౌండిన్య శౌనక గార్గేయజన్హు । మాండవ్య వాల్మీక మార్కండ్యకపిల
కౌశికాంగీరసకణ్వ దుర్వాస । వాసిష్ఠజమదగ్ని వత్సమాతంగ
శాండిల్య నారదశరభంగవ్యాస । పుండరీకాగస్త్యపులహాదిమునుల
ఘనులగన్గొని మ్రొక్కి కడుభక్తిబలికె । వినరయ్యమునులార విన్నపంబొకటి
నాకమ్మెవెళమునననిసజాడిపుడు । యీకాలసర్పంబు నిటువాకువ్రాసి
పురుషునిజేసెని భువిగలనదులు । తిరిగితినయ్య యందేమిలేదాయె

నైమిశారణ్య మునులు ఆమెమగని నరుడగునునుట.

ఘనులార యింకనా గతియెటులనిన । వనజాక్షిగనుగొని వారలిట్లనిరి
వినవమ్మ తరలాక్షి వినుపుణ్యసాధ్వి । వినుకోమలాంగినీ విభునిపూర్వంబు
భూనాకక్షేత్రముల్ పుణ్యభూములును । భానురంబైనట్టి బ్రాహ్మలకెల్ల
దుర్మార్గంబున దుష్టాత్ముడగుచు । ధర్మంబుదప్పియు ధనమ్ముల్ జేయ
అతిపాతకుండై యహిరూపియయ్యె । సతినీవుజేసిన సద్ధర్మమునకు
గతనుక్యాపంబు గతమునీయందు । వ్రతములుఫలియించె వైకుంఠుకృపను
నాగేంద్రునల్లన నరరూపమగును । శ్రీగలిగివర్ధిల్లు శీఘ్రంబు గాను
మగువరో పామ్మని మరిమునులనిరి । చిగురాకుబోణి వానిగమోవకుంది
తెగువతో నాకొన్ని దేశంబులెల్ల । తగవుమీరగజాడదరలె వాత్తణమె
కాళింగనేపాళ కర్ణాటగౌళ । చోళలాటమరాట శూరసేనాంధ్రి
కరహాటకేరళ కాశ్మీరబోట కురుమత్స్యపాంచాల కుకురవిదర్భ
బంగాళసైంధవ పారసీమగధ । వంగాంధ్రి కొంకణ పాండ్యపుళింద
ముఖ్యదేశంబులిమ్ముగ సంచరించి । సౌఖ్యంబుగోరక సాధ్వీలలామ
కందరాళీపలాశ కదలినిర్గుండి । తిందుకకర్పూర తింత్రిణీవకుళ
పనసపిప్పలిపలుబపారిభద్రాది । ఘనవృక్షయుతమైనకానలదాచి

ఘూకభరద్వాజకోయష్టి చటక । కాకోలటిట్టిభకలకంఠములను
గరుడశకుంతల కంకకపోత । స్వరములువినుచు నప్పటివేళనుండి
భల్లూకసూకర బలిముఖశరభ । భిల్లీలులాయక భీకరఖడ్గ
హరిణీగోకర్ణశశ వ్యాఘ్రదంష్ట్రక । కరి శశసారంగ గవయమార్జా
లములు మొదలైనట్టి మృగకోటులెల్ల । తలగక జూచుచు తరలాయతాక్షి
ఆ కాశిపురి జేరి అంజలిజేసి । అధవు సన్నిధిజేరి అతిభక్తితోను
భవపాశములుగోయ పరచింతదీసి । శివభక్తిగుంజేసి సిరులెల్లరోసి
వరగుణశాలి వల్లభునితాగోరి । వరప్రసాదులను శంభుప్రసాదము దాసి
మునిపక్షమునదీక్ష పూర్ణకటాక్ష । యనివిశ్వనాధుని కతిభక్తితోను
సావధానంబుగా సాగిలి మ్రొక్కి । భావంబులోనతిభక్తితోనుతను
కరములుముకుళించి కాంతయిట్లనియె । శరణుగిరిజాధీశ శరణుపరమేశ
శరణుపాపవినాశ శరణుభూతేశ । శరణుసగణేశ శరణుసర్వేశ
శరణుశాశ్వతరూప శశిజటాజూట । శరణునాగవిభూష శరణాధిదేవ
శరణులోకాతీత శరణుసన్న్యసుత । శరణుపూర్ణకటాక్ష శరణుఫాలాక్ష
అని యిట్లు నుతియించి ఆజ్ఞాయతాక్షి । పనివడి యాకాశభైరవుకాంచి
దండపాణికినుంబు వప్పజేసి । ఖండేందుమౌళికి ఘనమైనభార్య
సకలకళాపూర్ణ సాధుసంపూర్ణ । అకలంకమణికర్ణికా యన్నపూర్ణ
కని మ్రొక్కి విఘ్నేశు గుహుపూజ జేసి । పనివడి ప్రతిలోన బహుళమైయున్న
సకలదేవతలకు సాష్టాంగమెరగి । శుకవాణి వేగయచ్చోటును తెలిసి
వెక్కసంబున మతి విలపించుకొంచు । మక్కువ గంగను మునుమాడవలచి
అరయపాపవిభంగ అతిశోకభంగ । వరకంఠజటసంగ కరుణాంతరంగ
ముని మనస్సుమభృంగ భువిమహోత్తుంగ । ఘనగభీరతరంగ కేతుమత్తుంగ
వైరిసంతతిభంగ వరసుభాగంగ । భాగీరథి నిన్నుంగనుగొనిన ము
సకలపాపంబులు సమయుచు వినుము । ప్రకటితంబు బాముబహుదోషమునుచు
సరసిజలోచన సంభ్రమింపుము । పరవిచార్యము జేసి సరసతమీరి
నళినానాధుని జగన్నాధుని జూడ । అలివేణికుంతలి అతిభక్తితోను
శ్రీపురుషోత్తము జేరి వేగంబె । ఆపన్నగముతోడ నబ్ధిలోపలికి
ఆపన్నకాలయిన యనిమిషవేశి । ఆపన్నివారణములు సేయుమనుచు
వలగొనియాబలభద్రుబూజించి । వరదానమిమ్మని వర్ణింపదొడగ
శ్రీజగదాధార శ్రీజగన్నాధ । శ్రీవత్సకౌస్తుభ శ్రితజనాధార
మానితమృదుభాష మహానిత్యవేష । దానవమదశిక్ష తాపసరక్ష
శ్రియరూపకులదీప దారుణాటోప । వరచాపగతరూప వైరిప్రతాప

జాలగిరిమ్యలబోధ జేసేటివారు । కలిగుందురందుల గణుతింపనలవి
గాక సన్యాసులు ఘనమైనయట్టి । జోకత్రిదండులు శుద్ధవిరక్తు
లరయంగబైరాగులతిదిగంబరులు । పరమహంసలు మునుల్ బ్రహ్మచారులును
స్వామి సేవకువచ్చు జనకోటికోటి । యేమిచెప్పుదు పురియేడజూచినను
బావులు చెరువులు బహువనంబులును । దేవళంబులుగల్గి దేదీప్యమగుచు
పాలుపొందగాబ్రహ్మ పురమునుబోలి । సలలితంబైనట్టి స్వర్గంబుబోలి
యున్నయాపురిజూచియుగిసంతసించి । సన్నుతింపుచు మ్రొక్కిసన్నుతిగాను
శ్రీనారసింహుని సేవించదలచి । అనీలకుంతల యతిభక్తితోడ
వేగంబెవచ్చికోవెల జేరునంత । బాగొప్పగాను వైభవమెన్నవశమ
తారలుబూరలు తమ్మటంబులును । భేరీమృదంగముల్బిరుగు ఢక్కలను
వసుధగల్గిన సకలవాద్యంబులెల్ల । దశదిశలందును తగమ్రోయుచుండ
అంతసుందరాంగులు అబ్జలోచనలు । చతురత భరత శాస్త్రములతోను
అతులితగతినాట్యములుచల్పుచుండ । తతిగొనివర్యతో తాళముల్ మ్రోయు
భాగవతోత్తముల్పరి పరిగతుల । బాగుగాస్మరణలు బహుభంగిసేయు
గుడిచుట్టుదండములొక్కొందరుబెట్ట । కడలేని దీపముల్కొలలు వెలుంగ
మరికొందరునుపుష్ప మాలికల్వేలగ । కరుణతోకొందరు కానుకల్దెచ్చి
బడిబడి అర్పించు పుణ్యారావములు । అరిసెలు పులగంబు లన్నంబుపప్పు
పరమాన్నములు నెయ్యి పచ్చళ్లుపెరుగు । గారెలుబూరెలు కజ్జాయములు
పారమాఫలములు సకలవస్తువులు । విరివిగా నెవ్వడు నైవేద్యంబులివ్వ
సరగునతీర్థ ప్రసాదల్గొనుచు । హరిహరిస్వామికై మరలంగజనులు
సందడింపుచునుండ సారసనేత్రి । ఆనందంబుగాగుడి యప్పుడుజొచ్చి
బాగుగా గరుడగంభముజేరిమ్రొక్కి । వేగంబెవలగొని విలసముమ్మారు
కోవెలచుట్టును కొమరొప్పదిరిగి । భావంబు నలసింహు పైటెన్వికసిపి
భుజములుపొంగ నాభువనైకస్వామి । నిజముగాస్వామిసన్నిధికేగుదెంచి
దండప్రణామంబు తగనాచరించి । నిండువేడుకతోడ నిలిచికేల్మోగిచి
శరణుహారకునేత్ర శరణాధ్రిగాత్ర । శరణుపాపవిత్తు శరణాసుపత్తు
శరణదానవభంగ శరణశ్రీరంగ । శరణకౌస్తుభభూష శరణాశ్రితపోష
ఆపన్నురాలవై యఖిలేశనేను । నీపంచజేరితి నీవెదిక్కనుచు
తల్లిదండ్రియునీవె దైవంబుగురుడు । యిల్లబాంధవులు నీవెదిక్కుగాను
ప్రకటితంబుగనేను పాపముతోగూడి । సకలభూములును వెదకిచూచితిని
వసుధనెక్కడను దైవంబులేదయ్య । విసికితినయ్యనీవిప్పుడునీళ్ళ
ముంచినముంచుము మురహరనన్ను । అంచితంబుగకీలికా యంత్రనిద

అనుచు శ్రీహరిమూరి అచ్చోటనుండి । పనివడి యొకమంటపము దండ జేరి
పాలు నెయ్యాని దెచ్చి పాముకుబోసి । తాలిమితోడుత తాకొన్ని దాని
ఆవేళ తృణశయ్యనటు నిద్రబోయి । వేవేగ ప్రొద్దున విసువక లేచి
చక్కగా శేషుని నంక సంధించి । మక్కువ కుండంబు మరిచూడ వలచి
పడమటి దిగ్గున బ్రహ్మ కుండంబు జేరి । కడకతో నెక్కాని శాంతయిట్లనియె
మున్నారు జన్మాలమును రుకొన్నట్టి । యెన్నెన్ని విషముల యున్నంగ గాని
కలుషంబులెల్లను గడుక వ వెడలు । జలముల నెవ్వరు స్నానంబు జేసి
తోడరి పేజన్మాల దురితముల్ బోలగు । పుడమి నాభాగ్యమిప్పుడు యెటులగునో
అనియని తలపోసి ఆడలి మంతటను । అనువొంద మెల్లన నాదరి జేరి
చెక్కిట చెయిజేర్చి చింతింపదొడగె । అక్కటా దైవమా యీ వనిలోపలను
నాయీడువారు యెన్న గభోగమందు । నేయిట్టి కష్టంబు నిజముగా నొంద
యీభూమి దిరిగితి నిడుములబడితి । నాభాగ్యమెక్కడ నణుము గానాయె
హా జగదాధార హా దీనపోష । హా జలజాతాక్ష హా భక్తపాల
యేలపుట్టించితి వీక్షితి నన్ను । యీ లీల నాపదలేల పెట్టెదవు
యీవిధంబున నన్నేమి గాకుంప । దేవేశ నన్నింత తెర్లబెట్టితివి
యెంతని దిరుగుదు యెమి సేయుదును । యింతపర్యంతము యెను ప్రాణములు
నిలిపితి నాసచే నిల్వలేనింక । అలసితి దేహంబు అతికృశ్యమయ్యె
నడువబోయిన కాళ్లు నపవడి దప్పె । తడబడుచున్నవి దైవమాయింక
బ్రతికి నే నెవ్వరి పంచల బడుదు । గతిమాలి బ్రతికి సిగ్గభిమానముడిగి
యెవ్వరి నాసింతు యెవ్వరు దిక్కు । యెవ్వరు రక్షకుల్ యెవ్వరి దాన
జగతిలోపల వృథాజన్మమై పోయె । భగవంత నన్నీపాటు జేసి వి
యెంచ ఘనమైన యింట నే బుట్టి । యించుకైనను సుఖమెరుగ నే తల్లి
ఓతల్లి మరి నిను యెక్కింకరైన । యీతీరు మరుగుట నీవెరుగవు గదవె
మాతండ్రి యెంతెంత మరుగునో నాకు । బాతైన బంధుల బాసితి నేను
యెన్న పాతమునకు నైయిటు దెచ్చిదాను । నన్నింత జేసె నేనగుగాటు మంత్రి
[illegible]వింపగా మంత్రి పాలంబు మెసను । నా పుసురిక పోవు నాచుట్టుకొనక
యెంత గుఖింతు నే నెంత సహించుదును । యెంత విదలపోసి యేమి చేసినను
యెంత చింతించినా యేమియు రాదె । యెంత దుఃఖించినా నేమియు రాదె
యిక జన్మభూమికి యేమని నేను । ప్రకటంబుగామళ్ళి బంధుజాలముల
నేవిధంబున జూతు నేను గదాన । యీ వాహినందున యీ కష్టముడిగి
అవల సుఖము నేనందెదననుచు । అనల్లభుండైన నాయహిరాజుజూచి
అతిదుఃఖమున నొంది నాసరోజాక్షి । పతిభక్తి తప్పక పామునదిగిచి

తొడలపైబెట్టిరంతుగ నేడ్చుచును । గుహగుహస్వరమున గరిమంగననియె
నాప్రాణనాథపన్నగరాజు కఱువ । నీప్రాణమేమాయె నేనేమిసేతు
నీతల్లినెటుబాపి నేతెచ్చితికట । పాతకంబంటె యీపట్టునవాసు
నామాటద్రోయక నాగెంపినిన్ను । నీమాటదప్పక నీవురుసుంకుమను
నాచేతికిచ్చిన నాటనుండియును । మాచితిన న్యాయించుకపాలకంటె
యేమికూడిననేర నేమినేఱుఁగను । ప్రేమతోనే దిగబెట్టెదనంటె
పాముంచు నెవ్వరు పట్టికొట్టిరో । ఆమాటవిన్న చంద్యనపతిరాణి
పట్టిభక్తింపనో ప్రాణేశనిన్ను । పుట్టగావిడిచనే బోయెదనంటె
చేతులాడవునాకు చిత్తంబునెవరి । ధాతయీవో ప్రవతగ్రాసెననుచు
యిందీవరాక్షి తాయెలుగెత్తియేడ్చి । సందేహమేమిచవ్యనలేచి
యురగంబుపెట్టిదానువిజ్ఞప్తిబెట్టి । వరసమూసుడు ఓరనాకిలిజేసి
కాసెబిగ్గరజెక్కగట్టి గాగట్టి । భాసిలురవికె తప్పకముళ్లువేసి
తొయ్యలితనమది దృఢముగాజేసి । వెయ్యారుగధయు విభునకు మొక్కి
మడుగుదండము జేరి మగువకేల్మోగిచి । తడయక శ్రీహరిదలచియిట్లనియె
నారాయణాచ్యుతనరసింహకృష్ణ । నీరజదళనేత్ర నీరదగాత్ర
నీరజాసనవంద్య నీరజనాభ । భారతిఫాలాక్షపావనిదుర్గ
క్షీరాబ్ధివరపుత్రి శ్రీమహాలక్ష్మి । ధరణిగలయట్టి దైవంబులార
సురలామునులారసూర్యేందులార । పరుపడియష్టదిక్పాలకులార
గరుడకిన్నరయక్షగంధర్వులార । ఆకాశవాణి మీరందఱు వినుడు
నాకార్యమెల్లవిన్నపము గావింతు । ఘనముగామాతల్లిగర్భాననేను
పుట్టిననుండియే పుణ్యపాపంబు । లెట్టివిచేయావి యిట్టవియనుచు

## ఆకాశవాణి గంగనురకవద్దని వారించుట.

నేమియెఱుగనే నీపాపనుదచ్చి । పానురంబునబుట్టి బైటవేసితిని
ఈదోషమంటెను యెన్నిజన్మములు । పాదుకయెంతయైన పోబుంగగలదె
కారుణ్యగసమెప్ప గన్నవారెల్ల । గారవంబునసామి గావుడీయనుచు
చయ్యత్రిమ్రొక్కియా దిగుగాళుబోణి । అయ్యెడగ్రక్కున నాగంగలోన
నానరినధీరతనురకబోవంగ । మనుజభాషలతోను మహనీయముగను
ఆకాశవాణియిట్లనియెనావేళ । జాలియెంత యుగదురవిద్యనపుడు
ఈకాలమందున నీగంగలోన । నోకాంతరత్నమా యురకనేమిటికి
నీకేలయీచింత నెలతరోపినవె । కొందకయిబ్రహ్మకులంబుమహిమ
యొందశక్యముగాదు యీజగమందు । కొండిమనృపుడాహ కులమునిర్మోహి

ఖండనంబునభీతిఁ బారినవాఁడు । స్త్రీహత్యగురుహత్య శిశుఘాతకుండు
గోహత్యబ్రహ్మహత్య గురుతల్పకుఁడు । మేల్మినీదునగ్రుంకి మెలఁగిరేనియును
కల్మషరహితులయి కడుపుణ్యులగుచు । సకలపాపంబుల సమయించిమిగుల
నకలంకచిత్తులై యలరుచుండుదురు । పొలతినీచేసిన పుణ్యంబువలన
కలపాపమెల్లను గతమయ్యెనొక్క । కావునభోగీంద్రు కంఠంబునందు
నీవురవించి యీనీటఁగ్రుంకినను । దివ్యమోహాంబును దినకరగాంతి
భవ్యమౌరూపును బాగుగాఁగలిగి । ప్రత్యక్షమైనిలుచు కాంతనీవిభుఁడు
నిత్యవైభవమొందు నిశ్చయంబుగను । భువిజనుల్ నుతిసేయ భువియెల్లనేలు
పృథివీశులందరు ప్రేమరక్షింప । కోఁకయాడఁగలవారు కోమలినిన్ను
మనస్సులోపలచింత మానుమీవేళ । మదిరాక్షి వేగతెమ్మనిచెప్పినంత

పాముతో బ్రహ్మగుండమున మునుఁగగా పామురాజపుత్రుఁడగుట.

మదిలోననుప్పొంగి మరిసంతసిల్లి । యపుడయాగంగలో నురగంగమాని
హృదయేశుడైనట్టి యురగంబుదీసి । తనకంఠమందున తప్పకబట్టి
మునికొనిజలములో మునిఁగినంతటను । బామయినయట్టి సర్పాకారముడిగి
వాగీశుపుత్రుండయు వనజాప్తుకాంతి । మరుకంటెచక్కని మందహాసంబు
అరుణాబ్జములమించు నట్టిపాదములు । కలువరేకులవంటి కాంతికన్నులును
నిలువుటద్దముకన్న గరమించుమోము ఘనమయినశంఖుకగళమయినగళము
దొనసిరింగిణివిండ్ల నొదిగించుబోమలు । దాడిమివిత్తుల దనరుపల్వరుస
చూడనింపగునట్టి సుందరంబునను । తెలివైనచక్కని దేహంబుతోను
బలువైనఆజానుబాహువుల్గలిగి । చిగురువన్నెకుమించు చీనాంబరములు
తగినభూషణములంతంతకుమెరయ । పొలుపొందచక్కని పురుషుడైనిలువ
అలివేణిచూచితా నాశ్చర్యమందె । అక్కటమనలాఁడు అమటలెల్ల
యిక్కడనిజమయ్యె నిఁకయేలగలదు । అనినిశ్చయించితా నానందమునను
తనమనోహరమూర్తిఁ దప్పకజూచి । మనసిజతాపులవావనముల్వదలి
వినయంబుతోమ్రొక్కి కేడ్కనావేళ । తమకంబుగూడగా దద్దయుప్రీతి
యేణాక్షిచన యిట్లనిపలికె । ప్రాణేశవినయశ్రీవిజాకార
కారణజన్మసత్కీర్తిశృంగార । గారవంబున నన్నుగాపునీదాన
దానగంభీర సంతతధైర్యమాన । మానమునీసొమ్ము మరితాళజాల
చాలనమ్మితినిన్ను సద్గుణపాల । పాలించినన్ను చేపట్టిరక్షించు
మించినభాగ్య మిపుడుచేకూరె । పంచబాణునిబారిఁ బడద్రోయకిపుడు
కూడవిధమునంగద భూవరపుత్రి । తడయకయింకనీ దయజూడుమనిన

విని రాజపుత్రుండు వెలదికిట్లనియె । వనితనిన్నెరుఁగ నెవ్వరిద ననీవు
కావునా భార్యవెక్కడిమాటసీది । నీవునేనెన్నఁడు నిలయంబులోన
కూడియుంటిమిచాల కూరిమిమీర । చూడ నాశ్చర్యంబు సుందరినిన్ను
యెచ్చోటనెందుము యిదిగాకమునము । యిచ్చటికెన్నడు యేగుదెంచితిమి
నాకుదెలియదుగదా నలినాయతాక్షి । యీకథ జెప్పవె యేర్పడననిన
కుటిలకుంతలపల్కె కోమలాకార । యిటువినవయ్య నే నెరిగింతునిపుడు

## పూర్వవృత్తాంతము చెప్పుట.

స్థిరమైన కాశ్మీరదేశంబునందు । ధరణీశుడైనట్టి ధర్మాంగదునకు
ఉరగంబవై పుట్టితోగినన్ను నీవు । భార్యగా జేసిన భయమంది నేను
కార్యంబుదోచక కడుచింతనొంది । వేగమేనినుగొంచు నేపినముల్నదులు
బాగైన తిరుపతుల్పర్వతంబును । ఆపన్నురాలయి యన్నియుందిరిగి
యీపురిలో జేరి యీపుణ్యతటిని । యీవాజేసితి నేను నురికెదననుమ
సాహసంబుకు మెచ్చి సర్వేశ్వరుండు । నిన్ను మనుష్యుగా నిర్మించెనయ్య
నన్నేలుకొందగు నానాథయనిన । విని యద్భుతంబది వెలదిని జూచి
ఘనతపతివ్రత యనికడుసంతసించి । యున్నవేళలయందు నాగివిప్రవరులు
కన్నులజాచి వేగమె సంతసించి । యొకరికన్నగ నొకరు కేవలగట్టివారు
పిల్లజుట్లాడడొల్లనకాశలూడ । పల్లెకొంగులు తుళ్ళినడయూగులాడ
చంకపంచాంగముల్జారిపోవంగ : కొంకక వేదముల్గణియించుకొనుచు
జయయంచువచ్చియా జనపతిజూచి । దయశాలివైనట్టిదాతవునీవు
మాయదానమిమ్మనియడిగెడువారు । రయమునకొందరు రాజుచెయిపట్టి
యచ్చోటగంగలో యాచించరాము । ఇచ్చినమాత్రమే యిమ్మనువారు
శాస్త్రిలనుచును సన్నుతిజేసి । వస్త్రదానంబని వాపోవువారు
యేమైనమీకిష్టమిమ్మనువారు । హేమదానంబని యిగిలించువారు
గోదానమిమ్మని కొనియాడువారు । భూదానమిమ్మని భూషించువారు
తగిలి భూసురులిట్లు దానంబులడుగ । మగువయిప్పుడు తనమౌక్తికహార
ములు కక్షపాలలో మునుదాచియున్న । యొలనాగయిపుడు తానెలమినందరికి
యవిదెచ్చియిచ్చి యాయగ్రజన్ములను । నవిరళంబుగ జూచి యతిభక్తితోను
పొలుపొందనందరకు బుచ్చుకొమ్మనుచు । చెలువొందగా జెప్పిచెలువుడుదాను
సన్నుతితో నమస్కారంబుజేసి । మన్ననను నన్నంత మరిప్రీతితోను
వారలువినియటుపలె పుచ్చుకొన్న । వారిజలోచన వారితోననియె
వినరయ్య ఒకమాట విమలాత్ములార । గొనకొనియాబ్రహ్మగుండంబులోన

పరవితోడుతనేను సర్పంబుదెచ్చి । స్థిరము గాముంచిన తివిరి యాక్షణమె
పురుషుడాయెను నాగుపుణ్యంబుచేత । పరముపున్నెన్నంగ పాటియేనదికి
పరమపావనమైన బ్రహ్మాండంబు । తరమెన్నరాదు భూతలమునంగూడ
వనవిని వాలిట్లని బ్రాహ్మణులు । వినవమ్మ గుణవతి వినుపుణ్యసాధ్వి
తడయక యిచ్చోట దైత్యారి గూర్చి । యుండుగ బ్రహ్మదేవుడు తొల్లి తాను
తపమాచరించి యాతిమ సన్న్యసమ్యై । చపలాక్షి యదితుర జనులకీ యిదియు
బ్రహ్మగుండంబని పలికిరిమును । బ్రహ్మకృత్రిహత్య భగ్నమౌనిచట
యిదిపుణ్యపావని యెన్నంగవశమె । ఎచటచే యిది యొందలభ్యమైనట్టి
శేషముగనమ్మ చెన్నుమీరగను । శేషగేపురుషవిశేషుడైని చె
యింతిరోసీ ధర్మమెన్నంగ వరమె । సంతుకెక్కిన సత్యవతి పుణ్యరీవు
యిందీవరాక్షి యీ గాధుని వ్రాంబు । వి గుదూరినవారు గానుభాంకోప్ప
రవినయానందించి యతిర యుంబునన । తనపురుషునితోడ తల్ళాక్షిమారి
వచ్చి శ్రీనరసింహ్మ వాకిటనిలచె । అచ్చల మాసుగ లధిమైయున్న
తానంతవారికి పంచముబెట్ట । శ్రీనరసింహుని జేరినుతించెనిట్లు
శ్రితగణేశ మిత్ర సాంజాతి । జాతికధనవాళశంకర మిత్ర
మిత్రవిందాధిప మదురగాత్ర । సుత్రామవంద్య మా సుందర్యహార
హారకౌసుభ భూష అతిబలశూర । సూర్యకోటిప్రభాసుందరాకార
కారణబాంధవ కాదుస్థవీగ । వీగాగతాంసే వేయుధంగులును
వినుతింపనేతుడా నే విశ్వేశనిన్ను । నను ప్రాణవిభుజేర్చ నాడకృపను
అనిమ్రొక్కెదశరాత్రు లచ్చోటనుండి । దనరనంబును చాల దేదీప్యమైన
భగవంతునోర్చసంభ్రమము మామమను । మిగులవానందనమ్మి శాస్త్ర యుగము
ధారుణివిభుడైన తనపతిగూడి । నాగసింహుని దర్శనముజేయుకొనుచు
కాలభైరవమూర్తి కడుదాస్యమునను । మదిలోనపతిప్రీతి ముదలుకొనంగ
వాలోకనముజేసి యతికేడ్కతోడ । పన్నిద్దరాళ్వార్ల భారతీపతిని
చిన్నికృష్ణమ్మను శ్రీరంగపతిని । కొండరకతిథ క్తి కోరి మొక్కుచును
చందనమాల్యప్రసాదముల్గొనుచు । రమణీయముగ దశరాత్రులుగడపి
కమలాక్షి తామరికడు వేగమునను । అతిసంభ్రమంబున నచ్చోటుగదలి

## శశిముఖి పురుషునితో పుట్టింటికేగుట.

పతితోడగూడి సంభ్రమచిత్తయగుచు । పట్టగుమాణిక్యపట్టణమునకు
పుట్టింటకినిబోవ పూవోణివపుడు । ఆ వేళ ధర్మాంగదాది భూపతులు
వారిరి బాంధవుల్ పరుసతో హితులు । వలనొప్పమంత్రులు వరపురోహితులు

కొలువుకూటంబున గూచున్నయప్పుడు । అపుత్రికయై తనయల్లుడుగూడి
యేఘనకాల్నుడ నెదురుగారాగ । చూచి భూపతిబాల చోద్యంబుఁ బొంది
యీచిత్రమిదియేమి యిప్పుడుకాల్నుడే । వచ్చుటయిదిగాక వస్త్రహీనంబు
అచ్చెరువొందుచు ననిలేచి తాను । యెదురుగా నేతెంచి యిద్దరి నపుడు
కడకుఁ గోటకుఁ జేర్చి కడుమొప్పుననిరా । ఖరసింహశార్దూల గండభేరుండ
శరభఋక్షుల్ మృగసంఘంబు గడచి । వరుసతో నెటువలె వచ్చితిరిందు
తిరువుజాపుటకయి ధృతినొక్కరుండు । మనుజమాత్రుండన్న మాటకులేదు
అనవొందమీకేమి యాపదవచ్చె । విని చెప్పవలయు మీవిధమంతయనిన
తనతండ్రితో డుత దనకనిట్లనియె । తగవినుమా తండ్రి ధర్మాంగదునకు
బోగడంగ మొదటికి పుత్రుఁడే లేడు । కమలాలయంబున కాలసర్పంబు
ఆమరాలిగర్భంబునందు పుట్టినను । బూమెలమంత్రితో పుత్రుడేయనుచు
భూమెల్లపాలించె భోరుననపుడు । యేమేమొబోధించి హితబుద్ధి చెప్పి
అమీదమిమ్మ నన నటమటజేసి । అక్కడ తనపుత్రి నమరంగ జూపి
యిక్కడనొక్క త్రికీర్వరుపమచు । వనయింటికి దెచ్చి మాయలుబన్ని
నను బెండ్లిజేసితిన్నగ దోడుకొనుడు । పోయిధర్మాంగదుముందరనిలుప
జాయనయిది పాపమనక చేవేగ । కోరి గృహంబుల కోడలననుచు
వారక నన్నుంచరారింట నేను । యేరీతులెరుగక యేగిమీవలెనె
మీరక యాజ్ఞలో మెలగియేమనక । అత్తమామలమీద నతిభక్తితోను
చిత్తంబురాపను శ్రేయముచునుండు । తరువాతనంతకంతకువయసెరిగి
పురుషునికానక బుద్ధిలో వగచి । అత్తగారినిజేరి యడిగితి భువి
మత్తిల్లి శేషుండు మగడంచు జూపె । అప్పుడు చింతించి ఆహిరాజుగొంచు
చప్పన్న దేశముల్ జగతిలో నదులు । పుణ్యస్థలంబులు పూజ్యంబుగాను
గురుతరారణ్యముల్గానకొని తిరిగి । తిరుపతుల్ నిత్యయు తిరిగివేసారి
శరమతీరాక్కట్ట కడపారి వేళ । పురుడింపదగు ధర్మ పురి చేరినేను
వరనరసింహుని వర్ణించిమొక్కి । తిరమయిన ఆశలు తెగగోసివేసి
ఒకనదిలోపలను నురక బోవంగ । సకలేశ్వరుని యాజ్ఞ చయ్యన నపుడు
అశరీరిపలికెనిట్లసిగారవించి । వశముకానట్టి యావనములు నదులు
అష్టదిక్కులు జూచి యాపదకోర్చి । సృష్టికుడింక రక్షించెడివేళ
వలదవమ్మ యిందురకవలపదుకవు । వలనొప్పపెట్టెలో పలనున్నయట్టి
భుజగేంద్ర దెచ్చిని భుజములజుట్టి । గజరాజవరదని క్రమముప్పదలచి
సురనదీగంగలో స్నానంబుసేయ । పురుషుడౌ ననినాకుబుద్ధి చెప్పినను
జగంబెనేను నావిధమున జేయ । బాగుగా నప్పుడు పరమాత్మకృపను

నాగేంద్రుఁడల్లన నరరూపమయ్యె । నాగేంద్రశయనుండు నన్నురక్షించె
చూడుమీతఁడె యని చూపిననుజూచి । వీఁడనిదుఃఖంబు విభునకువచ్చి
యచటిపెద్దలజూచి యపుడిట్లులనియె । యెడలేనియాపద లీచిన్నబాల
కేమిప్రాప్తించెనో యింతగుఁగలిగ । నామంత్రిచెప్పిన నదిపాపమనక
యిరకొనిధర్మాంగదుండెంతదోషి । యరయంగయిదిదొడ్డయపకీర్తిగాదనక
పరవారిపడుచనని భయమింతలేక । కరుణావిహీనుఁడై కటకటాయితఁడు
పనివడితనమంత్రి బంపిదానెట్లు । మనపాపదప్పించెనురవారిమోము
జూతామురంభించు చుట్టాలజేరి । అత్తరికోపించిఅపుత్రిజూచి
అతిదుఃఖమునబొందె నాగజనకుఁడు । మదిలోనవగచిరి మంత్రులుబుధులు
అప్పుడుతనపుత్రినమరదోడ్కొనుచు । నొప్పగాగృహమునకొనరంగబోయి
యీవార్తజెప్పిన యెల్లబాంధవులు । ఆవేదనిజూచి అతిదుఃఖపడుచు
నంతింత వగచిరి యతివలుగూడి । యంతపుత్రినిజేరియశ్రువులొలుక
తల్లికౌగిటజేర్చి తడవుచింతించి । యెల్లవారిఁజూచి యిక్కెంతటంచు
రంతుమాన్పియులేచె ధర్మాంగదుండు । చింతింపవలదని చెలువమైనట్టి
పుత్రునివెయినోళ్ళ బొగడె నావేళ । మిత్రబాంధవులతో మృష్టాన్నములును
నప్పుడుభుజియించి రల్లుఁడుదాను । కర్పూరవిడెములు కాంతతోనిచ్చి
అకలంకచిత్తుఁడై యల్లునిఁబుపు । నొక్కమేడలోపల నుంచెనావేళ
అప్పుడుపుత్రికి నానల్లునిని । గొప్పైనతొడవులు కూర్మితోనిచ్చి
ఒప్పైనవస్తువులొక్కటోఁ డితముగ । కుప్పలుగాబంపె కొదువయేలేక
మల్లెలువిరులు చామంతి బంతులును । వకుళముల్ గేసంగి వంజాళంబును
మొల్లలుసంపంగిమొగిలిపువ్వులును । అగరువత్తులు తగయోగ్యమైనట్టి
సొగసైనకస్తూరి సుగంధములును । పండుటాకులుతమ్మి బాగాలుగూర్చి
మెండైనవేడ్కతో మేఁబంపినను । యెనయానిద్దగునవియెల్లధరియించి
చనువుతో నవ్వుల శయ్యపైవేడ్క । సతిపతులంతంతచాతురితగుల
నతనుకేళినిదేలి యానందమునను । వింతగావిభవముల్వాలయనిద్దగును
సంతోషచిత్తులై సరసతమీర । సకలసంతోషములజరుపుచువారు
బ్రీతినొకమాసముచ్చటనుండియంతటను । పాలతియత్తింటికిపోవగమదిని
దలచియప్పుడుతనతండ్రికిట్లనియె । నోయయ్యయేనిన్నాళ్ళునుండిననిదియె
మాయిల్లైగానుమ్ము మరివింతగాదు । అక్కడమామామఅత్తయుమిగుల
మక్కువజూడంగ మనసయ్యెనాకు । వారింతనాకుసైవగలనొందుదురో
వారువృద్ధులురాజ్యవాంఛలులేవు । ఊరకనిక్కడ నుండంగనేమి

యేమనిబొంకుదు నేమిసేయుదును । యెఱుగనివారికిడి యేమివచ్చె
పెండ్లివద్దని మొఱబెట్టిన నేను । కండ్లగానక చేసె కపటియీమంత్రి
పడుచులేకున్న ఆపదవచ్చునిపుడు । పడుచుయున్నదియన్న పంపుడందురిక
యీవహీనునితోడ నేమందుననుచు । ఆమంత్రిబిలుపించి యాగ్రహంబునను
చూచియాతనితోడ చురచురబలికె । యేచిరత్నాంగుడిటవచ్చె నేడు
ఓరిపాపాత్ముడా వుండుండినీవు । యూరక యపకీర్తి నొందజేసితివి
మూలనుండినవాని ముంగిటవేసి । యీలీలయాపద నేమితెచ్చితివి
యెక్కడికేగుదు నెక్కడిపడుచు । యెక్కడిపెండ్లి నిన్నేమిసేయుదును
యిదికార్యమనియని యెంతిజెప్పినను । మదిలోన నెరుగక మంత్రివానీవు
లేమయీగృహమున లేదన్నదరిగి । కామసంబునపుత్రికతో బంపుమనుచు
రాయబారముబంపి రాకయున్నాడు । పోయియేమనివారి ముందరనిలచి
మాట్లాడినొప్పించి మరివారితోను । నెట్లుగాదలచిపూనికె మీరువాడ
బాటివేడుకగాదు నగుబాటుగాని । చాటిచెప్పినగాని చయ్యనవినక
సమ్మతంబునబోయి సఖియదెచ్చితివి । పొమ్మనితలవంచి పోజాలకపుడు
మరినోటయించుక మాటైనలేక । విరసంబునుండె నిర్విణ్ణుడగుచు
అంత ధర్మాంగుడతని నిందించి । యైంతైనగానిమ్ము నేపోయియతని
అంతరంగముబట్టి అఖిలంబుగాను । యంతయుజెప్పిన నటుమీదనతడు
ఎంతయినకోపించియేమయిననన్న । యంతవింతలుగాగ నాడనిమ్మనుచు

## ధర్మాంగుడు రత్నాంగుని జూడబోవుట.

మించినరథమున మేలువస్తువులు । కొంచపోయవిరాజుకును సమర్పించి
కాంచనాంబరములు ఘనరత్నతతులు । కాంచనపాత్రిలకట్నంబులిచ్చి
అతనికౌగిటజేర్చి హర్షంబుమీర । చతురతగూర్చున్న సమయంబునందు
ధర్మాంగుడనఘ రత్నాంగుడనియె । అర్మిలిగుణవతియగుగాక మరియు
సకలదిక్కులనిను సన్నుతిసేయ । ప్రకటంబుగావినిబహుసంతసమున
యికనింతచోటుదానేడలేదనుచు । నొకచోటికెక్కడనొప్పక నేను
నీపుత్రిజూడక నాపుత్రిని స్త్రీ । నాపిన్నవాని పైయభిలాషచేత
నేడైనకన్నులనిండజూచెదను । తోడితెప్పించుసంతోషంబుమెరయ
తరువాతమాపుత్రితగబంపవలయు । అరయెంగనేటిపరత్వంబుమాకు
ధారుణీభారంబుకగిలియుండంగ । వారకనిందాకవచ్చెడికొరకు
తీరకుండంగయిన్నిదినములుజరిగె । కొరికతోడుతకొడుకుకోడలిని
పంపించుపోవలెపనిచాలగలదు । పంపకగానిపోగూడదటంచనిన

మీయింటనుండియీ మెలఁతయు వెడలి । పాయనియడవులు పర్వతంబులును
వేరైన నదులును వేరైననిధులు । వేరైనతీర్థంబుల్ ప్రియముతో దిరిగి
చెలగిధర్మ పురంబుచేరియాచెలియ । విలసితనరసింహ విభునిదర్శించి
గురుతరంబైన యాకుండంబు మహిమ । వినివిహితంబుగా విప్రులకెల్ల
దానముల్ సేయుచు తరళాయతాక్షి । గురుజనంబులఁగూడి గుండంబుజేరి
గురుతైన యాబ్రహ్మ గుండంబులోన । అహిరాజుతోడను అందుమునింగినను
మహిమీఁదపరమాత్మ మహిమచేనపుడు । పురుషుడైనిలచినాపాలతితోఁగూడి
కరమర్థిఁవచ్చిరి కనుగొనుమనుచు । దంపతులను వేగ తగబిల్వపించి
సొంపుగానిద్దరి జూసినజూచి । కంపించియుంత భూకాంతునకనియె
దంపతులందు రాధరణీశయిట్లు । రొమ్ముదానిదెచ్చి మీరిప్పుడునాకు
పోడిమితోఁడుత పుత్రుడటంచు । ఆడంగదెల్లునా యపకీర్తిఁభువిని
తోడఁతెచ్చూగాని కొడుకుగాడితడు । పుట్టినగాముకు పుట్టగోవిడిచి
పుట్టనిగానిని పుత్రుజేసెదరు । యిట్టిమాటలుపల్కి యిదిపాపమనిన
గట్టిగావినిమరి కమలాయతాక్షి । అట్టిట్టు చెదరక అప్పుడిట్లనియె
రొమ్మిల్లుపల్కితివయ్య యిటధర్మమూడిగి । ఏపాపమతివైతి యిందేలనత్తు
భూపాలవినుమునీ పుత్రుడేయితడు । సత్యంబుచెప్పెద చనగవినుమయ్య
మానంబువిడిచి దుర్మార్గులైపోయి । మానినులెక్కడ మగడనేతెంచి
సిగ్గులజ్జలుమాని శీలంబువిడిచి । అగ్గలంబుగనవ్వ సాగునదేల
తనునా ముందర తలలెత్తుకొనుచు । కొనుకొన్నప్రసికిన పురుషుఁడుగాక
యిరువుగానానునవెనుక కాశితివి । పరమాత్ముడితగా భయమేమినాకు
వినవయ్యపేక సేవిన్నవించెదను । కనకాపురంబువేగ మెకర్లిసేయ
మునివేషధారినై ముఖ్యమైనట్టి । వనములుగిరులు దేవాలయంబులును
మించిన నూటయెన్మిది తిరుపతులు । కొంచక సేవించుకొనివచ్చిపిదప
శ్రీధర్మపురిచేరి క్షీరాబ్ధిపుత్రి । నాథుడైనట్టి శ్రీనరసింహుజేరి
ఎదిరైయెను గ్గహముల ప్రస్తుతిజేసి । వదలకసేవించివచ్చియావలను
పదండిగొక మంటపములోనజేరి । మదిలోన చింతించి మరిమరికుంది
నదులుదేశంబులు నగరక్షేత్రములు । ఉదయాద్రిపర్యంతమున్నతీర్థములు
తిరిగితి నాపాలి దేవుడెంతయును । కరుణించడాయెనా కర్మమీలాగు
ననుచు వేసటనొందియతివేగమునను । ఘనమైనబ్రహ్మపుష్కరిణియామడుగు
గనియుందునురికెదగాకని దలచి । వినయముతోడ నావిభునున్నవెట్టి
భూకాంతపైబెట్టి పుణ్యవాహినిలో । యీకర్మదేహంబు విడువబోవంగ
ఆకాశవాణి యిట్లనియెనావేళ । ఓకాంతయిందులో నుడకవేమిటికి

నాకోదరుగనీదు కంఠమందునిచి । చేకొనిప్రాణంబు చేసినంతటను
మురుకంబెచక్కని మహనీయమూర్తి । పురుషుడౌనని చెప్ప భూనాథయేను
నశరీరి చెప్పిననట్ల చేసితిని । నాశరీరమునను శేషునిరూపముడిగి
పురుషుడై నిలచెను భువనైకవంద్య । మాపణంబుతో డుతనతిని దోడ్కొనుచు
వరుసమీపాలికి వచ్చెదనన్న । నరులయీతనిజూచి నమ్మరటంచు
గ్రక్కునమాతండ్రి కడకేగుదెంచి । యక్కడనాకిష్ట మంతయుదెల్పి
ఒక్కతెవచ్చుటయుచిమా యనుచు । తక్కకతండ్రినితగదోడుకొనుచు
వచ్చితినన్నయూ వనభేదమడ । ఆన్చెరువందితానబలకిట్లనియె
భోగిరూపక్కడనైన పురుషుడానవ్వ । అగడంబున కడపార్వుజేగాక
పతులకెక్కడనైన సత్యోక్తులు । కిలొ నగెదని చెన్వగాసనము
ఇందుకసాక్షివారెవ్వరున్నారు । కందువలోడ నాకాశవాణమ్మ
అక్కడబలుకట ఆదినమ్మరాదు । యిక్కబలికే యదినిశ్చయంబు
అక్కడగంధర్వ గతిగందిచట । యెక్కడివాకిల్ల యందరవినగ
పలికెవానిజమని పాటించవచ్చు । పక్కుపువి వ్వడు పడతిరో యనిన
కలికిరో నీగుణకధలెన్నవచ్చు । నీలోనధర్మంబునిలచియుండగను
లోలాక్షియిందరిలోనబల్కుచు । అనినను ఓకనప్పుడబ్జాయతాక్షి
కొంకపీతాంర పుడిక్కు ముఖముగనిలచి । తనహస్తములు ఫాలతలమున జేర్చి
యగణితభక్తితో నప్పుడిట్లనియె । నారాయణాచ్యుతనరసింహరామ
వారిజోదర జగద్వంద్యలోకేశ । పరమాత్మకృష్ణ ద్రౌపదీమానరక్ష
శరిర జా సాహల్య గాచినయట్లు । ననగావుమిక్కడ నలినాయతాక్ష
జనపతినన్ను విశ్వాసింపడిప్పుడు । కరుణాకటాక్ష వీక్షణములనుంచి
పరమాత్మయశరీరి బలికింపవయ్య । అనియిట్లు శ్రీహరినభినుతిజేసి
వనజాక్షియాకాశవాణివీక్షించి । అలినీలవేణిరో యాకాశవాణి

## శశిముఖి ఆకాశవాణిని వల్కించుట.

ఫలితమృదుపాణి సైకతశ్రోణి । వారకసేకతి వ్రతసైతిసేని
ధారుణీవేదముల్ తధ్యమానేని । మునిశుకడు లోకమునగలేని
మురువకభూమి ధర్మమువదప్పదేని । తనశేషుడైన తగవిశ్చేని
గగనంబునుండి వేగమెపల్కుమనిన । అధర్మకేళిత యధికతోననియు
ఓధర్మగుణసాంద్రి యోరాజచంద్రి । నీపుత్రిడితిడౌను నిజముగానమ్ము
ఈపతివ్రతమాట లివికల్లగావు । అనగజ ద్రాంతి యామాల్యతార
శివపత్ని యనబూయెనంతరబ్ధితనయ । కొండలయినవనితల ఫోలునీకాంత

సలుదెరంగులపుత్రు పట్టంబుగట్ట । వలెనని యూహించి వసుమతీనాథు
డనుపొందదగినబ్రాహ్మణులరావించి । వినయపూర్వకముగావించియిట్లనిరి

## కుమారునకు పట్టము గట్టుట.

శ్రీకరంబుగపుత్రుపట్టంబుగట్ట । భూసురోత్తములార పొలుపొందిలగ్న
మాయతఃబుగజెప్పు మనసనంతవారు । వేదవిధంబుల విప్రపుంగవులు
తెలివితోనక్షత్ర తిధివారములను । కలయవీక్షించియా ఘనవిలోకననిర్ణ
అవిరళ శుభదినంబభిషేకమునకు । రవివారమనఘాత్మ రవణితోదశమి
వివరింపదినమందు వృషభలగ్నంబు । భువనప్రశస్తమైన పుష్యమెల్లుండి
జననాథ తెల్పని సరవిజెప్పినను । మానమున హర్షించ మనవేశ్వరుడు
తనయునిపట్టంబుదశమినాడనుచు । తనవీటచాటించితగబంపెనంత
పురిలోనసంభ్రమంబున పౌరసతులు । పరువడితమతమభవనంబులందు
పన్నీరుకస్తూరిపదనుగావించి । కన్నులకింపుగాకలయంగనలికి
పలుచగామున్నంపుపట్టెలుదీర్చి । ధళధళమెరయుచిత్తరువులువ్రాసి
లాలితముక్తాఫలంబులచేత । లీలతోరంగవల్లికలొప్పదీర్చి
ప్రేమంబుతో తగపడిగెలొక్కములు । కమనీయముగ మేలుకట్లనుగట్టి
గ్రక్కునపురముశృంగారించిమరియు । తక్కకతనగృహాంతరమునరాజు
ఆరీతిగావించియాతక్షణమునను । గారవంబననులేఖలువ్రాసియప్డు
బాలుగదిక్కులనరనాయకులను । మేలైనబంధువుల్ మించుభూసురుల
గురువుపాహితులను కోరరప్పించి । ధరగల్గుధనధాన్యతతులైనట్టి
వారాంగనలువీరు వారనకుండ । వారలరప్పించి వసుధేశ్వరుండు
తానునపుత్రుండు తనసతిమణియు । పూనియభ్యంగముల్ పొసగంగజేసి
వేయుపన్నీరుతో గాచినయట్టి । జలములనప్పుడు జలకంబులాడి
పరగదివ్యాంబరాభరణముల్దాల్చి । పురహూతువైభవంబునను గూర్చుండి
అంతంత భేరివాద్యంబులుచెలగ । వింతగానృత్యముల్వేడలాడంగ
పుణ్యాహవాచనంబులు వేడ్కజరిపి । పుణ్యాంగనలుకడు పొడవిమీర
రమణీయ పుత్రుని రత్నపీఠమున । కొవరొప్ప నద్దర గూర్చుండబెట్టి
పూనివంగతూర్యములు మ్రోయుచుండ । మానితంబైనసమ్మతిపుత్రునకును
అవనిధరాంగదుండనునామధేయ । మవిరళంబుగబెట్టి యానందమునను
ధ్రువమైనయట్టి ముద్రిక వ్రేలబెట్టి । ఆవనీశ్వరుండంత నాబంధువులను
దొరలనరత్నాంగదుని యాజ్ఞచేత । కరమధిక శుభలగ్న కాలంబునందు
పాలుపైన శ్రీగంధపుష్పాక్షతలను । చెలగగైకొని వేదమంత్రములు

అవనిలో బ్రాహ్మణులందరు తాము । సవరణ మంగళాష్టకములు జదువ
అభినవ సింధు తోయమ్ములనప్పు । డభిషేకమొనరించి యప్పుడిట్లనిరి
ఎందాక కులగిరు లెందాక సూర్యు । డెందాక చంద్రుడు నెందాక ధరణి
యెందాక దిక్కులు నెందాక నుండు । నందాక వేశ్య రాజ్యము సేయుమనుట
భూసురోత్తములును బుధులును వేశ్య । నాశీర్వదించుచు నవని యంతటను
పట్టంబుగట్టిరి భాసురంబుగను । గట్టిగా పట్టంబు గట్టినంతటను
భూనాయకుడు వేశ్య భూసురులకును । దానంబులిచ్చి యాదరమున బంపె
కవులకు భట్లకు కట్నంబులిచ్చి । నవమోహనాంగుడై నాట్యకాంతలకు
అడిగిన త్యాగంబులందరికిచ్చి । తడయక వేశ్యనందరిని పంపించి
అరయంగ రత్నాంగదాది బంధువుల । పరువడి భక్తి తాత్పర్యంబుతోడ
కనకాంబరాదులు ఘనభూషణములు । వినయవిధేయుడై వేశ్వరుండయు
పూజించి బహుమానమున బంపెనపుడు । తేజంబుతో తమదేశంబులకును
అరిగిరి వారంత హర్షంబుతోడ । స్థిరతరనీతితో చిత్రాంగదుండు
పరమహర్షంబున ప్రజలనున్నించి । అరయ గాతలివందు త్రిలామోదమంద
చిరవైభవంబున క్షితియేలుచుండె । ఆనుచు గౌతమముని యాహల్యతోను
పొలుపు మీరంగ జెప్పిన సంతసించె । ఆనిరమాధీశుడౌ నబ్జాక్షు పేర
ఘనముగ శ్రీబొమ్మకంటివంశజాడ । ననువందకృష్ణున కపిలాతంబగును
రచియించి చెప్పితి రమ్యంబుగాను । ఉచితార్థయుతముగా నొనరిన యట్టి
యీపుణ్యకథ భువినెవ్వరు భక్తి । నేర్పుతో జదివిన యిష్టమైవినిన
వరుసతో వ్రాసిన వారలకెల్ల । సిరియును నాయువు గల్గి చెలగుచుండుదురు
పరువడి పతులతో బంధువులతోడ । వరుసపుత్రులతోడ వలనొప్ప నెపుడు
కామితార్థంబులు గలిగి హర్షించి । తామరతంపరై తనరుచుండుదురు



# 51 నోముల కథలు.

## 1 గాజులగౌరి నోము కథ.

ఓ బ్రాహ్మణ చిన్నది గాజుల గౌరీదేవి నోముపట్టి ఉద్యాపన చేసుకోకుండా ఉన్నది. ఉంటే ఆవిడను చూస్తే వీధిలో ఇరుగు పొరుగు అంతా చిట చిటలాడేవారు. ఇంట్లోకివస్తే మగడు అత్తా మామలు వది నెలు అంతా చిట చిటలాడేవారు ఇలావుంటె పడలేక ప్రాణం విసిగి చివరకు యేమైనాసరే అని తెంపుచేసి అడవిలోకి వెళ్ళి యేమీ తోచక యేడుస్తూ కూర్చుంటే లోక పరిపాలనార్థమై పార్వతీ పరమేశ్వరులు బయలుదేరి వెడుతూవుండగా యీ దీన రోదనములు వినబడ్డవి. వినబడితే పార్వతీదేవి యేమిటిది స్త్రీ కంఠములాగ వున్నదని అడిగితే ఆయన నవ్వి అవును, గాజులగౌరి నోముపట్టి ఉద్యాపనచేయక ఉల్లంఘన చేసింది అందుకని యిలాఅయింది అంటే పార్వతి జాలిపడి దగ్గరకు పోయి అమ్మాయి ఏం ఇలా ఒంటరిగావున్నావంటే ఏం చెయ్యను నన్ను చూస్తే అంతా చిటచిటలాడుతుంటారు అన్నది. అప్పుడు పార్వతీదేవి నవ్వి ఓ పిచ్చి తల్లీ ! నీవు గాజులగౌరి నోముపట్టేవుగదా, ఉద్యాపనం చేసుకున్నావా అంటే లేదన్నది. అలాయితే యింటికివెళ్ళి ఉద్యాపనం చేసుకో అంతా నిన్ను గౌరవిస్తారని వారంతర్ధానమైనారు. ఈ చిన్నది యింటికి వెళ్ళి ఉద్యాపనం చేసుకొంది. అప్పటినుంచి అంతా యీ చిన్నదాన్ని చూస్తే సంతోషపడేవారు.

ఉద్యాపనము.—ఓ మంచి ముత్తయిదువును పిలుచుకొని తలంటి నీళ్ళుపోసి చీర రవిక యిచ్చి పిండివంటలతో భోజనం పెట్టి తాంబూలం యిచ్చి ఆవిడ కోరుకొన్న గాజులు తొడిగించి దణ్ణం పెట్టవలెను. భక్తి తప్పినా ఫలం తప్పదు. కథలోపమయినా వ్రతలోపం కారాదు.

## 2 కుంకుమగౌరి నోముకథ.

ఒకవూళ్ళోవున్న సోమయాజులగారి అమ్మాయి కుంకుమగౌరి నోముపట్టి సరిగా ఉద్యాపన చేసికొన్నది గాదు. అందుకని విధవరికం వచ్చింది. అమట్టున ఆ సోమయాజులు లేక లేక పుట్టిన యీబిడ్డ యిలా అయిందే మాయని దుఃఖపడి కుటుంబసహితముగా కాశీయాత్రకు వెళ్ళి అక్కడ గంగ

ఒద్దన బ్రహ్మాండమైన తపస్సుచేస్తుండేవాడు. ఇంతలో కొన్నాళ్ళు జరుగగా జరుగగా కాశీవిశ్వేశ్వరుడు ప్రత్యక్షమై నీకేమికావలెనో కోర మనగా అయ్యా నా పుత్రికకు విధవాత్వము మాన్పించే వరమియ్యమనగా అయన అన్నాడుగదా యీ చిన్నది కుంకుమగౌరీదేవి నోముపట్టి ఉద్యాపన చేయక ఉల్లంఘన చేసింది. అందుకని యీలా అయింది. ఇప్పుడానోము ఉద్యాపన చేయించు శుభము కలుగుతుంది అని చెప్పి అంతర్ధానమైనాడు. అయన వచ్చి సంతోషముతో యీ చిన్నదానిచేత ఆ ఉద్యాపన చేయించాడు ఆమెకు విధవాత్వం పోయింది.

ఉద్యాపనము.—పదముగ్గురు ముత్తయిదువులకు పదమూడు బరి కొలకుంకుము పోసి, పదముగ్గురికి పదమూడు లక్కజోళ్ళు, నల్లపూసలు పెట్టి తాంబూలమియ్యవలెను.

## 3 తవిటి గౌరినోముకథ.

ఒక యిల్లాలికి తల్లి తండ్రి అత్తమామా యెప్పుడు యెడబాయకుండేవారు. ఏమమ్మా నీకీ యదృష్టం అంటే ఆకెవ అన్నదిగదా మా అమ్మ క్రిందటి జన్మాన తవిటి గౌరీనోము వాయనము అందుకున్న దానిఫలమిది అనే టప్పటికి అంతా అనుకున్నారుగద్దా ఏమి వాయనము పట్టితేనే యింతఫలమైతే యిక ఆనోము నోచుకుంటే యెంతమంచిదో అని అందరు ఆనోము నోచటము ఆరంభించేరు.

ఉద్యాపన.—తవ్వెడంత బియ్యముపోసి శక్తికొద్ది చీర శక్తిలేనివారు రవికెలగుడ్డ పసుపు కుంకుమ తాంబూలం ఒక ముత్తయిదుకిస్తే సరి భక్తితప్పినా ఫలంతప్పదు వ్రతలోపమైనా కథలోపం కారాదు.

## 4 చిక్కుళ్ళగౌరిదేవి నోముకథ.

చిక్కులులేకుండా వుండాలంటే చిక్కుళ్ళగౌరిదేవి నోముపట్టవలెను రథసప్తమినాడు ఎత్తుకున్నబిడ్డను యెడబాయకుండా పక్కలో బిడ్డను పాలు మాలకుండా కంటికాటుక కదలకుండా చంకనున్నబిడ్డ జడలకుండా చేతిగాజులు చెదరకుండా కాలిమట్టెలు కదలకుండా కట్టినబట్ట కదలకుండా వెంటపురుషుడు యెడబాయకుండా ఒంటిసొమ్ములు వదలకుండా యీ నోము నాడు దీక్షగా వుండాలి. పండిచిక్కుడు పూలు పచ్చిచిక్కుడు పూలునే పంచిపెట్టేవారికి చిక్కుళ్ళగౌరీదేవి తల్లి చీకుచింతలేకుండా సిరిసంపదయిచ్చి కాపాడుమమ్ముఅని కథచెప్పి అక్షింతలు వేసుకొనవలెను.

ఉద్యాపనము.—ఓబంగారపు చిక్కుడుపూవు గాని అంతశక్తి లేకపోతే వెండిచిక్కుడుపూవుగాని చేయించి ఒకముత్తైదువును పిలిచిభోజనం పెట్టి చిక్కుడుపువ్వు చీర రవికెలగుడ్డ పెట్టి దక్షిణతాంబూలంయిచ్చి నమస్కరించవలెను.

## 5 రేగులగౌరిదేవి నోముకధ.

ఓరాజుగారిభార్య రేగులగౌరిదేవినోముపట్టి ఉద్యాపనం చేయుటకు మరిచిపోయి ఉల్లంఘనం చేసింది. ఆవెడ ఆమాటే మరిచిపోయింది ఆవెడకెన్నాళ్లున్నా సంతాన్నం కలిగిందిగాదు. చూచిచూచి ప్రాణంవిసిగి ఆవిడె తలగట్టుకొని దుఃఖమ్మూపడుతుంది. అవిధ్రిలో శ్రీవిష్ణుమూర్తి వచ్చి ఏం అమ్మాయి అలావిచారపడుతున్నావు అని అడిగితే నాకు సంతానం లేదు ఎందుకుజన్మ అని విచారిస్తున్నానని అంది అంటే సరేనీవు రేగులగౌరి దేవి నోముపట్టి మరచిపోయి ఉద్యాపనం చేయకుండా విడిచిపెట్టేవు అందుకని యీలాఆయింది. కాబట్టి తవ్వెడునరసోలెడు బంగారు రేగుపండ్లు చేయించి ఒక మంచిబ్రాహ్మణునకు వాయనమిస్తివా నీకుసంతానం కలుగుతుంది అలాచెయ్యమనేగానే ఆవెడలేచి బ్రహ్మాండమయిన సంతోషముతో అలాచేసింది ఆమెకు సంతానం కలిగింది ఇరుగు పొరుగు వారంతావచ్చి ఏమమ్మా నీయదృష్టం నీకిలాసంతానంగలిగింది అంటే ఆవిడె అన్నదిగదా నేనుచిన్నవాడు రేగులగౌరినోముపట్టి ఉద్యాపనమరచిపోయినానుఅప్పుడు దుఃఖిస్తే శ్రీవిష్ణుమూర్తి ప్రత్యక్షమై వ్రతం ఉద్యాపనం చేసుకోమన్నారు. ఆప్రకారంచేసేను. ఈలాకలిగింది అన్నది. ఆమటున అప్పటివారంతా యీవ్రతంచెయ్యడం ఆరంభించేరు.

ఉద్యాపనము.—కుంచెడు తవ్వెడు మంచిరేగుపండ్లుతెచ్చి అందులో ఒకరేగిపండు బంగారంతో చేయించివేసి ఒక బ్రాహ్మణునకు పంచలచాపుయిచ్చి భోజనముపెట్టి యీరేగుపండ్లు ఆబంగారపు రేగిపండు తాంబూలముతో వాయినమియ్యవలెను. భక్తిలోపమైనా ఫలంతప్పదు వ్రతలోపమైనా కధలోపము కారాదు.

## 6 గ్రహణగౌరి నోముకధ.

ఒకవూళ్లో ఒక బ్రాహ్మణుడుండేవాడు ఆయనకు యోగ్యురాలైన భార్య ఉండేది వారికి నలుగురు కుమారులు ఒక కుమార్తెగలిగినది ఈకుమార్తె కడసారిది అయితే ఈబిడ్డపుట్టినప్పటినుండి పగలు మనిషిగాను, రాత్రి

ళ్ళు పురుగులుగాను అయిపోతుండేది. తల్లి చాలాకించపడి, రాత్రిళ్లు నిద్ర మానుకొని ఆపురుగులన్ని చెదరిపోకుండ ఒక గుంటచేసి అందు లోకి పోగుచేస్తూ వుండేది. ఇలావుండగా ఆవిడె అన్నగారువచ్చి అమ్మాయి పిల్లకు యేడాది వెళ్ళవచ్చింది పురుటిమంచము చూచి వస్తువు గాని రమ్మంటే అన్నయ్యా ఇప్పుడుగాదు యింకోమాటు వస్తానన్నది. ఇలా ఇలాపిల్లతో బాధపడుతోనే వుంది పిల్లకు రెండోయేడు వచ్చిన తరువాత అన్నగారువచ్చి మళ్ళీ పుట్టింటికిరమ్మని చెప్పేడు ఇప్పుడుగాద న్నయ్యా ఇంకోసారివస్తాను అని చెప్పిపంపించింది ఈపిల్లపగలల్లా చక్కంగా మనిషిగానే వుండడం రాత్రిళ్లు పురుగులు కావడం అలాగేవున్నది. ఇలాపిల్లకు 8 యేడువచ్చింది మళ్లీ అన్నవారు వచ్చి అమ్మాయిరా ఇప్పుడు రాకపోతే ఇక మీకుమీరే మాకుమేమే అని నిష్ఠూరముగా మాట్లాడితే అప్పుడు పెద్దకోడలిని పిలిచి ఏమే యీబిడ్డను నాలుగురోజులపాటు కాపాడుతావే అంటే అమ్మో నావల్లకాదన్నది. రెండోకోడలిని అడిగితే ఆవిడె అసలేవల్లగాదన్నది. మూడోకోడలిని అడిగింది ఆవిడ నాపిల్లల తోటే నేపడలేకుండా వున్నాను. ఈవిడతో నావల్లకాదు అన్నది సరే ఇక నాలుగోకోడలున్నది అని ఆ అమ్మాయిని అడిగింది ఆవిడెసరే వెళ్ళి రండి నానికేంభాగ్యం అలాగే మాస్తాను ఎవళ్ళకైనా పుట్టింటి ఆశవుంటుంది అన్నది. అనుట్టున ఆవిడె ఆకోడలనుపిలిచి ఓసీ యిది పగలుపిల్ల రాత్రిళ్లు పురుగులైపోతుంది ఇవన్ని చెదరకుండా పోగుచేసి ఈగుంటలో ఉంచాలి మళ్ళీ తెల్లవారేవరకు పిల్లయిలేస్తుంది. ఒక్కపురుగూ చెదరకూడదు అన్నది సరేఅని ఒప్పుకుంది అత్తగారు పుట్టింటికి వెళ్ళింది. ఈకోడలుమాట అన్నది గాని ఆరాత్రిచాలా కష్టమనిపించింది సరే ఒప్పుకున్నాము ఎలాగో చెయ్యాలని చేస్తూవుంది ఇలా మూడు రాత్రిళ్లు జరిగింది. ఆచిన్నవాని పెని మిటి ఏమా యిది రాత్రిళ్ళు గదిలో పడుకు రావడములేదని యీరాత్రి కనిపెట్టి వుందామని వున్నాడు ఆరాత్రిగోడమీద కూర్చుని యిది అంతా చూచి జాలిపడి మరువాడుభార్యను అడిగితే వున్నయధార్థమంతా చెప్పింది అతడు సంసారము విడిచి అప్పుడే అడవిలోకిపోయి ఆకుమీద ఆకు పోక మీదపోక వేసుకొని నిరాహారుడై తపస్సుఆరంభించేడు. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు లోకపరిపాలనార్థము బయలుదేరి వస్తూవుంటే పార్వతి, పర మేశ్వరా ఎవరయ్యా యీతపస్సుచేసేవారు అన్నది అంటే అతడొక బ్రా హ్మణుడు అని చెప్పితే అలా వాడు ఎందుకా తపస్సు కనుగొందామని వచ్చి అడిగితే అతడు "అయ్యా నాచెల్లెలు పుట్టినప్పటినుండి పగలల్లామని

షిగానేవుంటుంది. రాత్రిళ్లు పురుగైపోతుంది ఆదుఃఖముపట్టలేక యిలావచ్చి తపస్సుచేస్తున్నానంటే అప్పుడు పరమేశ్వరుడు జాలిపడి ఓయీ నీచెల్లెలు క్రిందటిజన్మలో రజస్వలయి యింట్లోకలిపింది ఆదోషముచేతయిలాఅయింది అంటే మహానుభావా మరి ఆది పోయ్యేసాధనమేమంటే గ్రహణగౌరీ వ్రతముపట్టి ఉద్యాపనచేస్తే ఆపురుగులు పోవడంపోయి సకలారోగ్యములు కలిగి పిల్ల దేదీప్యమానముగా వుంది. తరువాత తల్లివచ్చి పిల్లనుచూచి కొడుకును కోడలను దీవించి నాయనా నాకష్టములుగట్టెక్కినవి అనిచెప్పింది.

ఉద్యాపనము—అమావాస్యనాడేగాని సూర్యగ్రహణము రాదుగనుక ఆగ్రహణము పట్టగానే పసుపు కుంకుమ పిండి బియ్యము పత్తి బెల్లము ఆకు పోక దక్షిణలతో ఒకచోటపెట్టి గ్రహణము విడిచి విడువగానే స్నానముచేసి పైకథ చెప్పుకొని అక్షింతలు వేసుకొని తొమ్మిది కోలాలు తొమ్మిది పద్మములు తొమ్మిది వత్తులు దీపములు తొమ్మిది అట్ల వాయినాలు తొమ్మిది అట్ల నైవేద్యము కొత్తజల్లెడలోపెట్టి పాతజల్లెడ వానిపైన మూతవేసి చీర రవిక బెట్టి యిదిఒక పెద్దముత్తయిదువుకువాయన మివ్వవలెను.

## 7 శాకదానము నోముకథ.

ఒక పట్నములో ఒకరాజు ఒక మంత్రి ఉన్నారు వారి భార్యలు యిద్దరు శాకదానమునోము పట్టేరు. రాజభార్య ద్రవ్యము కలదిగనుక ఎప్పుడుబడితే అప్పుడే చేసికోవచ్చునని తలంచి శాకదానమునోము మాట అలక్ష్యం చేసింది. మంత్రిభార్య భక్తితో ప్రతిదినము ఒక తోటకూరకట్ట ఒకడబ్బు ఎవరో ఒక బ్రాహ్మణునకు యిస్తూ యిలా యేడాదివ్రతం చెడకుండా జరిపింది. రాజభార్యకు ఏదో గబులువలె రాను ఏడుస్తు కూర్చొను ఇలా అయింది, ఎన్నాళ్ళు చూచినా యీలాగేవుందని అడివిలోకిపోయి అక్కడ యేడుస్తూ కూర్చుంటే ఆ దారిని పార్వతీపరమేశ్వరులు పోవుచు యీచిన్నదాని ఏడుపాలకించి, దగ్గరకువచ్చి ఏమిటమ్మా! అలాఏడుస్తున్నావు ఎందుకని అడిగితే ఎందుకో నాకుతెలియదు ఎప్పుడూ ఏడవాలని ఉంటుంది అన్నది. ఆమాట విని పరమేశ్వరులు నీవు శాకదానముపట్టి ఆవ్రతం ఉద్యాపన ఉల్లంఘించావు అందుకని యిలా అయింది ఆ వ్రతంచేస్తే యీదిగులు పోతుందని అంతర్ధానమైనారు. ఆరాజు భార్య యింటికివచ్చి అతిభక్తితో ఒకటికి పదిగా ఏడాదిదాకా శాకము బ్రాహ్మణునకు దక్షిణతో దానముయిచ్చింది. ఈశోకము పోయింది. చూచినవా

తంరా ఆశ్చర్యపడి ఏమమ్మా ఎలాపోయిందంటే వారంతా కూడానోచెరు.

ఉద్యాపన.—దోడ్లో తోటకూరమడిచల్లి ఆ తోటకూరకోసి, బ్రాహ్మణునికి భోజనంపెట్టి వస్త్రమిచ్చి పదపదిమూడుడబ్బులు దక్షిణ తాంబూలంయిచ్చి తోటకూర వాయనం యియ్యవలెను. భక్తితప్పినను ఫలము తప్పదు వ్రతలోపమైనను కథ లోపముకారాదు.

## 8 మునికార్తిక దీపముల నోముకథ.

ఒకబ్రాహ్మణుని భార్య కార్తికదీపముల నోముపట్టి వ్రతసమాప్తి చేయకుండా ఉల్లంఘనచేసింది అప్పటినుండి ఆవిడెకు దరిద్రంపట్టుకొనడమే కాకుండా కడుపు శోకముకూడా కలిగింది. ఆవిడె చాలా పరాకాష్ట కలది. అందువల్ల నేనుపోయి బ్రహ్మనడిగి వరం తెచ్చుకుందునని బయలుదేరి పోతున్నది పోతుంవగా దారిలో ఒకబ్రాహ్మణు డగుపించి ఎక్కడికి పోతున్నావమ్మా అన్నాడు. నాయనా బ్రహ్మదగ్గిర వరము తెచ్చుకోడానికి వెళ్ళుతున్నానన్నది, నామాటకూడా కొంచెము చెప్పుదూ అనగా ఏమిటి నీమాట అన్నది. నేనిక్కడికి 18 జన్మాలనుంచి అన్నము నీళ్లు లేకుండా వున్నాను ఈసంగతికూడా కనుక్కొని నాకుగూడ్క వరము తెస్మన్నాడు సరేఅని ఆవెడ వెళ్లుతూవుండి దారిలో ఫలభరితమైన కేడిమామిడిచెట్టు కనిపించి ఎక్కడికి వెళ్లుతున్నావమ్మా అన్నది. అంటే బ్రహ్మ నడిగి వరము తెచ్చుకోటానికి వెళ్ళుచున్నాననగా నామాటకూడా కొంచెము మనవి చెయ్యమన్నది ఏమిటంటే నాచెట్టుకాపలసినన్ని పండ్లున్నవి పక్షి నరుడు యెవరూ ముట్టరు కారణమనేగి, యివియాన్నుకొ నేవరము తెచ్చిపెట్టవమ్మా అని బ్రతిమాలుకొన్నది. సరే అని దానిని పోతుంటే ఒక బురదగుంటలో ఆవు దూడా వున్నవి చుట్టు నోటిదగ్గిరకు అందేటట్టు గడ్డివున్నది. ఒక్కపరకైనా కొఱకవు అని యీమెను మాచి ఎక్కడికి వెళ్ళుచున్నావు అని అడుగగా బ్రహ్మ దగ్గిరకని ఆమె చెప్పగానే మేమిలావున్నాము మాగతి కొంచెము మనవి చేయుమని చెప్పగా నామె సరేఅని ముందు పోవుచుండగా పూచిన మల్లెపూల చెట్టగుపించి అమ్మా యెక్కడికి వెళ్లుచున్నాననగా బ్రహ్మ దగ్గిరకని ఆమె చెప్పగానే నేనిలావున్నాను ఒక్కరు నాపువ్వులుకొనుకోరు ఏమిపాపము బద్ధలయినదో తెలియదు నాసంగతికూడా కొంచెము మనవిచేసి రాఅమ్మా అని బ్రతిమాలుకొనెను సరే అని ఆవిడ ముందుకు పోతుండగా ఒకరింట్లో వెదుకు దక్షిణమున వేసినచీరలు ఎప్పటికప్పుడే జారిపోతుంటవి, వారిమెతో అమ్మా ఎక్కడికి వెళ్లుచున్నావని యడుగగా

నామె బ్రహ్మ దగ్గిర వరము తెచ్చుకోటానికని చెప్పగా మా మాటకూడా కొంచెము చెప్పి యీదిక్కు తప్పింపుమమ్మా అని బ్రతిమాలుకొనిరి ఆవిడ వెదుకుతుంగా ఒకచోట రెండు పెనములు కాలుచున్నవి ఎవ్వరూ చల్లారవు అమ్మా మామాటకూడా చెప్పండి అని బ్రతిమాలుకోగా సరే అని బయలుదేరింది ఆవిడే వెళ్ళగా వెళ్ళగా బ్రహ్మలోకము కనుపించినది. అప్పుడామె వెళ్ళి బ్రహ్మ కెదురుగా నిలువబడగా బ్రహ్మ చూచి ఎమమ్మా యింతదూరము వచ్చినావనగా ఆమె నమస్కరించి "నాకు గర్భదరిద్రము కడుపుశోకము కలిగింది, అది భరింపలేక నీకోసము వచ్చితిని కరుణింపుమనగా నాతను నవ్వి" ఓ అమ్మాయీ నీవు ఆటకోటికనముగా మునికార్తిక దీపములనోముపట్టి ఉద్యాపనలేకుండా ఉల్లంఘన చేసినావు. అందుకని నీకిలాశటస్థించినది. యిప్పుడుతిరిగి ఆనోముపట్టి మూడు కార్తీకమాసములుసరిగా వెలిగించుకుంటే యీదోషముపోతుంది అనిచెప్పగా నామె పరమేష్ఠీ మహానుభావా దారిలో ఒకబ్రాహ్మణుడున్నాడు 18 జన్మములనుండి అన్నపానములేవట. అనగా ఆబ్రాహ్మణుడు వేదము బాగాచదువుకొని అది తన సొత్తుగాని నెవ్వరికిచెప్పలేదు అందుకని అలాగైనాడు. నీవు పోయేటప్పుడు "గాను" అని ఆయనతో చెప్పివెళ్ళితివా అతనికాదిక్కు పోతుందనగా అమ్మా దారిలో జీడిమామిడిచెట్టు ఫలపరితమైయున్నది.

ఎవ్వరూ ఒక్కపండు కోసుకోరు అనగా ఆవిడ క్రిందటిజన్మమున కడిపెదుపిల్లలనుగన్న తల్లి ఒకరు వంశము నిలుపుకొనుటకై ఒక్కబిడ్డను పెంపుడు యివ్వమంటే యిచ్చినదిగాదు కాబట్టి యిలా అయింది నీవొక పండుకోసుకొని తింటివా యిక అందరూ తింటారు అదే శాపవిమోచనం అనగా సురజ్యేష్ఠా! దారిలో నొక ఆవు దూడ మెడలలోతు బురదగడ్డిలో నున్నా మేతమేయవనగా వారు క్రిందటిజన్మమున అత్తాకోడలు వారి యింట్లోనున్న ఆవుదూడకు వంతులుపోయి మేతవేయలేరు నీవు పోయేటప్పుడు నీ చేతితో గడ్డికోసి పెట్టితే అవిమేస్తవి కొంచెము నీరు పెట్టితే త్రాగుతవి అక్కడనుండి వానికి శాపవిముక్తి అనగా పితామహా! దారిలో పూచిన మల్లెచెట్టుంది ఒక్కరు పువ్వులుకోయరనగా అది క్రిందటి జన్మమునబోగముది పూచినపువ్వు లెవ్వరికీయక తానే పెట్టుకుంది నీవు వెళ్ళేటప్పుడు ఒక పువ్వుకోసి పెట్టుకుంటే ఇక అంతా కోసుకుంటారు అనగా ధాతా! నేను పొయ్యేదారిలో ఒకరింట్లో దణ్ణెముమీద చీరలు ఎప్పుడు కాలిపోతుంటవనగా వారు పుట్టింటి ఆడబడుచునకు నెప్పుడు చీరపెట్టలేదు నీవు వెళ్ళేటప్పుడో చీరదీసికట్టుకుంటివా ఇక అలా జరుగదనగా నో సృష్టికర్తా

ఒకచోట అట్లపెనములు యెప్పుడూ వండుతూనే వున్నవేమనగా వారు ఆ తల్లోపిల్లు ఎదురు వాయనాలందుకున్నారు అందుకని అలా అయింది నీవు కొంచెము నీళ్ళు చిలకరించి వెళ్ళుమనగా సరే ఇవన్నీ చేస్తాను నాకేమి ఫలితమనగా నీవు 360 వత్తులు చేసి సిద్దెడు నూనెపోసి దీపాలు వెలిగించి నావు వెలిగించినందు కావత్తుల ఫలము నిచ్చేసి ఒలికిన ఫలమిచ్చినాను వెళ్ళి నోముపట్టి ఉద్యాపన చేసికొమ్మని బ్రహ్మ చెప్పగా సరే అని ఆమె వచ్చుచు దారిలో పెనములమీద నీళ్ళుచల్లగా పెనముల వంట చల్లారెను. తరువాతపోయి ఒణ్ణెన చీరదీసి కట్టుకొనగా చీరెలు తగులబడుటమానెను. మల్లెపూవులు కోసి కొప్పున పెట్టుకొనగా అందఱు కోసుకో మొదలుపెట్టిరి తరువాత కొండదూడము సాగి అవుతు దూడకు మేతవేసి నీళ్లు పెట్టగా నవి వానియంతట ఆవి తినసాగెను. తరువాత బయలుదేరి జీడిమామిడి చెట్టు పండు కోసికొని తినగా నందఱు తిన మొదలుపెట్టిరి. తరువాత పోవుచూ బ్రాహ్మణునియింటికివచ్చి పరమాన్నమువండించి "రామరామ" అని చెప్పి తినుమనగా నాతడు తినుటకారంభించెను, తరువాత యీమె శివరాత్రినాడు మునికార్తీకదీపముల నోముపట్టి మూడువూర్ల అరువది వత్తులు సిద్దెడు నూనెపోసి వెలుగించగా వత్తి ఫలము కండె ఒలికిన ఫలము యొక్క—వగనుక యిల్లంతా సిరిసంపదలతో నిండింది. అప్పుడంతా ఆశ్చర్య పడి ఏమి నోము నోచినావమ్మా అని అడుగగా ఆమె మునికార్తీక దీపముల నోము పట్టెను. అప్పటినుండి అనోము అందఱుపట్టి ఉద్యాపనము చేసుకొనిరి.

ఉద్యాపనము.—అయిదు మూళ్ళ అంగవస్త్రములో ఆరుశేర్ల బియ్యము మండపములో పోసి దక్షిణ తాంబూలం బెట్టి, వెండి ప్రమిదలో పయిడివత్తివేసి దీపము వెలిగించి ఒక బ్రాహ్మణునకు వాయన మియ్యవలెను. భక్తిలోపమయినా ఫలములోపము కారాదు. ప్రీతలోపమయినా కథలోపము కారాదు.

## 9 కార్తీక దీపాలనోము కథ.

ఓవూళ్లో ఒక చాకలిది ఉన్నది దానికి నలుగురు కొడుకులున్నారు వారి నలుగురికి పెండ్లిండ్లు అయినవి. కోడండ్రు యింటికి కాపురానికి వచ్చినాగు ఆచాకలిది పెండటి ముగ్గురు కోడండ్రతో ఆశ్వయుజ బహుళ అమావాస్య మొదలుకొని ఉదయముకాకుండా స్నానము చేసి దీపాలు పెట్టుకునేవారు. చెల్లాళ్ళు అలా పెట్టుకున్నారు. కార్తీక బహుళ అమా

వాస్యనాడు నాలుగోకోడలును బిలిచి యిల్లు జాగ్రత మేము స్నానానికి వెళ్ళి వస్తానని చెప్పి వెళ్లేరు. ఈ నాలుగోకోడలు లేచి చల్లచేసిన కవ్వమున అంటివున్న వెన్నతీసి పత్తిచెట్టుక్రింద పడియున్న ఒక కాడ తీసి నూతివద్ద స్నానముచేసి యీకాడ కావెన్నరాచి దీపం వెలిగించి దేవుడికి వణ్ణంబెట్టింది. అప్పుడు భగవంతుడు దాని నిష్కళంకపు భక్తికిమెచ్చి ఆకాశముమీదనుండి విమానము పంపేడు. పోలి అదియెక్కి వెళ్లుతుంటే వూళ్ళో వాళ్ళంతా చాకలి పోలి స్వర్గానికి పోతున్నదని అనిరి. అత్తవిని మా పోలిఏమిటి స్వర్గానికి పోవడమేమిటని దాని ముగ్గురు కోడండ్రు అది చూచి దాని కాళ్ళు పట్టుకొని విమానముమీదికి యెక్కబోతే శ్రీ విష్ణుమూర్తి వచ్చి మీకు వీలులేదు. అది భక్తితో వెలిగించింది. మీరు ఆడంబరముకోసం చేసేరు. దానికి భోందితో కైలాసం యిచ్చాను. మీరింకా భక్తి గుదిరేవరకు యీకథజెప్పి అక్షింతలు వేసికొండనిచెప్పి అంతర్ధానమైందిరి. కానీ విష్ణుదర్శనమైనా అయిందని యీకథచెప్పుకుంటూ అంతా కార్తీక దీపాలు పెట్టుకునేవారు దీనికి ఉద్యాపన లేదు.

## 10. పోలాల అమావాస్య నోముకథ.

ఒకవూళ్ళో ఒక బ్రాహ్మణునకు ఏడుగురు కొడుకులున్నారు. ఆ ఏడుగురికి పెండ్లిండ్లై వారి భార్యలు కాపురానికివచ్చిరి. ఆ ఏడుగురు కోడండ్రు పోలాల అమావాస్యరాగా నోము నోచుకుందామని ప్రయత్నం జేసిరి అయితే యేడవకోడలుకు పుట్టిన చంటిపిల్ల ఆరోజునే చనిపోయింది అందుకని అంతా ఆయేటికి మానివేశేరు తిరువాత మళ్ళీ పోలాల అమావాస్యవచ్చింది ఆనాడు నోము నోచుకుందామని అనుకుంటే మళ్ళీ కడసారి కోడలు పిల్ల చచ్చిపోయినది ఈసారి సాగలేదు ఇల్లే ఆరేళ్లు కడసారి కోడలు చంటిపిల్ల చచ్చిపోవుటచేత ఆనోము సాగిందికాదు ఏడో యేడు వచ్చింది సరే పూర్తిచేదాము. మళ్ళీ చావువస్తుంది మానివేతామని తిట్టుకొంటూ కోడళ్ళంతా మళ్లు గట్టుకొనిరి. ఏడోకోడలుపిల్ల చచ్చిపోయింది పోయినాసరే నామూలాన అందటినోములు పాడయి పోతున్నవని చచ్చిపోయినపిల్లలు గదిలోపెట్టి తాళమువేసి అందరు కోడండ్రతోపాటు యీకోడలుకూడా వెళ్ళి పనిపాటలలో తోటివారికి సాయంచేసి ఒకరింట్లో తలంటి నీళ్ళుపోసుకొని ఒకరింట్లో యింతపిండి బెల్లము వడపప్పు తెచ్చుకొని తానుకూడా నోము నోచుకొనెను. తరువాత రాత్రిదాకా వుండి చీకటిపడ్డ తరువాత యింటికివచ్చి చచ్చిపోయిన పిల్లను బుజానవేసికొని

పోలేరమ్మగుడిదగ్గరకు వెళ్ళి ఆ పిల్ల నక్కడవుంచి యేడ్చుచుండెను. అమ్మ వారప్పుడు సంచారముచేసి గుళ్ళోకివస్తూ యీ చిన్నదానినిజూచి ఏం ఆలా యేడుస్తున్నావు అని యడిగెను. అంటే ఆచిన్నది యివాళ యేడు స్తున్నానా ఏడేండ్లనుంచి యిలాపిల్లపుట్టా చావా పుట్టాచావా అందటిని యీ అమ్మవారికే అర్పిస్తున్నాను ఈయేడుకూడా నాప్రతిఫలం అంతే అయింది అయితే పాపంనావల్ల నాతోడికోడండ్ర నోము పాడవుతుందని పగలల్లాదాచి యిప్పుడే వచ్చిన బిడ్డను తెచ్చేను అని బావురని యేడువగా పోలేరమ్మ కరుణించి నీపిల్లలకు మరేమీ భయములేదు నేనందటిని తీసి కొనివచ్చి యిస్తాను అక్షతలు ఆ చిన్నదానిచేతిలోపెట్టి యీఅక్షంతలు నీపిల్లలను పెట్టినచోట చల్లి పిలు పిలిస్తే వారే వస్తారనగానే ఆవిడె ఆ ప్రకారమే అక్షింతలుచల్లి పిలిచింది. అంతట నవ్వుకొంటూ యేడుగురు వచ్చేరు ఆమెకు పట్టరాని సంతోషమువచ్చి వారందటినీ వెంటబెట్టుకొని యింటికి వెళ్ళింది. ఈ యాశ్చర్యమేమిటి అని యింటిలోనివారు బైటివారు విరగబడ్డారు చూడడానికి అప్పుడు ఆవిడె వారందటితో పోలేరమ్మ మహాత్మ్యము తాను చేసినపని చెప్పింది. అనుట్లు నప్పటినుంచి అందఱు అమావాస్యనాడు పోలేరమ్మకు పెట్టుకొని నోము నోచుకొని సంతానవంతు లగుచున్నారు. దీనికి ఉద్యాపనములేదు.

## 11 నిత్యశృంగారము నోముకధ.

ఒకవూళ్ళో రాజుభార్య మంత్రిభార్య యిద్దరు నిత్యశృంగారము నోము పట్టేరు మంత్రిభార్య అందటికీ బొట్టుపెట్టి తాంబూలము చేతి కిచ్చేది ఇలావుండగా మంత్రిభార్యకు సకలైశ్వర్యములు వచ్చినవి రాజభా ర్యకు దరిద్రము సంభవించింది. ఆవిడకు చాలా విచారముకలిగి ఓనాడు దేవుడుగుళ్ళోకిపోయి అక్కడ దుఃఖించుచున్నది. పార్వతీపరమేశ్వరులు ఆదారుల తిరుగుచున్నారు వారువృద్ధదంపతులవలె కానుపించి ఏమమ్మా ఎందుకేడుస్తావు అని అడిగెరు, ఆర్చేవారా, తీర్చేవారా మీకెందుకు నా గొడవన్నది అంటేవారు ఆర్చేవారము మేమే, తీర్చేవారము మేము అక్క రవస్తే యేమేనైనా చేసేవారమూ మేమే పరవాలేదు చెప్పమంటే మంత్రిభా ర్యానేను నోముపట్టేము. ఆమెకు భాగ్యమువచ్చించి నాకు దరిద్రముప చ్చింది. అంటేవారన్నారుగదా నీవు నిర్లక్ష్యముగా నౌకరులచేత బొట్టుపె ట్టించి తాంబూలమిప్పించావు. మంత్రిభార్యా భక్తిశ్రద్ధలతో తానే స్వయ ముగా యిచ్చింది అందుకని ఆలాజరిగింది. నీవుమళ్ళీ ఈనోముపట్టి స్వయ

ముగానీవే యేటికేడాది కథచెప్పుకొని అక్షింతలు వేసుకొని శ్రద్ధగా నోము నోస్తే కావలసినంతభాగ్యము వస్తుందిఅని చెప్పి వారు అంతర్ధానమైనది. ఈ వెడయీనోము శ్రద్ధగా జరిపి అక్షింతలు వేసుకొని రోజు ఒక ముత్తైదువునకు బొట్టుపెట్టి అద్దము దువ్వెన చూపించి యిలా యేటికేడాది చేసి భాగ్యవంతురాలయింది.

ఉద్యాపనము.—ఒక ముత్తయిదువుకు తలంటినీళ్ళుపోసి చీరరవికె యిచ్చి భోజనంబెట్టి బొట్టుపెట్టి అద్దము, దువ్వెన కాటుకకాయ, కుంకంభరిణె, సవరము గంధపుచెక్క యిచ్చి ఉద్యాపనం చేసికోవలెను.

## 12 చద్దికూటి మంగళవారముల నోముకథ.

ఒక రాజుకూతురు బ్రాహ్మణునికూతురు చద్దికూటిమంగళవారముల నోముపట్టేరు రాజుకూతురు రోజు ప్రతికప్పుడే నోము నోచుకుందామనుచు చివరకు అలక్ష్యంగా ఉల్లంఘనచేసింది బ్రాహ్మణునికూతురు క్రిందటిరాత్రి వండివుంచుకొనిన అన్నము కూర చారు మూతపెట్టుకొని ప్రొద్దున్నే లేచి నంటిమీదస్నానంచేసి, అదిపెట్టుకొనితిని ముత్తయిదుకుపెట్టి యిలా వారంవారం జరిపింది. అలా యేటికేడాది అయినతరువాత ఉద్యాపనంచేసికొంది. సకలయిశ్వర్యాలువచ్చినవి. రాజుకూతురికి అష్టకష్టాలు సకల దరిద్రాలువచ్చి చుట్టుకొన్నవి. ఆవెత తీరనిదుఃఖముతో నుండగా పార్వతీపరమేశ్వరులు విప్రవేషముల కనుపించి యేమమ్మా యిలావున్నావు అంటే దరిద్రంతో బాధపడలేక యేడ్చుచున్నాననగా వారు దయవచ్చి అన్నారు గదా నీవు చద్దికూటి మంగళవారాలనోము పట్టి ఉల్లంఘనచేసేవు అందుకని యిలాగైయుంది. ఇప్పుడు మళ్ళీ ఆనోముపట్టి యథావిధిగా ఉద్యాపనం చేసుకొంటే సకలైశ్వర్యములు వచ్చును అని చెప్పి అంతర్ధానమైనారు అప్పుడావిడె అతిభక్తితో నోముపట్టియేడాది యథావిధిగా నోచుకునేసరికి దరిద్రాలుపోయి సకలైశ్వర్యములు వచ్చినవి

ఉద్యాపనము — 13 ముత్తయిదువులకు తలంటి నీళ్ళుపోసి రాత్రి వండియుంచిన అన్నము కూరలు ప్రొద్దుననే భోజనముపెట్టి 13 మూకుళ్ళలో యీచద్దిపెట్టి 13 వాయనములు దక్షిణతాంబూలం యియ్యవలెను భక్తి తప్పినను ఫలము తప్పదు వ్రతలోపమైనను కథలోపము కారాదు.

## 13 పండుతాంబూలాలను నోముకథ.

రాజుభార్య మంత్రిభార్య పండుతాంబూలం నోముపట్టేరు. మంత్రిభార్య ఏనాటితాంబూలము పండు అనాడు యిస్తూవుండేది. రాజుభార్య

ధనవంతురాలు గనుక అన్నీ యెప్పుడో ఒకమాటే యిస్తానని నిర్లక్ష్యము చేత ఉల్లంఘన చేసింది. మంత్రి భార్యకు చక్కని సంతానము కలిగింది. రాజు భార్యకు సంతానము కలుగలేదు. ఈ విచారముతో ఆవిడ అడవికి వెళ్ళి అక్కడ భగవంతుని ధ్యానిస్తూ కూర్చుండగా ఆదారిని వెళ్ళుతూ పార్వతీ పరమేశ్వరులు వీరా చిన్నదానిని చూచి యెందుకిలావున్నావు అనిఅడిగితే మంత్రిభార్యకు సంతానంగలిగింది నాకుగలిగిందికాదు. అని అన్నది. అంటేవారన్నారుగదా మంత్రిభార్యానీవు పండుతాంబూలం నోముపట్టి తిరిగిదా. ఆవిడే యథావిధిగా నోమునోచుకొని ఉద్యాపనచేసింది నీవు నిర్లక్ష్యముచేత నోము నోచలేదు అందుకని యిలా అయింది. నీవిప్పు డింటికి వెళ్ళి సలక్షణముగా నోము నోచి ఉద్యాపన చేసితో అన్నీ కలుగుతవి అని చెప్పి వారు అంతర్ధాన మైనారు. అప్పుడా రాచకూతురు నోము పట్టి ఉద్యాపన చేసుకొని సంతాన వంతురాలైంది.

ఉద్యాపన — ఒక ముత్తయిదువునకు తలంటి నీళ్లుపోసి పిండివంటలతో భోజనముపెట్టి చీర రవికెయిచ్చి పాతికపండ్లకు తక్కువలేకుండా ఒక పళ్ళెములో ఆ పండ్లుబెట్టి ఆ ముత్తయిదువునకు దక్షిణ తాంబూలముతో వాయన మియ్యవలెను. వ్రతలోపమైన కథ లోపంకాదు భక్తితప్పినా ఫలం తప్పదు.

## 14 కన్నెతులసినోము కథ.

ఒకాయనకు ప్రథమ భార్యవలన ఒక కూతురుండెను. ఆమె పోతే తిరిగీ రెండవ చిన్నదానిని వివాహము చేసుకొనెను. సవతి వచ్చినప్పటి నుండి ఆపిల్లకు సవతిపోరెక్కువయై పడలేక చివరకా అమ్మాయి తాతగారింటికి వెళ్ళి సౌఖ్యపడుచుండెను. ఇలావుండగా యీసవతి మగనితో మన అమ్మాయిని తీసుకొనిరండని పోరుటకు మొదలుపెట్టితే ఆయన అన్నాడు గదా అది ఉన్నన్నాళ్లు తల దువ్వక నీళ్ళు పోయక నానాశ్రమలుపెట్టేవు అది యిప్పుడు సౌఖ్యపడుతూవున్నది. నేను యేమొగము పెట్టుకొని వెళ్ళి అడగను. అడిగినా పంపరు. కావలిస్తే నీవే వెళ్ళి తీసుకురమ్మంటే సరే అని ఆమె వెళ్ళి తాతగారితో "అమ్మాయిని పంపండి" అంటే ఆయన మా మనుమరాలికి పెండ్లి యీడు వచ్చింది. పెండ్లి చేయవలెనంటే మా పిల్లకు మేమే పెండ్లిచేసుకుంటాము పంపమంటే పంపేరు. ఆపిల్ల వచ్చిన తరువాత యీవిడ తన చంటిపిల్లను యీపిల్ల చేతికిచ్చి ఒక అరిసె ముక్క పెట్టి తాను వెళ్ళి గొడ్లో తులసెమ్మకు పూజ చేసుకొనేది ఈ పిల్ల ఆవిడ

రాగానే తాను దొడ్లోకివెళ్ళి తులసి పూజచేసికొని యీఅరిసెముక్క నైవేద్యంపెట్టి వస్తూవుండేది ఇలావుండగా తులసమ్మకు దయవచ్చి అన్నదిగదా నీవు బాల్యంలో కన్నె తులసినోము పట్టి ఉల్లంఘనచేసేవు. అందుకని నీ అమ్మ చనిపోయింది అందుకనే యీ చిక్కులు కలిగినవి ఇప్పుడు యథాక్రమంగా నోముకో అనగా ఆ పిల్ల యేటికేడాది భక్తిశ్రద్ధలతో నోము నోచుకోగా సవతి తల్లికికూడా తల్లికుండే ప్రేమకలిగింది.

ఉద్యాపనము.—ఒక కన్నెపిల్లను పిలుచుకొని వచ్చి తలంటి నీళ్లు పోసి పరికిణీ, రవికెలగుడ్డ యిచ్చి 13 తోడాలు అరిసెలు వాయనము యియ్యవలెను ఇంకో 13 తోడాలు నైవేద్యం పెట్టవలెను. వ్రతలోపమైనను కథ లోపంకారాదు భక్తి తప్పరాదు.

## 15 కాటుకగౌరి నోముకథ.

ఒక వూళ్లో ఒకచోట ఇరుగుగ్రుడ్డి పొరుగు గ్రుడ్డి ఇంట్లో యిల్లాలు గ్రుడ్డి యింటియజమాని గ్రుడ్డి యిలా వుండగా యేమాధకనంతుడా యని ఆ యిల్లాలు యేడుస్తుండగా పార్వతీ పరమేశ్వరులు ఆదారిని పోవుచూ యీ గోడాలకించి అదేమి నడుగగా ఏమిచెప్పను, ఇరుగు పొరుగుయింట్లో ఆయన, నేను అంతా గ్రుడ్డి అందుకని యేడుస్తున్నా ననగా ఆయన నవ్వి ఫరవాలేదు నీవు కాటుకగౌరినోము పట్టి ఉల్లంఘనచేసేవు అందుకని యిలా అయింది కాబట్టి యిప్పుడు మళ్ళీ ఆ నోము పట్టి ఏటి కేడాది భక్తితో ప్రతిదినము ఒక ముత్తయిదువుకు కాటుక యిస్తివా నీ చిక్కులన్నిపోతవని చెప్పి అంతర్ధానమైనారు. భక్తిశ్రద్ధలతో ఆలాగే చేయగా నేత్రములు వచ్చి అంతా సుఖముగా నున్నారు.

ఉద్యాపనము.—నోముపట్టి యేడాది కథచెప్పుకొని అక్షింతలు వేసుకొన్నతరువాత ఒక ముత్తయిదువును పిలిచి తలంటి నీళ్లుపోసి చీర రవికెయిచ్చి ఒక కాటుక భరిణయిచ్చి దక్షిణతాంబూలము యియ్యవలెను. కథ లోపముకారాదు వ్రతలోపంకారాదు.

## 16 బొమ్మల నోముకథ.

ఇదేసావిత్రిగౌరిదేవి కథ యని వాడుక.

సంక్రాంతి పండుగ కనుము వెళ్ళిన తరువాత ముక్కనుమునాడు పార్వతీదేవి, పరమశివుణ్ణి అడిగిందిగదా. నాథా! భూలోకంమీద స్త్రీలు అష్టయిశ్వర్యములు పొందేటటువంటి నోము ఏదైనా ఉంటేచెప్పండి" అనెను. శివుడన్నాడుగదా సరే యీపండుగకు పేరంటాళ్ళంతా చేరియుం

టూరుగమక నకే దివ్యమైన నోము చెపుతాను వినుమని చెప్పచున్నాడు మూడుదోడ్లపేడ పోగచేసుకొని మూడు కదుళ్ళనూలు పోసుకొని పదిమంది పేరంటాళ్ళను కూర్చుకొని యీవ్రతము చెయ్యాలి సావిత్రీగారి దేవిని నిలిపి పుట్టినరోజున పులగం నైవేద్యంపెట్టి భూచక్రం నేలింది. రెండవనాడు చలిమిడి నైవేద్యంపెట్టి చల్లని చంద్రుడు తోడబుట్టింది. మూడోనాడు మట్టెలు నైవేద్యంపెట్టి ముద్దులగురితచూ పెటిగింది. నాలుగోరోజున నానబియ్యం నైవేద్యంపెట్టి నాగస్వసానిరైయింది. ఐదవరోజున పరమాన్నం నైవేద్యంబెట్టి గౌర బద్ధుడుతోడ బుట్టింది ఏడోనాడు అట్లు నైవేద్యంబెట్టి పట్టెకెల్లఅయింది. ఎనిదోదినమున బూరెలు నైవేద్యంబెట్టి భూమిఅంతా యేలింది. తొమ్మిదవనాడు పెరుగుపేన నెయ్యి నైవేద్యంబెట్టి పేతాళంయేలింది. కథలోపమూ కారాదు. వ్రతలోపము కారాదు. భక్తితప్పినా ఫలంతప్పదు.

ఉద్యాపనము.—9చేటలు తెచ్చి ప్రతిచేటలోను 9 బిళ్ళకుడుములు 9 లక్కతోళ్లు, 9 నల్లపూసల కోళ్లు, 9 అద్దలు, 9 పోకచెక్కలు, పెట్టి 9 ముత్తైయిదుల కియ్యవలెను. ఈవాయనాలిచ్చి నమస్కరించి పంపవలెను.

## 17 బచ్చలగౌరి నోముకథ.

ఒక వూళ్ళో బ్రాహ్మణచిన్నది కాపురంచేస్తువుంటే ఆచిన్నదానిఅన్నగారు చూడడానికి వచ్చేడట. అన్నాచెల్లెలు యిష్టాగోష్టి మట్లాడుకున్నారు, ఆచిన్నది వంటచేస్తూ పులుసులోకి కరివేపాకుకావాలి అన్నయ్యా దొడ్లో కరివేపచెట్టున్నది కోసితీసుకొనిరా అంటే అన్నగారు దొడ్లోకివెళ్ళి కరివేపఆకు కోస్తుండగా పెద్దపాము కరచింది క్రిందపడిపోయినాడు. ఆచిన్నది పులుసు కాగింది ఇంకా అన్నయ్యరాలేదని పిలిచిపిలిచి విసిగి తుదకు తానేలేచి దొడ్లోకివచ్చేసరికి, అన్నపడియున్నాడు. ఇంకేముంది. ఏడుస్తూ కూర్చుంది. ఆవట్టున చుట్టపట్టలవారంతా పోగయినారు. అప్పుడో ముసలమ్మవచ్చి పూలు, కాయలతోనున్న బచ్చలచెట్టు తీసుకొనివచ్చి దీనికిపూజచేయి, నీఅన్న లేచివస్తాడనిచెప్పి దగ్గరవుండి చేయించింది, తరువాత అన్నను పిలిస్తే లేచివచ్చేడు. ఆముసలిఅవిడ చూస్తేలేదు ఆవిడే పార్వతి నీభక్తికిమెచ్చి ప్రత్యక్షమైనదని అంతా అన్నారు. అప్పటినుండి కడుపుచలువ తోడుచలువ, పుట్టింటచలువ, అయిదవతనము చలువ అని బచ్చలగౌరిపూజ అందరు చేస్తున్నారు. [illegible] అయిదోతనం గలుగుతుంది.

ఉద్యాపనము.—ఏడాదిపాట బచ్చలకూర తినకుండా వారంవారం

పూజచేస్తూ వెండిబచ్చలకాయ, బంగారపు బచ్చలకాయ చేయించి ఒకముత్తయిదువను పిలిచి తలంటినీళ్ళుపోసి భోజనముపెట్టి బచ్చలికిపూజచేసి వెండిబచ్చలికాయ చీర రవికెయిచ్చి తాంబూలం దక్షిణయిచ్చి గౌరీదేవిపేరుచెప్పి ముత్తయిదువుకు వాయన మియ్యవలెను.

## 18 అట్లమీద అవపువ్వునోముకధ.

ఒకబ్రాహ్మణచిన్నది అట్లమీద అవపువ్వు నోముపట్టి అశ్రీకముచేయగా ండా ఉల్లంఘన చేసింది. అందువల్ల విధవయై పుట్టినపిల్లలుపోయినారు. ఈదుఃఖము భరించలేక యింటనేనా సంసారమని విరక్తిచేత నడవులపాలైపోయి అక్కడ దుఃఖించుచుండగా పార్వతీ పరమేశ్వరులు వృద్ధదంపతులవలెవచ్చి "ఏమమ్మా ఎందుకు దుఃఖించుచున్నావని అడుగగా నాకర్మమువాది మీదానని మీరుపొండని వదలించితే నీమెకర్మమింకయు గడువలేదని వారు వెడలిరి. ఆమె ఆప్రకారము రోదునూనే కాలముగడుపుచున్నది. మళ్లీపార్వతీ పరమేశ్వరులు సంచారమునకు వచ్చినారు. తిరిగి ఆమెనువెనుకటి ప్రకారమే అడుగగా నాతోలి మీకెందుకు పొమ్మన్నది. ఇదికాయి మెకు కర్మపరిపాకముకాలేదు మనకెందుకనివారు వెడలిపోయినారు. అవిడి అలాగేయేడుస్తున్నది. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు వృద్ధదంపతులవలె వచ్చినారు. ఈసారి ఏమమ్మా ఎందుకిలా దుఃఖించుచున్నావని యడుగగా" ఎడుపుగాక నాకేముంది నాయనా తలమీదగోడుగు తర్లిపోయింది. పుట్టినబిడ్డలు బుగ్గయిపోయినారు. అంటే "చిన్నదానా నీవు మునుపు అట్లమీద అవపువ్వునోము పట్టి ఉల్లంఘన చేసినావు అందుకనియిలా అయింది. ఇప్పుడింటికి వెళ్ళి యీ నోములు యధావిధిగాపట్టి కథచెప్పి అక్షింతలు వేసికొని ఏటికేడాది నోము నోచిన తరువాత ఉద్యాపనచేసుకొమని చెప్పి అదృశ్యులైనారు. ఆమె ఆప్రకారము చేసి సుఖపడ్డది.

ఉద్యాపనము — ఒకముత్తయిదువును రవికలగుడ్డ దక్షిణతాంబూలం యిచ్చి 12 అట్లు, పూత కాపుతో నున్న అవకొమ్మ తెల్చి పేరునెయ్యి బెల్లముతో పెట్టి ఆముత్తయిదువకు వాయనమియ్యవలెను. కధలోపమైనా వ్రతలోపముకాదాటు శక్తితప్పినా భక్తితప్పరాదు. సకలసౌఖ్యములు కలుగును.

## 19 కార్తికచలిమిడి నోముకధ.

ఒకవూళ్ళోరాజకూతురు మంత్రికూతురు కార్తీకపూర్ణిమనాడు కార్తీకచలిమిడినోముపట్టేరు. మంత్రికూతురు నోముపట్టినయేడు వారు

నము నీలాటిరేవున యిచ్చినది. నీలాటిరేవున వాయన మిచ్చినందుకై ఆవెడకు పరమేశ్వరుడు నిధినిక్షేపము ననుగ్రహించేడు. రెండో సంవత్సరము వాయనము చెట్టుకొమ్మక్రింద యిచ్చినది. కొమ్మకింద యిచ్చినందుకు కొమ్మలేటి నుగులవంటి కొడుకులా మెకు పరమేశ్వరుడనుగ్రహించేడు. మూడవయేడు వాయనము శివాలయములో యిచ్చినది. శివాలయములో నిచ్చినందుకు శివమైన ఐశ్వర్యము పరమేశ్వరుడనుగ్రహించేడు. ఈలా యీ విన్నది నోము నోయగా రాజకూతురు గర్విష్టినోముపట్టినది, నోచకుండా ఉల్లంఘించింది. అందువలన ఆమె పెనిమిటికి ఆరోగ్యము చెడ్డది. ఎప్పుడు తీసుకుంటూ నుండేవాడు. మంత్రికూతురు అష్టయిశ్వర్యములు అనుభవిస్తూ ఉంటేనమున్నా తానీవిధముగా దుఃఖము లనుభవిస్తూ ఉండవమున్నా సహించలేక అడవికి వెళ్ళి అక్కడ యేడుస్తుండగా పార్వతీ పరమేశ్వరులు వనసంచారము చేయుచు ఈ వెడ యేడుపువిని జాలినొంది పురాణదంపతులవలె అగుపించి ఏమమ్మా ఎందుకిలా దుఃఖిస్తావనగా ఆవెడ నాకర్మమిలాఉన్నది పెద్దలు మీకుమాత్రము తెలియదా అంటే అప్పుడు పార్వతీదేవి అన్నదిగదా ఈపిల్ల కార్తీకచలిమిడినోముపట్టి అది నెరవేర్చకుండా ఉల్లంఘన చేసింది. అందుకని యిలాఅయింది. మంత్రికూతురు పట్టి చక్కగా నెరవేర్చింది. అందుకని అలా వుందని చెప్పి "అమ్మాయి నీవు యింటికివెళ్ళి కార్తీకచలిమిడినోము పట్టి యథావిధిగా నుద్యాపన చేసుకొంటివి.నీకు సకలైశ్వర్యములును కలుగుతవి అనిచెప్పి వారు అంతర్ధానమయినది. ఆప్రకారముగా ఆమెవచ్చి ఆనోము నోచుకొని సకలైశ్వర్యములతో తులదూగుచుండెను. అప్పుడామె పట్టిననోము లోకమంతా పట్టేరు భక్తితప్పినా ఫలంతప్పదు.

ఉద్యాపనము.— మొదటిసంవత్సరము 5మానికల బియ్యము 2 వ యేడు పదిమానికల బియ్యము చలిమిడి ముద్దలుచేసి నోముపట్టినయేడు 5 గురుముత్తయిదువులకు మరుచటియేడు 10 పదిమంది ముత్తయిదువులకు వాయనాలీయవలెను.

## 20 గుమ్మడిగౌరి నోముకథ.

ఒకవూళ్లో ఒక జ్యోతిషపండితునకు ఒక్కడేకొడుకు అకొడుకును అతిగారాబారాలా పెంచుచుండెను గాని అతడికి పెండ్లి అయినతరువాత గండమున్నదని ఆయనకు తెలుసునుగనుక లోలోన కుమిలిపోతుండేవారు. ఇలావుండగా ఒకరుపిల్లనిస్తామని యింటికి వచ్చినారు. ఈయన అర్ధాంగీకారముగా నున్నప్పటి వారుపిల్లనిచ్చి పెండ్లిచేసేను పెండ్లాము కాపురానికి

వచ్చింది సరే ఆవిడతో పాటు గంపను కూడా వచ్చింది. దానితో పాటు యమదూతలు కూడా వచ్చి పిల్లవాని ప్రాణం తీసుకొని పోతున్నారు. అంటే వారన్నారుగదా పెండ్లి కాకముందైతే పిల్లవాడు మావాడు ఇప్పుడు పెండ్లాము వాడు. పెండ్లాము పుణ్యాన్ని బట్టిగదా వుంటుందని చెప్పిరి, ఆ మాటలాడిన్నది విని ఓహో వ్యవహారము మించివచ్చినదని అనుకొని మగనిని తీసికొని అడవిలోకి వెళ్ళింది అలా వెళ్ళుచుండగా పార్వతీపరమేశ్వరులు పురాణదంపతులవలె కనుపించి "అమ్మాయి ఎక్కడికి యిలాగు గణ్ని తీసుకొని వెడుతున్నావు" అనగా నామె ఓ పెద్దచిక్కు వచ్చింది. నా పెనిమిటిని తీసుకొని పోవలెనని యమదూతలు వచ్చారు. నేనీలోగా పార్వతీదేవి నడిగి అయిదవతనం తెచ్చుకుందామని తొందరగా వెళ్ళుచున్నాను మీరూ వస్తున్నారుగదా అమ్మవారియిల్లాలు ఎక్కడవుందో చెప్పుదురు అమ్మా అంటే పార్వతినవ్వి నేనో మాట చెప్పుతాను విను గుమ్మడిగౌరి నోముపట్టి పెద్ద ముత్తయిదువను నాకు వాయన మియ్యకుంటివా నీకీగండము కాస్తుంది అని చెప్పెను అయ్యో ఇక్కడి గుమ్మడిపండ్లు ఎక్కడ దొరుకుతవని చూడగా అక్కడే వున్నవి. అమట్టున ఆపండ్లు తెచ్చి మగని బొడ్డునవున్న రవికె తీసి పసుపు కుంకుమ తాను పార్వతిపూజకై తెచ్చినవి యిచ్చి తాంబూలమిచ్చి దండము పెట్టితే ఆవిడే వాయనము పుచ్చుకొని నీకిక గండము లేదన్నది. అనుట్టున ఆవిడే యింటికి వెళ్ళింది మగనికి గండము గడిచింది. ఆనాటు ఆమె పట్టిన గుమ్మడిగౌరినోము అంతా పట్టేరు.

ఉద్యాపన.—ఈ నోము పట్టినవారు ఏడాదిపర్యంతము గుమ్మడి కాయ తినకూడదు. పెద్ద ముత్తైదునకు భోజనం బెట్టి 8 గుమ్మడిపండ్లు రవికెలగుడ్డ పసుపు కుంకుము తాంబూల దక్షిణ యిచ్చి గౌరిని తలంచి నమస్కరించవలెను.

## 21 పువ్వుల తాంబూలము నోముకథ.

ఒక వూళ్ళోరాజు కూతురున్నది. రంగ రంగ వైభవాల ఆవిడకు పెండ్లి చేసేరు మగనితో కాపురానికి పోయినప్పటినుండి యెడ మొగము పెడమొగముతో నుండేవారు. ఎన్నాళ్ళకు మైత్రి కుదరలేదు. ఆవిడే చాలా విచారపడి అడవిలోబడి యేలాగునైనా అగపించడా అనిపోతూవుండగా పార్వతీదేవి సంచారము చేయుచు వృద్ధురాలివలె కానుపించి అమ్మాయి నీకేమి కావలెను ఎందుకిలా అడివినిబడి తిరుగుచున్నావనగా అమ్మా నా కన్ని ఉన్నవిగాని నామగడు నాతో సరిగానుండడు. ఇక మగడొల్లని

దానికి సంతాన ముండదుగదా నాబ్రతుకువలన ఫలమేమని యేమీతోచక యీలా అడవినిబడి పోవుచున్నానని చెప్పెను. ఆమాటలు విని పార్వతి దయతో నన్నదిగదా అమ్మాయి నేనో నోముచెప్తానువిను. ఒక్కయే డాదిపాటు ప్రతిదినము దినమునకు 5 పువ్వులచొప్పున తాంబూలములో పెట్టి ఒక ముత్తయిదువు యిచ్చు చుండుము. తరువాత యేడాది కాగానే ఉద్యాపన చేయుము. నీమొగుడునీతో యిష్టంగా వుంటాడు. నీకు సకల సంపత్తి కలుగుతుంది. అనిచెప్పి ఆవిడె అంతర్ధాన మయింది అప్పుడేపిల్ల యీఅమ్మాయే పార్వతీదేవి ప్రత్యక్షమైనదనిచెప్పి యింటికివచ్చి ఆనోమునోచి ఉద్యాపనముచేసికొన్నది. భర్తకువయిగదింబడి. పిల్లలు కలిగేవారు. సకలసౌఖ్యాలు అనుభవించేరు. ఆమె నోచిననోము లోకమంతా నోచేరు. శక్తితప్పినా భక్తి తప్పరాదు.

ఉద్యాపనము.—యేడాదిఅయినతర్వాత ఒక పళ్ళెమునిండా పువ్వులుపోసి ఒక బంగారుపువ్వుచేయించి రవికెలగుడ్డ పసుపుకుంకుమతో ఒక ముత్తయిదునకియ్యవలెను.

## 22 మాఘగౌరి నోముకధ.

అమావాస్యవెళ్ళిన మాఘశుద్ధపాడ్యమినాడీ నోముపట్టవలెను.

ఒకవూళ్ళో ఒక బ్రాహ్మణునకొక్కతెకొమార్తెగలదు. ఆకూతురికి పెండ్లిచేసేరు. కానిపాపము మగడు చనిపోయినాడు. విధవరికము వచ్చినది. తల్లిదండ్రిలకేకపుత్రికావిషయమగుటవలన దుఃఖముపట్టలేక అంతాగలిసి యెక్కడికైనా వెళ్ళుదమని వెళ్లుచున్నారు. అక్కడ ఒకనది కానపించినది. అక్కడ పునిస్త్రీలంతా ఒకచోట, విధవలంతాగూడ ఒకచోటనిదేవి పద్మాలుపెట్టికొని నోమునోసుకొనుచున్నారు వీరుకూడా అక్కడికి వెళ్ళి యిదేమిటని వారిని అడుగుచుండగా పార్వతీదేవి వృద్ధురాలు వేషముధరించి అచ్చటివారు చేసుకొనేనోము నేను చెప్తాను. మీఅమ్మాయిని యిలాపంపండి అనేవరకు వారు మహాభాగ్యాని పంపేరు. అమట్టున పార్వతీదేవి యీనీళ్ళలోనున్న యిసుక దోసెడుతీసి గట్టున పోయమనగా ఆచిన్నది అప్రకారముగాతీసిపోసేవరకు ఆదోసెడు పసుపుఅయినది. తరువాత మళ్ళీ దోసెడు యిసుకదీసి గట్టునపోయుమనగా అప్రకారమునామె పోసేవరకు ఆదోసెడు కుంకుమఅయింది. మళ్ళీ యధాప్రకారముగా ఇంకోదోసెడు యిసుకతీసి పోయమనగా ఆదోసెడు కొబ్బరిఅయింది. మళ్ళీ ఇంకోదోసెడు తీయుమనగా యాప్రకారముగా తీసిపోసేసరికి అది బెల్లమయినది. అమ్మా యింకోసారి దోసెడు ఇసుక తీసిపోయుమనగా దోసెడుపోయగా

జిలకర్రిఆయినది నోముపట్టినయేడు పసుపు, రెండోయేడు కుంకుమ, మూడోయేడుకొబ్బరి, నాలుగోయేడు బెల్లము, అయిదోయేడు జీలకఱ్ఱ, ముత్తయిదువులకు ప్రతియేటా సేరుంబావుచొప్పున వాయనమియ్యవలెను

మాఘశుద్ధపాడ్యమిమొదలు అమావాస్యదాకా నీలాటిరేవున స్నానము చేసి పసుపుతో గౌరనుజేసి 5 పద్మాలు పిండితోను, 5 పద్మాలు కుంకుముతోను పెట్టి గౌరినందుపైబెట్టి పూజచేసుకొని యిలా అయిదేండ్లు ప్రతిమాఘమాసము చేసికొని గౌరమ్మను నీళ్ళలోవిడిచిపెట్టవలెను అచిన్నది ఆవ్రికారంచేస్తే మగడు వచ్చెను. సంతానముగలిగెను.

ఉద్యాపన.—ప్రతియేటా పసుపు, కుంకుమ, కొబ్బరి, బెల్లము, జీలకఱ్ఱ సేరుంబావుచొప్పున వాయనమియ్యవలెను

ఆనాడు పిల్లపెట్టినసోము జగత్తంతా పట్టిరి. ఈనోము నోచినవారికి తరగని అయిదోతనము.

## 23 చెట్టునాడు పదమూడుపువ్వుల నోముకధ.

సాంబశివా! మహాదేవా! సింహద్వారముదాటి వచ్చితిని. దేవా మాటలో మనసుకలియకుండా నోము నోచుకచ్చితిని మహాదేవా అధమస్థానము అల్లుడింటికి వెళ్ళకుండా నోచి వచ్చితిని. మహాదేవా? ఒక పువ్వు పూజచేస్తిని మహాదేవా ఉత్తముడైన బ్రాహ్మణ కడుపున బుట్టగోరితిని మహాదేవా! రెండు పూవులు పూజచేస్తిని సావిత్రివంటి సంతానము కలుగ వేడితిని మహాదేవా! మూడుపూవులు పూజచేస్తిని ముత్యాలగొడుగుల నీడ నడువనేర్చితిని మహాదేవా నాలుగుపువ్వులు పూజచేస్తిని నవధాన్యాలతో నాయిల్లు నిండనోస్తిని. మహాదేవా ఐదుపువ్వులుపూజ చేస్తిని ధరణివంటి తల్లితండ్రి గలుగవలెనని కోరితిని. మహాదేవా ఆరుపువ్వులుపూజ చేస్తిని ఆదిత్యునివంటి అత్తమామలు కావలెనని కోరితిని. మహాదేవా ఏడుపూవులపూజ చేస్తిని ఏకచక్రిముగ నాఘటము వెళ్ళానని కోరితిని. మహాదేవా! ఎనిమిదిపూవులు పూజచేస్తిని మహాదేవా ఎనమండుగురు కంసాలుల చేసిన నగలన్నీ ధరించ గోరితిని. మహాదేవా! తొమ్మిదిపువ్వుల పూజచేస్తిని తోయజగంధులు తోడుగా పుట్టాలని నోచితిని మహాదేవా! పది పువ్వులు పూజచేస్తిని పట్టపురాణిని కృష్ణభార్యగా గోరితిని మహాదేవా పదకొండుపూవులు పూజచేసితిని పరస్త్రీని జూడని పురుషుడు కావాలెనని కోరితిని మహాదేవా! పన్నెండు పూవులుపూజచేసితిని బహుళ సంపదలు కావలెనంటిని. మహాశివ! పదమూడు పూవుల పూజచేస్తిని. పార్వతీదేవి

సాన్నిధ్యముగోరి వస్తిని. మెచ్చితిని అక్కా యిచ్చితినివరము మరియొకటి కోరవే మహాళలింగము శివభక్తులారా! కోర నేమున్నది. మాననేమున్నది. ఇష్టసంపదగా పార్వతీ పరమేశ్వరులవంటి యిద్దరుకూతుళ్ళను కోరితిని. మెచ్చితినిఅక్కా యిచ్చితినివరము మరియొకటి కోరవే మహాళలింగము శివభక్తురాలా! కోరనేమున్నది మాననేమున్నదయ్యా. పదముగ్గురు పుత్రులం పడగా గోరితిని మురుపు చూపేకొడుకు ముద్దులు పెట్టేకొడుకు మువ్వలు గట్టేకొడుకు అమ్మా అన్నమనేకొడుకు తూర్పు ధృవమేలే కొడుకు పడమట భాగ్యంబట్టేకొడుకు ఉత్తరాన నూళ్లేలే కొడుకు కన్నెలకని కన్యాదానముచేసేకొడుకు గోవులను బెంచి గోదానము చేసేకొడుకు అతిథి అభ్యాగతులను ఆదరించే కొడుకు మెచ్చితిని అక్కా యిచ్చితిని వరము మరియొకటికోరు మహాళలింగము శివభక్తులారా! కోర నేమున్నదయ్యా మాననేమున్నదయ్యా సోమయాజులవారి సోమిదేవి పెద్దకూతురైన పుట్టి వేయకపండే వెయిపుట్ల నివారి వడ్లు, పదిపుట్ల ఆవాలు, అయిదుపుట్ల జీలకర్ర, పుట్టెడు వుప్పు, సిద్దెలకొలది నెయ్యి, వెలుగు ఆరు పోక గుమ్మడికాయంతసున్నము పదికడవల పాలుపెరుగై కడవలపెరుగు చద్దికిరింద చెల్లే సంపదగోరితిని. మెచ్చితినక్కా యిచ్చితిని వరము. మరియొకటి కోరుము మహాళలింగనిశివభక్తులారా; కోరనేమున్నది మాననేమున్నదయ్యా. తల్లినిగన్నతల్లి తనతల్లి తాను మూడు తోటలలోని ముద్దు మల్లెపూలు ముడుచుకొని ఆరుతోటల పసపురాసుకొని మనమలను మునిమనమల చంకనెత్తుకొని పట్టె మంచముమీద పరుండగోరితిని మెచ్చితినక్కా యిచ్చితిని వరము మరియొకటి గోరవే మహాళలింగని భక్తురాలా! కోరనేమున్నది మాననేమున్నదయ్యా! అత్తగా రత్తగారు అత్తగారు తాను మూడుతోటల ముఖ్యమల్లెపూలు ముడుచుకొని ఆరుతోటలు పసపుంచుకొని మునిమనమలను చంకనెత్తికొని పూలపాన్పు మీద పరుండగోరితిని. మెచ్చితినక్కా! ఇచ్చితినివరము. మరియొకటి గోరవే మహాళలింగని నిజభక్తురాలా కోరనేమున్నది మాననేమున్నది. కోయకుండా చెట్టునపడిన పూవుల నోము పట్టిన పడతివచ్చినది. కడగండికాళ్ళు వేయండిగద్దె నందన వనములోకి వెళ్ళి సతిచరిత్ర చూడండి. ఎటువచ్చినదో నీలాంబరమున నిలిచియే వచ్చిందో కనకాంబరాన కదలియే వచ్చిందో తెల్లచీరతో వెలసి వచ్చిందో ఇనుపముక్క కాలుకు పోటు లేకుండా ఉగ్గండపుగుగుల ఉదటులేకుండా ఎలా వచ్చిందో స్వర్గము తలుపులుతీసి పెట్టండి. అప్పుడు స్వర్గము తలుపుతీస్తే శివభక్తురాలు అక్కడకు వెళ్ళింది. ఆమె నోచిన నోము లోకమంతా నో

చేరు భక్తితప్పరాదు ఫలం తప్పబోదు అక్షింతలు తప్పినా తరగని ఆయిదవతనం.

ఉద్యాపనము — నోము పట్టింది మొదలు నిత్య మల్లెచెట్టునో మరి యొకటియో 13 పువ్వులతో గౌరీపూజ యేడాది చేయవలెను. రోజూ కథ చెప్పుకోవలెను 13 పద్మాలు 13 వత్తుల దీపము 13 ప్రదక్షిణాలు నిత్యము చేసికోవలెను.

ఏడాది అయినతర్వాత 13 దోసిళ్ల బియ్యము, 13 బంగారపు పువ్వులు13 కాసులు. శివాలయమునకు తీసికొనిపోయి శివలింగమునకు పూజచేసి బ్రాహ్మణున కీయవలెను.

## 24 తరగని ఆదివారముల నోముకథ.

ఒకవూళ్లో ఒకరాజుకూతురు మంత్రికూతురు తరగని ఆదివారము నోముపట్టేరు. మంత్రికూతురు యేటికేడాది ఆదివార మాదివారము తరిగి వండినకూర తినకుండా, తానుచెతితో తరగకుండా, ఒకళ్ళను కూరతరగమని చెప్పకుండా నోమునోచుకొని యేడాదిఅయినాక ఉద్యాపన చేసుకుంది, రాజుకూతురు ఎప్పుడూ బద్ధకముచేత నిర్లక్ష్యముచేత తరిగినకూర తినుచు నోముఉల్లంఘున చేసింది. చివరకుమంత్రికూతురుకు మంచిఅదృష్టము పట్టింది పిల్లలుకలిగేరు. రాజుకూతురిది చూచినసహింపలేక యేమిచేసిందంటే, ఒకనాడు మంత్రికూతురిని బిడ్డలను పిలిపించి వారందరితలలు తరిగించి ఒకపెట్టెలోపెట్టిపంపింది. ఈలోగాపార్వతీదేవిమంత్రికూతురుపిల్లలవంటివారినిసృష్టించి యింట్లోపెట్టింది. వారలకావిడె చద్దిఅన్నాలు పెడుతూవుంది. అప్పుడీపెట్టెవెళ్ళింది. తీసిచూడగా పిల్లలున్నాను వాళ్లనువీళ్లనుకూడా పెంచుకొంటూవుంది. రాజుకూతురు మంత్రికూతురు బిడ్డలునరిగేసేనుగదా యేమి జరిగింద అనిఅడిగితే పెట్టెతీసుకొని వెళ్లినవాళ్లు అమ్మా! పెట్టెమాతదీసేవరకు బిడ్డలు జీవించియేయున్నారు పైగా ఇంకాయింట్లో యిలాంటిపిల్లలే ఉన్నారనగా ఏమిద నికీయదృష్టమని మరింతగుక్షపడి యిక్కడుండినని అడివినిబడి యేడ్చుకుంటూ పోతూవుంటే పార్వతీదేవి వృద్ధురాలైన ముత్తయిదువవలె అగపించి ఏమమ్మా యిలా యేడుస్తునావంటే తాను మంత్రికూతురు నోముపట్టడముఆవిడె యిలాకావడము తనపిల్లలు పుట్టినవాళ్లంతా చచ్చిపోవడము చెప్పింది పార్వతిఅప్పుడు దయతో అన్నదిగదా నీవు తరగని ఆదివారాల నోముపట్టి నిలక్ష్యము చేసేవు అందుకని యిలాఅయింది. ఆవిడ భక్తిశ్రద్ధలతో నోచింది అందుకని తామర తంపరగావుంది. పోయి

నోము యథావిధిగా నోచుకొనుమని చెప్పి అదృశ్యురాలైనది. అప్పుడు రాచ బిడ్డ యింటికివచ్చి నోము యథావిధిగా నోచుకొని సుఖపడ్డది.

ఉద్యాపనము.—ఏడాది ప్రతి ఆదివారము నోమునోచుకొని కథ చెప్పుకొని ఏడాది అయినాక 13 కొబ్బరికాయలు 13 కాసులు చీర రవిక పెట్టి ఒక ముత్తైదువునకు వాయన మియ్యవలెను. శక్తితప్పినా భక్తితప్ప రాదు. వ్రతం తప్పరాదు.

## 25 బాలాదివాముదల నోముకథ.

ఒక వూర్లో ఒకబ్రాహ్మణునకు ఒక కుమార్తె ఒక కుమారుడు ఉన్నారు. కొమారునకు పెండ్లిఅయినది. కోడలు కాపురమునకు వచ్చినది. కుమార్తె చిన్నది ఇట్లావుండగా వారింటికి ప్రతినిత్యా ఉపాదానపు బ్రాహ్మణుడు వచ్చేవాడు. వస్తే వదినె మరదలును యిద్దరు చెరి చెప్పెడు బియ్యము ఆయనకు పెట్టేవారు. ఆయన వదినను "సౌభాగ్యవతీభవా అనే వాడు మరదలిని" గంగాస్నానఫల సిద్ధిరస్తు" అనేవాడు ఇలా చాలాదినములు జరిగింది. ఓనాడా చిన్నమ్మాయి "తండ్రితో నాన్నా రోజూ ఉపాదానము పెట్టగానే యీయనారపు బ్రాహ్మణుడునన్నొకలాగు వదినెనొకలాగు దీవిస్తాడు కనుక్కోకుంటే ఒకనాడు ఆయన వచ్చేవేళ కింటనుండి ఆయని దీవెనలావిని ఏమయ్యా ఈ చిన్నదానిని యిలా దీవింపినావనగా నన్నేమి చేయుమన్నారు. ఈ యమ్మాయి క్రిందటిజన్మలోపసపు కుంకుమ దొంగిలిస్తూవుంటే మీరు దాచి ఊరుకున్నారు అందుకని యీ జన్మలో పసపు కుంకుమ లేకుండా పుట్టింది బాలవిధవరికమున్నది. అందుకని గంగాస్నాన ఫలసిద్ధిరస్తు అని దీవిస్తున్నానన్నాడు. అంట్టున తల్లి దండ్రి చాలా దుఃఖించి ఆయ్యా మాకొక్కతేపిల్ల యేమిచెయ్యను. నాయనా యని ఆయన కాళ్ళమీద పడ్డారు. ఆయన అన్నారు గదా దైవవిధి తప్పించుట కెవరితరము. ఐనా ఒకవిధము చెపుతాను చేసి చూడండి. ఈయమ్మాయికి వివాహము చేసినారు కనుక, పెనిమిటి పోగానే అశరీరమింట్లోవుంచి, మీరు గంగాస్నానానికి పొండి అపిల్లనుదారిలో ఒక ముత్తైదువు పసుపుకుంకుమ చీరు చెంగునకట్టుకొని గంగాస్నానానికి వెడుతూవుంటుంది. ఆమెతో మీయమ్మాయిని వుండమనండి. ఆమె పసుపుకుంకుమ జారిపోతుంది. అవితీసి జాగ్రత్తచేసి ఆమెతో స్నానాలకేవుకుపోతే, అక్కడఆమెమాచుకొని, నా పసుపు కుంకుమ"పోయింది అంటున్నది. అనగానే కాను దొరికిందని" చెప్పిమాయ్యండి ఇస్తేఈము

మ్మాయికికూడా పెట్టుతుంది. అంతా స్నానముచేసి వండి వచ్చేటప్పటికి పెనిమిటి యింట్లో తిరుగుతువుంటాడు. అనిచెప్పి వెళ్ళిపోయినాడు ఇలా ప్రతిఆదివారము ఒక యేడాదిపాటు రేవులోకి వెళ్ళి ముత్తైదువకు పసుపుకుంకుమ యియ్యాలి, శక్తితప్పినా భక్తితప్పరాదు అక్షతలు వేసుకొన్నా ఏదివేలయేండ్ల అయిదవతనము

ఉద్యాపన.—శేరుంబావుపాలు పరమాన్నమువండి అడుగుమట్టుపైమట్టుతీసి, మధ్యభాగముతీసి పళ్ళెములోనుంచి ఒక ముత్తయిదువను భోజనమునకుపిలిచి, చీర, రవికెయిచ్చి, ఆమెకీపరమాన్నము వడ్డించి, దక్షిణ తాంబూలమియ్యాలి. ఇది శుభప్రదమైన బాలవ్రతము.

## 26 ఫలాలగౌరిదేవికథ

అనగాఅనగా ఒక రాజు. ఆరాజుభార్య ఫలాలగౌరిదేవి నోముపట్టింది. ఒక బ్రాహ్మణునిభార్యకూడా పట్టింది. బ్రాహ్మణునిభార్య ముత్తైదువులకు మంచిపళ్ళు పదహారిచ్చేది. రాజుభార్య భాగ్యవశమువల్ల చచ్చుకాయ పుచ్చుకాయ పెట్టిచ్చేది. బ్రాహ్మణునిభార్య బిడ్డలుబాగావుండేవారు. రాజుభార్యబిడ్డలు చనిపోయేవారు గతిగుంపోయినారు. ఒకనాడు రాజుభార్య బ్రాహ్మణునిభార్యదగ్గరకు వచ్చి నీబిడ్డలు బాగుండును మేము నాబిడ్డలుచచ్చిపోవడమేమని అడిగెను అడిగితే నీవు చచ్చుకాయ పుచ్చుకాయ పెట్టిచ్చావు నేనుమంచిపళ్ళు పెట్టినాను గనుక నాబిడ్డలు బాగున్నారు నీబిడ్డలుచచ్చారు. కాబట్టి యథావిధిగా ఫలాలగౌరిదేవినోముపట్టి పదహారుపళ్ళు వాయినమిచ్చి ఉద్యాపనచేసే నీబిడ్డలుకూడా బాగుంటారని చెప్పగా రాజుభార్య యథావిధిగా ఫలాలగౌరిదేవినోముపట్టి పదహారుపళ్ళునుంచివి వాయనమియ్యగా రాజుగారిభార్యబిడ్డలుకూడా బాగావుండేవారు. కథలోభమైనా వ్రతలోభంగారాదు

## 27 చిలుకుముగ్గులకథ

తెలగతెలగయేమిబుట్టె నందిరాయనుడింట పెరగగా తెలగతెలగయేమిబుట్టె పందిబుట్టె పందిపరమేశ్వరుడింటపెరగగా తెలగతెలగయేమిబుట్టె నోముబుట్టెనోము దొడ్లల్లో పెరగగా పన్నెండుకొమ్మల పన్నెండు ఆకుల తులసెమ్మబుట్టె. ఆతులసెమ్మ కేవిచిన్నవాడు కావలెనా ఆయిదవతనములేని ఆడది కావలెనా, అయిదవతనములేని ఆడదైతేమాయింటనన్నాపడియుండదు, ఆయువులేని కుమారుడొందుకు అయిదువతనములేని కూతురునే యిమ్మని అడగగా పార్వతీ పరమేశ్వరులు భూమి పాలింపవచ్చారు. కుమార్తె కలిగింది. కుమా

త్రాగలిగితే ఏచిన్నవాని కిస్తానాయని చూస్తున్నాను. ఎవరికిచ్చి చేసినా వచ్చినవాడు గదా యని పర్వతునికిచ్చి పెండ్లిచేసెను. ఆరాతికిచ్చి పెళ్ళి చేస్తే ఆరాయికూడా బ్రద్దలై పోయెను. ఓపుణ్యాత్మురాలు చిలుకముగ్గుల నోముపట్టింది నోము పడితే నోచిననోము నాకు ధారాగతం చెయ్యవమ్మా అన్నది పార్వతీ పరమేశ్వరుల దగ్గరకు వెళ్ళి అడిగింది. నోచిననోము చేసుకున్న పెనిమిటి ధారాగతం చేస్తారా యెక్కడయినా కద్దా అంది అంటే అలాగాదు చేస్తేనేగాని వల్లగాదు. సరే పాప్మనుకుని యేమి చేసింది చిందులుధారాగతం చేసింది. అప్పుడు పన్నెండేళ్ళ బాలకొమార్తె అయింది. ఈచిందులు పడితేనే అయిదోతనం వచ్చింది. ఈ నోముపడితేయెంతో ఫలముంది. ఉద్యాపనము-5 శేర్ల పిండి తెచ్చి చలిమిడిచేసి ఆరా దేళ్ళు చిలుకుద్రొక్కి బ్రాహ్మణునికి కొక ముద్దభక్తితో యిచ్చి తనపాలిముద్దలో పాలు నెయ్యిబోసి అందరికి పంచిపెట్టి అయిదుగురు ముత్తయిదువులకు అయిదుగురు బ్రాహ్మణులకు భోజనము బెట్టి యథావిధిగా అలా అయిదేళ్ళు నోము నోచుకొని అయిదోయేడు వచ్చేటప్పటికి పదిహేనుకుంపాలు పదిహేనువత్తులు పదిహేను కలశాలు పదిహేనువత్తులు దీపములు పదిహేను ముగ్గులు పెట్టుకొని ఉద్యాపన చేసింది కథలోపమయినా వ్రత లోపం కారాదు.

## 28 కరుళ్ళగారిదేవికథ.

అనగ అనగ ఒకబ్రాహ్మణుడు. ఆబ్రాహ్మణునకు అయిదుగురు కొడుకులు. అయిదుగురు కొడుకులకు పెండ్లయినది. అయిదవ కోడలు కరుళ్ళగారిదేవి నోముపట్టినది. అంతాకూడా వేసివెయ్యకుండా భాగ్యముతోనున్నారు. ఉండిఅత్తసొమ్మొద్దు, మామసొమ్మొద్దు, పుట్టిసొమ్మొద్దు పురుషసొమ్మొద్దు నాసొమ్మే నాకిమ్మని సూర్యదేవుని ప్రార్థించి రోజు దండము బెట్టేది ఏడాదిన్ని పసపు పూసకొని నీళ్ళోసుకొని ప్రతిరోజు దండము బెట్టేది. దండముపెట్టితే కొంతకాలమునకు అత్తగారికి, మామగారికి, బావగారికి, మరుదులకు, పెనిమిటికి అందరికి ఆచిన్నదానిమీద కోపంగావుండేది. పడుకొని నిద్రపోవుచుండగా మంచము దీసుకపోయి అర్ధాన్నపు అడవిలో పారవేసినారు. తెల్లవారగా యెలాగ యేమిబుద్ధి అని అర్ధాన్నపు అడవి లోనే నీళ్ళుపోసికొని సూర్యదేవులకు నమస్కారము చేయుచుండగా చేటెడు వరహాలు వచ్చినవి. అవి పెట్టి పసపు, కుంకుము, గిన్నె, ఉప్పు, మిరపకాయలు, బియ్యము, కట్టెలు మొదలయిన సామాగ్రియంతా అక్కడ కొక

గొల్లవాడుండగా వానిచేత అన్నీ తెప్పించుకొని అనాయాసముగా అలాజీవ నంచేస్తూ వున్నది. అప్పుడు ఇంటిదగ్గర వీళ్ళకు అష్ట దరిద్రములు పట్టుకొని అయిద్దాన్నపు అడివిలోనికి కట్టెపుల్లలకువచ్చిరి. ఈచిన్నది సూర్యభగవానులకు దండము బెట్టుచుండగా జూచి మా తోటికోడలు యిలాగే దండము పెట్టేపని పుల్లలకు వచ్చిన తోడి కోడండ్రంతా అనుకొనుచుండిరి. ఇక్కడ అడవిలో ఉన్నది మేడలు, మిద్దెలు బ్రహ్మాండముగాకట్టించి అరిదేశి పరదేశి వస్తే అన్నము లేదనకుండా అన్నము పెడుతూ వుండేది. అప్పుడు మాయ అత్తగారు వచ్చి అమ్మా మాకింత అన్నము పెడతావా అని అడిగిరి అత్తగారు మామగారన్నమాట ఆ చిన్నదానికి తెలిసెను. వీళ్ళకు తెలియదు. అప్పుడా చిన్నది మా అత్తగారు మామగారు మీలాగే వుండేవారు. మీదేవూరు మీరెవరని అడిగితే అప్పుడు మేము ఫలానా అని చెప్పిరి. పనిమిటిని వుండమనిచెప్పి ముగ్గురికి ఉపచారములు చేస్తూఉండేది.

ఉద్యాపనము.—పదమూడు కరుళ్ళు కంచములో పెట్టి క్రొత్తకంచముకొని చీర ఒక రవికెలగుడ్డ కరుళ్లుపెట్టి ఉద్యాపన చేసింది ఏడాది అయినతరువాత చీర, రవిక పదమూడుకరుళ్ళ క్రొత్త కంచములో బెట్టి ఉద్యాపన చేసికొనవలెను. కథ లోపమయినా వ్రతలోపంకారాదు.

## 29 వాయిలక్ష్మివారం కథ.

ఒక బ్రాహ్మణునికి అయిదుగురు కుమార్తెలు. ఒకకుమార్తెను ఏమియూ లేనివారికి మేనరికమిచ్చారు. అష్టదరిద్రుడనకిస్తే ఈ కూతురికి పిల్లలు పుట్టిరి. ఈపిల్లలు తాతా పందిళ్ళువేస్తాము తాతా పాకలు వేస్తామని తాతగారింటికివెళ్ళి అనగా కూతు పందిళ్ళువేసేవారున్నారు, పాకలు వేసేవాండ్రున్నారు మీరేమీ చేయనక్కర లేదనేవాడు. అంతట పోనీవాయనా మీరు వెళ్ళవద్దనిచెప్పి ఆచిన్నవాండ్రితండ్రి ముష్టియెత్తి వచ్చుచుండగా చూచి దరిద్రురాలి పెద్దన్నగారిభార్యా అయ్యో వీరుదరిద్రముగానున్నారు, వాయిలక్ష్మివారం నోమైనా పడదామని పొట్టుకడగనిబియ్యం తేరంబావు, కడిగిన బియ్యం తేరంబావు చాటలోబోసుకొని ఒక వెండివాయిలికొమ్ము, ఒక పయిడివాయిలికొమ్ము చేతబుచ్చుకొని బిందె చేతబుచ్చుకొని మంచినీళ్ళకువచ్చినట్టుగా బిందెలో నోముచీరపెట్టుకొని అత్తగారికి మామగారికి తెలియకుండావచ్చి ఆడబిడ్డవచ్చింది ఈముష్టికివెళ్ళిన దరిద్రురాలి మొగుడు ఎడమాట పెడమాటవేసుకొని చక్కావచ్చాడు. మగడు వచ్చేటప్పటికి అన్నగారిభార్యాయిచ్చిన బియ్యంబెట్టి చప్పున వంటచేసింది. అంతటయే

మేయిూరోజున చప్పున వంటయినదని యడుగగా మాయన్నగారి పెళ్ళాము వాయిలక్ష్మివారంనోము ఉద్యాపనచేసుకుంది నేను వద్దుపొమ్మనగా బలవంతానయిచ్చిపోగా బాగుండదని పుచ్చుకొన్నాను. పుచ్చుకొన్నవేళమంచిదగుటచే మీరుకూడా చాలా మాటలుతెచ్చారు. మీపుణ్యము బాగున్నదనుకొన్నానన్నది. అంతట వాళ్ళను కావలసినంత భాగ్యమువచ్చింది. భాగ్యంవచ్చినతరువాత పుట్టింటవాండ్రకు తెలిసి సవారీపంపించినారు. పంపిస్తే వసువులన్నితీసి పళ్ళెములో బెట్టి నన్నుజూచిపిలిచేరా నాపాలిటి లక్ష్మిదేవినిజూచి పిలిచేరా అని ఏడువారాలవస్తువులు దానిమీదబెట్టి నగలకు నైవేద్యంబెట్టి పుట్టింటికివెళ్ళినది, వాయినం పుచ్చుకుంటేనే యింతభాగ్యంవచ్చింది. యీనోముపడితే యెంతభాగ్యమో అని ఆవిడకూడా నోముబట్టి ఉద్యాపన చేసికొన్నది. ఆవిడపట్టిననోము భూమల్లాపట్టారు. కథలోవనుయినా! వతలోపముకాదు. (ఉద్యాపన కథలోనేయున్నది.)

## 30 శుక్రవారపు నోముకథ.

శుక్రవారపు లక్ష్మిదేవమ్మ ప్రొద్దున్నలేచి యెవరికి సిరియున్నదో యెవరికి సంపదయున్నదో యెవరికిలేదో చూతామని పచ్చని అక్షింతలు పయిడిగిన్నె చేతబుచ్చుకొని పట్టుపీతాంబరం గట్టుకొని బయలుదేరేను ఒక యింటికి వచ్చింది పాచిళ్లు పాచివాకిళ్లు, ముడిపళ్లు మునిఎంటగొరుకుచు నోకయిల్లాలు గుంటలోబోసుకు దంచుచున్నది. ఛీ యెంతపాపిష్టికొంపకొస్తినాయని మరల రెండవయింటికి వెళ్లెను. రెండవ యింటావిడ పాచియింట్లో నలుగురుబిడ్డలను దగ్గరబెట్టుకొని కంచెడు పెరుగు అన్నముబెట్టుకొని తినుచుగూర్చుండెను ఛీ ఎంతపాపిష్టికొంపకొస్తినని మూడవ యింటికివెళ్ళెను మూడవయింటిలో నొక ఆవిడ పుట్టెడుగుడ్డలు ముందేసుకొని పాచివాకిలిలోగుట్టుకొనుచు కూర్చుండెను. ఛీ, యెంత పాపిష్టి కొంపకువచ్చితినని మరల నాల్గవయింటికివెళ్ళెను. నాలుగవ యింటావిడ పేలాలు బొక్కుచు పాచివాకిలిలో తలయీర్చుకొనుచున్నది ఛీ! యెంత పాపిష్టికొంపకువచ్చితినని అయిదవయింటికి వెళ్ళింది, అయిదవయింటావిడ నల్లగా అలుకొని తెల్లగా ముగ్గుబెట్టుకొని పచ్చగా పసుపుపూసుకొని గొబ్బగా బొట్టుపెట్టుకొని అల్లనేరేడు పండ్లవలె ఖండలుకడుగుకొని, అరుగుమీద ప్రత్తివిప్పుకొనుచు గూర్చుండెను. శుక్రవారపు లక్ష్మిదేవమ్మ రెండుద్వారబంధములుబట్టి తొంగిచూచి వెళ్ళుచున్నది. వెడతావేమిరా అమ్మశుక్రవారపులక్ష్మిదేవివి వచ్చితివనాను. లోపలికివెళ్ళి యెదురుగోడింట పీటవేయగా కూర్చుండెమడి

గట్టుకొని స్వయంపాకము చెయ్యనమ్మా యన్నది. మాయాయన యీయావారానికి వెళ్ళేరమ్మా చేస్తానని యీమె కింటి కోమటింటికి వెళ్ళింది ఆకోమట్లకదివరకు కిట్టకుండానుండేది. ఏమమ్మా యేన్నడులేనిది యిలావచ్చారు సోమిదేవమ్మగారూ, అన మాయింటికి శుక్రవారపులక్ష్మీదేవివచ్చినదన మీయింటికి శుక్రవారపు లక్ష్మీదేవివచ్చింది, మాయింటికి మీరువచ్చితిరని సకలసామగ్రితో స్వయంపాకమిచ్చిరి అక్కడనుండి కంచర వాళ్ళింటికి వెళ్ళగనే యేమమ్మాసోమిదేవమ్మగారూ యిలావచ్చితిరన మాయింటికి శుక్రవారపులక్ష్మీదేవమ్మ వచ్చినదనగా మీయింటికి శుక్రవారపు లక్ష్మీదేవమ్మవచ్చినది, మాయింటికి మీరువచ్చితిరని పాత్రసామగ్రి యిచ్చిరి. అతప్పేలాయింత దచ్చిచప్పనస్నానముచేసి మడిగట్టుకొని స్వయంపాకము చేసినది నుగమకోడుకు యీయావారమునకు వెడితే మానెకిచ్చేవారు అడ్డెడు, అడ్డెడిచ్చేవారు కుంచెడు, కుంచెడిచ్చేవారిరస, ఈ విధముగా ఇంటింటనిచ్చిరి ఇంటింటయాటకింటింట పెట్టుకొనుచు మొయ్యలేకుండావచ్చుచున్నారు ఎదురుగుండావెళ్ళి యీవేళమనయింటికి శుక్రవారపులక్ష్మీదేవమ్మ వచ్చినది చన్నానమునకు కట్టుకొనిదేవతార్చన చేయండి యాటలావక విప్పుదురుగాని యనగా చన్నాన యాటలక్కడ బెట్టిస్నానము చేసి దేవతార్చనము చేసి భోజనములు చేసిరి. లక్ష్మీదేవి భోజనము చేసి నేను వెళతానమ్మా అనగా ఈ వేళకుండుము యనగా పరేయనెను. అంతటనొకగదిలో మంచము వేసి పక్క వేసి పరుండుమనెను. ఒక ప్రొద్దువేళలేచి అమ్మా, అమ్మ కడుపునొప్పి యున్నదమ్మా అన్నది అర్ధరాత్రితలుపుతీస్తే మాయాయనకూకలు వేసెనరు. ఒకమూల కూర్చుండవమ్మా అనగా నొకమూల కూర్చుండెను. కొంతసేపటికి మరల కడుపునొప్పియున్నదనగా రెండవమూల కూర్చుండుమనెను. కొంచెముసేపాగి మరల కడుపునొప్పియున్నదనగా మూడవ మూల కూర్చుండుమనెను. కొంచెముసేపుండి మరల నొప్పియున్నదనగా నాలుగవమూల కూర్చుండి నట్టింట కూర్చుండవమ్మా యన్నది. నాలుగుమూలల నట్టింట కూర్చుండి తెల్లవారకట్లలేదిచెప్పకుండా వారిపోయినది ఉదయమున నేలేచి ముఖము గడుగుకొని యింటి చూవిడ పెంటచేట. చీపురు తీసికొని యెత్తిపోయుటకు వచ్చెను. అంతట చూడగా నాలుగు మూలల నాలుగు బంగారు చెంబులై యున్నవి, ముత్యాలు, కెంపులు, ధనంతులు, లోగిళ్ళు తెల్లవారునప్పటికి సిద్ధముయినవి. తెల్లవారిన తరువాత మారిలోలివాండ్రిండరు అమ్మా నీవేమినోముపట్టితివని యడుగగా అమ్మా నేను శుక్రవారపులక్ష్మీదేవి నోము పట్టితిని మాయింటికి శుక్రవారపు లక్ష్మీదేవివచ్చి భాగ్యమిచ్చినదనగా, ఎలాపట్టాలి వతీయన పట్టవలెననగా

ఏటికెదురయిన మాఘమాసమున పూర్ణిమముందర రథసప్తమినాడు విఘ్నములుగాకుండా విఘ్నేశ్వరునకుండ్రాళ్లు పోసి సరస్వతీదేవికి చలిమిడిచేసి ఆయత్త సూర్య భగవానునికి పాలుపొంగించి అయిదేళ్లు కథచెప్పుకొని అక్షింతలు వేసుకొని, పట్టినయేడు గడపమీద, రెండవయేడు బిందెమీద, మూడవయేడు పానమీద నాలుగవయేడు నట్టింట, అయిదవయేడు అద్దములో అయిదేండ్లు నోచుకొనేది.

ఉద్యాపనము.— అయిదుగురు పేరంటాండ్రకు నల్లపూసలు, లక్కజోళ్ళు దక్షిణతాంబూలము అయిదురవికెలగుడ్డలు, తలకు చమురిచ్చి, పిండివంటలతో భోజనముపెట్టి ఉద్యాపనచేయవలెనని చెప్పినది. ఆమె నోచిననోము భూమిభూలోకమంతా నోచిరి భక్తితప్పినా ఫలంతప్పరాదు. కథలోపమయివ్రాతలోపంకారాదు. నుడుగుదప్పినా ఫలందప్పరాదు. ఆయత్తభగవానుడాతండ్రీ నీకేనమస్కారము.

## 31 మూడుకార్తుల నోముకథ.

రాజుభార్య ప్రధాని భార్య యిద్దరు మూడుకార్తులనోముపట్టిరి. రాజుభార్య నాకేమి భాగ్యవంతురాలనని తడిపి గడేవనట్లు వత్తితడిపి దీపము వెలిగించేది. ప్రధాని భార్య యథావిధిగా మున్నూటరవయివత్తుల చేసి నిండా చమురుపోసి బాగా వత్తులుతడిపి ఆమె వెలిగించుచుండేది. ఒలికిన ఫలం మాకిచ్చి ఒలకని ఫలం నీవు పుచ్చుకొనుమని దండముపెట్టేది. ఆమెకు భాగ్యము సిరి సంపద గలిగినది. రాజు భార్యకు రొండదరిద్రము పెడదరిద్రముగా నున్నది. ఆవిడ పట్టినది నేను పట్టితిని ఆమెకు భాగ్యమేమి నాకీదరిద్రమేమి నేను శివునినడిగి చింతాకంత వరము దెచ్చుకొందునని బయలుదేరి కొంతదూరము వచ్చినతరువాత పొలములో చెంగల్వగడ్డిలో ఆవుదూడ మేయకుండా నిలచియుండి యెక్కడికి వెడతావమ్మా అని యడిగినది. శివునిఅడిగి చింతాకంత వరము దెచ్చుకొబోవుచున్నాననెను. నాదిగూడి ఒకమాట చెప్పవమ్మా అనెను. ఇక కొంచెము దూరముపోగా కోడు పెనాలు కాలుచున్నవి ఎక్కడికి వెడతావనగా శివుని అడిగి చింతాకంత వరము దెచ్చుకొనబోవుచున్నాననెను. మాది ఒకమాట చెప్పుమన్నవి ఇంకా కొంతదూరము పోయింది కోడు కోళ్ళు ఆకాశమున వ్రేలాడుచున్నవి ఎక్కడికి పోవుచున్నావమ్మా అనగా శివునిఅడిగి చింతాకంత వరము దెచ్చుకుందుననగా మాది ఒకమాట చెప్పుమన్నవి. ఇంక కొంచెము దూరముపోగా దణ్ణెముకోకలు తగులబడుచున్నవి. ఎక్క

సికి వెళ్లుదువమ్మా అనగా శివుని అడిగి చింతాకంత వరము దెచ్చుకొన బోవుచున్నాననగా మాది ఒకమాట చెప్పుచున్నవి కొంచెమవతలికి పోగా చెరువు లోనీరు పాలవలెనున్నవి అనీ రెవరుముట్టరు. ఎక్కడికి పోతావ మ్మా అని అడుగగా శివునిఅడిగి చింతాకంత వరము దెచ్చుకొందువన నాదీ ఒకమాట చెప్పుమనెను. ఇంకా కొంచెముదూరముబోగా ఒక చెట్టు నిండా పసుపు ముద్దలవలె వ్రేలాడు చున్నవి అవి రెవ్వరు కోసుకొనరు. ఎక్కడికిపోదువనగా శివుని అడిగి చింతాకాంతవరము దెచ్చుకొందునన మాదీఒకమాట చెప్పమన్నవి. ఇంకా కొంతదూరము వెళ్ళగా చెట్టునిండా సువాసనగల పువ్వులుండెను ఎవ్వరు ముట్టుకొనరు. కోయరు ఎక్కడికి వెడ తావమ్మాఅని యడుగగా శివునిఅడిగి చింతాకంతవరము దెచ్చుకొనబోవుచు న్నాననగా మాదీఒకమాట చెప్పుమనెను ఇంకాకొంచెము అవతలికి వెళ్ళ గా సోమయాజులవారి సోమిదేవమ్మ ఎక్కడికి వెడతావమ్మా అని యడుగగా శివునిఅడిగి చింతాకంతవరము దెచ్చుకొన బోవుచుంటినన యీభాగ్యము మోక్షము లేకుండావున్నాను. నాదీఒకమాట చెప్పుమనెను. అడవిలోనికివెళ్లి అడవిలో తపస్సుచేయుచు గూర్చుండెను. పార్వతీపరమేశ్వరులు భూమి లుపొంగించుచవచ్చి రెవరమ్మాయిక్కడకూర్చుంటివని అడిగిరి. అనుస్తారా తీరు స్తారా మీకెందుకు వెళ్లుమన్నది. అర్చేవారము మేమే తీర్చేవారముమేమే చెప్పవమ్మాఅనగా బ్రాహ్మణుని పెళ్ళామునోచింది నేనునోచితిని మూడు కారుణనోము, ఆమెకు సిరిసంపదయిత్తుకొన్నది నాకు దరిద్రమొయిత్తుకొ న్నది. అందుచే నిట్లు వచ్చితినిఅనగా ఆమె యుధావిధిగా మున్నూటరవ్వైవ త్తులతో నిండాదమురుపోసి వెలిగించుచువచ్చినది నీవు భాగ్యవంతురాలను గదాయని నిర్లక్ష్యముగా ఉల్లంఘనచేసి యుద్యాపనచేసితివిగావు కాగా నీకిలాచ్చినది మరలపట్టి యుద్యాపనచెయ్యి నీకు సిరిసంపద వస్తుందనిచె ప్పిరి. అవుదూడా మొలలోతు చెంగల్వగడ్డిలో నుంచున్నాయి నాదీఒక మాటచెప్పమన్నాయనెను, అత్త కోడలు ఇదరుపోట్లాడి అవుకునీళ్లుపొయ్య మంటే పోసితినని కోడలన్నది. అప్పుడు అవును నీనోరుపడా పోసితివా మన్నది కోడలు నీజివ్వాదీను పోను లేదాఅన్నది. అత్తకోడలుఅవుదూ డైపుట్టెనవి కొంచెము అక్షింతలు నీళ్ళుజల్లు మేస్తాయి అని చెప్పెను. దాని లో కోడు పెనాలు కాగుచున్నవి మావీ ఒకమాట చెప్పమన్నవి. తోడి కోడండ్రిద్దరు బయిటికిపోతే యేమిలాభము మనమే పుచ్చుకొందమని రెం డురువాయి నాలుపుచ్చుకున్నారు వాళ్ళిద్దరురెండురువాయి నాలు పుచ్చు కోవడమువలన కోడుపెనాలై యిద్దరు కాగుచున్నారు. కొంచెమక్షింతలు

నీళ్లుజల్లి వెళ్లుమనిరి. ఆకాశాన తోడ రోకళ్లు వ్రేలాడుచున్నవి. మావీ ఒక మాటచెప్పుమన్నవి. దంచిదంచిరోకళ్లు పొన్నులు పైకిపెట్టకుండా నిలువబెట్టుటచే అట్లు వ్రేలాడుచున్నవి. కొంచెమక్షింతలు నీళ్ళు జల్లిపొమ్మనిరి. దణ్ణెముకొసన తగులడుచున్నవి. మా వీ ఒకమాట చెప్పుమన్నవనను. ఏదుత రాలనాటి ఆడుబడుచు అన్నముబెట్టుమనగా పెట్టక పోవుటచేత ఉసూరుమని వెళ్ళిపోయింది. అందుచే దణ్ణెముకోకలు తగులడుచున్నవి. అక్షింతలు నీళ్లు పయివిజల్లి వెళ్లుమనిరి. చెరువులో నీళ్లు నాదీ ఒకమాట చెప్పుమన్నవన చెరువు ప్రతిష్ఠించి ప్రతిష్ఠ చేయించినారుకారు. అందుచేత ఎవరు ముట్టకొనరు రెండు దోసిళ్ళనీళ్లు ఇద్దునబోసి అక్షింతలు నీళ్ళుజల్లి పొమ్మనెను

చెట్టు నాదీ ఒకమాట చెప్పుమన్నదనగా ఒక బ్రాహ్మణునకు కడి పెడి చదువు వచ్చెను ఎవ్వరికి చెప్పేవాడుగాడు. అందుకీచెట్టు పళ్లెవరు ముట్టకొనరు కొంచెమక్షింతలు నీళ్లు జల్లి పొమ్మనిరి. పువ్వులచెట్టు నాదీ యొకమాట చెప్పుమన్నదనగా ఎవళ్ళకి ఒక పుష్పమియ్యకపోవుటచే పువ్వుల చెట్టయి పుట్టినదికావున అక్షింతలు నీళ్ళు జల్లి పొమ్మనిరి సోమయాజుల నాటి సోమిదేవమ్మ నాదీయొకమాట చెప్పుమన్నది ఎసరులో బియ్యము పోసి యినుపగరిటె పుచ్చుకొని కలియబెడి అంచుమీద కొట్టినట్టయితే తాన మాయలేనన్న భాగ్యము తొలగిపోవునని చెప్పిరి. అలా చెప్పినట్లు అక్షింతలు నీళ్ళు జల్లుచు యింటికి వచ్చినది. మున్నూటరువైపత్తులు వేసి యేటికెదురయిన మాఘమాసము పూర్ణిమముందర రథసప్తమినాడు విఘ్నము నుగాకుండా విఘ్నేశ్వరుని కుంక్రడాల్చుపోసి సరస్వతీదేవికి చలిమిడి చేసి, ఆయత్రి సూర్య భగవానునికి పాలుపొంగించి యేడాది కథచెప్పుకొని అక్షింతలు వేసుకొని కార్తీకపూర్ణిమనాడు, సంక్రాంతినాడు, శివరాత్రి నాడు మున్నూటరువై వత్తులు మూడు కార్తీకపు వెలిగించి వెండివత్తి పయిడివత్తి చేయించి ఒకసవాశేరు నేయి, కంచుపళ్ళెములో పోసి యీ వత్తి అందులో వెలిగించి మానెడు సోలెడు బియ్యము మండపముబోసి ముక్కంటీశ్వరునికేయించి యుద్యాపన చేసుకవలెను. ఇంతటయింటికివచ్చి యట్లుచేసినది. ఆమె నోచిననోము ఫాలి భోగములంతా నోచిరి. భక్తితప్పరాదు. ఫలం తప్పబోదు. కథ గ... వెయ... ప్రతిలో పంగారాదు. నుడుగుదప్పినా ఫలందప్పరదు. వారాంకమూర్తి తంద్రే దీకే నవ షాకారము.

## 32 చిత్రగుప్తుల నోముకథ.

ఒకపరిధాని పెళ్ళాము మున్నూటఅరువదినోములుపట్టి చిత్రగుప్తులనోముపట్టినది. రాజు పెళ్ళాము మున్నూటఅరువది నోములు నోచింది. ఇద్దరును కూడా స్వర్గమునకు వెళ్ళిపోయినారు. మున్నూటఅరువది నోములు నోచిన మరికేశ్వరం వచ్చినది యమద్వారము తీయుచున్నారు. చిత్రగుప్తులనోముపట్టిన శ్రీమహాలక్ష్మివచ్చినది స్వర్గద్వారము తీయుచున్నారు. అదియేమమ్మా మున్నూటఅరువది నోములు నోచినదానికి నేనను మున్నూటఅరువది నోములు నోచితిని దానికిస్వర్గమేమి? నాకుయమద్వారమేమి? అనిపోట్లాడెను. నీవుమున్నూటఅరువది నోములుపట్టి చిత్రగుప్తులనోము పట్టితివికావు అదిచిత్రగుప్తులనోమునోచినది. మరలవెళ్ళినీవు చిత్రగుప్తులనోముపట్టి ఉద్యాపనచేసి నీకూడా స్వర్గమువచ్చును. ఏటికొకసారియైన మాఘమాసమున పూర్ణిమముందర రథసప్తమినాడు, విఘ్నముగాకుండ విఘ్నేశ్వరున కుండ్రాళ్ళుపోసి సరస్వతికి చలిమిడిచేసి ఆయా తిథిభగవానునకు పాలుపొంగించి ఈ కథాక్షతలు చెప్పి అక్షింతలువేసికొని చిత్రిని చేయించి వెండాకు పయిడిగింటము చేయించి ఉద్యాపనచేసిరమ్మన్నారు అపుడింటికి వచ్చినోమునోచి యుద్యాపనచేసి స్వర్గానికివెళ్ళినది. ఆమెనోచిననోము భూమి భూలోకమందరు నోచిరి భక్తి దప్పరాదు ఫలందప్పబోదు. కథలోపమయినా వ్రతలోపంగారాదు నుడుగు దప్పినా ఫలందప్పరాదు. నారాయణమూర్తికి నీకేనమస్కారము.

## 33 ఆపదలేని ఆదివారముకథ.

ఒకావెడ ఇరుగు ఆపద పొరుగు ఆపద, తల్లి ఆపద తండ్రిఆపద, అత్తఆపద, మామ ఆపద, పురుషుడు ఆపద, పుత్రుడుఆపద, ఆపదలుపడలేక అద్ధాన్నపడవికి బోయి తలక్రిందుల తపస్సుచేయుచున్నది. పార్వతీపరమేశ్వరులు భూములు పాలింపవచ్చిరి. ఇలా కూర్చుంటివేమని యడిగిరి అరిచెదరా, తీరిచెదరా, మీకేమి పొమ్మన్నది. అర్చివారము మేమే తీర్చివారము మేమే చెప్పుమనగా ఇరుగు ఆపద, పొరుగు ఆపద తండ్రి ఆపద, తల్లి ఆపద, అత్త ఆపద, మామ ఆపద, పురుషుడు ఆపద, పుత్రుడుఆపద, ఆపదలు బడలేక యిలా వచ్చితిననగా మునుపటి జన్మాన ఆపదలేని ఆదివారముల నోముపట్టి ఉల్లంఘన చేసినావు. మరలపట్టి ఉద్యాపన చేయుము ఆపదలుపోవును. అనగా నపుడింటికివచ్చి ఏటికొదుర యైన మాఘ మాసమున పూర్ణిమ ముందర రథసప్తమినాడు విఘ్నం

గాకుండా విఘ్నేశ్వరునికి ఉండ్రాళ్లుపోసి సరస్వతీదేవికి చలిడిచేసి ఆయాత్త సూర్య భగవానునికి పాలు పొంగించి ఏడాది కథచెప్పి అక్షింతలుచేసికొని మానెడుసోలెడు బియ్యము పరమాన్నము వండి అడుగు మాడు, పైపక్క పోనతీసికొని బ్రాహ్మణునకు తలంటి నీళ్ళుపోసి గామా దుకట్టబెట్టి బ్రాహ్మణునకు వాయనమిచ్చుకొన్నది. ఆమెనోచిననోము భూమిభూలోకమంతా నోచిరి భక్తి తప్పరాదు ఫలందప్పబోదు కథలోప మయినా వ్రతము లోపము కారాదు. నుడుగుదప్పినా ఫలందప్పరాదు. నారాయణమూర్తీ నీకేనమస్కారము.

## 34 శోకములేని సోమవారముకథ

ఇరుగు శోకం, పొరుగు శోకం, అత్త శోకం, మామశోకం, తల్లి శోకం తండ్రిశోకం, పుత్రుడు శోకం, పురుషుడు శోకం, అనుభవించలేక అడవికిపోయి తపస్సు చేయుచున్నది. పార్వతీ పరమేశ్వరులు భూములు పాలింపవచ్చి యేమమ్మా అలాకూర్చున్నావని యడుగ అయ్యా తీయన్నా రా మీకేమి పొమ్మనగా అర్చేవారము మేమే తీర్చేవారము మేమే చెప్ప వమ్మా అనిరి ఇరుగుశోకం. పొరుగు శోకం, అత్తశోకం, మామశోకం, తల్లి శోకం, తండ్రిశోకం, పుత్రుడు శోకం, పురుషుడు శోకం, అనుభవింప లేక వచ్చితిననగా మునుపటి జన్మాన శోకములేని సోమవారము నోము పట్టి ఉల్లంఘన జేసితివి. మరల పట్టి ఉద్యాపనచేయుమనగా యింటికివచ్చి ఏటికొకదురయిన మాఘమాసాన పూర్ణిమనాముందర రథసప్తమినాడు విఘ్నం గాకుండా విఘ్నేశ్వరునకు ఉండ్రాళ్ళుపోసి, సరస్వతికి చలిమిడిజేసి, ఆయత్తభగవానునకు పాలు పొంగించి ఏడాధి కథ చెప్పుకొని అక్షింతలు జేసికొని అయిదు మానికల బియ్యము పులగమువండి, అడుగుమాడు పై పక్క తాను తీసుకొని ముత్తయిదువుకు తలంటి నీళ్ళుపోసి. చీర, రవిక, నల్లపూసలు, లక్కజోళ్ళు, దక్షిణతాంబూలమిచ్చి వాయనమిచ్చెను. ఆమె నోచిననోము భూలోకమందరు నోచిరి. భక్తిదప్పరాదు ఫలందప్పబోదు. కథలోపమయినా వ్రతలోపము కారాదు. నుడుగుదప్పినా ఫలందప్పరాదు. నారాయణ భగవానుడా నీకే నమస్కారము.



# 35 శ్రీరామనామ రామాయణమ్.

## బాలకాండము.

రఘువంశజ ఘన సీతారామా । రాక్షసకులవిధ్వంసక రామా
సురమునిగణ సంసేవిత రామా । త్రిజగాశ్రిత పరాత్పర రామా
నరవరరూపవిరాజిత రామా । కౌసల్యాప్రియనందన రామా
దశరథనందన రాఘవరామా । విశ్వామిత్ర మఖావన రామా
ఖలమారీచ విదారణ రామా । ఖండితదుర్గుణ తాటక రామా
శపితాహల్యా మోచక రామా । గౌతమ హృదయాకర్షణ రామా
శివధనకార్ముక భంజక రామా । ధృతసీతాంక విరాజిత రామా
మిథిలా తోషణ కారణ రామా । నిర్జితదర్పిత భార్గవ రామా
భీకరశత్రు భయంకర రామా । శ్రీఘనరాజ్యాభూషణ రామా
సీతాహృదయానందక రామా । రామ రామ శ్రీరామా రామ
రామరామ జయ సీతారామ ।

## అయోధ్యాకాండము.

మునివందిత చరణాంబుజ రామా । కాంతాశ్రిత గుణకల్పిత రామా
కైకేయీ వరవంచిత రామా । జనకాజ్ఞాపరిపాలక రామా
సీతాలక్ష్మణ శోభిత రామా । పరమాప్తగుహపూజిత రామా
తాపసవేషధరాంచిత రామా । దండకాటవీసంచారణ రామా
దశరథనృపచింతిత రామా । భారద్వాజానందన రామా
చిత్రకూటనగసుస్థిత రామా । ధృతతాతార్పితపదపాదుక రామా
అత్రిమునిప్రియానందన రామా । రామ రామ శ్రీరామా రామ
రామరామ జయ సీతారామ ।

## అరణ్యకాండము

ఘోరపాపభయనాశన రామా । దుష్టవిరాధ వినాశన రామా
భూరిబాహుబలవిక్రమ రామా । శరభంగాశ్రమసుస్థిత రామా
పుణ్యసుతీక్ష్ణనివసన రామా । మునిజనతోషణకారణ రామా
కుంభజదత్తవరాయుధ రామా । గృధ్రాధిపసంపరిచిత రామా
పంచవటీతటవర్తన రామా । శూర్పణఖానాసికహత రామా
ఖలఖరదూషణసూదన రామా । మాయాహరిణానుసరణ రామా
హతమారీచాసురవర రామా । హృతసీతాన్వేషణగత రామా

గృధ్రాధిపసంసూచితరామా । మత్తకబంధోన్మూలనరామా
శబరీదత్తఫలాశనరామా । పంపాలోకితపావనరామా
రామరామ శ్రీరామారామ । రామరామజయసీతారామా

## కిష్కింధా కాండము

సీతాన్వేషణతత్పరరామా । హనుమత్సేవితపదయుగరామా
సుగ్రీవార్చితనిజకథరామా । సప్తమహీరుహనాశనరామా
ఏకశరాహతశక్రిజరామా । రాజ్యాధిష్ఠితసూర్యజరామా
బలవానరముఖసేవితరామా । వానరదూతప్రేషకరామా
సీతాభూషణతోషితరామా । విజసుబోధితవానరరామా
రామరామజయసీతారామా । రామరామజయసీతారామా

## సుందర కాండము.

కపివరసంతత సేవితరామా । సీతా వనమణి సంస్మృతరామా
సాగరలంఘన పటుభటరామా । లంకా నగరీ నాశనరామా
దూషిత దుష్ట దశాననరామా । భక్తహనూమద్భావితరామా
పరచూడామణి దర్శనరామా । ప్రాప్తాన్వేషణ సత్ఫలరామా
విశ్రుత నిజవర నామకరామా । హనుమద్వచనాశ్వాసితరామా
రామరామ శ్రీరామరామ । రామరామ జయసీతారామ

## యుద్ధకాండము.

కోదండోద్ధృత భుజబలరామా । జడనిధి గర్వనివారకరామా
వారధిబంధన కౌశలరామా । కపిజనసైన్య సమావృతరామా
శరణాగత సువిభీషణరామా । శోషితరాక్షసరంజితరామా
విజితనాగాస్త్రాంచిత రామా । రణనిధనోపస్థితరామా
విదళిత కుంభకర్ణాసురరామా । సంహృతగర్విత రావణరామా
సీతాదర్శన కౌతుకరామా । ప్రాప్తవిభీషణరామా
సీతా శుచిపరిశోధితరామా । అఖిల సుర సుర వందితరామా
దశరథదర్శనరంజితరామా । పుష్పకయానారోహణరామా
అచలసుతావాసప్రదరామ । సాకేతపురీభూషణరామా
అభిషేకోత్సవహర్షితరామా । సర్వలోకనుతసద్గుణరామా

సకలజంతుసంరక్షకరామా । కరుణాసాగరవిలసితరామా
భక్తత్రాణపరాయణరామా । భరతానుజసమ్మోదితరామ
కారణకారణదర్శనరామా శరణాగతరక్షణజయరామా
రామరామశ్రీరామారామ । రామరామజయసీతారామ.

(నందిరాజు చలపతిరావు.)

# శ్రీ వేంకటేశ్వర వ్రతకథ ఫలము.

శ్లో॥ కృతేతు నరసింహో౽భూ త్త్రేతాయాం రఘునందనః ।
ద్వాపరే వాసుదేవశ్చ కలౌ వేంకటనాయకః ॥

ఆదిత్యపురాణము

కృతయుగంబున నరసింహ మూర్తిగాను త్రేతాయుగంబున శ్రీరామమూర్తిగాను ద్వాపరయుగంబున కృష్ణమూర్తిగాను కలియుగంబున వేంకటేశ్వరుఁడుగాను భగవంతుడు వెలసెను

శ్లో॥ కృతే సేనాపతి స్కంద స్త్రేతాయాంతు కుమారకః ।
సుబ్రహ్మణ్యో ద్వాపరేతు కలౌ వేంకటనాయకః ॥

స్కాంద పురాణము.

కార్తికేయుండు కృతయుగంబున స్కంద రూపంబు గాను త్రేతాయుగంబున కుమారస్వామి రూపంబుగాను ద్వాపరయుగంబున సుబ్రహ్మణ్య రూపంబుగాను కలి యుగంబున వేంకటేశ్వరుఁడుగాను సేనాపతియై యవతరించెను.

శ్లో॥ కలౌ కుమారరూపేణ షణ్ముఖో భగవాన్ హరిః ।
దృశ్య ఏకముఖేనైవ వేంకటాచలనాయకః ॥

మార్కండేయ పురాణము.

విష్ణువు దేవలోకంబునఁ బూర్వకాలమం దాఱుముఖములుగల కుమారస్వామి రూపంబునా నవతరించి యిప్పుడు కలియుగంబున భూలోకమందు వేంకటాచలమను పుణ్యక్షేత్రమునకుఁ బ్రభువయి నొక ముఖము గలవాఁడై వెలసెను.

శ్లో॥ శేషశైల శిరోరత్నం సమస్త సురసేవితమ్।
ఆవిర్భూతం శివస్థానే కోటికందర్ప సుందరమ్ ॥
లవలీ దేవసేనాఖ్య శ్రీభూసహచరం హరిమ్ ।
సుబ్రహ్మణ్యం సమాసేవ్యం కలిదోషనికృంతనమ్ ॥
సౌభాగ్యదాయకం విష్ణుం వేంకటేశం సమర్చయ ॥

వేంకటాచలమునకు చూడామణియైన వాఁడును సమస్తమైన దేవతలచేఁ సేవింపఁ బడువాఁడును శివస్థలంబు నావిర్భవించిన వాఁడును అనేక మన్మథులతో సమానమైన సౌందర్యము గలవాఁడును లవంగీదేవసేన శ్రీదేవి భూదేవు యను స్త్రీలకు భర్తయైనవాడును భక్తులపాపములను హరించువాఁడును సుబ్రహ్మణ్య స్వరూపుఁడను అంతటిచే స్తోత్రము చేయఁ బడఁదగినవాఁడును కలియుగంబున సంభవించెడు దోషములను బోగొట్టు వాఁడును సమస్తైశ్వర్యముల నిచ్చువాఁడును విష్ణువునగు వేంకటేశ్వరుని బూజింపుము.

శ్లో॥ శనివారే సముభ్యర్చ్య వేంకటేశం విశేషతః।
షష్టివ్రతసహస్రస్య ఫలమాప్నోతి మానవః ॥

వేంకటేశ్వరుని శనివారంబున పూజించిన మనుష్య డరువదివేల వ్రతముల ఫలమును బొందుచున్నాఁడు.

శ్లో॥ సింహే రవౌ శనే ర్వారే శేషాద్రిశిఖరోపరి ।
స్వామి పుష్కరిణీ తీరే పూజ్య శ్రీ వేంకటేశ్వరః ॥

సూర్యుఁడు సింహరాశిగతుఁడగు చుండఁగా వచ్చిన శనివారంబున తిరుపతి పర్వత శిఖరంబున నుండు పుష్కరణీ తీరమందు వెలసి యున్న వేంకటేశ్వరస్వామి పూజార్హుఁడు.

శ్లో॥ ఏకభక్తవ్రతం కుర్యాద్యత్నా శ్రీ వేంకటప్రియమ్ ।
ఏకవారాత్సమాప్నోతి షష్టిశత భవం ఫలమ్ ॥

తా॥ శనివారంబున వేంకటేశ్వరునికి ప్రీతికరమైన యేకభుక్తవ్రత మనఁగా నొకసారి భుజించుట నాచరింపవలెను. ఈ ప్రకారంబుఁగా నొకపర్యాయము వ్రతము చేసిన మనుష్యుఁడు అఱువదివందల వ్రతములవలన గలుగు ఫలమును బొందుచున్నాఁడు.

## పూజావిధానము.

ఓం శేషశైల పతయేనమః ఓం శేషాయనమః
ఓం శేషిశేనమః ఓం శేషవిభూషణాయనమః

ఓం శేషశాయినేనమః ఓం కుమారాయనమః
ఓం సుబ్రహ్మణ్యాయనమః ఓం పరాయణాయనమః
ఓం వేంకటాచలనాథాయనమః ఓం వేంకటాయనమః
ఓం కలితారకాయనమః ఓం శివక్షేత్రప్రపన్నాయనమః
ఓం శ్రీమతేనమః ఓం పుష్కరిణీతీరయేనమః
ఓం లోకేశ్వరాయనమః ఓం ధనపతయేనమః
ఓం విష్ణవేనమః ఓం సర్వేశ్వరేశ్వరాయనమః
ఓం కల్యాణగుణపూర్ణాయనమః ఓం కాంక్షితార్థ ప్రదాయకాయనమః
ఓం లవలీదేవసేనాఖ్యాయనమః ఓం శ్రీభూసహచరాయనమః
ఓం శ్రీవేంకటేశ్వరాయనమః ఓం ప్రత్యక్షదేవతాయనమః
ఓం మ్లేచ్ఛ రాజనుతో ద్వారరక్షితాపిః మండలాయనమః
ఓం మహిమోదయమూలాయనమః ఓం దేవాయనమః
ఓం పతితపావనాయనమః ఓం నృసింహ సేవానిరతాయనమః
ఓం నరాపద్వినివారకాయనమః ఓం పురాణపురుషాయనమః
ఓం ఆరాధకజనరక్షకాయనమః

ద్వాత్రింశన్నామకస్సనసభిర్నామభిర్భక్త్యా ప్రణవాద్యైర్నమోంతకైః ।తద్వత్పురుషసూక్తేన పూజయేద్వేంకటేశ్వరమ్॥

ఇట్టి నామంబులచేతను ఆప్రకారంబుగనే పురుషసూక్తము చేతను వెంకటేశ్వరుని పూజింపవలయును.

శ్లో॥ బ్రాహ్మణం భోజయేద్భక్త్యా దద్యాచ్చిత్రాన్నదక్షిణాః ।
ఏకభుక్తం ప్రకుర్వీత హరిధ్యానపరాయణః॥

బ్రాహ్మణునకు షడ్రసోపేతముగా భక్తితో నన్నం బిడి దక్షిణల నొసంగి భగవద్ధ్యాన మందాసక్తుడై యాదినంబున ఏకభుక్తము చేయవలయును.

శ్లో॥ కథాంశ్రుత్వాహరింస్మృత్వా సర్వపాపైః ప్రముచ్యతే ।
కలౌ సర్వాపద స్తీర్త్వా సర్వేష్టార్థానవాప్నుయాత్॥

భగవంతునికథ విని హరిని స్మరించి సమస్త పాపములఁ బోగొట్టుకొని సర్వకష్టముల దాటి కలియుగంబున సర్వములైన యిష్టార్థములను భక్తుఁడు పొందుచున్నాఁడు.

శ్లో॥ వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి ।
శనివారవ్రతే నైవ సుప్రసన్నో భవే న్నృణామ్॥

వేంకటేశ్వరునితో సమానమైన దేవుండు లేఁడు కలుగఁబోఁడు.

కావున నా దేవుఁడు శనివార వ్రతము చేతనే మనుష్యులకుఁ బ్రత్యక్షము కాఁగలడు.

శనివారంబునఁ బూజించి యొక పూట భుజించుటను గురించి చెప్పుచున్నాడు.

శ్లో॥ భగవన్ భగవాన్ విష్ణుః కలావారాధ్యతే కథం।
కుత్రాస్తే కీదృశీ తాత సర్వదేవమయీ కలా॥

నారదః

ఓభగవానుఁడా! భగవంతుఁడగు విష్ణువు కలియుగంబున నేరీతిపూజింపబడుచున్నాఁడు. సర్వదేవతాస్వరూపమైన యావిష్ణు సంబంధమగు కళ యెట్టి స్వరూపముతో నెచ్చటనున్నదో జెప్పుమని నారదుఁడు బ్రహ్మ నడిగెను.

శ్లో॥ శేషాద్రిశిఖరే నత్స వేంకటేశ్వరరూపిణీ।
కలౌ బ్రహ్మణ్యదేవస్య కలా విష్ణోర్విరాజతే॥

బ్రహ్మ చెప్పుచున్నాడు. కలియుగంబున కుమారస్వామి యొక్కయు విష్ణువు యొక్కయు కళ వేంకటేశ్వరుని స్వరూపముగలిగి తిరుపతి కొండయందు వెలసియున్నది

శ్లో॥ హతాః ప్రతికలం మర్త్యాః సంకటైస్సంస్కృతానరాః।
వేంకటేశప్రసాదేన ముచ్యంతే నాఽత్రసంశయః॥

కలియుగంబున ప్రతి క్షణంబునఁ విశేష కష్టంబులచేఁ బీడింపబడుచున్న మనుష్యులు వెంకటేశ్వరుని యనుగ్రహముచే ముక్తిని బొందగలరు ఈ విషయమై సందేహములేదు.

శ్లో॥ కల్పవృక్షసమా యత్ర తరవో వేంకటాచలే।
చింతామణిశ్చ పాషాణాః క్రిమిచ్చ దివిషత్సమః॥

ఆతిరుపతి కొండయందుండు వృక్షములన్నియు కల్పవృక్షములతో సమానమైనవి. అక్కడనుండుశిలలు చింతామణితో సమానమైనవి, అక్కడజనియించినపురుగైనను దేవలతతో సమానమైనది.

శ్లో॥ శ్రీవేంకటేశకృపాయా దరిద్రోఽపి ధనీ భవేత్।
మూకో వాచాలతాం యాతి పంగురారోహతిస్వయమ్।
అంతర్వర్త్నిభవే ద్వంధ్యా రోగస్యా ద్దృఢకాయవాన్।
అంధః పశ్యతి దేవేశం లబ్ధ స్సర్వం ప్రణాశ్యతి॥
సకృజ్జపేన సిద్ధ్యంతి సర్వే మంత్రా నసంశయః।
వర్తంతే దేవతా స్సర్వా స్సేవితుం వేంకటేశ్వరమ్॥

వేంకటేశ్వరునియను గ్రహాముచే దరిద్రుఁడు ధనవంతుఁడగును. మూగవాఁడు మాటలాడును. కుంటివాఁడు తనంతటనే కొండనెక్కఁగలను. గొడ్డురాలు గర్భిణి యగును రోగములవాఁడు బలిష్ఠమైన దేహముగలవాఁడగును. గ్రుడ్డివాఁడు భగవంతునిజాడఁగలడు లోభివిశేషముగా ధర్మముచేయువాఁడగును. ఆయనననొకసారి జపించిన సమస్తశాంత్రములు సిద్ధినిఁ బొందగలవు సందేహాలేదు సమస్తమైన దేవతలు వెంకటేశ్వరుని సేవించుటకు నక్కడ నదృశ్యులై యుండుదురు.

శ్లో॥ సేనానీ షణ్ముఖశ్చాఽపి విష్ణు ర్లక్ష్మీపతిస్స్వయమ్।
ఉభౌ శంభుం సమారాధ్య తత్ర వేంకటభూధరే ॥
సంగతా వేకభావేన సర్వభూతవరప్రదా ॥

ఆఱు ముఖములు గల కుమారస్వామియు లక్ష్మీదేవికిఁ బెనిమిటి యగువిష్ణువు లిద్దఱును సాంబమూర్తిని సేవించి సర్వభూతములకు వరములనిచ్చువారలై కలసి యైక్యముఁజెంది తిరుపతికొండయందు వెలసియుందురు.

శ్లో॥ విష్ణు స్కందాత్మికామూర్తిః వేంకటేశ్వరరూపిణీ
సర్వదేవమయీశక్తిః పూజ్యతాం సర్వమానవైః ॥

విష్ణు కుమారస్వాముల సంబంధించిన వేంకటేశ్వర స్వరూపమై సర్వదేవతాస్వరూపమైనశక్తి అందఱచేఁ బూజింపఁబడదగినది.

శ్లో॥ యత్ర శైలే పురా శంభు స్తపస్తప్త్వా ఽతిదుష్కరమ్।
నృసింహంతోషయామాస తావుభౌ తత్ర సంస్థితౌ ॥

పూర్వమందే పర్వతమున ఈశ్వరుని యంశా సంభూతుఁడగు కుమారస్వామి మిక్కుటమగు తపస్సుచేసి విష్ణువునుసంతోషపెట్టెనో నాకుమారస్వామియు విష్ణువు నిద్దఱును ఈపర్వతంబున వెలసియుండిరి.

శ్లో॥ యత్ర వ్యాధాశ్చ చోరాశ్చ పతితాః పామరా అపి।
తేసర్వే ముక్తిమాయాంతి వేంకటేశ్వరపూజయా॥

ఆపర్వతమందుండు కిరాతకులు, దొంగలు, వర్ణసంకరులు అజ్ఞానులు మొదలగుహీనులైనను భక్తితో వేంకటేశ్వరుని సేవించి పునరావృత్తి రహితమైన పదమును బొందుదురు.

శ్లో॥ వేంకటాచలనామేదం వింధ్యశైలశిరో మహాత్।
సాష్టాంగంప్రణతః పూర్వం కుంభజాయ మహార్షయే ॥
అద్యాఽపి దృశ్యతే తద్వ దత్ర సంతి సురేశ్వరాః ॥

వెంకటాచల మనుపేరుగల గొప్పదియగు వింధ్యపర్వత శిఖరము పూర్వకాలంబున గొప్పమునీశ్వరుండైనయగస్త్యులవారికి సాష్టాంగముగా

నమస్కరించినట్లె స్ఫటికిని నగపడుచున్నది. ఇక్కడ దేవతలందఱు నివసించుచుయుందురు.

శ్లో॥ రాఘవశ్చ నృసింహశ్చ సర్వే దేవా మహర్షయః। నిధీనామపి సిద్ధానాం స్థాన మత్ర ప్రకీర్తితమ్ ॥

ఇక్కడ శ్రీరాముడు, నృసింహమూర్తి సమస్తమైన దేవతలు మునీశ్వరులు వెలసి యుందురనియు, నవనిధులకు సిద్ధులకు నిది స్థానమనియుఁ జెప్పఁబడెను.

శ్లో॥ కలిదోషవినాశార్థం భక్తసంరక్షణాయచ।
పామరాన్ పతితాదీంశ్చ ప్రపన్నాన్ శరణాగతాన్ ॥
ప్రత్యక్ష వరదానేన రక్షితుం భగవాన్ హరిః।
స్వామి పుష్కరిణీతీరే రమయా సహ మోదతే ॥

భగవంతుండును విష్ణుస్వరూపుఁడునగు వెంకటేశ్వరస్వామి కలివల్లఁ గలుగు దోషములను నశింపఁజేయుటకొఱకును తత్తీరమందు భక్తులను సంరక్షించుటకొఱకును పంకరులకును భక్తిగలవారికిని శరణు కోరినవారికిని ప్రత్యక్షముగా వరములిచ్చి రక్షించుటకును పుష్కరిణీతీరమందు లక్ష్మితోఁగూడ వెలసి యభినందించుచున్నాడు.

శ్లో॥ సర్వక్షేత్రేషు తీర్థేషు కలౌ ప్రాయో భవేత్కలా।
న తథాస్య మహాచ్ఛాయా న ప్రత్యక్షఫలోదయః ॥

కలియుగంబున నన్ని క్షేత్రములయందు తీర్థములయందు నుండు కళతగ్గి మహిమకలవైయుండవు. ప్రత్యక్షమైన ఫలములను గలుగఁజేయవు.

శ్లో॥ సుబ్రహ్మణ్యో వేంకటాద్రి క్షేత్రయో రుభయోరపి।
కదాపినలకలాహ్రాస స్సర్వదా వ్యాద్భుతోచ్ఛ్రయః ॥

సుబ్రహ్మణ్యము వేంకటాచల మను రెండు క్షేత్రములయందు నెప్పుడును కళతగ్గిపోక యెల్లప్పుడు మహిమాతిశయము కలవైయుండును.

శ్లో॥ సుబ్రహ్మణ్యే కుమారాఖ్యా విష్ణ్వాఖ్యా వేంకటాచలే।
శేష శేషికలా బ్రహ్మోర్ధ్వచైతన్యరూపిణీ

సుబ్రహ్మణ్యక్షేత్రమందు కుమారస్వామియను పేరుగల యాదిశేషుని కళయు వెంకటాచలంబున విష్ణువుయను పేరుగల శేషశాయికళయు బ్రహ్మసంబంధమగు సమస్త చైతన్య స్వరూపముగా బ్రకాశించుచున్నవి.

శ్లో॥ శ్రీవెంకటేశరూపేణ కలౌ ప్రత్యక్షదర్శనా।
ప్రవర్తే కలివారేషు సా విశేష ప్రసాదినీ ॥

అటువంటికలి కలియుగంబున వెంకటేశ్వరుని రూపముకలిగి విశేషముగా ఫలము నిచ్చుచున్నది. శ్రావణశనివారములయందు మిక్కిలి యనుగ్రహముకలది యగుచున్నది.

శ్లో॥ సర్వదాఽపిశనేర్వారే భక్తేష్టార్థప్రదాయినీ॥

ఎప్పుడైనను శనివారంబున బూజించినభక్తులకు సమస్తకోరికల నిచ్చుచున్నది.

శ్లో॥ ఏకభుక్తేనయో భుక్త్వా శనివారే దృఢవ్రతః।
వేంకటేశం సమభ్యర్చ్య తోషయేద్విష్ణు మవ్యయమ్॥
సర్వేష్టా నవాప్నోతి సత్యమేవ నసంశయః॥

ఏ మనుష్యుఁడు దృఢమైన వ్రతముతో భక్తితో వెంకటేశ్వరుని బూజించి యొకపూట భుజించి నాశనరహితుండైన విష్ణువును సంతోష పెట్టుచున్నాడో యాపురుషుఁడు సమస్తకోరికలను సత్యఫలమునకే బొందుచున్నాఁడు. సందేహములేదు.

శ్లో॥ సర్వదేవార్చనం కృత్వా తత్ఫలం లభతే నరః
ఏకేన శనివారేణ తత్ఫలం సర్వ మాప్నుయాత్।
ఇదం కలియుగే ముఖ్యం సత్యంసత్యం న సంశయః॥

మనుష్యుఁడు సమస్తదేవతల బూజించి ఏఫలమును బొందుచున్నాడో ఒక శనివారంబున వెంకటేశ్వరుని బూజించిన ఆఫలమునంతయుఁ బొందగలఁడు. ఈ వ్రతము కలియుగంబున ముఖ్యముగా ఫలమునిచ్చుచున్నది. ముమ్మాటికి సత్యము సందేహము లేదు.

ఈ కలియుగంబున సమస్త వర్ణములవారు శ్రీ వేంకటేశ్వరులను ప్రతి శనివారము పూజించుచున్నారు. ఆ పూజ యథావిధిగా చేసికొనుటకై యీ పూజావిధానము ప్రకార మాచరింపవలయును.

# శ్రీ వేంకటేశ్వర పూజా, దీపారాధనము.

శ్లో॥ శుక్లాంబర ధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ । ప్రసన్నవదనమ్ ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే॥.. ఆచమ్య ..గుణ...విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ గోత్రః నామధేయః శ్రీమతః... గోత్రస్య .. నామధేయస్య... మమధర్మపత్నీ సమేతస్య .. సహకుటుంబస్య సబాంధవస్య క్షేమస్థైర్య విజయాఽఽయు రారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం మనోభీష్ట సిద్ధ్యర్థం శ్రీ అలివేలు మంగాసమేత శ్రీ వేంకటేశ్వర ముద్దిశ్య... శ్రీ వేంకటేశ్వర ప్రీత్యర్థం శ్రీ అలివేలు మంగాసమేత శ్రీ వేంకటేశ్వర పూజాం కరిష్యే॥ ఆదౌ గణపతి పూజాంకరిష్యే (ముందుగా గణపతిని పూజించి) అథవిధి ప్రకారేణ గణపతి పూజాంచ కృత్వా (విధిప్రకారము గణపతిపూజచేసి) పునస్సంకల్ప్య॥... యథాశక్త్యాఽఖండ దీపారాధనం కరిష్యే॥ మం॥ ఉద్దీప్యస్వ జాతవేదోఽపఘ్నన్నిర్ ఋతింమమ । పశూగ్శ్చమహ్యమావహ జీవనంచ దిశోదిశ ॥ జ్యోతిష్మంతం త్వా సాదయామి సర్వస్మైస్వాహా॥ ధ్యాన॥ శాంతాకారం... నాథమ్॥ శ్రీ గోవింద శ్రీగోవింద శ్రీగోవింద ఇతిప్రణమ్యపునః ఆచమ్య .. ... శ్రీ వేంకటేశ్వర పూజాం కరిష్యే॥ తదంగ కలశారాధనంకరిష్యే॥ శ్లో॥కలశస్యముఖే... సమాశ్రితా॥

ఆపోవా ఇదగ్ం... రాపఃఓం॥ శ్లో॥ గంగేచయమునే .. కురు॥ ఆయాంతు మమదురితక్షయ కారకాః పూజా ద్రవ్యాణి దేవ మాత్మాంచ సంప్రోక్ష్య॥

ఈగణపతి పూజవిధానము రెండవ భాగమునందు సంపూర్ణముగానున్నది చూడవలెను.

తగపీఠార్చనంకుర్యాత్॥ 1 ఆధారశక్త్యైనమః 2 మూలప్రకృత్యై నమః 3 మత్స్యాయనమః 4 కూర్మాయనమః 5 అనంతాయనమః 6 శేషాయనమః 7 గరుడాయనమః 8 పూర్వద్వారే ద్వారశ్రియైనమః 9 ధాత్రేనమః 10 విధాత్రేనమః 11 దక్షిణద్వారే ద్వారశ్రియైనమః 12 చండాయనమః 13 ప్రచండాయనమః 14 పశ్చిమద్వారే ద్వారశ్రియైనమః 15 జయాయనమః 16 విజయాయనమః 17 ఉత్తరద్వారే ద్వారశ్రియైనమః 18 బలాయనమః 19 ప్రబలాయనమః 20 విద్యాశక్త్యైనమః 12మాయా

శక్త్యైనమః 22 గంగాయైనమః23యమునాయైనమః24 దిగ్గజేభ్యోనమః 25 కేసరేభ్యోనమః 26 తన్మధ్యే శ్వేత దీపాయనమః 27 శ్వేతద్వీపమధ్యే వేదికాయైనమః 28 వేదికామధ్యే కల్ప వృక్షాయనమః 29 కల్పవృక్షస్యా ధస్తా ద్రత్నసింహాసనాయనమః 30 తన్మధ్యే శ్రీ వేంకటేశ్వరాయనమః ॥

## ధ్యానము.

ధ్యానమ్ ॥ శ్లో॥ శాన్తాకారం భుజగ శయనం పద్మనాభంసురేశం। విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం। లక్ష్మీకాన్తం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం। వందేవిష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం॥ సహస్రశీర్షేత్యావాహనమ్॥ సహస్రశీర్షాపురుషః। సహస్రాక్షస్సహస్రపాత్। సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ దశాంగులమ్॥ శ్లో॥ జ్యోతిశ్శాన్తం సర్వలోకాంతరస్థ। మోంకారాఖ్యం యోగిహృద్ధ్యానగమ్యం సాంగం శక్తిం సాయుధం భక్తసేవ్యం। సర్వాకారం విష్ణుమావాహయామి॥ శ్రీ అలివేలు మంగాసమేత శ్రీ వేంకటేశ్వర స్వామినేనమః ఆవాహనం సమర్పయామి ॥ పురుష ఏ వేత్యాసనమ్ ॥ పురుష ఏవేదగ్ం సర్వంయ ద్భూతం యచ్చ భవ్యం। ఉతామృతత్వ స్యేశానః। యదన్నే నాతిరోహతి॥ శ్లో॥ కల్పద్రుమూలే మణివేది మధ్యే సింహాసన స్స్వర్ణమయం సురత్న। విచిత్రవస్త్రావృత మచ్యుతప్రభో। గృహాణ లక్ష్మీ ధరణీసమన్విత॥ ఆసనం॥ ఏతావానస్యేతి పాద్యం॥ ఏతావా నస్యమహిమా। అతో జ్యాయాగ్ శ్చపూరుషః పాదోఽస్య విశ్వాభూతాని। త్రిపాదస్యామృతం దివి॥ శ్లో॥ శ్రీకృష్ణ స్సర్వదేవానా మధిక స్సర్వకామదః। మయా నివేదితం భక్త్యా సంగృహాణ సుపాద్యకమ్॥ పాద్యం॥ త్రిపాదూర్ధ్వ ఇత్యర్ఘ్యమ్॥ త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః। పాదోఽస్యేహాభవా త్పునః। తతో విష్వఙ్వ్యక్రామత్ సాశనానశనే అభి॥ శ్లో॥ గంగాజలం సమానీతం సువర్ణ కలశేస్థితం। అర్ఘ్యం గృహాణభగవాన్ కాలరూపనమోఽస్తుతే॥ అర్ఘ్యం॥ తస్మాద్విరాడిత్యాచమనమ్॥ తస్మాద్విరాడజాయత। విరాజో అధి పూరుషః। సంజాతో అత్యరిచ్యత। పశ్చాద్భూమి మధోపురః॥ శ్లో॥ జనార్దనాయ దేవాయసమస్తజగదాత్మనే। నిర్మలజ్ఞాన రూపాయ దత్తమాచమ నీయకమ్॥ ఆచమనీయమ్॥ యత్పురుషేణేతి మధుపర్కం॥ యత్పురుషేణ హవిషా। దేవాయజ్ఞ మతన్వత। వసన్తో అస్యాసీ దాజ్యమ్। గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః॥ శ్లో॥ మధ్వాజ్యదధి సంయుక్తం స్వర్ణపాత్రే ప్రతిష్ఠితం। మధుపర్కం గృహాణ

త్వంలక్ష్మీకాంత నమోఽస్తుతే॥ మధుపర్కం। సప్తాస్యాసన్నితిస్నానమ్॥ సప్తాస్యాసన్పరిధయః। త్రిస్సప్త సమిధః కృతాః। దేవాయ ద్యజ్ఞం తన్వానాః అబధ్నన్పురుషం పశుమ్॥ శ్లో॥ తీర్థోక్తైః కాంచనకుంభసంస్థైస్సువాసితై ర్దేవకృపారసార్ద్రైః। మయాఽర్పితం స్నానవిధిం గృహాణ పాదాబ్జనిష్ఠ్యూతనదీప్రవాహ॥ స్నానమ్॥ తం యజ్ఞమితి వస్త్రమ్॥ తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్। పురుషంజాత మగ్రతః। తేన దేవా అయజన్తసాధ్యాఋషయశ్చయే॥ శ్లో॥ స్వర్ణాంచలం స్వర్ణవిచిత్రశోభితం కౌశేయయుగ్మం పరికల్పితం మయా। దామోదర ప్రావరణం గృహాణ మాయాచలప్రాకృతదివ్యరూప॥ వస్త్రం॥ తస్మాద్యజ్ఞా దితి యజ్ఞోపవీతమ్॥ తస్మాద్యజ్ఞాత్సర్వహుతః। సంభృతం పృషదాజ్యమ్॥ పశూగ్ స్తాగ్ శ్చక్రే వాయవ్యాన్। ఆరణ్యాన్ గ్రామాశ్చయే॥ శ్లో॥ సువర్ణతంతూద్భవ యజ్ఞసూత్రం ముక్తాఫలస్యూత మనేకరత్నమ్। గృహాణ తద్వత్క్రమ ముత్తరీయం స్వకర్మసూత్రం ధరతే నమోఽస్తు॥ తస్మాద్యజ్ఞా దితిగంధం॥ తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచస్సామాని జజ్ఞిరే। ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్। యజు స్తస్మాదజాయత॥ శ్లో॥ కస్తూరికాకర్దమచందనాని కాశ్మీరసంయోజితగంధసారైః। విలేపనం స్వీకురు దేవదేవ శ్రీదేవి వక్షోజవిలేపనాంగ గంధం॥ తస్మా దశ్వా ఇతిపుష్పమ్॥ తస్మాదశ్వా అజాయంత। యేకే చోభయాదతః। గావో హజజ్ఞిరే తస్మాత్ తస్మాజ్జాతా అజావయః। శ్లో॥ చాంపేయకావకుళచంపకపాటలాబ్జ పున్నాగజాతికరవీరరసాలపుష్పైః। బిల్వప్రవాళ తులసీదళ మల్లికాభిః త్వాంపూజయామి జగదీశ్వర వాసుదేవ॥ శ్లో॥ ఆరామపుష్పాణి మనోహరాణి జలాశయస్థాని సుపల్లవాని। సువర్ణపుష్పాణి మయార్పితాని గృహాణ శ్రీవత్సధర ప్రసీద॥ శ్లో॥ కనపైర్జాదికుసుమైశ్చంపకైర్వకుళైశ్శుభైః। శతపత్రైశ్చ కల్హారై రర్చయేత్పురుషోత్తమ॥ పుష్పం॥ శ్లో॥ కేయూరకటకైశ్చైవహారైశ్చిత్రాంగుళీయకైః। మాణిక్యోల్లాసిమకుటంకుండలే హారశోభితమ్॥ శ్లో॥ బాహూ నాయకరత్నంచనూపురౌ పాదపద్మయోః। అంగుళీముద్రికాశ్చైవ గృహ్యంతా మస్మదర్పితా॥ అథరణం॥ శ్రీవేంకటేశ్వరాఽష్టోత్తరశతనామావళిపూజాంకరిష్యే॥

శ్రీ వేంకటేశ్వరాకృతిని గోడపై చిత్రించిగాని, శ్రీ వేంకటేశ్వరప్రతిమను పెట్టిగాని, అక్షతలతో గాని, పుష్పములతో గాని, ఈ క్రిందిచెప్పబోవు నామములను చెప్పుచు పూజచేయవలయును. ప్రతినామమునకు మొదట ఓం అనియును చివరనమః అనియును చెప్పుచుండవలయును.

## శ్రీ వేంకటేశ్వరాష్టోత్తరశతనామావళిః

ఓం శ్రీ వేంకటేశాయనమః
శ్రీనివాసాయ
లక్ష్మీపతయే
అనామయాయ
అమృతాంశాయ
జగద్వంద్యాయ
గోవిందాయ
శాశ్వతాయ
ప్రభవే
శేషాద్రినిలయాయ
దేవాయ
కేశవాయ
మధుసూదనాయ
అమృతాయ
మాధవాయ
కృష్ణాయ, శ్రీహరయే
జ్ఞానపంజరాయ
శ్రీవత్సవక్షసే
సర్వేశాయ
గోపాలాయ
పురుషోత్తమాయ
గోపీశ్వరాయ
పరంజ్యోతిషే
వైకుంఠపతయే
అవ్యయాయ
సుధాతనవే
యాదవేంద్రాయ
నిత్యయౌవనరూపవతే
చతుర్వేదాత్మకాయ
విష్ణవే అచ్యుతాయ
పద్మినీప్రియాయ
ధరాపతయే
సురపతయే, నిర్మలాయ
దేవపూజితాయ
చతుర్భుజాయ
చక్రధరాయ
ధాత్రిమ్నే
త్రిగుణాశ్రయాయ
నిర్వికల్పాయ
నిష్కళంకాయ
నిరాతంకాయ
నిరంజనాయనమః
నిరాభాసాయ
నిత్యతృప్తాయ
నిర్గుణాయ
నిరుపద్రవాయ
గదాధరాయ
శార్ఙ్గపాణయే
నందకినే
శంఖధారకాయ
అనేకమూర్తయే
అవ్యక్తాయ
కటిహస్తాయ
వరప్రదాయ
అనేకాత్మనే
దీనబంధవే
ఆర్తలోకాభయప్రదాయ
ఆకాశరాజవరదాయ
యోగిహృత్పద్మమందిరాయ
దామోదరాయ

జగత్పాలాయ, పాపఘ్నాయ
భక్తవత్సలాయ, త్రివిక్రమాయ
శింశుమారాయ
జటామకుటశోభితాయ
శంఖమధ్యోల్లసన్మంజులాయ
కింకిణ్యాఢ్యకరండకాయ
నీలమేఘశ్యామతనవే
బిల్వపత్రార్చనప్రియాయ
జగద్వ్యాపినే, జగత్కర్త్రే
జగత్సాక్షిణే, జగత్పతయే
చింతితార్థప్రదాయ
జిష్ణవే, దాశార్హాయ
దశరూపవతే, దేవకీనందనాయ
శౌరయే। హయగ్రీవాయ
జనార్దనాయ
కన్యాశ్రవణతారేజ్యాయ
పీతాంబరధరాయ
అనఘాయనమః॥ వనమాలినే
పద్మనాభాయ
మృగయాసక్తమానసాయనమః
అశ్వారూఢాయ, ఖడ్గధారిణే
ధనార్జనసముత్సుకాయ
ఘనసారలసన్మధ్యకస్తూరీ
తిలకోజ్జ్వలాయ, సచ్చిదానందరూపాయ
జగన్మంగళదాయకాయ
యజ్ఞరూపాయ
యజ్ఞభోక్త్రే, చిన్మయాయ
పరమేశ్వరాయ
పరమార్థప్రదాయ, శాంతాయ
శ్రీమతే, దోర్దండవిక్రమాయ
పరాత్పరాయ పరబ్రహ్మణే
శ్రీవిభవేనమః॥ జగదీశ్వరాయనమః

యత్పురుష మితి ధూపం॥ యత్పురుషం వ్యదధుః। కతిధావ్యకల్పయన్। ముఖం కిమస్య కౌ బాహూ। కావూరూపాదా ఉచ్యేతే॥ శ్లో॥ శ్రీకుండలాఖ్యరసకం దివ్య కర్పూరకాలాగరు చందనాని। ఖచోరకృష్ణాగరుదేవదారు మహీయతే స్నేహపూతి కశ్చ। ధూపః॥ బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్। బాహూ రాజన్యః కృతః। ఊరూతదస్య యద్వైశ్యః। పద్భ్యాగ్ం శూద్రో అజాయత॥ శ్లో॥ సూర్యేందుకోటిప్రభ వాసుదేవ। నవనీతగోఘృతవర్తియుక్తం। స్వమయయాం ధీకృతసర్వలోక జ్ఞానప్రదీపం కురుతే నమోఽస్తు॥ దీపం॥ చంద్రమా మనసేతి నైవేద్యం॥ చంద్రమా మనసో జాతః। చక్షోః సూర్యో అజాయత। ముఖాదింద్రశ్చాగ్నిశ్చ। ప్రాణాద్వాయురజాయత॥ ఓమ్ భూర్భువస్సువః...॥ సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు। అమృతోపస్తరణమసి॥ శ్లో॥ సౌవర్ణస్థాలిమధ్యే మణిగణఖచితే గోఘృతాక్తాన్ సుపక్వాన్ భక్ష్యాన్భోజ్యాంశ్చలేహ్యానపరిమితరసాన్ చోష్యమన్నం నిధాయ। నానాశాకైరుపేతం దధిమధుసగుడక్షీరపానీయయుక్తం తాంబూలం చాపి విష్ణోః ప్రతిదినమహం మానసే కల్పయామి। ఓం ప్రాణాయ స్వాహా...ఓం సమానాయ స్వాహా॥ నాభ్యా ఆసీదితి తాంబూలమ్॥ నాభ్యా ఆసీదంతరిక్షం శ్రీవిష్ణో

ద్యౌ స్సమవర్తత । పద్భ్యాం భూమి ర్దిశశ్శ్రోత్రాత్ । తథాలోకాగ్ం అకల్పయన్॥ పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీదళై ర్యుతం । ముక్తా చూర్ణసమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్। తాంబూలం॥ వేదాహమేతమితి నీరాజనమ్॥ వేదాహ మేతం పురుషం మహాంతం ।. ఆదిత్యవర్ణం తమసస్తుపారే । సర్వాణి రూపాణి విచిత్య ధీరః । నామాని కృత్వాఽభివదన్ యదాస్తే॥ సర్వప్రజాం మేగోపాయ । అమృత్వాయ జీవసే । జాతాం జనిష్యమాణాంచ । అమృతే సత్యే ప్రతిష్ఠితాం । అథర్వ పితుం మేగోపాయ । రసమన్నమిహాయుషే । అదబ్ధాయో౽శీతతనో । అవిషం నః పితుం కృణు శర్గ్స్యంశూన్మే గోపాయ । ద్విపాద్యే చతుష్పదః అష్టాశఫాశ్చయ ఇహాగ్నే । యేచైకశఫా ఆశుగాః । సప్రథ సభాం మేగోపాయ । యేచ సభ్యాస్సభాసదః । తానింద్రియావతః కురు । సర్వమాయురుపాసతాం । అహే బుధ్నియ మంత్రం మేగోపాయ । యమృషయ స్త్రైవిదావిదుః । ఋచస్సామాని యజూగ్ంషి । సాహి శ్రీరమృతా సతాం॥ మాతోహిగ్ంసీ జ్ఞాతవేదో గామశ్వం పురుషం జగత్ । అబిభ్రదగ్న ఆగహి శ్రియామా పరిపాతయ । సమ్రాజం చవిరాజం చాభి శ్రీర్యాచ నోగృహే లక్ష్మీ రాష్ట్రస్య యాముఖే తయా మాసగ్ంసృజామసి॥ సంతత శ్రీరస్తు సమస్తమంగళాని భవంతు॥ నిత్య శ్రీరస్తు । నిత్యమంగళానిభవంతు। ధాతా పురస్తాదితి మంత్రపుష్పమ్॥ ధాతా పురస్తాద్య ముదాజహార । శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః । తమేవం విద్వా నమృత ఇహభవతి । నాన్యః పన్థా అయనాయ విద్యతే। సహస్రశీర్షం దేవం విశ్వాక్షం..... అస్తుసదా శివోమ్॥ వెంకటేశ్వర.....నమః॥ సువర్ణ దివ్యమంత్రపుష్పం సమర్పయామి॥ శ్లో। యానికాని చ పాపాని జన్మాంతరకృతానిచ । తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే॥ పాపో౽హం పాపకర్మా౽హం పాపాత్మా పాపసంభవ త్రాహి మాంకృపయా దేవశరణాగతవత్సల॥ అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ । తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష జనార్దన॥ శ్రీ...॥నమః॥ ఆత్మప్రదక్షిణ...॥ ఛత్రం సమర్పయామి । చామరం సమర్పయామి । గీతం సమర్పయామి । నృత్యం సమర్పయామి । నాట్యం సమర్పయామి । సమస్తరాజోపచారాన్ సమర్పయామి॥ శ్లో॥ యస్యస్మృత్యాచనామోక్త్యా తపఃపూజా క్రియాదిషు। న్యూనం సంపూర్ణతాంయాతిసద్యో వందేజనార్దనమ్ । మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన । యత్పూజితం మయాదేవ పరిపూర్ణంతదస్తుతే। యథాస్థానముద్వాసయామి.

(సంపూర్ణము)

# మంజువాణీ ముద్రాక్షరశాలలో వెలకు దొరకు గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| సర్వలక్షణసారసంగ్రహము వ్యాకరణము | 12 అణాలు | కర్పూరము | 0-4-0 |
| అహోబలపండితీయము | రు 2-8-0 | గోరువార | 0-4-0 |
| శకటరేఫ నిర్ణయము | 0-8-0 | సహదేవపశుశాస్త్రము | 0-6-0 |
| కాగడా | 0-2-0 | చారుమతి పద్యములు | 0-4-0 |
| శ్రీనివాసవిలాసము | 1-0-0 | సుశీల పద్యములు | 0-4-0 |
| శిశుసంజీవని | 0-4-9 | వాసంతిక | 0-4-0 |
| శివగీత | 0-8-0 | వైద్యుతలోహశాస్త్రము | 0-6-0 |
| మధుపవిహారము | 0-4-0 | రోగారోగ్యవివేకము | 0-6-0 |
| రాజయోగసారము | 1-0-0 | నేత్రదర్పణము | 0-8-0 |
| సర్వశాస్త్రము | 0-4-0 | ధన్వంతరివిజయము | 0-10-0 |
| స్వప్నఫలదర్పణము | 0-8-0 | వ్యవసాయము | 0-4-0 |
| కాళహస్తీశ్వర శతకము | 0-4-0 | లోకతంత్రము | 0-12-0 |
| రామలింగేశ్వర శతకము | 0-4-0 | ఉపన్యాసపయోనిధి | 1-2-0 |
| శ్రీయాంధ్రనాయకశతకము | 0-4-0 | దిలీపచరిత్రము | 0-10-0 |
| సింహాద్రినారసింహశతకము | 0-4-0 | సంక్రాంతిముగ్గులు | 0-2-0 |
| భామాకలాపము | 0-6-0 | బ్రహ్మానందపత్రిక | 1-0-0 |
| హాహాశేఖావళి | 1-0-0 | సంస్కృతలోకోక్తిచంద్రిక | 0-8-0 |
| అప్పయ్యదీక్షితచరిత్ర | 0-4-0 | ఆంధ్రలోకోక్తిచంద్రిక | 0-8-0 |
| తిమ్మరుసు చరిత్ర | 0-4-0 | నవరత్నపరిదీపిక | 0-8-0 |
| పాండవాజ్ఞాతవాసము | 0-8-0 | రామేశ్వరమహాత్మ్యము | 0-12-0 |
| రామదాసు నాటకము | 0-8-0 | హస్తలాఘవము | 0-8-0 |
| నర్మదాపురుకుత్సీయము నా॥ | 0-12-0 | మహాగారడి | 0-4-0 |
| మమతకూరస్నేహపరిహాసనము | 0-2-0 | అచలాత్మజాపరిణయము | 0-12-0 |
| మహాయోగరహస్య పరిహాసనము | 0-2-0 | ఆంధ్రపరాశరస్మృతి | 0-8-0 |
| విధవావివాహపరిహాసనము | 0-2-0 | బంగారపాకశాస్త్రము | 0-8-0 |
| నిరపవాదపరిహాసనము | 0-2-0 | మహాశాస్త్రిపాకశాస్త్రము | 1-0-0 |
| చేమంతులు | 0-4-0 | ఓద్రిపాకశాస్త్రము | 0-12-0 |
| అరటిచెట్టు | 0-2-0 | గోసంరక్షణము | 0-8-0 |
| తత్వసార | 0-4-0 | ఆంగ్లేయులకువైద్యశాస్త్రము | 0-4-0 |
| | | అశ్వలక్షణసారసంగ్రహము | 0-6-0 |
| | | అశ్వచికిత్సాసారము | 1-0-0 |
| | | ఉపన్యాసదర్పణము | 1-4-0 |

